## Solicit Acknowledgment.

ఓం

శ్రీ విమలానంద

విజ్ఞాన విలాసానుబంధము

తృతీయ సంపుటి

(వచనము)

# జయభేరి

(యను)

'తత్త్వ' విచారణ, 'తదా'త్మనిష్ఠ, 'తత్ప'రాయణ.

శ్లో॥ తావత్ గర్జంతి శాస్త్రాణి జంబుకా విపినే యథా ।
నగర్జతి సటాక్షేపాత్ యావద్వేదాంత కేసరి ॥

(శంకరాచార్య)

వ్యాఖ్యాత

శ్రీ విమలానంద భారతీ ప్రియ శిష్యః

గుడివాడ.

1954

సర్వస్వామ్య సంకలితము. అమూల్యము.

శ్రీ Town Hall Library, Masulipatam గారికి

Kindly intimate this to the Swamijee's other disciples.

# అనుక్రమణిక

సద్గురు వందనము.
అంకితము.
తొలిపలుకు.
పరదేవతా ప్రార్థన.
ప్రస్తావము.
ఆదర్శపురుషులు.
పండితాభిప్రాయములు.
మంగళాచరణము (శ్రీ మచ్ఛంకర భగవత్పూజ్య పాదకృత.
బ్రహ్మవిద్యా గురు పరంపరాభి వందనాదికము.

"తత్త్వ" విచారణ. పుట.

1. వేద మపౌరుషేయమే 1 - 8
2. శబ్దమే ప్రమాణము 9 - 16
3. గురుభక్తి 17 - 25
4. అధికారత్వము 26 - 36
5. పౌరుషము - ప్రారబ్ధము 37 - 47
I ఉపదేశ పఞ్చకమ్ 48 - 49
6. మంత్రస్వరూపము 50 - 56
7. ఉపాసనలు - ఆవశ్యకత 57 - 63
8. శ్రీవిద్యయే చరమవిద్య 64 - 71
9. శక్తిస్వరూపము 72 - 79
10. శాక్తాద్వైత సిద్ధాంత సామరస్యము 80 - 87

| | పుట |
|---|---|
| **II** శుద్ధాఽద్వైతము-అనుభవావసానము | 88 - 90 |
| 11. మాయావాదము | 91 - 98 |
| 12. అజ్ఞాన మెటుల వచ్చినది? | 99 - 106 |
| 13. ప్రణవోపాసన - ప్రాశస్త్యము | 107 - 112 |
| 14. అజపాగాయత్రీ | 113 - 117 |
| **III** 'నేతి-నేతీతి'న కారద్వయ విమర్శన | - 118 |
| 15. మహావాక్య చతుష్టయము ఏకార్థ బోధకములే | 119 - 123 |
| 16. షడ్దర్శనముల ప్రతిపత్తి | 124 - 130 |
| 17. ప్రస్థానత్రయము | 131 - 139 |
| 18. సమ్యగ్దర్శనము | 140 - 146 |
| **IV** మనీషాపఞ్చకమ్ | 147 - 1[illegible] |
| 19. ఉన్నది "నేనే" | 149 - 1[illegible] |
| 20. జీవన్ముక్తి | 162 - 1[illegible] |
| 21. "బ్రహ్మవిదో మౌనంచ విహితమ్" అనుదాని విమర్శ | 170 - 17[illegible] |
| 22. అమృతత్త్వము | 175 - 18[illegible] |
| **V** ధన్యాష్టకమ్ | 184 - 1[illegible] |
| 23. గీతాహృదయము | 187 - 19[illegible] |
| 24. కర్మతత్త్వము | 200 - 20[illegible] |
| 25. ధర్మసూక్ష్మము | 210 - 22[illegible] |
| 26. సన్న్యాసము | 221 - 23[illegible] |
| **VI** యతిపఞ్చకమ్ | 234 - |
| 27. యోగప్రభావము | 237 - |

| | పుట |
|---|---|
| 28. ఆహారనియమము | 248 - 256 |
| 29. జ్ఞానాన్మోక్షః | 257 - 267 |
| 30 శ్రీ విమలానంద లేఖావళి | 268 - 276 |

II "తత్" ఆత్మ నిష్ఠ — పుటలు 1 - 15

| | |
|---|---|
| 1. లఘువాక్య వృత్తి | 1 - 7 |
| 2. బ్రహ్మానుచిన్తనమ్ | 8 - 14 |
| 3. ఏకశ్లోకీ | - 15 |

III "తత్" పరాయణ — పుటలు 1 - 5

| | |
|---|---|
| 1. స్వరూపాను సంధానాష్టకమ్ | - 1 |
| 2. అద్వైత పఞ్చరత్నమ్ | - 2 |
| 3. మాయాపఞ్చకమ్ | - 3 |
| 4. నిర్వాణమఞ్జరీ | 4-5 |

ఓమ్

# తొలి పలుకు

మదీయ చిదానంద స్వరూపులారా,

వందనములు. నేను తమకు చిరపరిచయుడనే! మఱియు నాత్మబాంధవుడనుగూడ నగుటచే, నన్ను గుఱించిన విశేష యుపోద్ఘాత మనవసరమని తలచుచున్నాను. శ్రీ విమలానంద విజ్ఞాన విలాసానుబంధ సరణిలో నింతకుముందు 1953 సం॥న, వెల్వడిన రెండు సంపుటములు తమ కందఱనుజేరి, తమ యాదరాభిమానముల బొందినవగుటచే, నింత త్వరలో నీ "జయభేరి" ప్రయోగించుచు తమ దర్శనమునకు మఱొకసారి రాగల భాగ్యము నాకు లభించినది. అందులకెంతయు నా హృదయపూర్వక కృతజ్ఞతలను తమ కర్పించుచున్నాను.

ఇందు నూతనాంశము లేమియు లేకున్నను మొదటి రెండు సంపుటములు పద్యకావ్యములగుటంజేసి, నామిత్రులలో కొందఱి కందలి రహస్యార్థము లంతగా నవగాహము గాక పోయినట్లు సూచించుచు, సాధ్యమైనంతవఱకు వచన కావ్య ముగ వివరించిన యెంతయో లాభకరముగానుండునని తెలియ బఱచుటచే, వారల యభీష్టము నెఱవేర్చిన, శ్రీవారికిని, వారి శిష్యులకును, తదితర ముముక్షువులకు నుచితరీతిగ సేవ జేసినవాడ నగుదునని తలచి, నాకు మఱొకావృతి మనన మీ విధముగానైనను గాగలదని సంతసించి తిరిగి దీనికి బూను కొంటిని. గాన నిది చర్విత చరణంబై, నెంత విన సొంపుగ

నుండకపోయినను, యిట్టి 'తత్త్వ' విచారణందు పునరుక్తి దోషములేదనునది సాంప్రదాయ సిద్ధమగుటచే, నేనీ యుద్యమమునకుం గడంగితిని. నేనొక యవజ్ఞుడను. శాస్త్ర విజ్ఞానమంతగా లేనివాడను. సాహిత్య జ్ఞాన మనున దంతకుముందే సున్న. అయినను, యెంతవఱకు నా 'ఉపాసనాదేవత' బలముతో, శ్రీదేవి యనుగ్రహించినదో, తదనుగుణముగ నీ రెండు ముక్కలిట జతపఱచగలిగితిని. ఇటుల తెలియజేయుటలో నాయభిప్రాయము, యదార్థమును మఱుగుపరచక ఈశ్వరానుగ్రహ మెంత అవశ్యకమైనదియు నెఱింగింపుచు, స్వానుభవమును వెల్లడించుటయేగాక,

'మూకంకరోతి వాచాలం పంగుం లంఘ యతేగిరిమ్' యనునదెంత 'సత్యమై - ప్రమాణమై' వర్ధిల్లు చున్నదియు చూచి యభినందించుటయే! గాక రసోపేతమగు శ్రీ విమలానంద 'బోధిద్రుమ'ము నాశ్రయించినివారి కేనాటికిని పతనము స్వప్నమందైనను, గలుగనేరదను ధైర్యముతో నేనీ కార్యమునకు సాహసించుట! అయిన నిందు విద్వాంసు లేమైన లోపములంగాంచిన దయగలిగి యెఱుకపర్చుచో, పునర్ముద్రణమున వాటిని నే సవరించుకో గలనని విన్నవించుకొను చున్నాడను.

మఱియు, నిందు 'తత్త్వ విచారణ' యను శీర్షిక క్రింద జేర్చిన ముప్పది వ్యాసములలో, కొన్నింటిని గత 12 మాసములలోను, యప్పటికప్పుడు "శ్రీరామకృష్ణప్రభ" (మద్రాసు) "యదార్థభారతి" (యేర్పేడు) "శ్రీరామదర్శని" (పిడుగురాల) "అమృతలిజ్ఞ" (విజయవాడ) లను నాధ్యాత్మిక మాసపత్రిక

లందు ప్రకటింపబడి యుండుటచే పాఠకలోకమున కిదివఱకే యవి పరిచితమైయున్నను, యావత్తు గ్రంథము నవలోకించుట కనువుగాను, పూర్ణతత్త్వానుభవము బొందగలుగుటకు వీలుగా నిందవియును జేర్చి పూర్తిగా ముద్రింపబడినవి. గాన సదరు వ్యాసముల నెంతయో యాదరాభిమానములతో స్వీకరించి, తమ తమ పత్రికలందు ప్రకటించి, ముముక్షు లోకమున కందు జేసి నా యుద్యమమునకు దోడ్పడిన సదరు పత్రికాధిపతుల కివే నా వినయపూర్వక కృతజ్ఞతాభివందనములు.

సర్వేజనా స్సుఖినోభవంతు.

| | |
|---|---|
| జయనామ సం॥ ఆశ్వయుజ | ఓమ్ - తత్ - సత్ |
| శు-౧ ఇందువాసరం | ఇట్లు, |
| దిః 27—9—1954. | శ్రీ విమలానందభారతీ ప్రియశిష్యః. |

## సూచిక.

కం॥ తెలుపుము 'పరతత్త్వం' బని
బలమొసగుచు 'దేవి' నాదు బాసట నిలువన్,
సలుపుచు 'తత్త్వవిచారణ'
పలుకుదు "నేనుండి బ్రహ్మపదము"న బాలా॥

(శ్రీ విమలానందభారతీ ప్రియశిష్య!

# ప్రజ్ఞానం బ్రహ్మ

అయమాత్మా బ్రహ్మ

అహం బ్రహ్మాస్మి



శ్రీ మత్పరమహంస పరివ్రాజకాచార్యవర్య

జగద్గురు

## శ్రీ విమలానంద భారతీస్వామి

(శ్రీశైలం పీఠాధిపతులు)

ధ్యానమ్

శ్లో॥ వందే భారతిసాంప్రదాయ చరితమ్ వైమల్య సంశోభితమ్,
వేద్యం, స్వాశ్రమ ధర్మకర్మ చతురమ్, భాష్యైః సదా చింతితమ్।
సత్యజ్ఞాన వివేక విశ్వనిలయమ్, వ్యాఖ్యాన సౌశాస్త్ర్యయమ్,
నిత్యానిత్య సమాధి నిష్ఠ నిరతమ్, ప్రాజ్ఞం ప్రభుమ్ సద్గురుమ్॥

తత్త్వమసి

# ప్రస్తావము

ఈ తృతీయసంపుటము లోఁగడ ప్రథమసంపుటములో దెలిపినటుల, "దుఃఖనివృత్తి, మృత్యుంజయ తత్త్వము, ధన్యాష్టకము" లను విషయములనేగాక తదితరాంశములను జేర్చి, (1) 'తత్త్వ'విచారణ (2) 'త'దాత్మనిష్ఠ (3) 'త'త్పరాయణ లను విభాగముక్రింద నొకే విషయమగు జీవేశ్వర విచారణ పూర్వక పరతత్త్వమును గుర్తింపజేయుటయనదే లక్ష్యముగా నిడుకొని, ఆత్మబ్రహ్మైకత్వము ప్రతిపాదింపబడినది. ఇటుల విభజించుటలోఁగల విశిష్టత, ఈ_శా. 1-2 శ్రు॥ "తేన త్యక్తేన భుఞ్జీథాః మాగృధః కస్యస్విద్ధనమ్" లో వివరించినటుల, విదేహకైవల్యార్థులు, కలిగిన జ్ఞానమును సదా ఆత్మనిష్ఠయందే యుండి రక్షించుకొనవలయునేగాని, బాహ్యమును దేనినిజూడ గూడదనియు, అప్పుడే యాచార్యబోధ చేయఁగలిగిన శాస్త్ర విచారజన్యజ్ఞానము, జగత్సత్యత్వభ్రాంతిని దొలగించి, ఆత్మ యొక్క యాథాత్మ్య పరిమళ మొసగగలదనియు వర్ణింపబడి యున్నందున, "తత్త్వ"విచారణ యను శీర్షికమూలమున "ఆత్మవా_ఽరే ద్రష్టవ్య శ్రోతవ్యో మంతవ్యోనిదిధ్యాసితవ్యః" యనుదానిలో వివరించినటుల ఆత్మసాక్షాత్కారమున కనుకూలించునటుల బుద్ధిని ప్రత్యక్ప్రవణముగానించి, "తదాత్మనిష్ఠ"చే సూత్రప్రాయముగ, అనాత్మాభిమానరూపమైన విపరీతభావన యొక్కయు, ప్రమాణ ప్రమేయగతమయిన యసంభావన యొక్క నివృత్తినిగలిగించి, "తత్పరాయణ" యనుదానివలన పరిపూర్ణవైరాగ్యాతిశయమును గలిగించుటయనదే, దృష్టియం దిడుకొని, నీప్రకారము విభజింపబడినది. దీనినే "సమాధి దశ

యందు బ్రహ్మమునందే యహం ప్రత్యయమున్నను, విద్వాం
సున కాహారాదికమునందు దేహమున "నహం" ప్రత్యయ
మగును. అట్లు చిరకాలికమయి, ప్రబలమయి, స్థూలమయిన
దేహాత్మ ప్రత్యయముచే బ్రహ్మాత్మ ప్రత్యయము, బాహ్య
ధ్వనిచే నాదధ్వనివలె, నశించును. అందువలన బాహ్య
కర్మము సమస్తమును సన్న్యసించి, ఆహారాది సర్వావస్థల
యందును దృశ్యమును గ్రహింపక బ్రహ్మమే తానను బుద్ధితో
నుండవలయు" నని శ్రీ మచ్ఛంకరానంద స్వాములవారును
శెలవిచ్చిరి. గాననే 'తత్త్వ' విచారణయందుగానవచ్చు విమర్శ
నాదికమంతయు ముగిసిన పిదప, సూత్రప్రాయముగ శ్రీ
మచ్ఛంకర భగవత్పాదుల వారిచే రచియింపబడిన, "ప్రకరణ
ప్రబంధావళి"లోని కొన్నిటిని మననానుకూలముగ నాంధ్ర
పద్యానువాదముతోడను, మఱికొన్ని కేవలము పారాయణ
కుపయోగపడునటుల శ్లోకములనుమాత్రమే నిందు చేర్చుట
మయినది.

మఱియు నిందు అంతఃకరణ పరిశుద్ధికొఱకు ముఖ్య
ముగా నాచరింపవలసినవి యభ్యాసాదులే యైనను, వాటిని
వివరించుటయందే నీగ్రంథమునింపక, టీకలయందు తెలియ
జేయబడిన "తత్ పద - త్వంపద" శోధనచే బ్ర-సూ. 1-1-4
"తత్తుసమన్వయాత్"లో వివరించినట్లు సర్వమును సమన్వయ
పఱచి, బ్రహ్మాత్మైక్యావగతిని నిరూపించుటకే యిందు
ప్రాధాన్య మీయబడినది. అదియును, అస్మద్గురువర్యులు ప॥
వ॥ శ్రీ విమలానందభారతీ స్వామివారి చెంత, నేనభ్యసించిన
గ్రహించిన, సూక్ష్మముల నాధారముజేసుకొని, శ్రీ మచ్ఛం
కర భగవత్పాదుల వారొసగిన భాష్యాది ప్రకరణ గ్రంథ

స్తోత్రాదులలోని సారాంశములనుండి దృష్టిని మరల్చుకుండి, రెంటిని జతజేసి, నా ఉపాసనా దేవతానుగ్రహ పాత్రుడనై మాతృకాదేవి యాజ్ఞానుసారమున, నామన నానుకూలముగ నాజ్ఞాకావృత్తి కాగలదని సంతసమున కొన్ని విషయములు నీ గ్రంథమున బొందుపఱచితిని. గాన నవి యెల్ల అకును రుచ్యము లగునవిగాని, యుపకరించునవిగాని యూహించుట కేవలము సాహసమే! అయినను నాబోటివారికే కొలదిమందికైన నుప యోగపడకపోవని యొకతృప్తి. అఘటిత ఘటనాపటిమగల శ్రీ ఆచార్యస్వాములవారే సకలలోక కళ్యాణదాయకముగా, ఆ చంద్రార్కము వెలయునటుల సర్వాధికారుల కుపయుక్త మగునట్లు ప్రతిపాదించియుండిన అమూల్యాదేశములే శరణ్యాం బు గావలయునుగాని, తద్భిన్ను లెవరైన నట్టిపనిని తలబెట్టుట కేవలము హాస్యాస్పదమగుటయే గాక హనుమంతునియెదుట కుప్పిగంతులే గదా !

మఱియు నిందు "తత్త్వ" విచారణ యను శీర్షిక క్రింద ముప్పది వ్యాసములు మాత్రమే సంపుటి చేయబడినవి. అవన్నియు నొకే లక్ష్యమును గుర్తింపజేయునవగుచు, "ఏకంసత్ విప్రా బహుధా వదన్తి" యనునటుల, సర్వవ్యాపియగు నా పరమాత్ముని యనంత లీలలో కొన్నిటినిమాత్రమే, యెవరి దృక్పథము ననుసరించి వారు ప్రశంసించునటుల, కొన్నిటిని మాత్రమే నేనిచట విమర్శించగలిగినను, వాటిని "జాత్యంధగజదృష్టి" న్యాయముగ సంకుచిత దృష్టితో గ్రహింపక, ఆయా వ్యాసము లందంతంతవఱకే ప్రాధాన్యమొసగి ముగింపబడుటచే, పూర్ణ తత్త్వమును గ్రహింపదలచిన వారామూలాగ్రముగ నన్నిటిని, శ్రద్ధతో పరిశీలించి, పూర్వాపర సమ

న్వయమున నేకవాక్యత జేయగలందులకు గోరుచున్నాను. అప్పుడేగాని పూర్ణానందానుభవము గలుగజాలదేమో నని నా మనవి.

గాక 'విచారణ' యనునదే అవిద్యాసమ్మిశ్రితమైనను నిద్రించువానిని మేల్కొల్పుటకు శబ్దమే శరణ్యంబైనట్లు, విచారణ యనబడును, 'తత్త్వమసి' మహా వాక్యార్థజ్ఞానమే విలక్షణమగు 'పరతత్త్వము'ను గుర్తింపజేయుట కనువైన మార్గమగుటచే, ముముక్షువులకు యాత్మ స్వరూపు లందఱు నీగ్రంథమును తమతమ యధికారానుగుణముగ దీని నుపయోగించుకొనగలందులకు కోఱుచున్నాను. రచనల కేమాత్రమును కొదువలేదు. వాటి హృదయమునుగుర్తించి ప్రవర్తించుటయే ప్రధానము. అప్పుడే ఆ రవిజ్ఞానము ననుసర్తించిన వారమగుదుము. శ్రీ సురేశ్వరాచార్య స్వామివారు శలవిచ్చినప్రకారము, బహుకాలము కొండగుహాలలో నున్న అంధకారము నైనను, దీపము చూపినంతమాత్రములోనే దొలగిపోవునట్లు, జ్ఞానోదయ మయినంతనే యెక్కడు శ్రవణానంతర వ్యవధాన మపేక్షింపక బోయినను, తాను భోక్తగ నున్నంతవఱకది యనుభవమునకు రాగలుగుటకు మాత్రము అంతఃకరణ పరిశుద్ధతెంతేని యావశ్యకమగుటచే, దానికనువుగా ప్రాచీన సాంప్రదయానుసారముగ సంస్కరింపబడిననేగాని "జ్ఞానవిజ్ఞాన తత్పరుడై" కృతకృత్యుడు కాలేకపోవు చున్నాడనునది స్పష్టము.

మఱియు నిట్టి శుద్ధచైతన్య స్వరూపమును తాను "సాక్షిమాత్రుడు"గా నుండి లెస్సగ గుర్తించుటనునది భారతావనికి నూతన మేమియుగాక పరంపరయా సిద్ధమైనదే యగుటచే, నెంత మసిపూసినను మాణిక్యమునకు వన్నె కొఱతగానట్లు,

యెప్పటికప్పుడు మహాత్ము లుద్భవించుచు, ధార్మిక, నైతికాధ్యాత్మిక ప్రవర్తనలందునేగాక, లౌకిక వ్యవహారమందు సైతము లోకనాయకులై, భారత విజ్ఞాన మేమాత్రమును చెక్కుచెదర కుండునట్లు ప్రదర్శించగలుగుచున్నారు. ఆధునిక స్వతంత్ర భారతరాజ్యాంగ విధానములోని వైదేశిక వ్యవహార కౌటస్థ్య సిద్ధాంత మీసూత్రము మీదనే యాధారపడి యుండుటయు, భారతదేశ ప్రస్తుత యుపరాష్ట్రపతియు, తత్వ-రాజకీయవేత్తలును, ధీరశాంతులునగు, శ్రీ డాక్టరు సర్వేపల్లి రాధాకృష్ణగారిటీవల యొనరించిన (1954 - నవంబరులో) ఖండాంతర పర్యటన సందర్భమున, పాశ్చాత్య ప్రముఖ రాజకీయ వేత్తలు చూపిన మన్ననలు, ప్రశంసలుజూడ (as a world - teacher=జగద్గురువు) నీ విధానముయొక్క యసమాన ప్రతిభ - ప్రతిష్ఠలు విశదము గాగలవు. ఇక విద్యారణ్యాది ప్రాచీనమహాత్ముల చరిత్రలగుఱించి వక్కాణింపనేల? గాన నిట్టి విజ్ఞాన ముదయించుట 'కనువగుచున విద్యా' (Education = "Manifestation of the perfection already in man" - both secular and spiritual knowledge - and therefore "not merely to impart but to draw out") విధానమునందే బాల్యమునుండియు ప్రబోధింపబడి క్రమ సుశిక్షితులు గావలయును. అప్పుడేగాని, నిరతిశయానందావాప్తి నొసంగునదియు, లోక కళ్యాణ మొనరించునదియు నగు నీ 'తత్వమును' చక్కగా గుర్తించుటనునది కలుగనేరదు. కావున నదియు, విధికృతమయిన శాస్త్రాచార్యోపదిష్ట యకుంఠిత జ్ఞాననిష్ఠయే యేకైక మార్గమగుటచే, నట్టి దీక్షాపరులై, యుండుటయే కర్తవ్యము.

సర్వేజనా స్సుఖినో భవంతు. ఓమ్ - తత్ - సత్.

# ఆ ద ర్శ పు రు షు లు

శ్లో॥ మహాత్మానస్తు మాంపార్థ! దైవీం ప్రకృతి మాశ్రితాః
భజంత్యనన్యమనసో, జ్ఞాత్వాభూతాది మవ్యయమ్ ॥
(భ.గీ. 9-13)

లో వివరించినప్రకారము, అనేక జన్మములం జేసిన సుకృతము లచే సంస్కృతమైన యంతఃకరణమును బొందిన సత్వగుణ ప్రధానులగు మహాత్ములే యీ ఆదర్శపురుషులు - వీరెల్లప్పు డును యీశ్వరునికంటె నితరమునందు మనస్సు లేనివారలై నందున, సదా ఆత్మాభిముఖులయే వీరి ప్రవృత్తి గానవచ్చు చుండును.

అనగా స్వ, పర, భేదజ్ఞానము లేని బాలుని యందెట్లు సర్వవస్తు దృశ్యమునందెట్టి భావనలకు నావకాశమే లేక నిశ్చల త్వము సహజమైయుండునో, అట్టిస్థితి, యేనాఁడు సాధకుని (ముముక్షువు) కట్టెదుట గానవచ్చు దృశ్యవర్గ మేమాత్రపు భావోద్రేకమును గలిగింపక, నిస్తరంగ జలధివలె నొకే నీటి మయముగ పొడసూపునో, యట్టిదగు ప్రపంచోపరమమే జీవన్ముక్తి పరమావధి. దగ్ధపటన్యాయమును బోలు నీ సం విద్దశ, "నతస్య ప్రాణా ఉత్క్రామన్తి - అత్రైవసమవనీయన్తి" యిత్యాది శ్రుతుల హృదయము సూచించునటుల, ఉత్క్ర మణాదు లనునవి గోచరములేనని ధృవబఱచు చున్నందున, విదేహకైవల్యమనునది సైతమట్టిదాని పరిపక్వస్థితియేయగునని యెఱుంగనగు. గాన విధినిషేధముల కేమాత్రము తావులేని యిట్టి పరమోత్కృష్ట నిస్త్రైగుణ్యపదమున స్వస్థుడైయుండుటకు

'సమ్యక్ జ్ఞాన' మనుచెంతయో శరణ్యమని నిరూపించుటకే యీ ఆదర్శపురుషుల జీవిత విమర్శన.

ప॥ ప॥ శ్రీసచ్చిదానంద శివఅభినవ నరసింహభారతీ స్వామివారిఅత్యంతప్రియశిష్యులును, శృంగగిరిపీఠాధిపతులును ఆది శంకరాచార్య పరంపరకుజెందిన 34 వ తరమువారు నగు, ప॥ ప॥ శ్రీజగద్గురు చంద్రశేఖర భారతీస్వామి మహాసన్నిధం వారును, అరుణాచల క్షేత్రోద్దీపకులు భగవాన్ శ్రీ రమణ మహర్షులవారును, కాళీఘట్టసమున్నతోజ్వల విరాజమానులు శ్రీ రామకృష్ణపరమహంసాది మహాఋషిపుంగవు లీ యధు నాతనకాలపు, యట్టి యాధ్యాత్మికాగ్రగణ్యులలో జేరినవారే! వీరి జీవిత చరిత్రలనొకసారి పరికించినచో, వారి శైశవదశ యెంత సామాన్యమైనదిగా గానవచ్చినను, వారి వారియొక్క ప్రజ్ఞావిశేషపాటవముచేతనే వారెట్లు "కశ్చిద్ధీరః" యనునట్లు, శబ్దాదివిషయాకార ప్రపంచాభినివేశ బాహ్యదృష్టినిపూర్తిగ నిశ్శేషముగ విసర్జించి, సదా అంతర్ముఖులై, నిరంతరాత్మానుసంధానపరులై, బ్రహ్మనిష్ఠయందేయుండి, మునిపుంగవులనియు మహర్షులనియు ఖ్యాతిగాంచినది స్పష్టముగాగలదు. శబ్దాది విషయాభినివేశమే గదా! సూర్యుని మేఘము లడ్డునట్లు స్వప్రకాశతను మఱుగుపఱచునది. మఱియు నిదియే జీవితము యొక్క పరమావధియనియు, సకలలోక కళ్యాణదాయక మనియు, శాశ్వత ప్రశాంత్యైక సాధనమనియు, తమతమ నైతిక - ధార్మిక ప్రవర్తనలవలన ("సంభవామి యుగేయుగే" యన్నట్లు) మరొకసారి చాటగలిగి, యెట్లు పురాణపురుష ధురీణు లయినదియు విశదముగా గలదు.

ది 26-9-1954 న, బ్రహ్మీభూతులైన ప॥ ప॥ శ్రీ చంద్రశేఖరభారతీ స్వామివారికి, తమ సానుభూతి జూపు సమయమున, గౌ॥రాష్ట్రపతి - శ్రీ రాజేంద్రప్రసాద్ గారును వివరించినటుల,

" Saints like him continue to help humanity even after leaving the body "

అట్టి మహాత్ములు భౌతిక శరీరమును విసర్జించినటుల మనకు దాదులకు గానవచ్చినను, వారి యంతరాత్మ సర్వదా, సకల జనశ్రేయోదాయకముగ వెలుగుచు, సర్వులకుమార్గదర్శియై, మానవలోకమున కహర్నిశములు తోడు నీడై యుండగలదనే శాస్త్రప్రమాణము. ఇట్టిమహాత్ములను గుఱించియేతమయను భవమును సైతమును పురస్కరించుకొని, శ్రీ ఆచార్య స్వాములే (వి-చూ 39-40)శ్లోకములలో, "ప్రశాంతచిత్తులగు మహాత్ములు వసంతఋతువు వలె, లోకోపకారమొనరించుచు భయంకరమగు సంసారార్ణవమునుండి తాముస్వయముగతరించి నిర్హేతుక కటాక్షముతో నితరులను సైతము తరింపజేయుదు రనియు, సూర్యునియొక్క ప్రచండకరణములచేత తపింపబడిన భూమిని శీతకరుడు,తనఅమృతకిరణములచేత రక్షించునటులది వారికి సహజ స్వభావమే" ననియు వర్ణించిరి. గాన నట్టి సిద్ధపురుషుల జీవితము లాదర్శముగ నిడుకొని, జీవయాత్రను ముగింప నెంచుకొనుటనునదే యెంతయు వరణీయము.

లోకా స్సమస్తాస్సుఖినోభవన్తు.

ఓమ్ తత్ - సత్.

| | | |
|---|---|---|
| జయనామ సం॥<br>విజయదశమి - గురువారం<br>ఈ-రాహ్వాంతరం. 7-10-54. | } | ఇట్లు,<br>విమలానందభారతీ ప్రియశిష్యః |

ఓ మ్

శ్రీ మచ్ఛంకర భగవత్పూజ్యపాదకృత

# నమస్కార రూప మంగళాచరణమ్

శ్లో॥ అజమపిజనియోగం, ప్రాపదైశ్వర్యయోగా
దగతి చ గతిమత్తాం, ప్రాపదేకం హ్యనేకమ్,
వివిధ విషయధర్మగ్రాహి ముగ్ధేక్షణానాం
ప్రణతభయవిహంతృ, బ్రహ్మయ త్తన్నతోస్మి ॥

శ్లో॥ ప్రజ్ఞా వైశాఖ వేదక్షుభిత జలనిధే ర్వేదనామ్నోం తరస్థం
భూతాన్యాలోక్య, మగ్నాన్యవిరత జనన గ్రాహఘోరే సముద్రే,
కారుణ్యాదుద్ధ ధారామృత మిదమమరై దుర్లభం భూతహేతో
ర్యస్తం, పూజ్యాభిపూజ్యం, పరమగురుమముం, పాదపాతైర్నతోస్మి॥

శ్లో॥ యత్ప్రజ్ఞా, లోకభాసా, ప్రతిహతిమగమత్స్వాంత మోహాంధకారో,
మజ్జోన్మజ్జచ్చ, ఘోరే, హ్యసకృదుప జనోదన్వతి, త్రాసనేమే,
యత్పాదావాశ్రితానాం, శ్రుతిశమ వినయప్రాప్తిర గ్రాహ్యమోఘా,
తత్పాదౌ, పావనీయౌ, భవభయవిధురౌ, సర్వభావైర్నమస్యే ॥-

తా॥- ఏ పరబ్రహ్మ, సర్వోపనిషత్ప్రసిద్ధమై, సర్వదా పరిచ్ఛేద రహితమై, నిత్య శుద్ధ బుద్ధ ముక్త స్వభావంబున, నిర్విశేషముగ ప్రకాశించుచుండెనో, అట్టి స్వయంజ్యోతి స్వరూపుడే, తటస్థలక్షణంబున, 'అహం' ప్రత్యయప్రతిష్ఠుడై, అజుడు, అవ్యయుడు, ఇత్యాది సాంకేతములతో, త్రిపుటీకృత ధ్యానధ్యాతృ ధ్యేయరూపంబులను, జగజ్జీవేశ్వరాదులుగను భాసించుచు, మందమతుల కహర్నిశము లతిభయముగొల్పున దగుచున్నను, అదంతయు నాతని యఘటిత ఘటనా సామ

ర్థ్యాతిశయమే యగుటచే, వస్తుతఃయున్న నిరస్త సమస్త నానాత్వ మేకరస మద్వితీయ ముపనిషద్భిరభ్యుపగమ్య పర బ్రహ్మను పరదేవతాతత్త్వమను స్మృతిపూర్వక నమస్కారము.

మఱియు నేది సర్వవ్యాపకమయిన ప్రజ్ఞాన స్వరూపమే యైనను,-ఎటుల నేక ఘాతుక జలచరసముదాయమున కాశ్రయ మయిన సముద్రము, మథించుటచేతనే అమృతోత్పాదనము కాటపట్టయినటుల - పరమ కారుణికుడయిన పరమాత్మయే వేదమాతగ నవతరించి, తన స్వరూపమేయగు ప్రజ్ఞానముచే (కవ్వము) జ్ఞానులద్వారా (అమరులు) వేదమును (సముద్రము) చిలికి, స్వస్వరూపాను సంధానానందము (అమృతము) నుద్భవింపజేసి, సకలభూతసముదాయము నుద్ధ రించెనో, - యట్టి లక్షణోద్యోతకమగు పరమ గురువునకు నమస్కారము.

ఇదియుంగాక, యెవనియొక్క ప్రజ్ఞావిశేషముచే, అవి చారిత రమణీయంబయిన భవబంధనమునుండి తొలగింపబడి, అనేక జన్మార్జిత పుణ్యాఽపుణ్య కర్మ ఫలానుశాయిగ తనను తలంచుట యను యనాద్యజ్ఞానజనిత మోహాంధకార వ్యాకుల చిత్తవిక్షేపాదులు పటాపంచలు గావింపబడుచు, నెవనియొక్క యనన్యభక్తిచే చిత్తైకాగ్రతగలిగి బ్రహ్మాకార వృత్త్యవలీలగా లభించుచున్నదో, అట్టి ప్రజ్ఞాన స్వరూపలాంఛనప్రాయులును, శ్రవణ మనన నిదిధ్యాసనపూర్వక శుద్ధవిజ్ఞాన స్వరూపులును, పరమ పురుషార్థ శ్శాంతి ప్రకాశకులునగు గురువర్యులకు నమస్కారము.

ఓమ్ - తత్ - సత్.

హరిః - ఓమ్

# బ్రహ్మవిద్యా గురుపరంపరాభి వందనాదికమ్

శ్లో॥ వన్దే గురూణాం చరణారవిన్దే, సందర్శితస్వాత్మ సుఖావబోధే
జనస్యయే జాంగలికాయమానే, సంసార హాలాహల మోహశాంత్యై
వందే గురుపదద్వంద్వ, మవాఙ్మానస గోచరమ్
రక్తశుక్లప్రభా మిశ్రమతర్క్యం త్రైపురం మహః ॥
సదాశివ సమారంభాం, శంకరాచార్య మధ్యమాం
అస్మదాచార్య పర్యంతాం వందే గురుపరంపరాం ॥
అభీప్సితార్థ సిద్ధ్యర్థం పూజితో యస్సురైరపి
సర్వవిఘ్నచ్ఛిదే తస్మై గణాధిపతయేనమః ॥

శ్లో॥ ప్రకాశరూపం, శివమాదినాథం, పరాఖ్యికాం, శంకరమాదిదేవం
నారాయణం, పద్మభువం, వసిష్ఠం, శక్తించ తత్పుత్రపరాశరంచ
వ్యాసం, శుకం, గౌడపదం, మహాంతం, గోవిందయోగీంద్ర మథాస్యశిష్యం
శ్రీ శంకరాచార్య మథాస్య పద్మపాదంచ, హస్తామలకంచ శిష్యం
తం త్రోటకం, వార్త్తికకారమన్యా, నస్మద్గురూన్ సంతత మానతోస్మి॥

శ్లో॥ ధ్యాయేత్పద్మాసనస్థాం, వికసితవదనాం, పద్మపత్రాయతాక్షీం,
హేమాభాం, పీతవస్త్రాం, కరకలితలసద్ధేమపద్మాం వరాఙ్గీం,
సర్వాలంకారయుక్తాం, సకలమభయదాం, భక్తనమ్రాం భవానీం
శ్రీవిద్యాం, శాన్తమూర్తిం, సకలసురనుతాం, సర్వసంపత్ప్రదాత్రీమ్॥

శ్లో॥ స్వామిన్ నమస్తే నతలోకబన్ధో, కారుణ్యసిన్ధో పతితం భవాబ్ధౌ
మాముద్ధరాఽత్మీయకటాక్షదృష్ట్యా, ఋజ్వాఽతికారుణ్యసుధాభివృష్ట్యా॥

ఓమ్ నమో బ్రహ్మాదిభ్యో బ్రహ్మవిద్యా సంప్రదాయ కర్తృభ్యో,
వంశర్షిభ్యో, నమో గురుభ్యో, నమో మహద్భ్యః,
సర్వోపప్లవరహితః, ప్రజ్ఞానఘనః, ప్రత్యగర్థో
బ్రహ్మైవాహమస్మి బ్రహ్మైవాహమస్మి॥
ఓమ్ శాంతి శ్శాంతి శ్శాంతిః

# శాంతి పాఠ క్రమము

హరిః - ఓం- ( ఋగ్వేదీయ )

"వాఙ్మే మనసి ప్రతిష్ఠితా, మనో మేవాచి ప్రతిష్ఠిత, మావిరావీర్మ ఏధి వేదస్యమ ఆణీస్థ శ్రుతంమే మాప్రహాసి దనే నాధీతే నాహోరాత్రా న్సన్దధా, మ్యృతం వదిష్యామి సత్యం వదిష్యామి తన్మామవతు తద్వక్తారమవ త్వవతుమా మవతు వక్తార మవతు వక్తారం"

ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః-

హరిః - ఓం- ( సామ వేదీయ )

"ఆప్యాయన్తు మమాంగాని వాక్ప్రాణ శ్చక్షు శ్శ్రోత్ర మథోబల మిన్ద్రియాణి చ సర్వాణి . సర్వం బ్రహ్మోపనిషదం మాహంబ్రహ్మ నిరాకుర్యాం మామా బ్రహ్మ నిరాకరోద నిరాకరణమ స్త్వ నిరాకరణం మే అస్తు తదాత్మ నిరతే య ఉప నిషత్సు ధర్మా స్తే మయిసన్తు తే మయిసన్తు"

ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః-

హరిః - ఓం- (అధర్వణ వేదీయ)

"భద్రం కర్ణేభి శ్శృణుయామ దేవాః, భద్రంపశ్యేమాక్ష భిర్యజత్రాః, స్థిరైరంగై స్తుష్టువాగ్ స్తనూభిః, వ్యశేమ దేవహితం యదాయుః, స్వస్తిన ఇంద్రో వృద్ధశ్రవాః, స్వస్తినః పూషావిశ్వ వేదాః స్వస్తినస్తార్క్ష్యో అరిష్టనేమిః స్వస్తినో బృహస్పతిర్ద దాతు"

ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః

ఓమ్ - తత్ - సత్

ఓమ్

# పండితాభిప్రాయములు

గుడివాడ. ది 22-2-1954.

శ్రీ శివాయ గురవేనమః

పూజ్యపాదులగు శ్రీ విమలానందభారతీ స్వామివారి ముఖ్య ప్రియశిష్యులగు శ్రీ తంగిరాల వేంకటలక్ష్మీనరసింహా రావుగారిచే రచింపబడిన గ్రంథములను, వ్యాసములనుచూచితిని. సంస్కృతమురాని ముముక్షువులగు ఆధ్యాత్మవిద్యారసికులకు జన్మరాహిత్యముకొఱకు మంత్రశాస్త్ర, వేదాంతశాస్త్రముల నభ్యసించువారికి చాల ఉపయోగకరములు. సిద్ధాంతములు చక్కగా తెలుసుకొని సులభమగు గద్య పద్య రూపమున రచించిరి. వారి గ్రంథములు, వ్యాసములు బాగా ప్రచారమునకు, పఠన పాఠములకు నుపయోగించు గాక.

Sd/- శ్రీ నిత్యానందేంద్ర సరస్వతీస్వామి,
("ఉపనిషత్స్వామి")

---

గుడివాడ శుభమస్తు 25-5-1954

శ్రీ మహాగణాధిపతయేనమః

శ్రీ శ్రీ శ్రీ శ్రీ మత్పరమహంస పరివ్రాజకాచార్యేత్యాది సకల బిరుదావళీ సమేతులయిన శ్రీ మద్విమలానందభారతీ స్వాములవారి ప్రియశిష్యులయిన శ్రీ మత్తంగిరాల వంశ పయోనిధికి, పూర్ణచంద్రు లయినటువంటిన్ని, శ్రీ మద్వేద

వ్యాసాచార్యులువలె సకలాగమ మంత్ర తంత్రశాస్త్ర రహస్యార్థ విదులయినటువంటివిన్ని, శ్రీ శుకులువారివలె కేవలాంతర్ముఖులయి నటువంటివిన్ని, అనగా ఆత్మావారే ద్రష్టవ్య శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్యః అని శ్రుత్యుక్త పరిసంఖ్యావిధి ఈమహానుభావులందే వర్తిస్తున్నది. అనగా బ్రహ్మవేత్త, వ్యాపారాంతరమును విడిచి కేవల బ్రహ్మనిష్ఠులు అయేవుండవలసినదని శ్రుతి తాత్పర్యము. అటువంటి పరమ మహర్షితుల్యులు అయినటువంటివిన్ని, గద్య పద్యాత్మకంగా అనేక మంత్ర శాస్త్రార్థ గ్రంథములను నిర్మించి నటువంటివారున్ను, మరియు వేదాంత శాస్త్రోపనిషదర్థ రహస్యములను స్పష్టంగా ప్రకటనచేసినటువంటి వారున్ను, సాక్షాత్ శ్రీమచ్ఛంకరాచార్యులువారితో సమానులున్ను, ఆధునికులయిన శ్రీ బెల్లంకొండ రామారావుగారివలె బహు గ్రంథములను అనాయాసంగా నిర్మాణదార్ఢ్యం గలవారున్ను, 'పుత్రాదిచ్ఛేత్పరాజయం' అని న్యాయంగా వీరి గురువులయిన శ్రీవిమలానంద భారతీ స్వాములవారి యశఃపయోరాశికి పూర్ణచంద్రులు అయినటువంటివిన్ని, శ్రీ మన్నతసింహారావుపంతులుగారికి నా కృతజ్ఞతను చూపిస్తూ అపరిమిత సంతోషంగా ఈపత్రికా పారితోషికమును అనేక నారాయణ స్మరణపూర్వకంగా వీరికి నేను సమర్పించుచున్నాను.

ఇట్లు వీరియొక్క శ్రేయోభిలాషి,

బెజవాడ గ్రామనివాసి

కేశవానందేంద్ర సరస్వతీస్వామి

వ్రాసియిచ్చిన పత్రికారూప ఆనంద పరబ్రహ్మ ధ్యానం.

# తప్పొప్పుల పట్టిక.

| పే | తప్పు | ఒప్పు |
|---|---|---|
| ౨౨ | 1e | 1s |
| ,, | sams | same |
| 88 | నుండెడు | నుండుకు |
| 99 | కొని నష్టము | కొన నిష్టము |
| 102 | సానము | స్థానము |
| 103 | యుక | యొక |
| 108 | స్మతి | స్మృతి |
| 109 | ప్రతీము | ప్రతీకము |
| 142 | అవిచారిత్ర | అవిచారిత |
| 144 | ఉత్కృష్ణ | ఉత్కృష్ట |
| 145 | కష్ణార్జున | కృష్ణార్జున |
| 157 | అధిషాన | అధిష్ఠాన |
| 159 | పశ్వతి | పశ్యతి |
| 171 | జాదు | జాలదు |
| 172 | నిష్నల్మ | నిష్కల్మ |
| 176 | వలయ్యను | వలయును |
| 177 | దనుట | దగుట |
| 194 | వృత్తి | వత్తి |
| 196 | ఆచార్యోప్రదేశము | ఆచార్యోపదేశము |
| 214 | తాదాత్మ్యభిభిమానము | తాదాత్మ్యాభిమానము |
| 225 | విగరా | విరాగ |
| 259 | జానము | జ్ఞానము |
| ,, | అపేక్షించ | అపేక్షు |

శ్రీ శ్రీ త్రిపురసుందరీ పరదేవతాయైనమః.

ఉ॥ ఒక్కటి మూడుగానుబె యొప్పగనున్న ప్రధానశక్తియై
చక్కగ షోడశాక్షరిగ సృష్టను తానవయుక్తంబులన్
నిక్కటమైన యత్నమని యొప్పదిగాంచరె! సర్వదృశ్యమున్
ఒక్క పదార్థపు స్మృతిని గాంచెదమన్న నిటింగియుండె తాన్.



శ్లో॥ హ్రీంకారాసనగర్భితానలశిఖాం, సౌః క్లీం, కళాం బిభ్రతీం
సౌవర్ణాంబరధారిణీం, వరసుధాధౌతాం, త్రినేత్రోజ్జ్వలాం,
వందే, పుస్తకపాశమంకుశధరాం స్రగ్భూషితాముజ్జ్వలాం,
త్వాం, గౌరీం, త్రిపురాం పరాత్పరకళాం, శ్రీచక్రసంచారిణీమ్.

హరిః ఓం

శ్లో॥ సహనావవతు సహనౌభునక్తు సహవీర్యం
కరవావహై । తేజస్వినావధీతమస్తు మావిద్విషావహై॥
ఓమ్ శాంతి శ్శాంతి శ్శాంతిః

# 1. వేదమపౌరుషేయమే.

శ్లో॥ యోవేదాదౌ స్వరః ప్రోక్తో వేదాంతేచ ప్రతిష్ఠితః
తస్య ప్రకృతిలీనస్యయఃపర స్సమహేశ్వరః॥

(తైె-నారాయణీయం 4-10-24) లో వర్ణించినటుల, యే శబ్దజాలమంతయు 'ఓం' కారమునుండి బయలుదేరు చున్నదో అట్టి శబ్దజాలమగు నీచరాచర ప్రపంచమంతయు ప్రళయమొందినపుడు తిరిగి సర్వమును, 'ఓం' కార వ్యాచమగు ఆ పరమాత్మ స్వరూపముగనేయుండును. అదే తిరిగి సృష్ట్యావిర్భావ కాలమున తానే స్ఫుట శివ శక్త్యాత్మక 'నాదవృత్తులుగ' ప్రపంచాకారమున అభివ్యక్తమగుచుండుననియు తెలుపబడినది దీనినే బృ 4-4-10 'అస్యమహతో భూతస్య నిశ్వసితమేవ తద్యదృగ్వేదో' యను దాని వ్యాఖ్యానములో "పరమాత్మనః ప్రకృతస్యనిశ్వసితమివ నిశ్వసితం, యథాప్రయత్నేనైవ పురుష నిశ్వాసోభవతి" అని వర్ణించునపుడు, వేద మపౌరుషేయమే ననియు, అనగా సామాన్యపురుష బుద్ధీంద్రియములచే మార్పు జెందుచు, యెప్పటికప్పుడు భిన్న భిన్నములుగా స్ఫురింప బడినవిగాక, ఆద్యంతములు లేని 'వాక్' ఆ పరబ్రహ్మ నుండియే సృష్టికాలమందు బైలుదేరినట్లు తెలుపబడినది. గాన తైత్తిరియం నారాయణీయం 4-1-38 లో "ధాతాయథా పూర్వ మకల్పయత్" అని వివరించినట్లు, నిత్యమైన వస్తువును

గుర్తించుటకు సాధనమగు వేదము (విద=జ్ఞానే=అవబోధనే; అనగా పరబ్రహ్మమును జ్ఞానము (తెలివి) చే తెలుసుకొనుట నిత్యమైయుండుటచే "వేద మపౌరుషేయమనుట" రహస్యార్థ మనియు, వేద ప్రతిపాదితమైన సృష్ట్యాదులు సర్వ కల్పము లందును యెట్టిమార్పునులేక ఆదిపురుషుడైన చతుర్ముఖబ్రహ్మ (స్వయంభూ = స్వయం భవతీతి - తనంతటనే పుట్టినవాడు) యందు ఈశ్వరుని యొక్క అనుగ్రహమున సత్యమైన తత్త్వ మును సంకల్ప మాత్రముచేతనే స్ఫురింపజేయబడెనని తెలుప బడినది. అటులగాక పురుషాధీనమే యగుచో ఉపాధి పరిచ్ఛి న్నములగునవి అఖండాద్వితీయ పరిపూర్ణునెట్లు గుర్తింప జేయు గలుగునో. దుహూహ్యము. దుర్విజ్ఞేయమగు పరబ్రహ్మను, శాఖాచంద్రన్యాయముగ, గుర్తింపజేయుటయే ముఖ్యోద్దేశమై, పురుషార్థసాధకముగానట్టి యనృత రూపమగు సృష్టి, 'సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ' (తై 2-1-1) అని లక్షణార్థ ప్రధాన ముగా త్రిపుటి విరహితమైన సద్వస్తువునెట్లు గుర్తింపజేయ గలుగును? జ్ఞానశబ్దము 'జ్ఞ' ధాత్వర్థముకంటె భిన్నమయి, సూర్యకాంతిచే ప్రకాశింపబడు దర్పణము, దాని కెదురుగ వస్తువున్నయెడలనే దానిని ప్రతిబింబించి, లేనియెడల సూర్య కాంతి మాత్రమే ప్రకాశించునట్లు, సృష్టికిపూర్వ మద్వితీయ ముగ నున్నస్థితియందు 'ఆత్మ' యని యేది చెప్పబడుచున్నదో యట్టి ఆత్మ పదార్థము, సూర్యుడు - సూర్యకాంతియుంబోలె నిత్యమగుటచే, తనను తానే ప్రకాశింప జేసుకొనవలయును గాని మరొక రెట్లు ప్రకాశింపజేయ గలుగును?

శ్లో॥ "సవేత్తి వేద్యం నచ తస్యాస్తి వేత్తా
తమాహురగ్ర్యం పురుషం మహాంతమ్॥ శ్వేతా. 3/19

శ్రుతివ్యాఖ్యానములో శ్రీ ఆచార్యస్వాముల వారును, "తనను తెలుసుకొనువాడు మఱొకడు లేడనియు, తానే ప్రధానమయినందున సర్వకారణత్వాత్పూర్ణుడే ననియు" శెల విచ్చిరి. అట్లు త్రికాలాబాధ్యమైనవస్తువును గుర్తింపజేయుటకే ఈశ్వరుడు పదములసృష్టించి అప్పుడే అర్థవంతములగునట్లుజేసి (పద + అర్థములు = పదార్థముల గావించి) స్వకీయములగు సత్తాస్ఫూర్తులనే శబ్దార్థములద్వారా వ్యక్తపఱచుచు, నామ రూపాత్మకమగు 'నీ సృష్టి'ని సాగించ మొదలిడెను. అట్లు యీ జగత్తుగా వ్యవహరింపబడునది శబ్దార్థములే యగుటచే, బ్రహ్మముకన్న భిన్న మెట్లగును? అనగా అద్దములో తోచు నగరమునకు అద్ద మాధార మైనట్లు, ఇది ప్రపంచముగా చూచుటకు శబ్దార్థములే గదా! ఆధారము. గాన స్వతః సత్త కలవి గావు - అనుకొనినపుడు కలిగి, అనుకొననపుడు లేని దగుచు, ఎటులెటుల ననుకొనునో యటుల భాసించునదియు యగుటచే అనిర్వచనీయము, మిథ్యాభూతము అని వర్ణింప బడినది - అటుల పరాపేక్ష జనితములగు శబ్దార్థములు "ప్రమాణంనిరపేక్షఏవ స్వార్థే" అని ప్రశంసింపబడు 'వేదము' ను కేవలము శబ్దమాత్రమే ననియు, పురుషబుద్ధి ప్రయత్న పూర్వకములేననియు, నిరసించుటెంతయో సాహసము. ఇట్లు "అనంతా వై వేదాః" అని చెప్పబడు ఆపరంజ్యోతియే, సర్వజ్ఞ త్వాది లక్షణాయుత మగుటచే, "మంత్ర బ్రాహ్మణయోః వేద నామధేయః" అను శ్రీ విద్యారణ్య వచనానుసారమున, వస్తుసంగ్రహవాక్య విచారణాన్యను వ్యాఖ్యానమున ప్రవచింప జేసిన సరూపమైనసృష్టిని, సలిలఫేన తరంగాదులు సముద్రము కన్న భిన్నముగావను యదార్థస్థితిని లెస్సగ గుర్తింపజేయుటయే

యేకైకలక్ష్యమని ప్రతిపాదింపబడెను. అనగా మధువులోని మధురత్వమును, భాస్కరునియందలి కాంతియు యెట్లు ఆశ్రయముకన్న భిన్నముకాక వాటి వాటి, అస్తిత్వ గ్రహణమున, కాధారములై ప్రసిద్ధి చెందుచున్నవో యెవరెవరి ఉచ్ఛ్వాస నిశ్వాసములను వారే కర్తలో యటులనే, "వేదజనని"యని ప్రశంసింపబడు ఆ పరాశక్తియే పశ్యన్త్యాద్యవస్థల బొందినదై వైఖరీరూప శ్రుతి, స్మృతి, పురాణేతిహాసంబులుగ వెల యుచు, కేవల స్వస్వరూపానుసంధానోపాయముగ ప్రవర్తిల్లు చున్నందున, వేద మపౌరుషేయమనున దెంతమాత్రము శంకింపదగదు. భ.గీ-4,24 లో

శ్లో॥ 'బ్రహ్మార్పణం బ్రహ్మహవిర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణాహు తమ్। బ్రహ్మైవ తేన గంతవ్యం బ్రహ్మకర్మసమాధినా॥'

అని వర్ణించుటలో హోమముచేయువాడు (అధర్వణ) హోమసాధనములు (సామ)మంత్రములు (యజస్సు)స్తోత్రము చేయబడునది (ఋక్) అను చతుర్విధవిభాగమును, అనగా అవిద్యాకృత సర్వదృశ్య ప్రపంచమును 'ఆత్మ'యందు ప్రవిలాపనజేయుటయే ప్రయోజనమై చతుర్వేదములను మనోవృత్తి వ్యాపక చిదాత్మత్వమును సూచించుటయే యగుచు, ఉపాధి సహితుడగు ఆత్మను ఉపాధిరహితమగు పరబ్రహ్మరూపమున చూచుట యనునదే విసియోగ మగుటచే సర్వార్థములను బోధించు వేదము బ్రహ్మమేయగుచున్నది. శ్వేతా 6/18

'యోబ్రహ్మాణం విదధాతి పూర్వం యోవై వేదాంశ్చ ప్రహిణోతితస్మై' అను శ్రుతియును, సృష్ట్యాదిని యే చతుర్ముఖ బ్రహ్మసృజింపబడెనో ఆనాడే వేదము నతనిబుద్ధికి స్ఫురింప

జేసెననియు, అవియే మహావాక్యరూపమున ముక్తికాములగు పరమేశ్వరానుగ్రహముగల పురుషుల బుద్ధులను ప్రకాశింప జేయుననియు, వినబడుటచే, యీ వేదమనునది యెట్టి రూపముగ గాన వచ్చినను 'వేదాన్తకృద్వేదవిదేవచాహమ్' అనునట్లు, పామరులును, పండితులును, వేదాంతార్థము నుపదేశించి గురువులందును, బ్రహ్మవిదునియందును బరమేశ్వర బుద్ధి నవశ్యము చేయవలయునని బోధింపబడుచున్నది. యిట్టి విశిష్టత దీనియందుండుటచేతనే, బ్రహ్మనిష్ఠులగు మహాపురుషులబుద్ధి, అను పూర్వక విశిష్టయుతముగ అట్టి స్ఫురణగలిగిన గలుగవచ్చును. గనుకనే తైత్తిరీయాద్యుపనిషత్తు లన్నియు, అపౌరుషేయములే. ఇటుల జెప్పుటలో లోక ప్రత్యక్షానుభవముల ద్రోసివేసి, వేఱొకటి బోధించు టనునదిగాక "సర్వోఽప్యయం వేదః ప్రత్యక్షానుమానాభ్యా మనవగతేష్టానిష్టప్రాప్తి పరిహారోపాయ ప్రకాశేన పరః" అను వేదవచనానుసారముగ, పురుషబుద్ధుల కతీతమై, తమ తమ అనుభవములచేత తెలివిలు లేని తమ యిష్టానిష్ట పరిహారోపాయమయి సప్రమాణముగ తెల్పునదనియు, "శాస్త్రం జ్ఞాపకం నతు కారకమ్" అను న్యాయముగ నూతనముగ నొకదానినిసృష్టించునదిగాక, ఉన్న దానినే తిరిగి జ్ఞాపకముచేయునదే యగుటచే అపౌరుషేయమే ననియు సిద్ధించుచున్నది. మరియు వేదోత్తరభాగమై 'ఉపనిషత్తు' లని పిలువబడు అంత్యభాగములు (సర్వకల్పనాపనయనార్థసారపరత్వాత్సర్వోపనిషదాం)-అని శ్రీ ఆచార్యస్వాములవారే శలవిచ్చినటుల - యెంతియో ప్రాశస్త్యము వహించి - విశరణ, గతి, అవసాదనేష్వితి = ఉపనిషత్ - అవిద్యాకామ కర్మముల నశింపజేసి బ్రహ్మవిద్యయను ధర్మమూలమున

రహస్యమైన సత్యమగు బ్రహ్మప్రాప్తిని గలిగించి, "శీఘ్రముగ పర్యవసానము నొందించునగుటచే నవియెంత పురుషార్థీనము లుగ బహిర్దృష్టికి గానవచ్చినను సామాన్య - విశేషరూపము లగు సత్య - ధర్మములు (సత్య ధర్మయోశ్చాభేదేవ నిర్దేశః బృ 4-5-11) అవినాభావములే యగుటచే, నవి అపౌరు షేయములగు టనునది నిర్వివాదాంశము.

అటులగాక, పౌరుషేయమేయగుచో సకలచరాఽచర ప్రపంచ ప్రకాశనపరమగు వేద మెవరిచేత, యెట్లు ప్రకాశింప జేయ బడునదియు అగ్రాహ్యము. పరిచ్ఛిన్న దేహధారులును, కించిజ్ఞత్వాది సంకుచిత దృష్టిగలవారును, నిరంతర రాగ ద్వేషాది మల సంకలిత హృదయులును, సంతత స్వార్థపరా యణులును, సర్వకాల సర్వావస్థ సత్యానృత వ్యవహారాపన్ను లును, శుభాఽశుభ మిశ్రమ కర్మఫలానుభవులును, జనన మరణాది క్షణకాలస్థితిమాత్ర సంభవులును, సుఖదుఃఖాది క్షుద్రవిషయ వాసనావాసితులును, ఇత్యాది అల్పప్రజ్ఞానవంతు లగు మానవులు, త్రికాలాబాధితమును సర్వజ్ఞత్వాది లక్ష ణంబులును, ఆచంద్రార్కస్వయంప్రకాశమానంబును, ఆద్యంత రహితంబును, శరత్కాల చంద్రబింబతుల్య పరమోత్కృష్ట శాంతిప్రదాతయు, స్ఖలిత్వాది దోషరహితంబును, నిరాఘాట శాస్త్రయు, అన్యాపేక్ష రహిత పరమప్రమాణము, శరణాగత రక్షయు, ఆప్తవాక్యమునగు, వేదమును రచియించగలుగునది స్మరించుట నైతము కడు సాహసమనే చెప్పక తప్పదు. గాని ఇట్టి విపరీతాభిప్రాయములు లోకములో గానవచ్చుటకు హేతువు వారి వారి సంస్కారములతో గూడిన అభినివేశము లనియే స్పష్టమగుచున్నది.

కావున అవాఙ్మానసగోచరమైన ఆ పరమాత్మయే భక్తానుగ్రహాది ప్రయోజనము కొఱకు, శివశక్త్యాత్మకమగు నీ జగద్వనమున ప్రకాశ విమర్శనపూర్వక వేదవృక్షముగ వెలసి, ముముక్షుజన లోకమునకు బ్రహ్మజ్ఞాన ఫలముల సమకూర్చి పరబ్రహ్మసిద్ధి యను శాశ్వతానందమును గలుగజేయు చున్న దనుటలో సందేహము లేదు. దీనినే భ.గీ. 15-1 లో ఏబీజము నుండి యేవృక్ష ముత్పన్నమగునో ఆవృక్ష మాబీజముయొక్క రసము గలదే యగునట్లు, చిదేకరసమగు బ్రహ్మమునుండి పుట్టిన యీ సంసారవృక్షము చిద్రసమేయగును. ఇట్లుగలిగిన స్వానుభవముచేత నీ సంసారము చిదేకరసము, కారణమును మాయాశబళిత పరబ్రహ్మమేనని శుద్ధాత్ముడైన యే పండితు డెఱుంగుచున్నాడో ఆతడే వేదార్థవిదుడు. అప్పుడే "సర్వే వేదా యత్పదమామనన్తి" యను న్యాయమున బ్రహ్మాత్మై క్యానుభవమును గలిగినవాడగుచున్నాడు.

మరియు, భ.గీ. 14-27 "బ్రహ్మణోహి ప్రతిష్ఠాఽహమ్" అనునట్లు కర్మకాండోపాసనాకాండ జ్ఞానకాండాత్మకములై మంత్రబ్రాహ్మణ రూపములైన సమస్త వేదముల యర్థ మెఱింగిన విద్వాంసుడు. 'అహం' పదవాచ్యుడగు పరమాత్మకన్న భిన్నముగానందున శబ్దోపాధిచే జ్ఞాతృ జ్ఞేయరూపమునభేదముగ దోచుచున్నను, విచారింపగ వాని కర్థముచే నేకత్వమే ఉపపన్నము- దీనినే శ్రీ స్వామి వివేకానందులవారు 1893 వ సంవత్సరమున వారి చికాగో ఉపన్యాసములలో నీ క్రింది విధముగ ప్రతిపాదించినట్లు వినవచ్చుచున్నది.

"The Hindus have received their religion through revelation- 'the VEDAS' These Vedas have no beginning or end. It is no Grandham"

అని ఉద్ఘోషించుచు, ఆయా కాలములో ఆయా మహర్షులు కనిపెట్టిన పారమార్థిక శ్రుతి ప్రకాశములనియు, యెట్లు భౌతిక మందు ఆకర్షణ సూత్రములను (Laws of Gravition) భౌతిక శాస్త్రవేత్తయగు న్యూటన్ మహాశయుడు, కనిపెట్టక పోయినను సిద్ధమయే యున్నదో, అటులనే యీ ఆధ్యాత్మిక సూత్రములను (Spiritual revelations - Devin$_{e}$ Truths అనగా జీవుడు, ఈశ్వరుడు, మోక్షము, ఇత్యాదులు యేమిటో సిద్ధపడే యున్నవనియు, ఎవరు కనుగొనక పోయినను ఆధర్మములే సర్వకాలములందును, సర్వులచేతను అంగీకరింపబడు చుండుననియు, వానికి దేశ కాల కలనములతో సంబంధము లేదనియు, మంత్రద్రష్టలగు స్త్రీపురుషు లనేకులు భౌతికశాస్త్రవేత్తల మాదిరిగానే వాటినిగ్రహించి కృతకృత్యులగుచుండి రనియు విశదము జేసెను. బృహన్నలాది తంత్రములందును యిటులనే చెప్పబడినది.

గాన శ్లో॥ "సర్వేషామేవ వస్తూనాం భావార్థో భవతి స్థితః
తస్యాపి భగవాన్కృష్ణః కి మ తద్వస్తురూపతామ్"॥

అనునట్లు 'కారణమైన సత్తుకన్నను గార్యసత్తు నంగీకరింపమి' వలన, పరబ్రహ్మకంటె అన్యమైన వస్తువు పారమర్థికమున నించుకేనియు గానరాదు. అందువలననే బృ-6-3-22 లో త్రిగుణాతీతమైన-ఆ శుద్ధచైతన్య పరబ్రహ్మయందు 'వేద' మవేద మగుననియు, అట్టి దానిని గుర్తించిన "స్వస్థితియే" కృతకృత్యత బొందుటగుననియు, భ-గీ 2/45 ఘంటాపథముగ జాటుచున్నది. కావున భ-గీ 3 14-15 శ్లోకములలో చెప్పినటుల, "బ్రహ్మస్వరూపమగు వేదము అపౌరుషేయమే!"

హరిః ఓమ్-తత్-సత్

# 2. శబ్దమే ప్రమాణము

శ్లో॥ నామరూపేచభూతానాం కర్మణాం చ ప్రవర్తనం ।
వేదశబ్దేభ్య ఏవాదౌ నిర్మమే స మహేశ్వరః॥

(మనుస్మృతి

"అఖిల ప్రమాణాగోచరం బ్రహ్మ" (మహానారాయణం - 1 అ) లో చెప్పినటుల, బ్రహ్మము తెలియబడునది (దృశ్య) కామిచే యే ప్రమాణమునకు గోచరముకానిదే యైనను, శాఖాచంద్ర న్యాయముగ, కాల్పనికమైన దైనను యొక ప్రమాణముచేతనే గాని యస్తిత్వ గ్రహణమువలన పడని హేతువున, అట్టి ప్రమాణమేమగునా యనునదే నిట ప్రస్తుత విషయము.

'ప్రమీయతేఽనేనేతి ప్రమాణం' అనునటుల దేని చేత నెఱుగబడునో, నదియే ప్రమాణము. ఏదైనా యొక వస్తువు యొకదానికి ప్రమాణమగుచు, మరొకదానిచే పొంద బడనిదై యుండవలెను. అనగా కన్ను రూపమును గ్రహించు టకు యెట్లుప్రమాణమో అట్లు-గాన యిచ్చట కన్నువిషయి, రూపము విషయము; కావున ప్రమాణమనగా "స్వవిషయాని ద్వారాణి" అనునట్లు, స్వతః ప్రమాణమని చెప్పబడుచున్నది. ఇటుల చెప్పవలసియున్నను, కొందరు ప్రమాణము లెనిమిదని [1 ప్రత్యక్షము (సాక్షాత్కారము) 2 అనుమానము (వ్యాప్యము జ్ఞానముచేత వ్యాపకము నిశ్చయించుట-ఊహ) 3 శబ్దము (ఆప్తవాక్యముగాని - వేదాది గ్రంథవాక్యములనుగాని విశ్వ సించుట) 4 ఉపమానము (పోలిక) 5 అర్థాపత్తి (శబ్దమువలన ఉపస్థితముగాని అర్థము సందర్భముబట్టిస్ఫురించుట) 6 అనుప

లబ్ధి (ప్రత్యక్షాదిజ్ఞానము లేమి) 7 సంభవము (మొత్తమునందు దాని భాగము లున్నవని యెరుగుట) 8 ఐతిహ్యము (ఒకడు చెప్పిన మాటను విని ప్రత్యక్షముగ దానినిగూర్చి భయాదుల నొందుట)]యు కొందరు సంభవము, ఐతిహ్యములను విడచి ఆరేననియు మరికొందరు ఉపమానార్థాపత్త్యనుపలబ్ధులు, ప్రత్యక్షాదిత్రయమునందే యంతర్భవించుటవలన మూడేప్రమాణములనియు చెప్పుచుండుటగలదు. ఏది యెట్లున్నను, ముఖ్యములుగ చేకొనబడిన ప్రత్యక్షానుమానాగమము లెంతవఱకు ప్రమాణములో నొకింత విచారింపనగు.

ఎవడు మేది యెక్కువగ యభ్యాగము నితలచునో, అటులనే సాక్షాత్కారమైనటుల పొరబడుచుండును. (సాక్షాత్కారము) 'ప్రత్యక్షము' అనునది కన్నువలె రూపమును దెలుపు నొక ప్రమాణమైనయెడల, సాక్షాత్కారము నుప యోగించు ప్రతివానికి కన్ను అని ప్రయోగించినపుడెటుల రూపమే తెలియునో అట్లే ప్రత్యక్షమని యుపయోగించునప్పుడెల్ల ప్రతివానికి దెలియునది యొకటియై యుండవలెనుగాని యొకనికి శూన్యము సాక్షాత్కారమనియు, మరొకనికి ద్వైతము సాక్షాత్కారమనియు, ఇంకొకనికి ద్వైతాద్వైతము సాక్షాత్కారమనియు, వేరొకనికి అద్వైతమే సాక్షాత్కారమనియు చెప్పఁబాడుగదా!

అటులనే 'అనుమాన' (ఊహ. తర్కము) ప్రమాణమును విచారించినను, సూ-భా 2-1-11 "తర్కాప్రతిష్ఠానాత్" అనుచోట, శ్రీ ఆచార్యస్వామివారి చేతనే, "పురుష బుద్ధు లనేక విధములగుట వలన విద్వాంసులచే యత్నపూర్వకముగ నూహింపబడిన తర్కము, వారికంటె నధికులగు

వారిచే వ్యాఖ్యానింపబడుట ప్రసిద్ధము కుటచే దర్కములను నిలు కడ గలదని యాశ్రయింప శక్యముగాదుగాన శాస్త్రము సిద్ధము ననుసరించని కేవల తర్కబలముచే నాగమ గమ్య మైన అర్థము నిరూపరచ నెంచ సాహసమని నిరాకరింపబడినది. మనుధర్మశాస్త్రమందును.

"ఆర్షం ధర్మోపదేశంచ వేదశాస్త్రవిరోధినా॥
యస్తర్కేణాను సంధత్తే సధర్మం వేద నేతరః॥"

వినవచ్చును. 'యెవడు వేదమును, వేదమూలకమగు స్మృతి సముదాయమను వాటికి విరుద్ధముగాని న్యాయముతో ననుసరించి విచారించుచున్నాడో అతడే ధర్మమును బాగుగ గుర్తించిన వాడుగాని యితరులు తెలిసినవారుగారని' స్పష్ట పరచెను. మరియు 'యుజిర్ యోగే' యను ధాత్వర్థమును జూచినను కార్యకారణముల రెంటి సంబంధమును నిరూపించు నదే 'యుక్తి' గాన త్రికాలములందుండు యెల్ల తార్కికులను యొకచోట, వొకేకాలమందు సమూహారింప శక్యముగాదు గావునను, కేవల మనుమానమే ప్రమాణమని నిర్ణయింప జనదు.

ఇక 'శబ్దమన్ననో' శ్రీ ఆచార్యస్వాములవారు శెలవిచ్చి నటుల "సర్వోఽప్యయం వేదః ప్రత్యక్షానుమానా భ్యామనవ గత యిష్టానిష్ట ప్రాప్తి పరిహారోపాయ ప్రకాశనపరః సర్వ పురుషాణాం నిసర్గతయేవ తత్ప్రాప్తిపరిహారయో రిష్టత్వాత్" పురుషబుద్ధుల కతీతమైనట్టిదియు, యెల్లరకు యెల్లకాలము లందు ముఖ్యావశ్యక మైనదియు, సాధ్యమునకు సాధనము చెప్పునదే శాస్త్రమని నిర్వచింప బడినపుడు, దానినే యితర ప్రమాణము ఖండనమండన చేయగలదు?

ఉ॥— శివునకు బిల్వమును, విష్ణువునకు తులసియు ప్రీతియని యే యుక్తి సాధింపగలదు? అట్టి యుక్తికి వెళ్ళ లేముగనుకనే నిష్కామనయా (స్వార్థరహితముగా) నాచ రించు నిష్ఠయే, సాధనముని నిర్ణయింపబడినది. అప్పుడేగాని ప్రత్యక్షానుమానముల సార్థకము తెలియబడదు.

"శ్రుతి"యన్నను, ధర్మాఽధర్మములు వినబడి పారం పర్యేణ అభ్యసింపబడుచు, తానే స్వకీయసామర్థ్యముచే విశ్వ రూపము ధరించినదై: శబ్దబ్రహ్మమను పేర ప్రశంసింపబడు చుండుటచే నిత్యసిద్ధమై అగ్ని జౌష్ణ్యమువలె ప్రకాశించు చుండునదై, స్వవిషయమున వేఱొక ప్రమాణముచే తెలియ రాని యంశమున ప్రమాణమగుచు, ప్రమాణాంతరములచే దనవిషయము నుపహరింపబడని దగుటచే, "ప్రత్యక్షమను" నామాంతరముచేతను, 'స్మృతియే' అనుమానమను పేరునను విరాజిల్లుచున్నవి. అందువలనే ఆత్మతత్త్వము (అద్వైతము) వేదము, (శబ్దము) చేతనే తెలియబడుచు, మఱొక ప్రమాణ గమ్యము కాకపోవుట! అదెట్లనో యీ క్రింది విచారణోకింత గమనించిన విశదము గాగలదు.

"అసలు యీ "విషయము" లున్నవని వాటికి "విషయి" నైన నేనెరుగుదునని నాకెటుల వచ్చినది? అనగా నేను 'పుట్టినానని చెప్పుట' యెటుల వచ్చినది? ఇతరులు చెప్పిన శబ్దమేగదా! 'నేను పుట్టలేదు— ఆకాశమునుండి ఊడి పడినానని అంగీకరించకపోవుటకు కారణమేమి? అది నాకు స్వభావమైతే నమ్ముదును. గాన వస్తు 'స్వభావ' మున కను కూలమైన శబ్దమే ప్రమాణము. అట్లుగాక మన 'భావన'కను కూలమైన శబ్దము ప్రమాణమని చెప్పజెల్లునా? నాకు 'పుట్టి

నానంటే' సంతోషము, 'చచ్చెదను' అంటే భయము. ఎందుకు? 'నేను' అనగా నాకు తెలిసినది. 'పుట్టువాడను-చచ్చువాడను' అనే యింతవఱకు ఉన్నది. చీమకు, దోమకు, సర్వభూతసముదాయమునకు తెలిసినదేయిది! - చివరకు పిల్లవానిని హాస్యముగ క్రింద పడ వేయబోయినచో వాడు మన మెడను గట్టిగా కౌగలించుకొనును. కారణం - తాను క్రింద పడుదునని వానికి గట్టిగా తెలియును. ఇదియే సహజజ్ఞానము. అనగా మనకు తెలిసినది, విషయములంటూ యిదివఱకే యుంటూయున్నవని, అటులనే యీప్రపంచమున్నట్లు, యీ కన్నులు, ముక్కులు, మొదలగు యింద్రియముల చేతనే గాదు మనకు తెలిసినది - మనకు ముందే తెలిసియున్నది. అయితే యీ విషయములు మఱుకు ఉండక తప్పవుగాని, అవి యెట్లు వచ్చినవో అను దానియందే యీ విభిన్నాభిప్రాయములు. దీనికే ప్రమాతృత్వము సంస్కరింపవలయును."

'రజ్జుసర్ప భ్రాంతి'లో సర్పజ్ఞాన మెటులవచ్చినది? సర్పము లేదే? ఈ విమర్శనే భిన్నమతములకు నాంది. దీనినే ప్రాశ్చాత్య తత్త్వవేత్తలు సూక్ష్మపరిశీలనచేయుచు, కంటికికనపడు ప్రతిబింబము భౌతికశాస్త్రరీత్యా తల్క్రిందులుగా గోచరించవలసియున్నను, సరిగా కానవచ్చుటకు కారణమేమి ? అను సంశయముగలిగి, బుద్ధిమంతులై, విచారణకు దిగినట్లు ప్రతీతి! గాన దీనివలన దేలున దేమనగా "చూచేవాడు మారవలెను గాని' చూడబడేది గాదని" స్పష్టమగుచున్నది. దీనినే వివేకచూడామణిలో (67) 'మాయాకార్య తిరోహితం స్వమమలం 'తత్త్వం నదుర్యుక్తిభిః' అని వర్ణించుచు, సద్గురూపదిష్టమైన మార్గమున శ్రవణాదులచేతనే ఆత్మతత్త్వము గ్రహింపనగును

గాని, తర్క-సాంఖ్యాది యుక్తులవలన, నది లభింపదనియు వివరింపబడెను.

ఇక శబ్దమే ప్రమాణమను దాని విషయములో, సూ.భా 1-3-30లో వ్యాఖ్యానింపబడినటుల - సృష్టిప్రళయముల యావృత్తి యంగీకరింపబడినదయ్యును. ఉత్తర ప్రపంచము పూర్వప్రపంచముతో దుల్యమైన నామరూపములు గలదిగను కను శబ్దమందు ప్రామాణ్య విరోధమెద్దియు లేదనుచు-ఎట్లు నిద్రాప్రబోధములందు, ప్రళయము - ప్రభవమును వినంబడినను, పూర్వప్రబోధమునందు వలెనే, తరువాత ప్రబోధమునందును శబ్దార్థ సంబంధ స్మరణాముల"ను వ్యవహారముగలదో అట్లు - అని రూపించ్చిరి.

కౌషీతికే బ్రాహ్మణోపనిషత్ 3—3 నందును "ఉపాదానమున లీనమగు కార్యరూపశక్తి, 'మహాసన్న గ్రోధస్సిష్ఠతి' యను శ్రుత్యనుసారముగ సిద్ధమగుటచే, జగత్తు ప్రళయ ప్రభవములందు శక్తిశూన్యముగ లయించునేని, యాకస్మికత్వము ప్రసక్తించునుగాన, జగము లయించుచున్నదియయ్యు శక్త్యవశేషముగనే లయించుననియు మరల శక్తిమూలమయే ప్రభవించుననియు తెలుపబడినది. మరియు నట్లగుటచే, యెల్లకల్పములు సమానవ్యవహారము గలవికావునను, ఈశ్వరానుగ్రహము గలవారు పూర్వవ్యవహారము ననుసంధింప శక్తులుగావునను, నెల్ల సర్గములందును వ్యక్తులు సమానములే పుట్టుచూ సమాన నామరూపములు గలవి కాబట్టియే జగమునకు మహాసర్గ ప్రళయలక్షణమైన యావృత్తి అంగీకరింపబడినదైనను, శబ్దప్రమాణమున కెట్టి విరోధము లేదనియు" స్పష్టము జేయబడెను.

స్మృతియును.

ఋషీణాం నామధేయాని యాశ్చ వేదేషు దృష్టయః
శర్వర్యంతే ప్రసూతానాం తాన్యే వైభ్యోదదాత్యజః॥

అని ప్రతిపాదించుచున్నది. మరియు సూ.భా 1-3-28 లో వ్యాఖ్యానించునటుల.

శబ్దముల శాకృతులతోడనే సంబంధముగాని వ్యక్తులతో సంబంధములేదనియు, సేనాపత్యాది శబ్దములవలె నింద్రాది శబ్దములు స్థానవిశేష సంబంధ నిమిత్తములైన గావచ్చును గాన దోషములేదనియు, నిత్యార్థసంబంధముగల నిత్యశబ్దము, వాచకరూపమున నున్నది యగుచుండగా శబ్దవ్యవహారమునకు దగిన యర్థవ్యక్తి నివృత్తి దానినుండి యగుచున్నదనియు, తెలియవచ్చుచున్నది, అనగా శక్తివిలసన రూపమగు నీజగము శబ్దనిస్సృతికన్న వేరుగానపుడు వస్తు యదార్థస్థితిని గుర్తింప జేయుటలో శబ్దముకన్న మఱొకటెట్లు ప్రమాణముగాగలదు?

గాన శబ్దైక గమ్యమగు బ్రహ్మమే తెలుసుకొనదగిన ప్రమేయముగా (అథాతో బ్రహ్మజిజ్ఞాసా)యను సూత్రమును, తెలుసుకొనే ప్రమాతగా (జన్మాదస్యయతః) యను సూత్రమును, దేనివలన తెలుసుకొనవగునో దానినే ప్రమాణముగా (శాస్త్రయోనిత్వాత్) యను సూత్రమును వివరించి తెలుసుకొనిన పిదప శాస్త్రము (శబ్దము) ను సమన్వయము చేయునటుల ప్రమితిగా (తత్తు సమన్వయాత్) అను సూత్రములుగ విభాగించి ప్రాచీనమహర్షులు,

"ఉపాసకానాం కార్యార్థం బ్రహ్మణోరూప కల్పనా॥
అనునట్లు తమ ఔదార్యమును చాటుచు, శాస్త్రమునంతయు

నాలుగు సూత్రములద్వారా బోధజేసిరి.

మరియు లోక వ్యవహారమునందు సైతము, దేశాంతర వాసుల క్షేమసమాచారములందును, వివాహాది సంబంధము లందును, 'శబ్దమే ప్రమాణ' మగుచుండుట యెల్లరకు నిత్యా నుభవమే. ధర్మము - మోక్షము, చావు, బ్రతుకు యిత్యాది మాట లెక్కడనున్నవి? అట్టివి, వినినంతనే మన హర్షా మర్షములకు కారణమేమి?

ఇట్టి విమర్శనములకు గడంగినచో శబ్దము (సంస్కృత మైన అర్థబోధకమగు మాట) యొక్క స్వరూపము విశద మగుచు (అనగా శబ్దమునకు అనుటయే-స్ఫూర్తి లేక చలనమే మొదలు అనునది స్పష్టమగుచు) "స్థితం న్యాయం సబాధతే" యను శ్రీ ఆచార్యస్వామివారి సిద్ధాంతానుసారము జగత్తు యొక్క సర్వానుభవము గలిగిన పరమేశ్వరుడిచ్చిన శాస్త్ర మునకు (శబ్దమునకు) మఱొక ప్రమాణమేమియు లేదని దృఢముగాగలదు. గాననే తమ సాధనపంచకమునందు శ్రీ స్వామివారు,

"దుస్తర్కాత్సు విరమ్యతాం శ్రుతి మతాస్తర్కోను సన్ధీయతామ్" అని శలవిచ్చిరి;

స్మృతులయందును.

"అనాదినిధనా నిత్యావాగుత్సృష్టా స్వయంభువా
ఆదౌ వేదమయీ దివ్యా యతస్సర్వాః ప్రవృత్తయః."

సృష్టిని శబ్దపూర్వకముగనే చెప్పబడుటచే పైన జెప్పినవిధమున శబ్దమే ప్రమాణము.

ఓమ్ తత్ సత్

# 3. గురు భక్తి

శ్లో॥ గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః।
గురుసాక్షాత్పర బ్రహ్మ తస్మై శ్రీ గుర వేనమః॥

ప్రపంచములోని జీవులందఱును యెల్లప్పుడును ఆనందము గానే యుండవలెనని కోరుచుందురు. అట్లభిలషించి తమకు లభ్యమైన యే స్వల్పఆనందముతోడనో తృప్తిజెందువారలకు లోకవ్యవహారము సహజమై నడచుచుండునుగాని, ఆనందానుభవమే యేకైక లక్ష్యమగుటచే యెప్పుడెప్పుడా స్వల్పానందమైనను లభించకపోవునో, లేక దాని కంతరాయము గలుగుచుండునో యప్పుడెల్ల, నెంతయోపరితపించుచు, తిరిగి దానినిబొంద ప్రయత్నించుచుందురు. అందులో ముఖ్యముగ మానవుడది స్వాభావముగ నెంచుటచే వాని దైనందిన ప్రవృత్తి కదియొక ప్రధానకారణముగ పరిగణింపబడుచున్నది. అట్లెంత కృషిసల్పినను, ఫలమునందేనాటికి నెట్టి మార్పును గలుగనేరదని గుర్తించిన వివేకిమాత్రమే తను జేయుప్రయత్నమందేమైన లోపముండకపోదని శంకించి స్వయంకృషియందు నిరుత్సాహియై, తన మనోభీష్టసిద్ధికొఱకు సరియైన మార్గాన్వేషణకు గడంగును. ఇట్టియన్వేషణయే నిరతిశయానందావాప్తికి నాంది యగుటచే తనయొక్క దురహంకారమును గుర్తించినవాడయి, దానిని సరిజేయ నెంచినవాడగుటచే, తనకన్న శ్రేష్ఠులును, ఆనందానుభవముగలవారిని సమీపించి, వారి చెప్పుచేతలకు లోనై, వారి యాదేశముల శిరసావహించుటకు ప్రయత్నించుట లోకములో జరుగుచున్నది. వారలనే 'గురు'వులని భావించుటయు, వారి ననుకరించుటకే 'భక్తి' యనియు

సామాన్యవచనము. కావుననే యిట్టి భక్తిమార్గమున కందఱు అర్హులేయని సూచించుటయందు గల విశిష్టత. అయితే యీ మార్గము 'భక్తి - ప్రపత్తి' యని రెండువిధములుగ గాన వచ్చుచు రెంటియందును, వారివారి యనుష్ఠాన పటిమ నను సరించియే ఫలము కలసివచ్చుచుండుటయు యెల్లర కనుభవ ములోనున్నది. ఈ రెండుమార్గములును సేవ్యసేవకారూప పృథక్త్వమును సూచించుచు, చిరకాలాభ్యాస పాటవమున, ఉత్తరోత్తర భూమికల కందించి, స్వపరభేదరహిత అఖండా ద్వితీయ ఆనందమొసగు సాధనలుగానే సామాన్యముగ నిర్ణ యింపబడినవి. గాని అందు భక్తియనునది యుత్తమాధికారు లకు తగినదై శీఘ్రఫలకారియగుచున్నది. రెండవదగు 'ప్రపత్తి' యో, అందు శరణాగతియే ప్రధానమగుటచే,

శ్లో॥ ఆనుకూలస్య సంకల్పః ప్రాతికూలస్య వర్జనమ్।
రక్షిష్యతీతి విశ్వాసో గోప్తృత్వావరణం తథా।
ఆత్మనిక్షేపకార్పణ్యే షడ్విధా శరణాగతిః॥

యనునట్లు, సామాన్యముగ నందఱకును నుపయోగపడునదే యగుచున్నది. ఇక

భ-గీ 8/22 "పురుషస్య పరః పార్థ భక్త్యాలభ్యస్త్వనన్యయా"
11/54 "భక్త్యాత్వనన్యయాశక్య అహమేవంవిధోఽర్జున"

ఇత్యాదిస్థలములందు, భక్తియొక్క పర్యవసానమగు ఆత్మనివే దనమనుపేర విరాజిల్లు యేకాంతభక్తియే సాధకతమమనియు,

18/55 శ్లో॥ భక్త్యా మామభిజానాతి యావాన్ యశ్చాస్మి తత్త్వతః। తతో మాంతత్త్వతో జ్ఞాత్వా విశతేతదనంతరమ్॥

అనుచోట నట్టి జ్ఞానలక్షణముగు భక్తి - ప్రత్యగాత్మవిషయ
ప్రత్యయసంతాన కరణాభినివేశ మనబడు జ్ఞాననిష్ఠచే, "తానే
పరబ్రహ్మము" నను అంతటను అభిముఖ్యంబున వికల్పరహిత
మగు సాక్షాత్కారమగు వస్తువుయొక్క తత్త్వమును నిశ్చ
యించి నిత్యానందభరితుడగుచున్నాడని తెలుపబడినది.

పిదప 'గురు' శబ్దార్థమును విచారించినను, "'గు'
కారశ్చాంధకారస్తు 'రు'కారస్తన్నిరోధకృత్" అనెడి వ్యుత్ప
త్తినిబట్టి, అజ్ఞానాంధకారమునకు భాస్కరునివంటివాడని స్పష్ట
మగుచున్నది. కావుననే రాగద్వేషాది మలరహితుండును,
ప్రత్యగభిన్న పరమాత్మ తాదాత్మ్యమును బొందినవాడునునగు
ఆచార్యమూర్తియందుగల బ్రహ్మమే గురువయి, ఈశ్వరా
రాధనచే నిర్మలచిత్తులగు శిష్యులను అవిద్యాతత్కార్య నివా
రకమగు శక్తినిగలిగించి, పరతత్త్వమును బోధించుచున్నది.
దీనినే అద్వయతారకోపనిషత్తునందు

గురురేవ పరంబ్రహ్మ గురుదేవ పరాగతిః।
గురురేవ పరావిద్యా గురుదేవ పరాయణమ్ ॥

యని వివరింపబడినది. అనగా సృష్టి, స్థితి, లయకారణమగు
యే పరాశక్తి, తదధిష్ఠానమును లెస్సగ గుర్తింపజేసి, యీ
సంసారము మాయాకల్పితమైన మరుమరీచికవలె మిథ్యాభూత
మని తెలిపి, తాపత్రయశాంతిని గలిగించుటేయను సద్గురు
మూర్తియొక్క దివ్యానుభవమును ప్రియశిష్యునకు బోధ
జేయుటయే యందలి ముఖ్యైకలక్ష్యమగుటచే, అట్టివారి
పాదారవిందములయందు సమర్పించెడి యచంచల భక్తియే
'గురుభక్తి' యని ప్రశంసింపబడుచున్నది. ఇట్టి కృతార్థతను

బొందుటకు తగినంత 'శ్రద్ధా - భక్తి' గలవారలే శిష్యులని చెప్పబడుదురు. "శుశ్రూష" యనినను - శ్రోతుమిచ్ఛా 'శుశ్రూషా శ్రు-శ్రవణే' యను ధాత్వర్థమునననుసరించి విన నిచ్ఛయించుటనునదే ప్రధానము జేసుకొని, దాని కంతరా యము లేనట్లు సద్గురుమూర్తి సేవయందే నిమగ్నుడగుటగాని, లక్ష్యశూన్యమైన కేవల డాంబిక పరిచర్య నిష్ప్రయోజనమే! ఇట్లు నిష్కళంకహృదయులైన వారిఉభయులయందును అకుంఠిత సేవ్యసేవకాభావ ముద్భవించినసేగాని లక్ష్యసిద్ధి గానేరదని శాస్త్రాదులయందు బేర్కొనబడిన వారివారి విధినియమములే ప్రమాణము. భ॥ గీ॥ 4-37.

శ్లో॥ శ్రద్ధావాన్ లభతే జ్ఞానంతత్పర స్సంయతేంద్రియః।
జ్ఞానంలబ్ధ్వా పరాం శాంతిమచిరేణాధిగచ్ఛతి ॥

యమనది దీనినే తెలుపుచున్నది. గాన గురుశిష్యానుబంధము నకు భక్తియే సాధనము. మరియు అట్టి యుత్తమమైన జ్ఞాన సిద్ధికి బాహ్యసాధనగ, భ॥ గీ॥ 3-34.

శ్లో॥ తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా ।
ఉపదేక్ష్యన్తి తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వదర్శినః ॥

అనుచోట శ్రీకృష్ణభగవానుడే, 'ఆచార్యులయొద్దకుబోయి వారలకు నమస్కరించి, సంశయములుదీరునట్లు వారల నన్ని విషయములనడిగి వారికి శుశ్రూషచేయుట మొదలగు నుపా యములచే నాజ్ఞాన మెఱుంగుమనియు, అప్పుడు తత్త్వసాక్షా త్కారముగలజ్ఞానులు శిష్యునియం దనుగ్రహముగలవారలై అట్టిజ్ఞాన ముపదేశింతురనియు' సెలవిచ్చిరి. దీనినే శ్రుతియును "తద్విజ్ఞానార్థంస గురుమేవాభిగచ్ఛేత్సమిత్పాణిం శ్రోత్రియం

బ్రహ్మనిష్ఠమ్." అని గురుశిష్యుల వర్ణించుచున్నది. అటుల చెప్పుటలో ఆచార్యవిషయకంబైన యీ బహువచనము, ఒకనియందే గౌరవాతిశయమునకొఱకుగాని (యేకైకలక్ష్యము) బహుత్వమునుద్దేశించి చెప్పబడినదిగాదు. గాన 'ఆచార్యవాన్ పురుషోవేద' అనునట్లు ఉత్తములైన ఆచార్యులచే నుపదేశింప బడిన జ్ఞానమే కార్యసమర్థంబని సిద్ధంబగుటచే చంచలాత్ములై కనబడినవారినెల్ల గురువులుగ స్వీకరించక, తమకు తగిన యొకే సద్గురువును బొందుటయందు కడు జాగరూకులై, సాంప్రదాయానువర్తులగుమని ఆదేశించుటయే యందలి ముఖ్యోద్దేశము.

శ్లో॥ ఆశ్రమీ దేశస్థాయీ చ గురుశేవం విధీయతే ।
పుత్రదారైశ్చ సంపన్నో గురురాగమసంమతః ॥
ఆశ్రమధ్యాననిష్ఠాశ్చ మన్త్రతన్త్ర విశారదః ।
స్వయమాచరతే శిష్యానాచరే స్థాపయిత్యపి ॥
(గణేశతంత్రము)

యందును సద్గురువుల నీ ప్రకారము వర్ణించియుండుటచే, వారలను వరించుటయందును నేర్పరులై యుండుటను నదెంతయో అవసరమగుచున్నది.

మంత్రము – మంత్రార్థము–మంత్రాధిష్ఠాన దేవతనను నవి అవినాభావ సంబంధముగలవియై సాధకుని దీక్షాకుశలత ననుసరించి సార్థకంబగునటులనే ఆదిభౌతికాది విభాగత్రయ సూచక 'గురు వీశ్వరాత్మ' పదములు మూడును వేర్వేఱుగ గాన్పించుచున్నను,

ఈశ్వరో గురురాత్మేతి మూర్తిభేదవిభాగినే।
వ్యోమవద్వ్యాప్తదేహాయ దక్షిణామూర్తయేనమః॥
(మానసోల్లాసిని-భావార్థ వార్తికం)

లో వర్ణించినటుల యేకార్థబోధకములే యగుటచే,

యస్య దేవే పరా భక్తిర్యథా దేవే తథా గురౌ।
తస్యైతే కథితా హ్యర్థాః ప్రకాశంతే మహాత్మనః॥
(శ్వేతా—6/23.)

యే పురుషునకు సర్వోత్కృష్టమైన దైవభక్తి గలదో, యా పురుషునకు ఆత్మజ్ఞానోపదేష్టయగు గురువునందు పరమభక్తి గుదురుననియు, అట్టి మహాత్ముడే బ్రహ్మాత్మైక్యబోధోపయోగమగు ఉభయపదార్థశోధన త్రిపుటీ వివేకాది శుద్ధసంపత్తు గలవాడగుచున్నాడని తెలియవచ్చుచున్నది. దీనినే శ్రీఆచార్యస్వాములవారు"......తదుభయం వర్తతే......యథా చ బుభుక్షితస్య భోజనాదన్యత్ర సాధనాన్తరం న, ఏవం గురు కృపాంవిహాయబ్రహ్మవిద్యా దుర్లభేతి వరాన్వితస్య ముఖ్యాధికారిణో మహాత్మన......భవన్తి" యని వర్ణించుచు, గురుభక్తికిమించిన సాధనాన్తరంలేదనియు దానిని విడచిన బ్రహ్మవిద్య కడుదుర్లభమనియు, శిష్యునిభక్తిననుసరించియే గురుకృప ప్రసరించుననియు శెలవిచ్చిరి. ఇట్టిదైవభక్తి,

అనేకజన్మసాహస్రైస్తపోదానసమాధిభిః।
నరాణాం క్షీణపాపానాం కృష్ణేభక్తిః ప్రజాయతే॥

అనునట్లు అనేకజన్మార్జిత తపోదాన సమాధిఫలముచే నశించిన పాపముగల మనుష్యులకే లభ్యమగునని తెలుపబడినది. ఈ భక్తి అనేకవిధములగు సేవారూపమున,-భగవద్వాత్సల్యము,

భగవత్పూజయందనుమోదము, భగవద్ధ్యానము, భగవద్విష యమునందు అదంభము, భగవత్కథాశ్రవణేచ్ఛ, సర్వ నేత్రాంగ వికారము, సదా భగవదనుస్మరణము, అమాంసభక్షణములను యెనిమిదివిధములుగ ప్రబలుచున్నదై ఆయా సాధకుననుష్ఠాన తీవ్రత ననుసరించి ఫలమొసంగునదై గానవచ్చుచున్నది. ఇంత సులభసాధ్యమైనను భ-గీ 7/16-17 లలో కనబఱచినట్లు పుణ్యవంతులగు జనులు నాలుగువిధములవారు- భయమువలన ఆపదనొందినవారు, భగవత్తత్త్వమును తెలియగోరినవారు, ధనమును గోరినవారు, భగవత్తత్త్వమును తెలిసినవారు - మాత్రమే భగవద్భజనాసక్తులగుదురనియు, అందునను భగవంతునియందే సమాహితుడై అంతఃకరణ వృత్తిని - ఇతరమయిన భజనీయము కనబడమివలన-అఖండాకారముగావించువాడే పరమగతినిబొందుటకు ప్రవర్తించువాడగుటచే ఉత్తముడని చెప్పఁబడెను. ఇట్టి యుత్తమమైన స్థితినిబొంది కృతార్థులగుటకు అనన్యమైన గురుభక్తియే యేకైకసాధనమగుటచే పింగళ తంత్రములో,

> గురౌ మానుషబుద్ధిం చ మన్త్రే చాక్షరభావనమ్ ।
> ప్రతిమాయాం శిలాజ్ఞానం కుర్వాణో నరకం వ్రజేత్ ॥

చెప్పినట్లు, గురుదేవుని కేవలము భౌతికశరీరధారియగు మనుష్యమాత్రునిగనే గుర్తించి, రాగద్వేషాది మలినవాసనలకులోనై సంకుచిత దృష్టిగలిగి సేవించువారలుగాక, గురుతంత్రాది యుద్గ్రంథములందు నిర్ణయించిన ప్రకారము వినయవిధేయతలతో పూర్ణ విశ్వాసముగలవారలై సేవించగా,

> గురౌ తుష్టే శివస్తుష్టే రుష్టే రుష్టస్త్రిలోచన ।
> గురౌ తుష్టే శివాతుష్టా రుష్టా రుష్టా చ సున్దరీ॥

అతో గురుర్మహేశాని సంసారార్ణవలంఘనే।
కర్తా పాతా చ హర్తా చ గురోర్మోక్షప్రదాయకః॥

పుణ్యపురుషులు 'గురుమూర్తి' యని ప్రశంసింపబడు వర
దేవతానుగ్రహము బహుసులభముగాబడసి, భ. గీత - 9/31
'కౌన్తేయ! ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతి'యను వచ
నానుసారమున, స్థిరమైన నిరతిశయానందావాప్తి బొందగలుగు
చున్నారు.

మరియు నిట్టి 'గురుభక్తి' యెంతవఱకు ఫలప్రదమగు
నదియు శిష్యునియొక్క హృదయపరివర్తననుసరించి యుండున
దగుచున్నట్లు 'భక్తకన్నప్ప'ది సచ్చరిత్రము లేతార్కాణము.
ఇట్టివారు ప్రాచీనకాలములో పెక్కండ్రు దేవతలలోను, అసు
రులలోను, మానవులలోను (స్త్రీ పురుష జాతి మత కుల
గోత్ర విద్యాది విచక్షణలేక) తమతమ కనువైనరీతిగా(కీర్తనం
శ్రవణం, స్మరణం, పాదసేవనం, అర్చనం, వందనం, దాస్యం,
సఖ్యం, ఆత్మనివేదనమను నవవిధములలో) భజించి కృత
కృత్యులైనట్లు పురాణప్రసిద్ధము. ఇట్లన్నివిధములుగ భజనీయ
మైనను, శ్రద్ధాభక్తులె ప్రధానమగుటచే - దూడ తన తల్లిని
సమీపించినంతనే తల్లి భక్షించిన తృణాదుల పరిణామరక్తము
యెట్లు క్షీరరూపమున స్రవించి, బిడ్డ క్షున్నివారణజేయునో
అటులనే, సద్గురు సాన్నిధ్యమాత్రముననే యోగ్యుడైన
శిష్యుడు సకలానర్థములనుండియు రక్షింపబడుచున్నాడు.
అదెట్లనిన, శిష్యునియొక్క దృక్పథముననుసరించి ఫలప్రద
మగు నీ 'గురుభక్తి' (1) "మార్జాల కిశోరన్యాయమున"—
పిల్లి తనకూనల నెట్లుభద్రముగ నోటగఱచుకొని కాపాడునో

యట్లు - శ్రీ గురుదేవుని పుత్రవాత్సల్యతాయుత బోధలతో నుపక్రమింపబడిన శిష్యుడు (2)"మర్కట కిశోరన్యాయముగ" సద్గురువువెంటనే దిరుగుచు, నిరంతరానుసంధాన బలముచే శీఘ్రకాలములోనే వారిననుకరించు నేర్పుగలవాడగును. అంత (3) "కుక్కుటకిశోరన్యాయ" మన బరగెడినట్టి గురుశిష్యానుబంధమున సంతత సద్గురుసాన్నిధ్య ప్రభావముచె, శిష్యునను అంతఃకరణ పారిశుద్ధ్యతయేర్పడి, ఆధిభౌతికాది దృక్పథముల నతిక్రమించి క్రమముగ, అనన్యభావమున నిరంతరాత్మానుసంధానపరుడుగా విరాజిల్లును. ఇట్టి ఉత్తమోత్తమ స్థితులనే మత్స్య-కచ్ఛప కిశోరన్యాయములుగ బోల్చుచుందురు. అవగా యిట్లు సంకల్పమాత్రముననేశిష్యుడు సకలవిద్యాపారంగతుడై గురుశిష్యులిరువురు నామమాత్ర దేహోపాధులుగలవారలై అద్వితీయాఖండానందరసమునుగ్రోలుచుందురు. ఇట్టి సంఘటన జగద్గురు శ్రీ శంకరభగవత్పాదులవారికిని, వారిప్రియశిష్యులు శ్రీ మదానందగిరి స్వామివారికిని లభ్యమైనట్లు ప్రతీతి. ఇట్టి బ్రహ్మాత్మైక్యానుసంధానస్థితిని బొందుటకనువుగా, శ్రీ మదాచార్యస్వాములవారే, శివానందలహరి యను గ్రంథమున,

> సారూప్యం తవ పూజనే శివ మహాదేవేతి సంకీర్తనే
> సామీప్యం శివభక్తిధుర్యజనతాసాంగత్యసంభాషణే।
> సాలోక్యం చ రాఽచరాత్మకతనుధ్యానే భవానీపతే
> సాయుజ్యం మమ సిద్ధమత్రభవతి స్వామిన్ కృతార్థోఽ
> స్మ్యహమ్॥

వర్ణించుచు, సద్గురుసేవచేతనే సోపానమార్గమున మానవుడే తీరున ఉత్తమోత్తమస్థాయినిబొంది ఆనందమనుభవించగలుగునది నిరూపించిరి గాన, వర్ణనాతీతమైన యిట్టి "గురుభక్తి"

ప్రాశస్త్యమును, "గురుకృప" అనధిని, "ఇదమిత్థమ"ని వక్కాణింపనెంచుట కడుసాహసము! గావున శ్రీ గురుమూర్తి యొక్క పూర్ణానుగ్రహము నడయుటకు అనన్య భక్తియే శరణ్యము.

ఓమ్ తత్ సత్

# 4. అధికారత్వము

శ్లో॥ అధికారిణ మాశాస్తే ఫలసిద్ధి ర్విశేషతః।
ఉపాయా దేశకాలాద్యాః సన్త్యస్మిన్ సహకారిణః॥
(వి-చూ)

అనుబంధచతుష్టయ మనబఱగు అధికారి, ప్రయోజనము, విషయము, సంబంధము లను నాలుగింటిలోను ప్రధానమగు అధికారనిర్ణయములో, ఆయాపురుషులయొక్క ఫలానుభవము వారివారి సంస్కారయుతమైన ప్రయత్నములమీద నాధారపడి యుండునుగాన, యీ నాలుగును పరస్పరసంబంధము గలవియైయే ప్రవర్తించుచుండునని తెలుపబడుచున్నది. ఇదికేవలము వ్యవహారము లందేగాక, ఆధ్యాత్మికాది విచారణ లందును యెంతయో ప్రధానపాత్రవహించుచున్నది. గాననే 'స్వాధ్యాయోఽధ్యేతవ్య' యను అధ్యయనవిధి, మోక్షము (బంధము నుండి విడిపించుకొనవలయునను కోటిక - ముముక్షు) గోరు వారికి నద్వైత విచారమే, వేదాంత వాక్యములచేత జేయందగినదిగా చెప్పబడినది. మరియు

శ్లో॥ దేశకాలవయోఽవస్థా బుద్ధి శక్త్యనురూపతః।
ధర్మోపదేశో భైషజ్యం వక్తవ్యం ధర్మపారగైః॥

అను న్యాయమున, దేశకాలాదు లనునవి అధికారత్వ మున కెటుల అభ్యుదయమునందు సహకారులై ధర్మపారగులగు వారి ధర్మోపదేశమును, ఔషధాదులు, వాటి వాటికి తగి నటులుగా ఫలప్రదము లగుచున్నవో, అటులనే బ్రహ్మజ్ఞాన ఫలప్రాప్తికి సాధన చతుష్టయసంపత్తియే అధికారత్వమును నిర్ణయించుచున్నది. సర్వసాధారణముగ లోకములో ప్రతి మానవునకు తాను సంసారియై గొప్పగ యిహలోకసుఖముల ననుభవింపవలయుననే సహజముగ నుండుటచే, అహో రాత్రులు విసుగు విరామము లేక తత్తద్విషయములయందు భగీరథప్రయత్నము చేయుచుండుటయు, చివరకు వారు తమ తమ యోగ్యతలను గుర్తించలేకపోవుటచే తఱచు విఫలమనో రథులగు చుండుటయు యెల్లరకు ప్రత్యక్షానుభవమే! అట్టి అధికార ప్రభావము నీక్రింది యితిహాసమున మిక్కిలి స్పష్టము గాగలదు.

పూర్వకాలమం దొక పాశ్చాత్యాధికారిక్రింద భారత దేశ శ్రోత్రియ యువకు డొకడు - కడు మేధావి - పనిచేయు చుండెను. ఒకనాడు వారిద్దరును సంభాషించుచు అధికారి యోగ్యతాఽయోగ్యతలు, మానవుల హక్కులు, విధులు, మొదలగునవి చర్చించుతఱి భేదాభిప్రాయములకు లోను గావలసివచ్చెను. అంత నా మేధావియగు యువకుడు, తన కొక యవకాశ మొసంగినచో వాటి యాథార్థ్యమును ఋజువు చేతునని విన్నవించెను. దానికా పాశ్చాత్యు డా యువకుడు గోరినటుల ప్రత్యేక అవకాశ మొసంగుటకొప్పుకొనెను. ఆ మరు నాడుదయముననే యువకుడు మామూలుతీరుననేగాక ప్రాతః కాలముననేలేచి కాలకృత్యములనెఱవేర్చుకొని తన కార్యా

లయమునకు కొంచెము ముందుగ వెళ్లి ప్రతిదినమును పాశ్చా
త్యాధికారమధిష్ఠించు ప్రత్యేకస్థాన మాతఁడా దినము నలంక
రించెను. ఇంతలో యొకింత కాలవ్యవధానముతో నా పాశ్చా
త్యాధికారియు కార్యాలయమునకు వచ్చుట గలిగెను. దానిని
జూచి యీ 'నూతనోద్యోగి' తన యధికారమునుజూపుచు
యొకింతతడవైనందు కాపాశ్చాత్యునిదూఱుచు తమ జమానుని
వైపునకుతిరిగి కోపోద్దీపితుడై 'ఆపాశ్చాత్యుని గెంటివేయు'మని
ఉత్తరువు జారీచేసెను. పాపమా పాశ్చాత్యుడు నిశ్చేష్టుడై
నిలబడిపోయెను! ఇది కేవలము విపరీతముగ గానవచ్చుటచే
'శ్రోత్రియ యువకున కేమైన యున్మాదమా' యని నలువురు
నివ్వెఱ బోవుచుండిరే, గాని యీ 'నూతనోద్యోగి' యుత్త
రువుల లక్ష్యబెట్టినవారే లేకుండిరి. ఇంతలో నా పాశ్చాత్యుని
యభిమానము పొంగి పొరలుటచే, నా వంచన సహించలేక
నా జమానువైపునకు తిరిగి కన్నెఱ్ఱజేసి 'ఆపిచ్చివానిని మెడ
బట్టి వీధిలోనికి గెంటుము' అనునటుల కను సన్న జేసినంత
మాత్రముననే క్షణములో యీ నూతనోద్యోగిని 'యా
జమాను జఱజఱలాగి వీధిలోనికిగెంటివైచెను. కాని ఆమేధావి
యైన యువకు డెంత మాత్రమును చలింపక, చిఱునగవుతో
"చూచితిరా! అధికార ప్రభావము?" అని నిట్టూర్పువిడచెను.
వెంటనే పాశ్చాత్యప్రముఖుడున్ను తన యవివేకమునుగుర్తించి
సిగ్గుజెందెను. గాన 'అధికార మహిమ' ను వర్ణించ వారి
హారాదులకైనను వశమగునే?

గావున 'అధికారియనగా తనకు లేని వస్తువునుగాని
తెలియని విషయమునుగాని సంపాదింపవలెనను కోఱికగలిగి
దానిని గురించి దిగులుజెంది తన యోగ్యతకు తగినటుల

ప్రయత్నించువాడే! అటులనే ఆత్మజ్ఞానము అందఱికిని లేక పోయినను 'అయ్యో! అది తెలియలేదే' అని దుఃఖించువారే దాని కర్హులుగాని లేనివారు అర్హులని చెప్పబడుదురా? భగవద్గీతయందు శ్రీకృష్ణభగవానులు అర్జునున కెప్పుడుపదేశించినటులున్నది? విషాదయోగములతో ప్రారంభించుటయు, పదునెనిమిది అధ్యాయములవఱకు ముగించకపోవుటకు, నీ అధికార తారతమ్యమునకు నిదర్శనములే గదా! అటులనే సర్వభూత సముదాయమును వారివారి సంస్కారములు ననుసరించియే వారివారి అధికారత్వము నెలయుచుండును. తాము కర్తలమని గట్టినమ్మకముగలిగి దేహతాదాత్మ్యమును వదలలేక యున్న వారు కర్మాధికారులు. దృష్టి యెంతకాలము భాగముల మీదనేయుండునో అంతకాలము మొత్తముమీదకు పోజాలదు గదా! వారి కపుడు పూర్ణవస్తువుయొక్క ప్రసక్తివచ్చుట కెటు లవకాశముగలుగును? వస్తువుయొక్క గుణము కేవలము ఆ వస్తువుమీదనే ఆధారపడియుండదు. ఏ యితర వస్తువుమీద నుపయోగింపబడునో దానిమీదగూడ ఆ గుణముయొక్క ఫల మాధారపడి యుండును. గాన ఫలమనునది 'అధికారి' ననుసరించి యుండును. ఉ॥ తేలుకుట్టిన అందఱకు యెందుకు విషమెక్కదు? ఒకొక్కని శరీరము యీ విషము పని చేసే రక్తముగలది యగుటచే ఆతనికే యీవిషము బాధించునుగాని మరొకని శరీరములో తదనుగుణమైన రక్తప్రసారములేని కారణమున ఆ విష మతని కెంతమాత్రము బాధనీయజాలదు! అట్లే వేదములోజెప్పబడిన కర్మలుగూడ నెవరిని చేయవలయు నని వేదము నిర్ణయము జేయునో వా రా కర్మలు చేసిననే ఫలకారి యగునుగాని యితరులు జేసిన అంత ఫలవంతము

కావచ్చు-కాకపోవచ్చు. లౌకికములో నన్నిపనులకు అందఱు అధికారులైనను ఎవరికి దేనివలన ఫలముచేకూరవలెనో వారికి దానివల్లనే ఫలము చేకూరుట మన నిత్యానుభవమేగదా! అట్లే ధర్మాఽధర్మములందును "అందఱు అధికారులే" అనినను, ఫలము రాకతప్పదు. గాని దానికి ప్రతిబంధకములు తీఱువరకు ఆ వైదికకర్మలు ఉదాసీనముగనుండి ఆపైన తప్పక ఫలదాయకము లగును. గాన ఏ వస్తువైనను దాని గుణము మనమీదపడినపుడు అనుభవమునకు రాగలదనిన దానికి మన శరీరములుగూడ ఉన్ముఖమైననేగాని వెంటనే ఫలకారిగానేరవు అట్లు సమయము కూడుటయే అధికారత్వమును పొంది యుండుట.

'దేహమే నేను' అని యెంతెంత యభిమానముగలదో, తదనుగుణమైన వాసనలతో జన్మలుగలుగుచుండును. వర్ణము అను పదమునకు 'వృ' అను ధాతువులోనుండి యుత్పన్నమైన దగుటచే 'వరించు' అను అర్థయుక్తముగ ఎవడు దేనిని వరించునో వాఁడాజన్మనే తెచ్చుకొనును గాని మనుజులూహించునటుల 'రంగు' మొదలగునవన్నియు గౌణార్థములే! శ్రు-'దేవాం భూత్వా దేవానప్యేతె' అనియు భ-గీ 8-6 శ్లో॥ "యంయం వాపి స్మరన్ భావం" అనునదియు ఛాం॥ 8-2-10 'యం యం మన్తమభికామో భవతి' అను శ్రుతియు దీనినే సూచించుచున్నవి.

మరియు శ్రీ ఆచార్యస్వాములవారు బృ॥ 3-4-14 భాష్యవ్యాఖ్యానములో 'తానిచ, నిసర్గత, ఏవ కర్మాధికారి నిమిత్తాని' అని శెలవిచ్చినపుడు జన్మాంతరీయ సంస్కారముల చేతనే అవిద్యయే స్వరూపముగాగల మానవులకు జన్మతో

కూడ గలిగిన భావనతో ధర్మానుష్ఠానము కొఱకు యీ అధికార తారతమ్యతగు ర్తింపబడినదని తెలియవచ్చుటచే, నటులు గాక లౌకికవ్యవహారమునందే వాటికి విశేష ప్రాధాన్యమిచ్చుట కేవల దురభిమానమే యగునేమోనని సందేహింపవలసి వచ్చుచున్నది.

సోక్రటీస్ అను పాశ్చాత్య తత్త్వవేత్త యొకానొకప్పుడు తన శిష్యులకు తన శరీరమునుగూర్చి చెప్పునపుడు నేను పోయిన తరువాత యీ నా భౌతికశరీరమును మీ యిష్టము వచ్చినటుల జేయుడు. ఈ శరీరము సోక్రటీస్‌ది మటుకు కాదని తెలుసుకొనుడు' అని పలికెనట. అనగా 'దేహమే నేను' అను సామాన్యజ్ఞానమునుండి 'దేహము నేను కాను' అను విశేష జ్ఞానమువరకు పుట్టినప్రతిజీవియు నొక్కొక్క యవస్థలోనుండునవియు, యొక్కొక్క వ్యక్తి యొక్కొక్కజాతికి చెందియుండునవియు స్పష్టమగుచున్నది. కాబట్టి వివిధజాతులకు 'దేహము నేను గాను' అను జ్ఞానములోనే వివిధ పరిణామములున్నవి. అందువలన ప్రతివాడును తానందుకొనినమెట్టునుండి పైకిపోవుటకు చేయుకృషి వానిస్వధర్మము. అటులకానిది పరధర్మము. శ్రుతియును,

"స్వే స్వే ఽధికారే యానిష్ఠా సగుణః పరికీర్తితః" అని తన యధికారమునందు నిష్ఠ యేదిగలదో అదియే గుణము - ధర్మము- అని చెప్పుచున్నది. దీనినే అరవిందఘోషు యొకానొక సందర్భమున (24-12-1936 ఉపన్యాసములో)

" All kinds of works are equal before the DIVINE, and all men have the sams 'BRAHMAN' within them is ONE - TRUTH; but that development is not equal in all ie ANOTHER'' అని శలవిచ్చెనట.

గావున 'జీవుడు జన్మలెత్తును' అని చెప్పిన దశాస్త్రీయము. జన్మలెత్తునది జీవుడు + అహంకారము కలసి దీనినే గౌడపాదకారికలు వైతథ్య 15 లో నిట్లు వర్ణింపబడినది.

శ్లో॥ జీవం కల్పయతేపూర్వం తతో భావాన్ పృథగ్విదాన్
బాహ్యానాధ్యాత్మకాంశ్చైవ యథావిద్యా స్తథాస్మృతిః॥

కావున అధికారమనునది వారివారి కర్తృత్వాభిమానములమీద నాధారపడి యుండుననునది సర్వసమ్మతమైన విషయము. ఈ అహంకారము ద్వివిధము. దురహంకారము, సదహంకారము. ఈ దురహంకారమును తొలగజేసుకొని సదహంకారమును బొందవలెనని క్రమశిక్షణ యవసరము. అహంకారమును తీసివేయుటకు యెక్కడనుండైనను తీసివేయవచ్చును గాన జ్ఞానమున కందఱు అర్హులే! గాని సదహంకారమును పెంచవలయునని క్రమమైన శిక్షణకే రావలయును. అప్పుడే అభ్యుదయము నిశ్శ్రేయసమునకు దారితీయునని శాస్త్రహృదయము.

ఎవరైనను తనయధికారము నతిక్రమించి నడువరాదు. వీధిలో బిచ్చగాడు క్షుద్బాధతో పీడింపబడుచు వచ్చి 'అమ్మా-కబళము' అని ఆక్రందించుచుండ వానినిగాంచి "నీవు బ్రహ్మవు" అని యోదార్చిన యెంత లచ్చనముగనుండునో అట్లు తన యధికారమును మించువారి ప్రతిభ! దాననే శాస్త్రము (సన్యాసోపనిషత్)

శ్రు॥ నాపృష్టః కస్యచిద్బ్రూయా న్నచాన్యాయేన చపృచ్ఛతః
జానాన్నపి హి మేధావీ జడవ ల్లోకమాచరేత్॥

సూత్రప్రాయముగ వివరించుచున్నది.

ఇటుల సదహంకారము పొందినజీవి 'నేనేమి చేయవలయును. నా అధికారమేమి? నా ధర్మ మేమి?' ఇత్యాది కర్తవ్యాంశమునందే విచారణ సలుపునంతవఱకు తెల్పునది 'పూర్వమీమాంసయేగాన' 'నేనెవరిని' అను స్వరూపజ్ఞానము గలుగుటకు సాధన చతుష్టయ సంపన్నుడైన యధికారియే గావలయును. దీనినిగలిగినవారు ధర్మజిజ్ఞాసగలిగినను కలుగకున్నను, బ్రహ్మవిచారణకర్హులేనని సూ.భా.1-1-1 అథాతో బ్రహ్మజిజ్ఞాసా అనుచోట వ్యాఖ్యానింపబడినది. ఈ సంపత్తు కేవల ముచ్చారణమాత్రమేగాక దీపముయొక్క భయము గలిగిన పిదప పిల్లవాడు ఎటుల దీపమును సమీపించ వెఱచునో అట్లు తెలిసిన తరువాత పూర్ణవిరాగమే ఫలముకావలయును. అప్పుడే (పరలోకఫలములు గూడ అనిత్యములని తెలిసిన పిదప) బ్రహ్మవిచారణ కధికారి. అటుల పూర్ణవిరాగము గలుగనంతవఱకు జేయు శ్రవణము కేవలము గౌణమే!

దీనినే బృ 4-4-5 శ్రుతి వ్యాఖ్యానములో 'ద్రష్టవ్యః' అని చెప్పగానే తెలిసిన వానిని ఉత్తమోత్తమాధికారిగను 'శ్రోతవ్యః' అను దానినిజేర్చి వినిన పిదప తెలిసినవానిని ఉత్తమునిగను 'మంతవ్యః' అను దానినిగూడ జేర్చి "వినినను విన్నానుగాని...అయితే" అను ప్రశ్న లుత్పన్నమైనవారు మధ్యమాధికారులుగను 'నిదిధ్యాసితవ్యః'అని మరొక దానిని జేర్చినను విని సంశయములుతీరక క్షోభ జెందువా రధమాధికారులుగను, ఎన్ని సారులు వినిననుతృప్తిజెందక అనేకచోట్లకు పరుగులిడుచు స్థిరబుద్ధిలేని విక్షేపమానసులు అధమాధమాధికారులుగను ఇట్టివారు చిరకాలమభ్యసించవలయునని అధికార

తారతమ్యత నిరూపింపబడుచు శ్రవణాదులందు స్థాయి నొసంగ బడెను.

మరియు సూ. భా. 3-3-32 'యావదధికార మవస్థితి రాధికారికాణాం'యను సూత్రమునందు లోకస్థితిహేతువులగు నాయా అధికారములందు నీశ్వరునిచే నియోగింపబడిన వ్యాసాదులకు బ్రహ్మసాక్షాత్కారము గలిగినను నా యధికారమునకు బ్రాపకమగు ప్రారబ్ధమున్నంత కాలము వారు జీవన్ముక్తులైయుండి పిదప ముక్తి నొందుదురని వ్యాఖ్యానింపబడినది. ఛాం 6-14-2 "శ్రు॥ తస్య తావదేవ చిరం యావన్న విమోక్ష్యేథ సంపత్స్యే"యని యీ అధికారత్వమును సూచించుచు "ప్రారబ్ధము క్షయించిన పిదప యీ అధికారముకంటె తరువాతను-విలక్షణుడై (కేవల బ్రహ్మస్వరూపుడుగ) దేహమును విడచి ఉదయాస్తమయములులేక అద్వితీయుడుగనే ఉదాసీనమగు నాత్మ స్వరూపమునను సూర్యునివలె నిలుచువాడగునని చెప్పబడినది. అనగా వీరు అనేక జన్మలయందధికారఫలమునిచ్చుట కొకసారియే ప్రవృత్తమైన కర్మజాతమును (ప్రారబ్ధమును) భోగమున నశింపజేయుచున్నవారై స్వాతంత్ర్యమున నొకగృహమునుండి వేఱొకగృహమునువలె వేఱొకటియు నింకొకటియునగు దేహమును గ్రహించుచున్నవారై తమ యధికారము నిర్వర్తించుటకొఱకు లోపింపని జ్ఞానముగలవారయియే దేహేంద్రియములను బ్రకృతిని వశపఱచుకొనినవారుగనుక దేహములనిర్మించుకొని ఒకసారిగాగాని క్రమముగాగాని వాని నధిష్ఠించుచున్నారు. వ్యాసాదులందరును నిట్టి అధికార పురుషులే! అటులనే జ్ఞానులు యధికారము నపేక్షించుట జూచినను జ్ఞానోత్పత్తికిబూర్వము మహర్షులైశ్వర్యాదిఫలముల

నిచ్చు వేర్వేరుపాసనములయందు ఆసక్తులై వానిని గావించి పిమ్మట నైశ్వర్యములకు నాశముల దెలుసుకొని నిర్విణ్ణులై పరమాత్మజ్ఞానమునంద త్యాసక్తులై కైవల్యముబొందుదు రని స్పష్టమగుచున్నది. శ్రుతులందును యిటులనే

బ్రహ్మణా సహా తే సర్వే సంప్రాప్తే ప్రతిసంచరే
పరస్యాంతే కృతాత్మానః ప్రవిశంతి పరంపదమ్॥

ప్రతిపాదింపబడుచున్నది.

ఇట్టి యుత్తమోత్తమాధికారత్వమును బొందుట కనుపైనవిద్య కాలక్రమేణ లభింపవలసినదేగాని తటాలున రాజాలదని సనత్సుజాత 3/13 శ్లోకములో 'కాలేనపాదం లభతే' యనుచోట వ్యాఖ్యానించుచు ఉపదేష్ట, గురుశుశ్రూష, సత్సాంగత్యము – ఉత్సాహమున సహాధ్యాయులతో చర్చించుటచే శాస్త్రజ్ఞానము దృఢము గాగలదని నిరూపింపబడినది. మరియు యిట్టి అధికారతారతమ్యతను సద్గురువుచేతనే గుర్తింపబడవలెనేగాని యే శాస్త్రము నిర్ణయింపలేదు. గాన యిట్టి మహత్తర ప్రభావము గలిగిన అధికారసంపత్తును తృణప్రాయముగ నెంచక తమ యోగ్యతలను గుర్తించి దురభిమానముల వీడి ఈశ్వరాభిముఖులై పిపీలికామార్గము నవలంభించినయెడల కృతకృత్యులగుదురనుట నిస్సందేహము.

ఓమ్ తత్ సత్.

# 5. పౌరుషము - ప్రారబ్ధము

శ్లో॥ ఆత్మాఽనాత్మాకారం స్వభావతోఽవస్థితం సదాచిత్తం
ఆత్మైకాకారతయా తిరస్కృతా నాత్మదృష్టి విదధీత।
అజరోఽస్మ్యమరోఽస్మీతియ ఆత్మానం ప్రపద్యతే
తదాఽత్మనాతిష్ఠతోఽస్యసతః ప్రారబ్ధ కల్పనా॥
(అధ్యాత్మోపనిషత్)

పూర్ణ=పూర్వముగూడ యెల్లప్పుడు యేకరూపమున నుండువాడగుటచే అసంగపరిపూర్ణుడగు పరమాత్మ, యే వేదాంతములందు ఉత్తమ పురుషుడని ప్రశంసింపబడుచున్నాడో, 'ఆ సద్వస్తువు' నందు యత్నమునకుగాని, అర్థించుటకుగాని, గలుగనేరక పోయినను స్వకీయ చైతన్యబలశక్తిచే ప్రతీయమానమగు నీ మాయామయ జగత్తునందు, సర్వము ద్వైతప్రతీతి గలిగి రాగద్వేష సంకులమైయుండు దానిలో పురుషార్థమునకు, జీవునకు, మనసునకు, ప్రారబ్ధమునకు సావకాశము లేకపోలేదు. గాన నీ పురుషకార ప్రారబ్ధముల విమర్శనొకింత జేయనగును.

పురుషకారమన్నను పురుషప్రయత్నమన్న నొకటే. ఇంక ధ్వనించు పురుషుడు చేయుక్రియకే పౌరుషమని నామాంతరము. ఈ పురుషుడే (పురిశరీరే శేతఇతి పురుషః= శరీరము నందుండువాడు) చిదాభాస ధర్మములైన కర్తృత్వ భోక్తృత్వాది ధర్మముల యధ్యారోపమున కధిష్ఠానభూతుడగు క్షేత్రజ్ఞుడు. 'ప్రకృతింపురుషం చైవ విద్ధ్యనాది ఉభావపి' (భ.గీ 13-19)లో వివరించినట్లు, అనాది యగు నీశ్వరుని శక్తి యగుటవలన ప్రకృతి యనాది పురుషుడును తదంశమే యగు

టువలన అనాదియే! అందు అపరప్రకృతి క్షేత్రలక్షణము. పర ప్రకృతిజీవలక్షణము. గాన నీ రెండుప్రకృతులును, అనాదియే యని చెప్పబడుచున్నవి.

ఇట్టి జీవుడు స్పందాత్మక మగు 'ప్రాణము'-చిదాత్మక మగు 'ఆత్మతత్త్వము' - నీ రెంటియొక్కయు (అజ్ఞానోదిత) యభేదా ధ్యాసముచే నుత్పన్నమగు 'ఈదేహమే నేను' అను కల్పనాయుక్తము నగు జడత్వా వేష్టిత చిద్రూప కల్పనయే (అనుకొనుటమాత్రమే) ప్రాణధారణచే జీవు డనబడువాడు. అనగా సూ.భా 2-3-27 'తద్గుణ సారత్వాత్తు తద్వ్యపదేశః ప్రాజ్ఞతత్' యందు సూచించునటుల, జీవుడు ప్రకృతి గుణ సారుడయి తద్గుణసారత్వు డగుచున్నాడు. సంసార మనునది గుణసారత్వము లేనిది లేదు. బుద్ధ్యాది ధర్మాధ్యాస నిమిత్తములేని సంసారములేదు - కర్తయులేదు - భోక్తయులేదు- కారణము. ఆత్మను గుణములులేవు. బుద్ధికి (అంతఃకరణకు) గుణములు లేకపోలేదు. ఇట్టి వీటి రెంటి కల్పనాపూర్వక సం బంధమే జీవత్వము; సంసారిత్వ కారణము—దీనినే భ.గీ 13/20-21 శ్లోకములలో "పురుషుడు దేహేంద్రియాది రూప ముల బరిణమించి, యందు ప్రకృతిని-అది తానేయని తలంచి పొందియున్న వాడగుటవలన ప్రకృతివలన గలుగు సుఖాది గుణములను నేనే సుఖిని - దుఃఖిని ఇత్యాదిగా భుజించు చున్నాడు." అని వివరింపబడినది. శ్రుతియును "ఆత్మేంద్రియ మనోయుక్తం భోక్తేత్యాహుర్మనీషణః" అని ప్రతిపాదించు చున్నది. గాన యదార్థములో, తానన్యాత్మకుడై యన్యధర్మం బులను సమీచీనములను - అసమీచీనములను తనవిగా దలఁ

చుటయే యెడిగలదో అదియేక్షేత్రజ్ఞుడగునాత్మకు సంసారము. దీని నే

రూపాద్యాగుణదోషాది వికల్పాబుద్ధిగాః క్రియాః ।
తాః క్రియావిషయైః సార్ధం భాసయన్తీ చితిర్మతా॥

యని శ్రీ ఆచార్య స్వాములవారు తమ 'లఘువాక్య వృత్తి' యందు వివరించిరి. ఇట్టి కేవల మాధ్యాసిక బంధము స్వాజ్ఞానం చేతనే కలిగినది. కాన వివేక విజ్ఞానముచేతనేగాని నది నివర్తిల్లదు.

అట్లగుచో, యీ ప్రకృతి పురుషు లిరువురును యొక చోటనేయుండు వారలగుటచే వాటంతటవి యెప్పటికో యొక వ్వుడువిడిపోవచ్చునుగదా! అప్పుడు స్వతస్సిద్ధమైన మోక్షము తానంత టదే రావచ్చు నే! ప్రయత్నమువలన ప్రయోజన మేమి? యను శంక గలుగ గలదనిన – అట్లు విడిపోయిన విడవచ్చును గాని అంతటితో జీవత్వము పోజాలదు.

సవికల్పక జీవోఽయం బ్రహ్మస్యాన్నిర్వికల్పకమ్ ।
'అహం బ్రహ్మేతి' వాక్యేనసోఽయమర్థేఽభిధీయతే॥
(ల.వా.వృ. 13

లో వివరించునటుల యెంతకాలము జీవత్వము తనస్వరూపమే నని తెలియక సంసారిగానుండునో అంతకాలము బుద్ధితో సంయోగము తప్పదు. ఇట్టి జీవత్వమును నివర్తిల్లజేసి, ప్రత్యగభిన్న మగు పరబ్రహ్మమును ప్రత్యగ్దృష్టిచే స్వరూపంబున నెఱుంగుటకొఱకు వినియోగింపబడు నిషేధపూర్వక యత్నమునకే పౌరుషమని పేరు.

ఇయ్యది రెండువిధములు:-సామాన్యపౌరుషము; మహాపౌరుషము అందు సామాన్య పౌరుషము జగద్వ్యవహారములో ముఖ్యము. ఇది లేనిది 'మహాపౌరుషము' రానేరదు. అభ్యుదయమునకు సాధనమగు సామాన్య పౌరుషమే లేనిచో మహాపౌరుష సాధ్యమైన మోక్షాఖ్యంబగు నిశ్శ్రేయసము తలంపనగునా? మహాపౌరుష మన్ననే, అసలు జన్మమే యవుసరము లేనిదయి, సంసారము సమూలముగ నిర్మూలించి, మోక్షమే పర్యవసానముగాగల నిశ్శ్రేయసమే గదా! అట్టి యీ పౌరుషము శాస్త్రము నతిక్రమించునది-శాస్త్రవిహితమైనది. అని రెండురకములుగావరిలుచున్నది. అందు శాస్త్రవిహితమైన పురుషప్రయత్నమే క్రమక్రమముగా పరమార్థమును గలిగించుచున్నది—లోకమునందునుగూడ నిన్నటి యజీర్ణాది దోషములను నేటి లంఘనాది గుణములచే శాంతింపజేయుట మనకందఱకు ననుభవమేగదా!

గాన భ.గీ 3/28 'గుణాగుణేషు వర్తంతే' యనుచోట అంతఃకరణ ధర్మము లగు 'ఇదం' అనే బహిర్ముఖవృత్తిని 'అహం' అను అంతర్ముఖవృత్తిని రెంటిని లెస్సగ విమర్శించవలెననియు, యీ 'అహం'వృత్తియెప్పుడు నొక్కటేయగుచు 'ఇదం'వృత్తి బాహుళ్యమున నెప్పటికప్పుడు జేరుచు, అవిచ్ఛిన్న వ్యాపారము జరుగుచుండుననియు, దీనిని శాస్త్రీయ ప్రక్రియలచే నివర్తింపజేయబూనవలయునని విశదము చేయబడినది. గాన జీవుడనువాడు రెండుగుణముల సమ్మేళనమే! సూ.భా 3-3-53 'ఏకఆత్మ నశ్శరీరే భావాత్' అనుచోట తాను కర్తను, కర్మఫలభోక్తను, దేహాది వ్యతిరిక్తుడను పూర్వాపరజన్మముల కధికారి ననియు, సూ.భా 2-3-17

'నాత్మాఽశ్రుతేర్నిత్యత్వాచ్చతాభ్యః' అనుచోట అట్టి జీవుడు నిత్యుడే ననియు, 2-2-43లో జీవునినుండి మనసాదుల యుత్పత్తిని నిరసించుటయు విశేషముగా వినవచ్చుచున్నవి. గాన సర్వకార్యములకుపౌరుషమే కర్తయు ఫలభోక్తయుగాని మరొకటి గాదని స్పష్టమగుచున్నది.

ఇక **నియతి** - దైవము అని పర్యాయ పదములుగా సామాన్యముగా వాడబడు ప్రారబ్ధము కేవలము కల్పనా నిరూఢమైన జనుల భ్రాంతియే! ఎట్లన, పూర్వజన్మమందు జేయబడిన కర్మమే, ఈ జన్మమున ఫలావస్థయందు దైవమని చెప్పబడుచున్నది. ఇక 'నియతి' యన్ననో—"బ్రహ్మతత్త్వము సచ్చిదానంద స్వప్రకాశరూపమై యంతటను సర్వానుకూలమై యున్నది. ఆ బ్రహ్మతత్త్వ సంబంధినియగు సర్వపదార్థముల "సత్త" యే భవిష్యత్కాల సంబంధముచేతను వ్యపదేశింపబడుచు, కారణమునందు నియామక రూపమునను కార్యమునందు నియమ్యరూపమునను, తానే నియతి యనుపేర ప్రశంసింపబడుచున్నది. ఇక ప్రారబ్ధమన్ననో అధ్యాత్మోపనిషత్ లో వివరించినటుల

" అధిష్ఠానే తదాజ్ఞాతే ప్రపంచే శూన్యతాంగతే।
దేహస్యాపి ప్రపంచత్వా త్ప్రారబ్ధావస్థితిః కుతః॥"

సంకల్పపరమై, సంస్కారానుసారముగ ప్రవర్తించుచు, సర్వవిస్మృతి కధిష్ఠానమును ప్రథమాభాసయునగు "అహం" శబ్దవాచ్యపరిణామమే యగుటచే కేవలము మిథ్యాభూతమేగదా! భ.గీ 8/6 "యంయం వాపి స్మరన్ భావన్" యను శ్లోకమునందును దేహధారణయను ప్రారబ్ధఫలమునకుగూడ పూర్వజన్మ అంత్యకాల సంకల్పమనేగదా! వర్ణింపబడినది. గాన వేఱుగ

పై వాదములనునవి గాసరావు. మరేమనగా సర్వకల్పనలు పౌరుషమునందే యంతర్భవించుచున్నవి. ఇట్లు గుర్తించజాలని బలహీనులు, మూఢులు "దైవమే నన్నిటు ప్రేరణజేయుచున్నది" యని తలపోసి, కుతర్కములందొదిగుచున్నారు. అట్టివారు పురుషార్థమును సాధించిన అనేక పురాణ పుణ్యపురుషుల చరిత్రల నెఱుంగని వారగుటచే, వారి ముఖమును జూచి "లక్ష్మి" పెడమొగము బెట్టుచున్నదనుటలో సందేహము లేదు. గాన యట్టి చెడుకల్పనల కలవడిన అధములను, అలసులను దూరముగానే విడువనగునని శాస్త్రాదేశము.

మరియు కర్మమనగా వృద్ధిపొందిన తన వాసనయే గదా! వాసనయును తాను పూర్వకాలిక దృఢ భావనా వశమున పూర్వాపరవిచారణవదలి, దేహాదిపదార్థములను 'నేను' "నాది" మున్నగు సంస్కారములచే గ్రహించుటయేగదా! అనగా తనకు కారణమైన మనస్సుకంటె వేఱైనది గాదు. గానసే " దైవాధీనే శరీరేఽస్మిన్ గుణభావ్యేన కర్మణా " యని నిశ్చయింపబడినది. అట్టి మనస్సు స్పందశక్తియొక్క స్ఫురణయే యగుటచే, వాశిష్ఠమందు

'ప్రాణశక్తౌ నిరుద్ధాయాం మనో నామ విలీయతే।
ద్రవ్యచ్ఛాయాను తద్రవ్యం ప్రాణరూపం హి మానసం॥'

అని వర్ణించినపుడు, దేహధారియగు ప్రతి జీవుడును, ధ్యేయ వాసనా త్యాగమునే నిరంతర మభిలషించవలెననియు,

అహమాత్మాన జీవాఖ్యాః సత్తాః న స్తితరాః క్వచిత్
ఇత్యేవ చిత్తోపశమః పరమం సుఖముచ్యతే ॥
(యోగవాశిష్ఠం)

లో, నిరూపించినటుల, మనసును జయింపనంతవరకు ప్రారబ్ధము జయింపబడదనియు, దీనికి సశాస్త్రీయమైన పౌరుషమే ఏకైక శరణ్యమనియు స్పష్టముచేయబడినది. మరియు యేది దైవము-ప్రారబ్ధము అని చెప్పబడుచున్నదో యది కర్మమేకదా! ఆకర్మ మనసేకదా! ఆ మనసు పురుషుడేకదా! అయినపుడు నియతి-ప్రారబ్ధమునునవెచటనుండి వచ్చినవి? గాన మనసు, చిత్తము, వాసన, కర్మము, దైవము, నియతి ఇత్యాదులన్నియు మిథ్యాభూతమయిన మనసునకు - అనగా తాదాత్మ్యాభిమానియగు పురుషునకే నామములని పెద్దల మర్యాద.

అయినను, పూర్వజన్మకృత పుణ్యాపుణ్యాది సంస్కార స్వభావజనిత ఆధ్యాత్మికాద్యుపద్రవంబులును, దేహ యాత్రయును ప్రారబ్ధాధీన మగుటవలన నట బురుష ప్రయత్నము వ్యర్థమన నొల్లదు. ఎట్లన, పూర్వజన్మమందుచేసిన ధర్మాధర్మములు మొదలగువాని సంస్కారముతే

" ఆయుః కర్మచ చిత్తంచ విద్యానిధనమేవచ ।
పఞ్చైతాని విలిఖ్యన్తే గర్భస్థస్యైవదేహినః ॥

అన్నట్లు, ఇప్పటి జన్మాదులందభివ్యక్తమగుచుండును. ఇదియే ప్రకృతి యనియు. శరీరస్థితి కారణమనియు నెఱుంగవలెను. ఎవ్వని ప్రకృతి యెట్టిదిగనుండునో వాని ప్రవృత్తి అట్టిదిగానే యుండును. ఇది జ్ఞానవంతునకునుగూడ సమానమే! అందువలన సర్వప్రాణులు తమతమ ప్రకృతి ననుసరించి ప్రవర్తింతురు. అయితే యీ ప్రకృతి - దాటగలిగిన ప్రకృతి, దాటజాలని ప్రకృతియని - రెండురకములగుటచే, దాటగలిగిన ప్రకృతి వశమయిన ప్రవృత్తి రాగద్వేషరహితమై యుండ నేఱదు. గాన

వాటిని నిగ్రహించవలెనేగాని అసలు ప్రకృతిని పూర్తిగ, నిగ్ర హించలేము. దీనినే భ.గీ 3-33/34 శ్లోకములలో వివరింపబడి నది. అనగా ఇది మంచిది - ఇది చెడ్డది - ఇది యిష్టమునకు సాధనంబని యజ్ఞానయుతమైన రాగమునను సరించియే శాస్త్ర నిషిద్ధమైన పనియందును, తన కిష్టముగాని పనియందు శాస్త్ర సమ్మతమైనను దానిని దోషబుద్ధితో త్రోసివైచుటయు జరు గుచున్నది. గాన శాస్త్ర జన్య వివేకజ్ఞానప్రాబల్యముచే స్వాభావిక రాగద్వేషములను గారణానాశముచే నాశముగలు గుటవలన ప్రకృతి విపరీతమార్గమునందు శాస్త్రదృష్టిగల పురుషుని బ్రవర్తిల్ల జేయజాలదు. గావున అనేక శ్రుతి శతంబులచే, స్వాభావిక రాగద్వేషంబులవలనగలుగు శాస్త్ర విపరీతప్రవృత్తిని, అంతకుముందే విషయములయందు రాగ ద్వేషములు గలుగుటకు ప్రతిబంధకమైన పరమేశ్వర భజనాది కమునందు ప్రవర్తిల్ల జేయుచున్నది — యెట్లు "లోతు ప్రవా హములో బడుటకు మున్నే యోడనెక్కిన వారివలె॥—

అట్లు శాస్త్రజన్యమైన సమ్యగ్దర్శనమున సర్వ కర్మలు నిర్బీజములగుటకు కారణమైనను, సామర్థ్యమువలన యే కర్మ ముచే శరీర మారంభింపబడినదో, అది ఆరంభించిన ఫలముగల దగుటచే, నుపభోగముచేతనే త్రివిధ ప్రారబ్ధమును—

(1. ఇచ్ఛా=ఇచ్ఛను గలిగించుటచేత ననగా ముందు రాబోయెడి కీడులను గలిగించెడి ఇచ్ఛలు ప్రారబ్ధ కర్మలవలన గలుగుచున్నది—

2. అనిచ్ఛా=పురుషు డిచ్ఛయింపకున్నను భోగము నిచ్చునవి, అనగా ప్రారబ్ధవశమువలన ఉద్రేకించిన రజోగుణము

యొక్క కార్యములను కామక్రోధాదులలో నొకటి బురుషుని ప్రేరేపించి విషయములందు ప్రవర్తింపజేయునది—

3. పరేచ్ఛా = పరులయొక్క ఇచ్ఛచేత భోగము నిచ్చుటవలన, అనగా ఇచ్ఛయించని వారు సుఖాదు లనుభవింపరు. ఇచ్ఛయించెడివారు సుఖాదుల ననుభవింపక మానరు. వీరు పరులయొక్క దాక్షిణ్యముతో గూడిన వారగుచు ఆపరుల యొక్క ప్రీతికొఱకే ఈ సుఖ దుఃఖముల ననుభవించువారు. )

'ప్రారబ్ధం భోగతో నశ్యేత్' అనునట్లు నశించుచున్నది. కావున యేవి యప్రవృత్త ఫలంబులు, జ్ఞానోత్పత్తికి ముందు జేయబడిననియు, జ్ఞానకాలంబున గలుగునవియు, అతీతానేక జన్మంబుల జేయబడినవియు, గలవో ఆకర్మములన్నింటిని భ.గీ 4/37 లో చెప్పినటుల జ్ఞానాగ్ని భస్మీకరించుచున్నది. అనగా బ్రహ్మాత్మజ్ఞానముగూడ స్వరూపము నావరించిన యజ్ఞానము నివర్తించి, తత్సమ కాలమందే విద్వాంసున కాయజ్ఞానముచే గలిగిన కర్తృత్వభ్రమను నశింపజేసి, యా భ్రమచే గలిగింపబడిన సర్వకర్మములను తత్క్షణముననే నిర్మూలించుచున్నది. గాని ప్రారబ్ధకర్మ ప్రవృత్త ఫలంబగుటవలన దానికి నివృత్తి గుదరదు - ఎట్లు భోజనమునకు ముందున్నదియు, బిమ్మట నున్నదియునగు యన్నమునకు త్యాగ మంగీకరించినను భుజించిన దానికది సరిపడదో యట్లు ప్రారబ్ధకర్మము సంచితాదులను వలె నివృత్తి గానేరదు. అయినను, జలబుద్ధి నశించినను, మరుభూమియందు మరల జలాభాసము తోచినట్లు, విద్వాంసునకును దేహాత్మత్వ, సత్యత్వ, మమత్వబుద్ధి లేకున్నను తత్ఫలాభాసము జరుగుచున్నదై, దగ్ధపట న్యాయముగ వర్ణింపబడు

న ప్రారబ్ధలేశము బంధజనకమే మాత్రముకాకనే ఉపశమించు
చున్నది.

మరియు కర్మ క్షయంబైనపుడే, పురుషయత్నము
లేకనే, స్వతసిద్ధంబగు మోక్షము ప్రాప్తమగుననిన, అట్లు
జరుగనేరదు. కారణం, చిత్తమెల్లప్పుడు స్వభావంబున
ఆత్మాఽనాత్మాకారముగనున్నది. అనాత్మ దృష్టిని తిరస్క
రించి యాత్మైకాకారముగ నవశ్యము జేయవలెను - యెట్లు
ఘటము పుట్టినపుడే యాకాశ పూర్ణమగుచు పుట్టినను,
యందుంచబడిన జలతండులాదులు పురుషప్రయత్నముచే నగు
చున్న దానిని తిరిగి దొలగించినను ఆకాశమెట్లు దొలగింప
శక్యముగాదో యట్లు - చిత్తముపుట్టుచు చైతన్యపూర్ణముగనే
పుట్టుచున్నది. అది పుట్టిన పిదప సుఖదుఃఖాద్యనాత్మా
కారములు, భోగహేతు ధర్మాఽధర్మ సహాకృత సామగ్రి
వశమువలన గలుగును, నిరంతర ప్రత్యయాభ్యాసముచే నివా
రింప బడుచున్నది. ఇదియే పురుష ప్రయత్న ఫలముగాన,
సద్విద్యాసంపన్నమయిన జన్మముచేత నూహింపబడిన సత్ప్ర
యత్న ప్రారబ్ధము ఫలముగాగల పూర్వజన్మవాసన తనకు
విరుద్ధమయిన ఫలమును మాత్రమే ఆటంకబఱచి, తదధికృత
జన్మమునందు తన్నివృత్తికి దోహదమొసంగునదగుచున్నందున
శాస్త్రజన్య జ్ఞానమే ప్రాచీన సంస్కారమును మార్చుటకు
సమర్థముగాన లౌకికమందు కృష్యాది ప్రయత్నంబును, వైది
కమునందు జ్యోతిష్టోమాది ప్రయత్నంబును ఫలకారియగు
నెట్లనుభవమో అట్లే శాస్త్రీయమగు ప్రయత్నము, దృష్ట
ఫలభూతమును కల్పితమును నగు ప్రారబ్ధంబుకన్న అన్నివిధముల
వరిష్ఠంబని సిద్ధము. మరియు ప్రవృత్తఫలమగు ప్రారబ్ధకర్మము

నకు, ఎట్లు ధనువునుండి విడువబడిన బాణమునకువలె వేగము క్షయించిన తరువాతనే నివృత్తియగునో, యట్లే జ్ఞానికిని శరీర పాత పర్యంతము కైవల్యముగలుగదని జెప్పటచే, వారువారు చేసిన ఉపాసనాది బలముచే, వారి వారి ప్రజ్ఞావిశేషములు వేర్వేరుగాయుండి, వారధికార పురుషులై, అపూర్వ ప్రజ్ఞా మతులు గలవారైయుండగలరు. జగత్తు ప్రలయమునొందినను, శక్తిగలిగియే లీనమగుచుండునుగాన తిరిగి సృష్టి గలుగుటకు హేతువగుచున్నది. కాబట్టి జ్ఞానికి జన్మాంతరమును, జ్ఞానము నకు నియతమైన ఫలము కలిమియు, నవిరుద్ధనుగుట వలన జ్ఞానమున కైకాంతిక ఫలత్వము (నిశ్చయమైన మోక్షము) యుక్తమే. గాన విద్వాంసునకు సమ్యగ్జ్ఞాన కాలముననే దాని ఫలముగు 'అన్నిటికిని తానాత్మ యగుట' ను జూపుచున్నది గాన కైవల్యము నియతమైనదే!

ఇట్లగుటచే కర్త - భోక్తయని వ్యవహరింపబడు జీవుడు ధర్మాచరణవల్లనే తా నవిక్రియుడును, అకర్తయునగు పర మాత్మనని తన నిజ రూపమును గుర్తించగలుగుచున్నాడు. ఇదియే సూ.భా. 2/2-42 'ఉత్పత్త్య సంభవాత్' అను దాని వ్యాఖ్యానములో "జీవుడు పుట్టువాడు కాడనియు, జాతి కర్మాదుల విధించు శాస్త్రము, తాను కర్తనని యభిమానించు కొనుటచే దానిని తొలగించుట కేర్పడినదైన యౌపాధిక జన్మాది విషయమే ననియు" వివరింపబడినది. గాన సుఖ దుఃఖాదుల మొదలు బంధమోక్ష పర్యంతము అజ్ఞానమును ముందు బెట్టుకొనే సంచరించుచున్న వగుటచే, యీ జీవేశ్వ రాదులన్నియు అజ్ఞాన కల్పితములే యగుచు, పౌరుష ప్రారబ్ద ములును తత్తుల్యములేయగుచున్న వనుటలో(పారమార్థికమున) సందేహము లేదు.

ఇట్లిన్ని విధములుగ జీవపరమగు పురుషకార ప్రాధాన్యము, ప్రారబ్ధాదుల కుపపత్తియు నిరూపింపబడినను, ప్రకృతితో మిథ్యాతాదాత్మ్యమువలన బురుషునకు సంసారముకాని స్వరూపంబున గాని దగుటచే, ఆత్మ కత్యంత నిర్మలత్వ, సచ్ఛత్వ, సూక్ష్మత్వము లుపపన్నములగుచు 'ప్రత్యగావగమంధర్మ్యమ్' అని అత్యంతప్రసిద్ధముగుటవలన, బ్రహ్మజ్ఞానమునందు పురుష ప్రయత్నమున కెంతమాత్రము స్థానములేదు. మరేమన 'అవిద్యాధ్యారోపనిరాకరణ, బ్రహ్మమునందు గ ర్తవ్యము అనగా నామరూపాద్యనాత్మాధ్యారోపణ నివృత్తియే కార్యము. దీనినినే శ్రీ ఆచార్యస్వాములవారు నిట్లు వర్ణించిరి.

"సవికల్పకచిద్గోఽ నాం బ్రహ్మైకం నిర్వికల్పకం ।
స్వతఃసిద్ధం వికల్పాస్తే నిరోద్ధవ్యాః ప్రయత్నతః॥"

( వి. వా. వృ. )

ఓమ్ తత్ సత్.

---

శ్రీమద్భగవత్పాద శ్రీ శంకరాచార్యవిరచిత

# I ఉపదేశ పంచకమ్

( ఆంధ్ర పద్యానువాద సహితము )

౧ మూ॥

వేదోనిత్యమధీయతాం, తదుదితం కర్మస్వనుష్ఠీయతాం
తేనేశస్యవిధీయతా, మపచితిః కామ్యేమతి స్త్యజ్యతాం
పాపౌఘః పరిధూయతాం, భవసుఖేదోషోఽను సన్ధీయతాం
ఆత్మేచ్ఛావ్యవసీయతాం, నిజగృహాత్తూర్ణం వినిర్గమ్యతాం॥

ఉ॥ వేదము సత్ప్రమాణమని ప్రీతిని కర్మల నాచరించి, తా
వేదన జెందకుండ, నవివేకపు కామము లెల్ల వీడుచున్
బాధల కాలవాలమగు పాపపు భావనలన్ని త్రెంచి, తా
మోదము గ్రోల, "నాత్మసస్మృతి బొందకయుండునె,"
గహ్వరంబులన్ ॥

౨ శ్లో॥
సంగస్సత్సువిధీయతాం, భగవతో భక్తిర్దృఢా౽ధీయతాం
శాన్త్యాదిః పరిచీయతాం దృఢతరం కర్మా౽శుసంత్యజ్యతాం
సద్విద్వానుపసృప్యతాం, అనుదినం తత్పాదుకా సేవ్యతాం
బ్రహ్మైకాక్షరమర్థ్యతాం, శ్రుతిశిరోవాక్యం సమాకర్ణ్యతాం॥

ఉ॥ సంగము సత్స్వభావులెడ, సంతత సద్గురు విష్ణుభక్తినిన్
అంగముగాను జేసుకొని, అల్పపు కర్మఫలంబు వీడి తా
పొంగుచు, శాస్త్రవాక్యముల పూర్ణసమీక్షణ జేయుచుండ, నే
భంగి, ప్రశాంతచిత్తమున బ్రహ్మపదార్థము, ప్రస్ఫుటింపదో॥

3 శ్లో॥
వాక్యార్థశ్చ విచార్యతాం, శ్రుతిశిరఃపక్షః సమాశ్రీయతాం
దుస్తర్కాత్సువిరమ్యతాం శ్రుతిమతస్తర్కో౽నుసంధీయతాం
బ్రహ్మా౽స్మీతి విభావ్యతాం, అహరహర్గర్వః పరిత్యజ్యతాం
దేహే౽హంమతిరుజ్ఝ్యతాం బుధజనైర్వాదః పరిత్యజ్యతాం॥

ఉ॥ అర్థవిచారణంబునను, ఆగమవాక్య విశిష్టతెంతయున్
స్వార్థకుతర్కవాదముల సంకులపఱ్చక, గుర్తెఱింగి, శా
స్త్రార్థ విశేషతర్కమున "సర్వము తానె" యటంచు గాంచ ప్ర
త్యర్థిని, దేహధారియని, దర్పపుదృష్టిని యేవగించునే ॥

౪ మూ॥

క్షుద్వ్యాధిశ్చచికిత్స్యతాం, ప్రతిదినం భిక్షౌషధంభుజ్యతాం
స్వాద్వన్నం నతుయాచ్యతాం, విధివశాత్ప్రాప్తేనసంతుష్యతాం
శీతోష్ణాదివిషహ్యతాం, నతువృథావాక్యంసముచ్చార్యతాం
ఔదాసీన్యమభీప్సితాం, జనకృపానైష్ఠుర్యముత్సృజ్యతాం ॥

ఉ॥ ఔషధమెట్లు రోగి తనయాపదతీరను స్వీకరించునో
మాషప్రమాణమట్లు, తగుమాత్రమె దైవమొసంగుదాని నే
ద్వేషములేక తా, గుడిచి దేహపుక్షుత్తునుమాన్పి, ద్వంద్వముల్
వేషముభాషయున్ విడువ, విష్ణుపదంబెటుదూరమానొకో॥

౫ మూ॥

ఏకాన్తేసుఖమాశ్రితాం పరతరేచేతస్సమాధీయతాం
పూర్ణాత్మాసుసమీక్ష్యతాం, జగదిదంతద్బాధితందృశ్యతాం
ప్రాక్కర్మ ప్రవిలాప్యతాం, చితిబలాన్నాప్యుత్తరైశ్లిష్యతాం
ప్రారబ్ధం త్విహభుజ్యతాం, అథపరబ్రహ్మాత్మనా స్థీయతాం॥

ఉ॥ ఎచ్చటకేగకుండి, జగమేవిధిమాఱ తపింపకుండ, తా
నిచ్చటనే విలాసమును, యేకపుదృష్టినె గాంచుచుండి, వే
ఱిచ్చల లోనుగాక, తనకేమిట కర్మఫలంబు సిద్ధమో
అచ్చముగా నదేగుడువ, ఆత్మసుఖంబెటు బొందకుండునో॥

ఓమ్ తత్ సత్.

# 6. మంత్రస్వరూపము

శ్లో॥ మన్త్రాణాం మాతృకాదేవీ, శబ్దానాం జ్ఞానరూపిణీ ।
జ్ఞానానాం చిన్మయాతీతం, శూన్యానాం శూన్యసాక్షిణీ॥
(అథర్వణీయదేవ్యుపనిషత్తు)

శ్లో॥ "అజాతస్య కుతో నాశః ప్రారబ్ధ మసతః కుతః॥

అను ఆధ్యాత్మోపనిషద్వాక్యములో విశదీకరించినట్లు స్వతః పరిపూర్ణునకు జననాది కార్యకలాపాదు లసంగతమేయై, కేవల మవజ్ఞాని సంశయనివారణార్థమే 'ప్రారబ్ధాదులు' వెలయుచుండి,

శ్లో॥ 'ననిరోధో నచోత్పత్తి ర్నబద్ధో న చ సాధకః'
(అమృతబిందు)

అని ఉత్తమాధికారినిగూర్చిన అద్వయప్రతిపాదిత పారమార్థిక విశిష్టవాక్యము లనేకములు కర్తవ్యమేమియు నిరూపింపక పోయినను, మందమధ్యమాధికారులను గూర్చిన సాధ్య-సాధక భావనాపేక్షితములైన విధివాక్యము లనంతములు,

శ్లో॥ 'సుప్తేరుత్థాయ సుప్త్యంతం బ్రహ్మైకం పరిచిన్త్యతాం'
(వరహోపనిషత్)

ఇత్యాదులు, మంత్రజపాదు లంగముగాను, విచారమును అంగినిగాను జేసికొని, సమ్యగాత్మ విజ్ఞానముదయింపకుండు వఱకు నెల్లప్పుడును వేదాంతావృత్తి, నియమమున జేయుచునే యుండవలయుననియు అనేకచోట్ల స్పష్టము చేయబడినది. కావున మంత్రానుష్ఠానమెంతయు ప్రధానమైనదిగా తెలియ వచ్చుచున్నందున, దాని విమర్శ ఒకింత యిట వివరింపబడు చున్నది.

శ్లో॥ 'మననం విశ్వవిజ్ఞానం, త్రాణం సంసారబంధనం ।
యతః కరోతి సంసిద్ధౌ, మంత్ర ఇత్యుచ్యతే బుధైః॥

అని పింగళాది తన్త్రములలో చెప్పబడినటులను, "మంత్రో దేవాది సాధనః" అనునట్లును, కల్పసూత్రాది సహితములైన వేదవిజ్ఞానమును విచారించుటచేతనేగాని చిత్తస్థైర్యము సంపాదించి, కృతకృత్యుడు గాజాలడని స్పష్టమగుచున్నది. మంత్ర శబ్దావతరణము చూచినను, "మననాత్త్రాయతీతి మన్త్రః" అనునటుల (మననములోని 'మ' ను, త్రాణలోని 'త్ర' పదములను జేర్చుటవలన గలిగినదగుటచే) 'విశ్వాసమువలన రక్షించునదని'యు తెలియవచ్చుచున్నది.

ఇట్టి శక్తి, స్థూలదృష్టికి శబ్దమాలంబనముగ గోచరించినను, వాచ్యవాచక విభాగయుతమై, బీజాంకురన్యాయముగ, అకారాదివర్ణములకు పరిపాకముచేత కార్యరూపమును బొందునట్లు చేయు మూలకారణమగుటచే, కేవలము వర్ణ సముదాయముగనేపరిగణించి, తదధిష్ఠానప్రతిపాద్యదేవతను అలక్ష్యము చేసినచో, నిష్ఫలంబే యగుచు, అనర్థపరంపరలకుగూడ దారి తీయునదగుచున్నది.

శ్లో॥ గురౌ మానుష బుద్ధిం చ, మన్త్రేచాక్షర భావనమ్ ।
ప్రతిమాయాం శిలా జ్ఞానం, కుర్వాణో నరకం వ్రజేత్ ॥

అని స్మృతులయందును వినవచ్చుచున్నది. కావున జీవులు సఫలమనోరథులగుటకు, మంత్రములజీవనాధారము 'వాచ్య' శక్తియనియు, కవచము వాచకశక్తిగను గ్రహింపనగును.

శ్లో॥ 'అనాహతస్య శబ్దస్య తస్యశబ్దస్యయో ధ్వనిః'
(మండలబ్రాహ్మణం)

లో సూచించినటుల, అనాహతమును, సర్వవ్యాపకమునైన, సుఖస్వరూపమునుంచియే, ప్రప్రథమమున 'ధ్వని' యుద్భవించి నటులను, పరిణామాదులఁబొంది అదే మనోరూపాదులుగ ప్రవర్తించుచున్నట్లును తెలియవచ్చుచున్నది. ఏ ప్రకారము వాయుసంచారము, ఏ యితరాయుధముచేతను గుర్తింపబడక, స్పర్శచేతనేగుర్తింపబడుచున్నదో, అటులనే నిర్గుణపరబ్రహ్మ, అవాఙ్మానసగోచరుడైనను స్వకీయ శక్తి యను శబల బ్రహ్మ చేతనేగాని గ్రహింపబడజాలడు. ఇదియే పరాబిందువు. అట్టి బిందువికసనమే నాదము. నామరూపాత్మకమగు నీ జగము నాదముతో మొదలిడి, క్రమక్రమముగ పరా - పశ్యంతి - మధ్యమా - వైఖరీలు అను అవస్థలను గలదగుచున్నది.

శ్రు॥ చత్వారివాక్పరిమితాపదాని విదుర్బ్రాహ్మణాయే
మనీషిణః। గుహాత్రీణినిహితా, నేంగయంతి,
తురీయం వాచో మనుష్యావదన్తి ॥

యని పరా పశ్యన్తి మధ్యమాలు సూక్ష్మావస్థలు అగోచరము లనియు, నాలుగవదైన వైఖరిని మాత్రము మనుష్యులు వాక్కుచేత ఉచ్చరించుచున్నారనియు విశదీకరించుచున్నది. కావునమంత్రములు పంచాశద్వర్ణమయములు. వర్ణములు వైఖరీరూపములు. వైఖరీ పరాబిందువువలన క్రమముగా గలిగినది గాన, సకల మంత్రములు పరాశక్తిస్వరూపములే! అట్టి సకల మంత్రములందును ప్రధానమైనది

'స్ఫుట శివ శక్తి సమాగమ బీజాంకుర రూపిణీ పరా శక్తి' అని యుండుటచే, ప్రకాశాంశములో సర్వవర్ణాగ్ర్యమైన 'అ' కారమును, విమర్శాంశయగు సర్వవర్ణాన్త్యమగు 'హ'

కారము కలసి, 'అహం' అను ఆత్మమంత్రమే ప్రథమ కామ కలా స్వరూపము. అవశ్య మనుష్ఠేయము. [దీనిని గురించి ముందు 'శ్రీ విద్య' యనెడి వ్యాసమున విస్తరింతుము.]

మరియు పైకి బీజమొకటిగ గానవచ్చినను, విమర్శ చేయువారలకు, తన్నయమున, రెండుడిప్పలు గలిగినటులుండి బీజమొకటిగానే తెలియవచ్చునటుల, బ్రహ్మతత్త్వ విమర్శన కాలమందు శివ - శక్త్యాత్మకముగ స్ఫురించుచున్నను, శుద్ధ చైతన్య పరిపూర్ణునియందు యిట్టి విభాగమున కెంతమాత్ర మును సావకాశము లేదు. "స భగవః కస్మిన్ ప్రతిష్ఠితః ఇతి- స్వేమహిమ్నీతి" అని మైత్రాయణ్యుపనిషత్తులో తెలుపబడి నటుల, శక్తి-శక్తుల కనన్య భేదమేగదా! చంద్రునియందుండి వచ్చు కాంతి చంద్రునికంటె వేఱుగానటుల, ఆత్మ శక్తి యొక్క విజృంభణమే యీ సృష్టి విలాసము. సృష్టికిపూర్వ మద్వితీయముగనున్న స్థితియందాత్మయనియు (శబలబ్రహ్మ) సృష్టితరువాత నామరూపములచే ననేకాకారములుగ భాసించు స్థితియందు జగత్తనియు (శబ్దబ్రహ్మ) ఒకేవస్తువు వ్యవహరింప బడుచుండుటచే, ఆవస్తువు అనిర్వచనీయము. అట్టిసమయమున ఆత్మ, జగత్తులనునవియును శబ్దము లేగదా! ఆధ్యాత్మమందును మనో-వాక్-ప్రాణరూపములే,యీదృశ్యమానమగు తేజోబన్న మయమగు సర్వభూత ప్రపంచమగుటచే, మహాప్రలయములో సర్వము 'శబ్దమే' యని చెప్పుటయే దాని సారస్యము. కావు ననే 'నారాయణ' నిర్వచనంబును, శబ్దైకవేద్యమని, శబ్దాశ్ర యమైన దాని అఖండ పరిపూర్ణతను తెలియ జేయుటలో ముఖ్యోద్దేశము.

ఇట్టి సిద్ధిని బొందుటకే సాధనముగా, శబ్దార్థ రూప వంతమగు మంత్రానుష్ఠానముకన్న వేఱుమార్గముగా నరాదు. అట్లు చిరకాల మభ్యసించిన, విక్షేపరహితమైనదియు, బీజాక్షర రూపమగు శబ్దార్థమననమే, తదధిష్ఠాన దేవత సాక్షాత్కారముద్వారా, స్వస్వరూపజ్ఞానము గలుగజేయుననునది నిస్సంశయము. అదెట్లనిన, భూమిమీద ప్రవహించు జలములు సూర్యరశ్మిచే తపింపబడి, ఆవిరి రూపమున ఆకాశమున జేరి తిరిగి వర్షరూపమున నేలమీద పడినను, క్రమ క్రమమున సూర్యతాపముచే నిర్జల మెట్లగునో, అటుల నే శబ్ద విస్తృతి కన్న వేఱుగాని యీ జగమంతయు, మంత్రానుష్ఠాన మను పేర విరాజిల్లు అధిష్ఠాన దేవతారూపమగు అర్థ పరిశీలనాది మననమూలకమున, నిస్సారమైనదై అఖండ అద్వితీయ జ్ఞాన రూపముగ పరిణమించి, ద్వైతప్రతీతిని సైతము దొలగజేసి, కృతకృత్యత నొనర్చగలదు. అనగా మేఘము జలముయొక్క, ఘనీభూతమైన స్థితియగునటుల, అనిర్వచనీయమగు ఆ వాచ్య శక్తి (ప్రతిపాద్య దేవత) యొక్క, సగుణరూపమే వాచకశక్తి గాన, గుణాతీతమైన పరబ్రహ్మయొక్క అస్తిత్వగ్రహణమును అభివ్యక్తముచేయునదే వాచకశక్తి. ఇట్టి శబ్దబ్రహ్మస్వరూపములే బీజమంత్రములగుటచే, యీ మంత్రములు వాచ్య – వాచక రూపద్వయమున, సాధకుని యనుష్ఠాన పటిమ ననుసరించి, చిత్తశుద్ధిని గలిగించి, ఫలమొసంగునవగుచున్నవి. అష్ట సిద్ధులును, ఇట్టి అనుష్ఠాన ఫలితములే!

ప్రధానమైన బీజమే, అంకురము, వృక్షము, శాఖాపల్లవములు మొదలైన వానినన్నింటిని లోనగలిగియుండి, వాని పుట్టుకకు తానే ఆధారమైనటుల, వేఱు వేఱు మంత్రములుగ

బాహ్యదృష్టికి గోచరమగు వర్ణసముదాయము కేవలము కన చములేయై, బీజమంత్రమను అధిష్ఠాన దేవతాసంజ్ఞను లోన గుప్తముగా గలిగినదగుటచే, సాధకుడు వానివాని అధిష్ఠాన దేవతలద్వారా సర్వాధిష్ఠానమైనదానిని గుర్తించగలుగుటయే 'మంత్రసిద్ధి' యని పేర్కొనబడినది. కావున అట్టి సాధకుడు, ఏయొక మంత్రానుష్ఠానముద్వారానైనను సిద్ధిని బడయగలిగిన యెడల చతుర్దశ భువనములకును, సర్వ వేదములకును జ్యోతి స్వరూపమైన దానిని గుర్తించగలుగుటచే, పరమోత్కృష్ట శాంతిని బొందుచున్నాడు.

కావున విద్య-ఉపవిద్య - సిద్ధవిద్య - మహావిద్యలని వేర్వేఱుగా చెప్పబడుచున్ననన్నియు మంత్రములే! అన్నియు పర్యవసానమున జ్యోతిస్స్వరూపమే! సాధకుని బంధవిముక్తుని చేయుటకు మంత్రానుష్ఠానరూపమగు మహావిద్యల విచార ణయే శరణ్యము. ఈమంత్రములు వర్ణరూపమున నుండినటు లనే, రూపశాఖకు చేరిన వాని తత్త్వమే యంత్రరూపమున ప్రసిద్ధిగాంచుచుండుటచేతను, తత్త్వవిచారణపూర్వక మంత్రా నుష్ఠానమే తంత్రమగుటచేతను, ఈ యంత్ర-మంత్ర-తంత్ర విభాగమంతయు నామమాత్రమే యగుచు, సాధకుని అధి కారానుగుణముగ ఉపయోగపడుచుండును.

మరియు నీ మంత్రములు సిద్ధ-సాధ్య-సుసిద్ధ-రిపులని నాల్గువిధములుగా లోకములో ప్రసిద్ధిచెందియున్నవి. వీని నన్నిటి అనుష్ఠానమందును వానివాని ఋషి-ఛందస్సు-దేవత లను స్మరించి బీజ-కీలక-శక్తియుతమగు మంత్రరూపమును తదేక దీక్షతో ననుష్ఠించుటయే క్రమమైన మార్గము.

(1) అందు సిద్ధమంత్రము లనునవి సుహృద్భావము గలవియై సాంప్రదాయసిద్ధముగ పరిపక్వము నొందినవగుటచే, ముముక్షువుల తీవ్ర వైరాగ్యాది స్వల్పానుష్ఠానమాత్రముచేతనే శీఘ్రకాలములో ఫలోన్ముఖులగుచున్నవి.

(2) సాధ్యమంత్రములు సేవకస్థానీయములై, చిరకాల జప, తప, హోమాదుల యావశ్యకతను గోరుచున్నవియై, కాలవ్యవధానమున ఫలభూతము లగుచున్నవి.

(3) సుసిద్ధమంత్రములు పోషకవర్గమునకు చెందినవియై, హస్తమస్తక న్యాయానుసారమున, గురువుల యనుగ్రహ మాత్రముననే సద్యఃఫలకారులగుచున్నవి.

(4) ఇక చిట్టచివరి రిపుమంత్రములు శత్రుస్థానీయములై అనేక జన్మార్జిత సిద్ధుల నన్నిటిని హతంబొనరించి, సకలానర్థ దాయకములని పేరువడయుచున్నవి.

కావున ఇట్టి మహిమగల మంత్రములను, విచక్షణ జ్ఞానము లేనివారలై, కనబడినవారినెల్ల గురువులుగ భావించి తమతమ అధికారముల గుర్తింపనేరక, మోహావేశులై శిష్యుల మని చేరి ఉపదేశముల బొందగోరుచో మిక్కిలి కష్టనష్టము లకు లోనుగావలసిన వారగుదురని పూర్వసాంప్రదాయ వచనము. అట్టివి నివారించుటకే పురాణేతిహాసములందు సైతము కాళింగమర్దన-గోవర్ధనోద్ధారణ యను ఆఖ్యాయికలద్వారా, గురుశిష్య సాంప్రదాయమును బహుళముగ విశదీకరించిరి. కులార్ణవాది తంత్రములందును, గురువులవర్ణించుచు, ప్రేరక-సూచక - వాచక - దర్శక - శిక్షక - బోధకములను విభాగముల నిరూపించిరి. ఏది యెట్లున్నను, ఎట్లు కలశము -

ఘటము-కుంభములనునవి వేఱువేఱు పదములైనను ఒకేవస్తువును స్ఫురింపజేయుచున్నవో అట్లే గురు - మంత్ర - దేవలనునవి యొకే పరంజ్యోతిని గుర్తింపజేయ ననువైన పర్యాయ పదములై అధికారానుగుణ సోపానములగుటచే,

శ్రు॥ యస్య దేవే పరాభక్తి ర్యథా దేవే తథాగురౌ ।
తస్యైతే కథితాహ్యర్థాః ప్రకాశన్తే మహాత్మనః ॥
(సుబాలోపనిషత్)

లో చెప్పినటుల, శ్రద్ధాభక్తులు గలిగి తమ తమ అధికారాను గుణముగ - ననుష్ఠించుటయే మిక్కిలి శ్రేయోదాయకము.

ఓమ్-తత్-సత్

# 7. ఉపాసనలు - ఆవశ్యకత

శ్లో॥ కృతే శ్రుత్యుక్త ఆచార స్త్రేతాయాం స్మృతిసంభవః
ద్వాపరేతు పురాణోక్తః కేవలాగమికః కలౌ ॥

అని కులార్ణవములో చెప్పబడినట్లు కృతయుగంబున శ్రుతులచేత నే బొందననువగు పరమశాంతి త్రేతాయుగములో శ్రుతియుక్త స్మృతులచేతను ద్వాపరమునందు శ్రుతి, స్మృతి, పురాణములచేతను, యీ కలియుగమందు శ్రుతి, స్మృతి, పురాణోక్తముల తంత్రముల చేతనేగాని, సులభ సాధ్యముగా నేరదని తెలియవచ్చుచున్నది. తంత్ర నిర్వచనంబు చూచినను (కామికాగమమున)

శ్లో॥ తనోతి విపులానర్థాన్ 'తత్త్వ-మన్త్ర' సమన్వితాన్
త్రాణంచ కురుతే యస్మా త్తన్త్రమిత్యభిధీయతే ॥

యనియె గదా! అనగా కృతయుగములో 'ఆత్మావా అరేదృష్టవ్యః' అను శ్రుతి విన్నంతనే కలుగ గలిగినంత అంతఃకరణ శుద్ధియుతమగు 'శాంతి' త్రేతాయుగమునందు 'శ్రోతవ్య' అని చేరననేగాని లభ్యము గానట్లు, ద్వాపరయుగమునందు శ్రవణముతో పాటు మననముగూడ అవశ్య మనుసరణీయమగుచు, యీ కలియుగమందు శ్రవణ మననపూర్వక నిదిధ్యాసనముల చేతనేగాని, పరమోత్కృష్టమయిన 'స్వాస్థ్యమును' బొంద నవకాశము లేకపోవుచున్నది.

కావున భక్తితో గూడిన ఉపాసనాంగముగ శ్రవణాదులొనర్చిననేగాని సర్వానర్థ నివృత్తి పూర్వక పరమోత్కృష్ట శాంతి గలుగుటలేదు. దీనినే వాశిష్ఠమందు

శ్లో॥ తత్త్వజ్ఞానం మనోనాశో వాసనాక్షయ ఏవచ।
మిథః కారణతాంగత్వా దుస్సాధ్యాని స్థితానిహి॥

అనుచోట వశిష్ఠులవారు తత్త్వజ్ఞానమును, మనోనాశనమును: వాసనాక్షయంబును, యీమూడును పరస్పర కారణతనుబొంది సాధింప నశక్యములయి యున్నవగుటచే 'ఓ రామా! వివేక సహితమయిన పురుషప్రయత్నముచే భోగేచ్ఛను దూరంబున విడిచి యీ మూటి నాశ్రయింపు' మని తెలవిచ్చిరి. అటుల గాక 'ఈ కాలమందున ప్రాయికముగా అకృతోపాసనుడే ముముక్షువై యాత్మనైక్యమాత్రమువలన దటాలునవిద్యయందు బ్రవర్తించుచు 'యోగము' నభ్యసింపకయే చిజ్జడ వివేక మాత్రము చేతనే తాత్కాలికములైన మనోనాశము, వాసనాక్షయము సంపాదించి శమదమాది సంపత్తిచే శ్రవణమనన నిదిధ్యాసముల సంపాదించుచున్నాడు. గాని దానివలన జీవ

న్ముక్తి సుఖ మనుభవించక చిత్తవిక్షేపముచే దృష్ట దుఃఖము ననుభవించుచున్నాడు. మరి ఎవఁడుపాస్యదేవతా సాక్షాత్కార పర్యంతము నుపాసన చేసి 'తత్త్వ' జ్ఞానము కొరకు ప్రవర్తించునో వానికి వాసనక్షయ మనోనాశములు దృఢతరంబగుటచే జ్ఞానము కలిగినపిమ్మట జీవన్ముక్తి తనంతట నేసిద్ధించుచున్నదని, శ్రీ మధుసూదన సరస్వతీస్వామివారును శలవిచ్చియున్నారు. గాన జీవన్ముక్తి సుఖానుభవాపేక్షగలవారెల్లరును 'ఉపాసన' యను దాని విశిష్టత లెస్సగ గుర్తించు టెంతయో కర్తవ్యమైయున్నది.

'ఉప' = ఆత్మనుగా పొంది 'ఆసన' = అట్లే నిలచుచున్నారు. అను ధాత్వర్థము ననుసరించి 'ఉపాసన' యనగా సమీపవర్తులైయుండుటని సామాన్యముగ నిర్వచింపబడుచున్నను శ్రీ శంకరాచార్యస్వామివారు శలవిచ్చినటుల యథా శాస్త్రముగా నుపాస్యమైన వస్తువును విషయీకరించి దాని సామీప్యమునొంది తైలధారవలె సమానప్రత్యయ ప్రవాహముచే దీర్ఘకాలముండుట యేదిగలదో అదియే ఉపాసన. దీనినే 'నిదిధ్యాసన' మను విజాతీయ ప్రత్యయానంతరితంబగు సజాతీయ ప్రత్యయ ప్రవాహముచే శ్రవణ మననోత్తరభావి యగు దానిచే నిరంతర చింతనమని ప్రశంసింప బడుచున్నది. ఇట్టి సాధనాంతరము అధికారానుగుణముగ వర్ధిల్లుచుండుటచే సగుణ నిర్గుణోపాసనలను క్రమమున ప్రసిద్ధిచెందుచున్నవి.

'త్వంవా అహమస్మి భగవో దేవతే అహంవై త్వమసి' ఇత్యాది శ్రుత్యుక్తమగు అహంగ్రహోపాసనాదు లుత్తమాధికారి కనియు 'ఆదిత్యో బ్రహ్మేత్యాదేశః' ఇత్యాదులు ప్రతీ

కోపాసన రూపముగ మధ్యమాధికారులకును నీ రెంటికిని అసమర్థులగువారు కొంద ఱధమాధికారులు యితర దేవతోపాసనముగాని అగ్న్యాదికర్మంబులనుగాని చేయుచు ఆయా బహుప్రకారములచేత విశ్వరూపుడగు పరమాత్మనే ఉపాసించుచు ఉత్తరోత్తర క్రమంబున పూర్వపూర్వ భూమికాలాభంబును బొందగలుగుచున్నారని సూచింపబడినది. అనగా ఆరురుక్షువగు ముముక్షువునకు సుకరంబగు సగుణోపాసన యున్నా ఆరూఢుడగు బ్రహ్మవిదునకు కలిగిన జ్ఞాన మప్రతిబద్ధమగుటకై "తమేవ ధీరో విజ్ఞాయ ప్రజ్ఞాం కుర్వీత బ్రాహ్మణః" ( బృ-6-4-21 ) లో చెప్పినటుల నిర్విశేషమగు పరబ్రహ్మమే యుపాస్యము. అట్టి దీర్ఘకాల మాచరించగలిగిన బ్రహ్మాకారవృత్తియు బ్రహ్మత్వవాసనయు నేదిగలదో అదియే 'సమాధి' యని పిలువబడుటచే అది యెట్లు దృఢము, నిరంతరము వర్ధంబగునో అట్లు వర్తించుటయే 'సర్వం ఖల్విదం బ్రహ్మ తజ్జలానితి శాన్త ఉపాసీత' అను (ఛాం-3-14-1) శ్రుతిచే బోధింపబడు దాని సారాంశము. ఈ ప్రకారము నిష్కామనయా ప్రవర్తించు సమ్యగ్దర్శులు అంతటను అనవచ్ఛిన్నముగా చూచుచుండుటచే 'తనను' 'సర్వంబును' బ్రహ్మమను జ్ఞానయోగ బలంబున బ్రహ్మభావము ననుభవించు చున్నందున 'భక్తుడై'న బ్రహ్మవిదున కేవిధమైన ఆధ్యాత్మికాద్యుపద్రవములచే విచ్ఛేదము లేకుండునటుల నిరంతర బ్రహ్మనిష్ఠను. కొనసాగించ గలనని భగవంతుడే భ-గీ 9-22 న

'అనన్యాశ్చిన్తయన్తో మాం యేజనాః పర్యుపాసతే।
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్॥

అని ప్రతిజ్ఞ బూనియున్నాడు. ఇట్లు నిత్యనిరంతర బ్రహ్మనిష్ఠచే రాగాది రజోగుణంబులను విపరీత భావనాది తమోగుణంబులను శమాది సత్త్వగుణంబులను తత్కార్యము లగు ప్రవృత్తి నివృత్త్యహంకార మమకారాదులన్నింటిని అతి క్రమించి యిదేసంసారమునుండి విముక్తులై (కఠ. 2-5-1)లో చెప్పినట్లు "విముక్తశ్చ విముచ్యతే" యను అఖండమును ఆత్మీయమను విదేహముక్తిని బొందుచున్నారు. గాన శ్రవణ మాత్రంబున తమ్ములను కృతార్థులుగా దలంచువారు అట్టి సుఖంబును బొందజాలరు. ఇట్టి ఉపాసన దేహాభిమానము విడచినవారికే గాని శక్యముగాదు గాన 'సగుణోపాసన' యను దానిని అనాయాసంబును అక్షరోపాసనసిద్ధికి కారణమును అగుటచే దానిని ముముక్షు లవశ్యమాచరించవలయును. ఎవ రట్లు సగుణోపాసన చేయుదురో వారు సుఖముగ నక్షరో పాసనమును తత్ఫలమును బొందగలుగు చున్నారని భగవం తుడే భ.గీ. 12-(6-7) శ్లోకములలో శెలవిచ్చి యుండిరి. 'సఏతస్మాజ్జీవ ఘనాత్పరాత్పరం పురిశయం పురుషమీక్షతే' అనుచోట ఈశ్వర సహకృత వేదాంత వాక్యముచే జ్ఞానముద యించుటవలన (అనగా తానయంత నావిర్భవించిన వేదాంత ప్రమాణముచే తన హృదయ గుహాయందు నివిష్టుడైన పర మాత్మను సాక్షాత్కరించుచున్నాడు.) నవిద్యా తత్కార్య మును నివర్తిల్లుటంజేసి బ్రహ్మలోకమునందే యైశ్వర్య భోగాం తంబున నిర్గుణబ్రహ్మవిద్య ఫలమైన పరమకైవల్య ముపపన్నం బగునని స్పష్టము చేయబడినది. దీనినే విద్యారణ్య స్వామియు

"వేదాన్త విజ్ఞాన సునిశ్చితార్థా ఇతిశాస్త్రతః
బ్రహ్మలోకేశ కల్పాంతే బ్రహ్మణా సహముచ్యతే"

యనియు ముండకోపనిషత్ 3-2-6లో శ్రుతిమూలము నను ప్రతిపాదింపబడినది.

గాన భగవంతుడు గీతలలో 12వ అ. మున ముముక్షువుల చిత్తశుద్ధికి బరముకారణమును అధికారిభేదముచే గురులఘ్వాది భేదభిన్నంబగు సగుణోపాసనమును కర్తవ్యముగా బోధించి సగుణధ్యానమందశక్తులకు శక్తి తారతమ్యమునుబట్టి ప్రథమంబున బాహ్యమగు ప్రతిమాదికమందు భగవద్ధ్యానాభ్యాసంబును, తదశక్తులకు భాగవత ధర్మానుష్ఠానంబును, తదశక్తులకు సర్వకర్మ ఫలత్యాగంబును అను మూడు సాధనముల జూపి సగుణోపాసనచే బరిశుద్ధబుద్ధి అయినవానికి తదుపాసనా ఫలభూతమయిన అక్షరోపాసనము కర్తవ్యంబని స్పష్టపరచెను' బ్రహ్మసూత్రాదులందును శ్రవణానంతర ఫలదాయికముగనే అపరోక్షానుభూతి గలుగుటకు దహర శాండిల్యాది ద్వాత్రింశద్విద్యోపాసనలు జేర్కొనబడి నేటికిని విరాజిల్లుచున్నవి.

మరియు యిట్టి ఉపాసనలన్నిటి ప్రాప్తికి భగవద్భక్తియే ప్రధానమని దెల్పుచు 'ఈశ్వరానుగ్రహ దేవా పుంసామద్వైత వాసనా' అని పేర్కొనబడినది. అథర్వవల్లుల శ్రుతియును "నాయమాత్మా ప్రవచనేనలభ్యో నమేధయా నబహునా శ్రుతేనా యమేవైషవృణుతే తేనలభ్య స్తస్యైష ఆత్మావివృణుతే తనూస్వామ్" ప్రతిపాదింపబడుచు శాస్త్రముచేతగాని గురువుచేతగాని పరమేశ్వరుడు కనబడడనియు తన సత్త్వస్థమయిన బుద్ధిచే స్వాత్మచేతనే యాత్మ చూడబడుననియు దానికినైతిక ధార్మిక ప్రవర్తనాయుత ఉపాసనలు ఎట్లు-అద్దమునందు ప్రతి

బింబము కనబడుచునే క్తి స్వభావముననే యున్నను మాచు వాడుమలినమును చూచుటనునది అట్లావశ్యకమనియు-అట్లు మలినమును చూడవనిచో తన స్వచ్ఛమైన స్వరూపము గానరాక అట్లు చేయుటవల్లనే చిత్పరిమాణ రూపమయిన మనసు యొక్క మలమును సత్కర్మేశ్వర భక్తులవలన దొలగింపగా అందే తన యంతనే యాత్మప్రకాశించి స్వాస్థ్యము గలుగుననియు తెలియజేయబడెను. ఈ ప్రకారము "ఉపాసన"యను విచారణపూర్వక "ధ్యానసమాదులు" బ్రహ్మవిదునకు గూడ అప్రతిబద్ధ జ్ఞానసిద్ధికొఱకు అవశ్యకమని శ్రుతులు ప్రతిపాదించుటచే-శ్రు॥ "సమాహితోభూత్వాఽఽత్మ న్యేవాఽఽత్మానం పశ్యతి సర్వమాత్మానం పశ్యతి" అని యెల్లఱును ఏమాత్రము నుపేక్షింపక ఆచరించిననేగాని యీ కాలమున పరిపూర్ణమగు జీవన్ముక్తి సుఖానుభవము బొందనేరకుందురనునది నిర్వివాదాంశము.

ఓమ్ - తత్ - సత్.

# 8. శ్రీవిద్యయే చరమవిద్య

శ్రుతి॥ ఓమ్ "బ్రహ్మవిదాప్నోతిపరమ్-తదేషాభ్యుక్తా సత్యం
జ్ఞానమనన్తం బ్రహ్మ యో వేదనిహితం గుహాయాం
పరమేవ్యోమన్." —(తై. 2-1-1.)

"శ్రీవిద్యాతంత్రము స్వతంత్రతన్త్రమని" శ్రుతి-స్మృతి-పురాణసమ్మతమైన వచనము. ఇది పరాపేక్షలేని స్వభావమే ధర్మమగుటచే, స్వరూపమును గుర్తింప జేయుటయందే పర్యవసించునదై, "నామరూపయోర్నిర్వహితా తేయం దతరా

తద్బ్రహ్మేతి” యనునటుల, అఖండైకరసస్వరూపమును గుర్తింప జేయుటయందే సార్థకపడుచున్నది. లోకములో కులార్ణవాద్యనేక తన్త్రము లల్పఫలదములుగలవు గాని ‘శ్రీవిద్య’ స్వతంత్రమైనదగుటచే, ‘మహాతంత్ర’ మనియు, కాది (బ్రహ్మ) విద్య తన్త్రమనియు ప్రసిద్ధి.

మంత్రములు మనోవృత్తివ్యాపక చిదాత్మత్వ సూచితములే గాన, విధి నిషేధరూపముగ, పరవస్తువును గుర్తింప జేయుట కనువైన పరంపర సాధనములు. సిద్ధమైన మోక్షమునకు సాధనములు లేవు; గాన సర్వసాధనములు ప్రతిబంధనివృత్తికొఱకేనని, స్వస్వరూపవిజ్ఞానముచేత తెలుపుటయే “శ్రీవిద్య” యొక్క ప్రాశస్త్యము. మరియును మంత్రములు స్థూలరూపమున, కర్మలనుపేర పిలువబడు స్తోత్ర, జప, తప, హోమాదులుగ పరిగణింపబడుచు, వ్యవహితమైన సాధనలుగ చిత్తశుద్ధిని గలిగించుటతో బాటు, క్రమక్రమముగ శ్రవణాదుల యందు ఇచ్ఛగలిగించి తాము ఉపరతి జెందుచుండును. అట్టి ఆశ్రమోచిత విధులు, శ్రవణాదుల దీర్ఘకాలాచరణ వలన, ప్రతిబంధము క్షయించి, పిమ్మట అవశ్యముగ సస్వరూపానుసంధానమున కనువైన శివశక్త్యాత్మకమగు “శ్రీవిద్యా”త్పత్తికి దారితీయును. ఈవిద్యను కేవలము తటస్థలక్షణముగ గ్రహించవలసినదేగాని—అనగా ఐక్యమున్నంతకాలము ఉండునవిగాక, పరతత్త్వమును గుర్తింపజేయు సాధనగనే గ్రహింపవలయును. కావుననే “విద్యాఽవిద్యస్వరూపిణి” యను నామము సార్థకమగుచున్నది. ఎట్లన—

“నవసంఖ్యాహుతజ్ఞానమే” అత్యంతసన్నిహితమైనను, తనను గుర్తింపజేయలేక పోవుచున్నది. ఇదియే అవిద్య,

బాహ్యానవసంఖ్యాదిని అభిమానించుటకు పూర్వము, ప్రత్య గాత్మ రూపముగనున్న "పరమ"మైన "తన"ను గుర్తింపలేక పోవుట అనే ఆవరణను (మాయను) గలిగి యుండవలెను. అట్టి (మాయాఽవిద్యలు) ఆవరణ, విక్షేపములను నామాంతరము గలిగిన, శబల, శబ్దబ్రహ్మల సత్య విభాగములగు స్వరూప మెఱుకపఱచి, వ్యావర్తికానువర్తికములచే, సజాతీయ విజాతీయ స్వగతభేదరహితమైన సత్యవస్తువును గుర్తింపజేయు విమర్శనయందే "శ్రీవిద్య" వినియోగము. కావున ఉపాసనలలో భేదమేగాని ఉపాస్య మేకమే యగుటచేతను, ఉపాసనలు సూక్ష్మార్థగ్రహణాదుల నిచ్చు సామర్థ్య మగుటచేతను, విద్యలనుపేరున బిలువబడు "ఉపాసన"లెంతేని స్వస్వరూప జ్ఞానానుసంధానమున కుపయోగపడుచున్నవి.

శ్రీ పతంజలియోగి సెలవిచ్చిన "తస్యవాచక ప్రణవః, తజ్జప స్తదర్థభావనమ్" అని బ్రహ్మమునకు ఉపలబ్ధిస్థానమగు "ఓంకారము" స్ఫురించునదేగాని, పుట్టుక లేదని దేనిని వర్ణించిరో, దాని విమర్శనపూర్వక అనుసంధానమునకు "శ్రీవిద్యా సాక్షాత్సాధనమనియు తెలియనగును. కావున అట్టి 'శ్రీవిద్యా' యొక్క స్వరూప స్వభావము లొకింత పరిశీలింపనగును.

శబ్దములు (1) రూఢము, (2) యోగములను రెండు విధములగు అర్థవంతములుగనున్నవి. అందు

యోగార్థవద్భి శ్శబ్దైర్హి లక్ష్యైకై ర్వాచ కైశ్చవా।
శిష్యేభ్యః ప్రోచ్యతే సత్యం వస్తు శ్రీగురుమూర్తిభిః॥

—(ఋభుగీత)

అనునట్లు, యోగార్థవంతములైన శబ్దములచే కాని, లక్షణ ములుగల వాచకములచేగాని 'సత్య'వస్తువు శ్రీ గురుమూర్తుల వారిచే శిష్యుల కొఱకు చెప్పబడినదనియు, సూక్ష్మార్థ్యమాత్ర వంతమగుటచేతను, అలక్ష్యైకత్వముంబట్టి అయోగమువలనను, ప్రశ్న యోగ్యత్వంబుగాని, వాచ్యత్వంబుగానిసిద్ధింపదు. కావున తురీయరూపమగు సత్యమైన బ్రహ్మమునే యోగవృత్తితోటి, సచ్చిదానందపూర్వక లక్షణములచేత ముక్తికొఱకు ఎఱుంగ నగుననియు స్పష్టీకరింపబడినది. కావున వర్ణమయములైన మంత్రములకు వాచకశక్తి కవచమగుటచేతను, 'త్రిపదా' యను గాయత్రీ మంత్రమునకుగాని, త్రిమాత్రాయుతమైన 'ప్రణవ'మునందుగాని, కూటత్రయమే శరీరముగాగల పంచ దశాక్షర్యాది విద్యలయందుగాని, గాంచబడు బీజాక్షర సము దాయము పరాత్పరుని గుర్తింపజేయ ననువై "తం దుర్దర్శం, గూఢమనుప్రవిష్టమ్, యో వేదనిహితం గుహాయాం॥ఇత్యాది శ్రుత్యంతరములందు గోచరించునట్టి స్వకీయ దేవాత్మశక్తి స్థూలశరీర స్థానీయమై, సూక్ష్మాకారమున తదర్థ్యోగార్థ విచా రణపూర్వక వాచ్యశక్తిగ నదియే 'శ్రీవిద్య' యను పేరున ఉద్ధరింపబడుటచే, శ్రీవిద్యయే చరమవిద్యగ కీర్తింపబడు చున్నది.

దీనినే "తత్సృష్ట్వా తదేవానుప్రావిశత్" (తై. 2-6-1) లో ప్రవేశమని చెప్పబడినచోట, అల్పమైన ఉపాధియందు బృహత్ అయిన బ్రహ్మము ప్రవేశించుటయనిగాక, 'అనుత్తర విమర్శలిపి లక్ష్యవిగ్రహా' మైన ఆ పరాశక్తియొక్క స్థూలా కారమగు 'అహం' శబ్దముయొక్క లక్ష్యార్థమును గుర్తింప జేయుటయే ! దీనినే తంత్రశాస్త్రములయందు

"అకార సర్వ వర్ణాగ్ర్యః ప్రకాశః పరమః శివః ।
'హాకారోఽన్త్యం కలారూపో విమర్శాఖ్య ప్రకీర్తితః ॥
యనియు,

కైవల్యోపనిషత్తునందు—

'ఉమాసహాయం పరమేశ్వరం విభుం, త్రిలోచనం,
నీలకణ్ఠం ప్రశాన్తమ్ । ధ్యాత్వా మునిర్గచ్ఛతి
భూతయోనిం, సమస్త సాక్షిం, తమసః పరస్తాత్ ॥

అనియు వర్ణింపబడినది.

ఛాం. 6-8-7 లో "ఐతదాత్మ్య మిదగ్ం సర్వం, తత్సత్యగ్ం స ఆత్మా తత్త్వమసి" అనునది విమర్శించునపుడును ఆద్యంతములయందు సచ్చిదానందరూపమును బొందియుండునది పరవస్తువేననియు, ధర్మాఽధర్మములు ఆత్మవేద్యములుగాని ఆత్మధర్మములు గావనియు, గాన వేదితమైన 'సద్వస్తువే' ఆత్మమంత్రమైన అహంశబ్దవాచ్య మనియు తెలుపబడినది.

"శ్రీం" బీజోత్పత్తి విచారించినను, శవర్ణ-రేఫ-తురీయస్వర-బిందువులు గలదియై, శివ-శక్తి సామరస్య స్వరూపమును వ్యక్తపఱచు నా శక్తియే సర్వఫలప్రద పవిత్ర వికార వాక్ప్రసారముగ వెలయుచుండి, 'శ్రీవిద్య' యను వాడుకయందు, దాని ప్రధానబీజమైనది వ్యవహరింపబడుచున్నది. ఇటులీ యుపాధికృతము, మిథ్యారూపమేయైనను 'అస్తిత్వ గ్రహణమునకై' జ్ఞేయధర్మములవలె కల్పించి 'అధ్యారోపాపవాదాభ్యాం నిష్ప్రపఞ్చం ప్రపఞ్చ్యతే' అనుదాని సార్థకముగ, శివశక్తి సామరస్య స్వరూపమునే ప్రధానముగ గుర్తించుటర్థే, యేకైకలక్ష్యమైనను, దాని నుపేక్షించి,

ఏతత్స్వభావజనిత వాక్ప్రసార విలాసప్రపంచమునే ముఖ్యమని యెంచి, మోహపరవశులగుటచేతనే, 'శ్రీవిద్య' తనయొక్క యథార్థస్వరూప జ్ఞాన ప్రాశస్త్యమును కోల్పోయి, కేవలము 'శక్తిపూజగ' పరిగణింపబడు దురవస్థకు లోనయి నిష్ఫల దాయిగ భావింపబడుచున్నది. కాని యథార్థములో—పరా పరత్వ జ్ఞాపక పరంజ్యోతి రూపశిఖామణి యని వర్ణింపబడు 'క్ష'కారము మేరువుగా గలిగి, పంచాశద్వర్ణముల పీఠాకృతిని గలిగి, ఆమాతృకాశక్తియే శబ్దబ్రహ్మ మనుపేర సకలమంత్ర సారమైన శ్రీవిద్యగా ప్రశంసింపబడుచున్నదనుసంగతి ప్రాజ్ఞుల కొక్కరికే గాని తెలియరాకున్నది.

ఇట్టి 'శ్రీవిద్య' త్ర్యక్షరీ (బాలా) పంచదశాక్షరీ షోడ శాక్షరీలను సంజ్ఞ కలిగి, ఆయా మంత్రములకు జెందిన బీజాక్షర సంపుటితో, 'శ్రీం' బీజప్రధానమైనదై విరాజిల్లుచున్నది. అనేక శక్తిమంత్రములున్నను, శబ్దబ్రహ్మము సృష్ట్యావిర్భావ కాలమందు అవ్యక్తచక్రమందున్న కోణత్రయ బిందురూపమైన 'బాలా' బీజత్రయమును ముందు ఉత్పన్నమైనందున, శ్రీదేవి బ్రహ్మశక్తిసృష్టికి ప్రథమావతారముగ నున్నది.

శక్తయో యస్య దేవస్య బ్రహ్మ విష్ణు శివాత్మకాః ।
బ్రహ్మ విష్ణు శివా బ్రహ్మ ప్రధానా బ్రహ్మశక్తయః॥

అనునది యిట ప్రమాణము.

వామకేశ్వర తన్త్రములో—

వాగీశ్వరీ జ్ఞానశక్తి ర్వాగ్భవే మోక్షరూపిణీ, కామరాజే క్రియాశక్తి కామేశీకామరూపిణీ । శక్తిబీజే పరాశక్తిరిచ్ఛైవ శివరూపిణీ, ఏవం దేవీ త్ర్యక్షరీ తు మహాత్రిపురసుందరీ॥

అని వర్ణించినదానినే—దేవీభాగవతమున 'సత్త్వ రజస్తమో గుణాత్మకమగు ఏ పరాశక్తి ప్రలయకాలమందు స్వస్థితిబొంది యుండునో, అది శబ్ద వాచ్య కావున, సృష్ట్యాదిని బ్రహ్మాది త్రిమూర్తులుగా భాసించుచుండుననియు, ఈ ప్రపంచము కేవలము తమోగుణ ప్రధానమైన అవిద్యా సంజాతమేననియు, తానుమటుకు త్రిగుణాతీతమై, నామరూపరహితమైన పరబ్రహ్మకన్న భిన్నముగానని కానవచ్చుటచే, త్ర్యక్ష్యరీ 'శుద్ధ విద్యా కుమారీచ' అను గౌడపాద సూత్రానుసారముగ ప్రథమావతారమని గుర్తించుట యందే 'శ్రీవిద్య'యొక్క వినియోగము గాన

సర్వమస్మిన్ శేత ఇతి శివః। సర్వస్మిన్ శేత ఇతివా శివః॥

అను నిర్వచనములచే శివశక్తుల కభేదమునే, 'శ్రీవిద్య' ప్రతిపాదించునదగుటచే ఎంతయో ప్రశస్తమైనది. అట్టి అవినాభావదృష్టి నలవఱచుకొనుటకుగాను

యథాసా పరమాశక్తిః స్వేచ్ఛయా విశ్వరూపిణీ।
స్ఫురత్తామాత్మనః పశ్యే త్తథా చక్రస్య సంభవః

అనునట్లు 'సితవ్రజ' మను ఖ్యాతిగల శ్రీచక్ర రూపమును ధరించి, ప్రకాశ విమర్శరూపమున తానే శ్రీచక్రమధ్య బిందువుగా భావింపబడుచు, దక్షిణాచారమను ప్రక్రియచేత పూజలొందుచుండును. అట్లు గురుసాంప్రదాయము తెలిసికొని, సర్వసామాన్యముగనున్న. వేదమార్గమైన 'శ్రీవిద్య' దీక్షను బొంది, వేదసమ్మతముగా శ్రీచక్రార్చనాదులను బాహ్యపూజాకలాపాదులం జరుపుటచే, "క్రమముగ అంతర్ముఖులై, అంతరంగవస్తు విచారణ కుశలులై, సహస్రార కమలమునందు

శ్రీచక్రమునైక్యముసంపాదించి, బిందుమండలమగు ద్వాదశాంత మందు చిచ్చంద్రునితో పరాస్వరూపవహ్నిని ఐక్యమును గావించి, బ్రహ్మాత్మైక్యమును భావించి, అంతర్యాగమను సమయాచారమున కలవడుటచే, కృతకృత్యులు గాగలరని తెలుపబడినది.

ఈ ప్రక్రియకు, లోకాచారములగు, వామకౌలాచారములు భేదించి, సద్యోఫలప్రదములు కాకపోయినను, క్రమక్రమమున కాలవ్యవధానముచే, ఫలవంతములుగాక తప్పవను నది "సవ్యాపసవ్యమార్గస్థాయ నమః" అను మంత్రవర్ణమున సూచింపబడుచున్నది. మరియు సృష్ట్యాదికృత్యముల కన్యాపేక్షలేకయే స్వతంత్రమగుటచేత, స్వతంత్ర తన్త్రమనియు, భక్తులకు సర్వానందమయ శ్రీచక్రార్చనవలన, సంవిన్మయ మనోలయ భావనయను పూర్ణసిద్ధి నొనగూర్చగలుగునదగుట చేతను

"తే ధ్యానయోగానుగతాం అపశ్య
న్దేవాత్మశక్తిం స్వగుణైర్నిగూఢాన్॥"

లో చెప్పినటుల "సిద్ధవ్రజ"మని ప్రఖ్యాతి (శ్వేతా. 1-3) గాంచుచున్నది.

ఈ ప్రకారము పిండాండబ్రహ్మాండములకును, మాతృకా, శ్రీచక్రములకును ప్రధానకారణము శుద్ధబ్రహ్మ స్వరూపము. అట్టి శుద్ధబ్రహ్మముయొక్క అంశమైన శబలబ్రహ్మాకారమే చిద్బిందుస్వరూపము. ఇదియే వికసనమున పశ్యంతీవాక్కు. బిందువు నాక్రమించిన ప్రథమ త్రికోణచక్రము. శరీరపక్షమందవ్యక్తము. అదియే క్రమముగా

"ఇచ్ఛాజ్ఞానక్రియాశక్తులుగను, సత్త్వరజస్తమోగుణములుగను పశ్యన్తి-మధ్యమా-వైఖరీరూపములుగను, సృష్టి-స్థితి-లయ మనుగతులుగను, వామ-జ్యేష్ఠ-రౌద్రీలనువిగ్రహములుగను"

శ్లో॥ యా సా తు మాతృకాలోకే పరతేజః సమన్వితా ।
తయా వ్యాప్తమిదం సర్వం ఆబ్రహ్మభువనాన్తరం॥.

అనునట్లు విస్తరించుచున్నది. వ్యాస విస్తర భీతిచే నింతటితో ముగించుచున్నాను.

కాన పుణ్యపురుషులకు ఉత్తమలోక ప్రాప్తికి కర్మాచరణ, ఉపాసన, జ్ఞానము లనునవి మార్గములై యున్నను, సత్కర్మానుష్ఠానపరులకు చంద్రలోకావాప్తియు, ఇతర దేవతోపాసకులకు అర్చిరాదిమార్గమున సూర్యలోకావాప్తియు, దేవతాత్మల కభేదజ్ఞాన కామకలోపాసకులగువారికి బ్రహ్మాత్వసిద్ధియనియు, అదియే కైవల్యసిద్ధియనియు, శ్రుతి-స్మృతుల యందు చెప్పఁబడుటచే, సకలమంత్ర, తంత్ర, యంత్ర, శాస్త్రచ్ఛన్దస్సారమై, పరమంత్రవిచ్ఛేదినియై, మిగుల గుప్తమగు, నీ శ్రీవిద్యను, వేదపురుషుఁడైనను వెల్లడింపక, సాంకేతరూపమున ప్రసిద్ధి చెందునట్లు చేసెను.

"మహాయజ్ఞైశ్చ యజ్ఞైశ్చ బ్రాహ్మీయం క్రియతే తనుః" అని గొప్ప తపఃఫలముచేతనేగాని శ్రీవిద్యోపాసనయు, శ్రీచక్రార్చనాదులును లభింప నేరవనువది ప్రసిద్ధము. శ్రీ ఆచార్యస్వాములవారును.

"సదనుష్ఠాన జనితా పూర్వ వశాత్పరిశుద్ధ బుద్ధిః ।
ససమ్యగ్గే యోగ్యోభవతి॥"

అని సెలవిచ్చిరి. కాన 'శ్రీవిద్య'యే ఆత్మ విద్య-బ్రహ్మవిద్య-మహావిద్య యని వేర్వేరు పేర్ల జెప్పబడుచు, భక్తుల కడపటి జన్మయందే లభించునని

"చరమే జన్మనియధా శ్రీవిద్యోపాసకో భవేత్" యని స్పష్టీకరింపబడుచున్నదగుటచే 'చరమవిద్య' యని గూడ చెప్ప బడుచున్నది.

ఓమ్ - తత్ - సత్.

## 9. శక్తిస్వరూపము

శ్లో॥ కృతేతు రేణుకా శక్తిః । త్రేతాయాం మైథిలీహి చ ।
ద్వాపరే ద్రౌపదీ శక్తిః । కలౌశక్తిర్గృహే గృహే ॥

శ్వేతా॥ 6-7-8 శ్రుతి. "పరాస్యశక్తిర్వివిధైవ శ్రూయతే" యనునటుల, పరాశక్తియే సర్వకాల సర్వావస్థలయందును,-కృతాదియుగ విభాగయుతమైనటుల సృష్ట్యాదినుండియు గానవచ్చుచున్నది. అట్లుండ నది కేవలము బాహ్యగోచరమగు నామరూపాత్మకముగనే భావించుట, సంకుచిత దృష్టియేయగుచు, నిరాధారమై సంశయాస్పదమగుచున్నది. అటులగాక సూక్ష్మవిచారణకు గడంగినచో, సృష్టికిపూర్వము సజాతీయ, విజాతీయ, స్వగత భేదరహితమైన సద్వస్తువే, సృష్ట్యనంతరం బింత విస్తృతిగలదిగా గోచరించుట కొకకారణ ముండక తప్పదనియు, అది దాని స్వభావమే యైయుండవలెననియు, శ్రుతి-స్మృతులందు వినవచ్చుచున్నది. దాని ప్రతిపత్తి విచారింపబూనినను, అవాఙ్మానసగోచరమైన సద్వస్తువు, స్వకీయ సామర్థ్యముచేతనే స్ఫురణ గలిగినట్లు-కృతే-శివశక్త్యై

త్మకముగ గోచరించుటయను క్రియను లోనై - త్రేతా - త్రిపుటియను నామాంతరమున జీవేశ్వర మిథునముగ తనను భజించువారికి తానే ప్రాప్తిస్థానమగుచు, తదుపరి - ద్వాపరే - యీ రెంటికి పరమై రెండు పక్షములు ముఖ్యముగాగలిగి నామరూపాత్మకమగు నీ దృశ్యవర్గమున కధిష్ఠానమై, - కలౌ - సకల చైతన్యరూపిణిగ నీ వికారసంకుల చరాఽచర ప్రపంచ మును తనయొక్క విలాసముకన్న వేఱుగానియటుల తానే ప్రకాశించుచున్నట్లు తెలియవచ్చు చున్నది.

ఇటుల అమృతబిందూపనిషత్ —

"ఏక ఏవహి భూతాత్మా భూతేభూతే వ్యవస్థితః
ఏకధా బహుధా చైవ దృశ్యతే జలచంద్రవత్"

లో గానవచ్చునటుల, ఇన్నిగా గోచరించుటచేతనే, దాని యథార్థస్థితిని గుర్తించుట కనువైనరీతిని, తమతమ యోగ్య తానుసారముగ, సుకరములగు మార్గములుగ శ్రుతి, స్మృతి, పురాణేతిహాసము లనుపేర బోధింపబడుచున్నవి. కావున, ఏయొక్క విషయము ఎన్నివిధములుగ ప్రదర్శింపబడినను, ఆధ్యాత్మికాది విభాగ జనిత అర్థవిచారణలచే పరమార్థమును గుర్తించుటకే యగుటచే, ఆయా అంతస్థులగుర్తించి, నధిష్ఠించుట కనువైన యంతఃకరణశుద్ధిని బొందుటకు తగిన సాధనల కెంతేని యావశ్యకత గానుపించుచున్నది. అట్టి దృక్పథము తోనే నీ కృతయుగాది. విభాగముజరుపబడుచు (ఛాం.4-3-8) స్థూలముగ ఆయా యుగపురుషు లాదర్శప్రాయులుగ గైకొన బడుచుండిరి.

కుండ మన్నుకన్న వేఱుగానటుల, కార్య జాతమగు నీ దృశ్యమంతయు కారణమైన పరాశక్తి కన్యముగాదు. అట్టి పరాశక్తియొక్క సూలాంకారము 'అహ' మత్వమే (ఛాం. 6-3-2) "సేయం దేవతైక్షతహన్తాహ మిమా స్తిస్రోదేవతా అనేన జీవేనాత్మ నానుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణీతి" అను శ్రుత్యనుసారము 'ఇది యీపేరుగలది - యిది యీరూపము గలది' యని చెప్పుకొనని సంకల్పించి, జగజ్జీవేశ్వరాదులుగ భాసించుచున్నది. అట్లు ఆ యా సంకల్పానుసారమున ఆ యా రూపములు బొందగలుగుటచేతనే 'యాదృశీ భావనాయత్ర సిద్ధిర్భవతి తాదృశీ' అను నియమము వలన, తమతమ బుద్ధి బలమున గ్రహించిన తత్త్వముయొక్క యుపాసన కనురూపము గానే వారికి ఫలము సిద్ధించుచున్నది. ఇటుల నిరుపాధికమైన ఆ పరమాత్మ - ఎట్లు అద్దమునందు ప్రతివారును, తన స్వరూపము తానెఱింగియే యుండియు తాను చూచుకొనిననేగాని ఆనంద మనుభవమునను రాదని భావించునో యటుల - బృ॥ 3-4-3 శ్రుతి

"తస్మాదేకాకీ నరమతే, సద్వితీయమైచ్ఛత్"

ననుసరించి, తానే (స్వయంభువుగా) సోపాధికమైన సృష్టి నొకదానిని సంకల్పించి, అందు తనను తాను (బృ 4-5-19) 'ప్రతిచక్షణాయ' యనునటుల చూచుకొని ఆనందించు వాని వలె తోచుచుండును. ఇట్లుండుట నాతనికి స్వభావమే యగుటచే, లౌకికమందును సతీ-పతులను 'దంపతుల అవినాభావ మొకింతయేని సంశయింప నవకాశము లేనిదై ప్రవర్తిల్లుచున్నది. అట్లగుటచేతనే, సత్త్వరజస్తమోగుణాత్మకమగు నీ జగద్విలాస మందు, సత్త్వగుణ ప్రధానముగల దేవాంశసంభూతులును,

రజస్తమోగుణో ద్రేకమున క్రమముగ విశ్రమ, అసురియా ను లును అను భూతసముదాయముచే సంకీర్ణము బొందినదగు చున్నది.

అనగా దేశ కాల భేదములతో నిమిత్తము లేకుండగనే యెల్లప్పుడును ఈవిచక్షణ యనునది సహజమూ యనునటుల ప్రవర్తిల్లుచున్నదిగాగానబడుచు 'ధర్మ' (ధంతి విశ్వం-ధృఞ్ = ధరణే) నిర్వహణ అవిచ్ఛిన్నముగా జరుగుచున్నది. దీనినే భ.గీ. 4-7/8 శ్లోకములలో శ్రీకృష్ణభగవానులు-"ఎప్పుడెప్పుడు ధర్మమునకుహానియు, అధర్మమునకువృద్ధియు గలుగుచున్నదో ఆయా సమయములందు తాను శిష్టరక్షణార్థము, దుష్టసంహార నిమిత్తము, ధర్మోద్ధారణ కొఱకు నవతరించు చుందునని" ప్రతిజ్ఞజేసెను. అటులా పురుషోత్తముడా యా సమయము లందు, మహాపురుష శరీరధారులుగ నుద్భవించి, చిరంజీవులు గను, చిరస్మరణీయులైన యమరజీవులుగను వెలయుచుందును.

అట్టి మహాపురుషులే కృతయుగాదులందు రామ కృష్ణాద్యవతారములున్ను, రేణుకా, సీతా, ద్రౌపదీ, అన సూయాది పతివ్రతాశిరోమణులునై యుండిరి. అటులనే అధు నాతన కాలమందు శ్రీరామకృష్ణ పరమహంసా శ్రీ శారదా మాతలును, వారి ప్రతిభ, వారి వారి జీవిత సంఘటనలు చూచినవారికిగాని, వారి చరిత్రాంశములు దిలకించిన వారికి గాని, స్పష్టముగాక తప్పదు. భాష్యకాలమునందు నిరూపింప బడిన గార్గి - మైత్రేయి - సులభ ఇత్యాది బ్రహ్మవేత్తలను ఇక్కాలపు ఈ ఋషిదంపతులు, తమతమ ధార్మిక ప్రవర్తన లచే, తిరిగి స్మృతికి దెచ్చుచు, ప్రాచీన యౌన్నత్యమును

గుర్తింపజేయుటయే గాక, అనేక అల్ప ప్రజ్ఞావంతులకు ఆదర్శ ప్రాయులగు చున్నారనుటలో సంశయమేమియు లేదు. ఇట్టి సత్పురుషులు అప్పటికప్పుడు భారతదేశమునం దుద్భవించుట పరిపాటియే యగుచు, 'చలనము లేనిది ప్రకాశమెటుల గాన బడదో యటుల' సూర్యరశ్మినిబోలుచు సతతము సహచరించు చుండినందుననే, స్త్రీ పురుష విచక్షణ లేక సర్వజనాదరణీ యులై మార్గదర్శకులైరి.

పూర్వకాలమందు వివాహమొక సంస్కారమై, 'దంపత్యోస్సహాధికారః' అనునటుల, భార్యకుగూడ కర్మల యందు సమానాధికారముగలదిగా భావింపబడుచు, ఎట్లు రెండు చేతులు జోడించిననేగాని పూర్తిగ పని జరుగజాలదో అట్లు, ఉత్తమలోక ప్రాప్తికొఱకు పాటుపడుచుండెడు వారను నది శాస్త్రదృష్టము. ఆవిధముననే సహధర్మచారిణియగుచు, శ్రీ శారదాదేవియు ప్రస్తుతకాలపు మూర్తీభవించిన సద్గుణ సంపన్నురాలగుటచే, స్వ-పర-భేద మనునది లేక,

> కార్యేషు మంత్రీ, కరణేషు దాసీ
> భుక్తేషు మాతా శయనేషు రంభా,

యను నార్యోక్తి ప్రకారము, సర్వకాల సర్వావస్థలందును, శ్రీరామకృష్ణ పరమహంసల వారి ప్రకాశత్వమును ప్రసరింప జేయుచు, భారతనారీమణుల కొక పాతివ్రత్య నిదర్శనమును, ఇక్కాలమందును మఱి మఱి ప్రదర్శించిన మహాసాధ్వీమణి. శాస్త్రములందును సత్యలోకమున కేమాత్రమును తీసిపోని 'పతివ్రతాలోక' మహిమను జయగేషవ్యాది చరిత్రలందు వర్ణించునప్పుడు, నారీమణులెంత సులభముగ, తమ తమ

ప్రాణనాథులే సాక్షాద్భగవత్స్వరూపులని త్రికరణశుద్ధిగా, విశ్వసించి, వారి సత్కర్మానుష్ఠానమందు ఛాయాతపములవలె వెంబడించి, తమ పతివ్రతా ధర్మమును నిలబెట్టుకొనగలిగి, తా మెట్టి యుత్తమగతుల బొందగలిగినదియు వివరింప బడెను. అట్టి వర్ణనల సార్థకపఱచి ప్రత్యక్షముగ మార్గదర్శి యైన మహాశక్తి యీ శారదామాత! నిజముగ నామె చరిత్ర యొకింత పరిశీలించినచో, సార్థకనామ మేయగుచు, శరత్కాల చంద్రమండలమును బోలు మానసిక పరిణామముతో, సర్వ వికార భూయిష్ఠమైన యీ కలిసంచరులకు, ఎట్లు వారు తమ మలినవాసనలం బోగొట్టుకొని, మైత్రాది వాసనల (మైత్రి - కరుణ - ముదిత - ఉదాసీనత) కలవడి, తన్మూలమువ చిత్త శుద్ధినిబొంద వీలగునో, నిదర్శన పూర్వకముగ నిరూపింప గలిగిన లలనామణి. "కలౌ శక్తి గృహేగృహే" అనునటుల దైవాసుర సంకులభావములతో గూడియున్న మానవ శరీరము లలోని తమోగుణమే ప్రకోపించియున్న యీకాలమున, తమ యొక్క నైతిక, ధార్మిక ప్రవర్తనలచే నెట్లు నిత్యానందమును సర్వోత్కృష్టమైన శాంతి ననుభవించ గలుగుటయు, ప్రత్యక్ష ముగా ఋజువుచేయగలిగినదియు ఈ ఋషిదంపతులే గదా! ప్రాచీనకాలపు అవతారపురుషులని పేరువడసిన వారల జీవి తములు కేవలము, చరిత్రాత్మకములే యగుననియు, ఇకాక లమున కవి యనుష్ఠేయములు గావనియు నిట్టూర్పు విడుచు వారి కీ దంపతులచరిత్ర కనువిప్పుగా పరిణమింపగలదనుటలో నెంతమాత్రము సందేహము లేదు. మరియు భారత విజ్ఞానమున నానావిధముల వ్యాఖ్యానించుచు, అదియొక గగనకుసుమమే యనియు, గారడివిద్యయే యనియు తలంపబడు విపరీతపు

అపోహలను దొలగించి, నవీన నాగరికులలోగూడ నూతనోత్తేజము గలిగించి, భారతదేశ మన నొక కల్పవృక్షమని మరొకసారి చాటించిన మహానుభావు లీ పుణ్యదంపతులు.

'యస్యస్త్రీతస్య భోగేచ్ఛా, నిస్త్రీ కస్యక్వభోగభూః'

అను మహోపనిషత్ శ్రుతి ననుసరించి, పరాశక్తి యొక్క యథార్థ స్వరూపమును గుర్తించిన మహానుభావులగుటచే, నాదంపతులిరువురును ఒకరికొకరు నామరూపాత్మక కేవల పాంచభౌతిక దేహులుగనె గ్రహించక, స్వకీయ 'ఆత్మశక్తి'యే నని దృఢాపరోక్షజ్ఞానము గలవారగుటచే, భ.గీ 3-17 లో ఉదహరించినటుల, 'తస్యకార్యం నవిద్యతే' యని ప్రత్యక్షముగా నిరూపించి, లోక సంగ్రహముకొఱ కవతరించిన అధికారపురుషులుగ ప్రకాశించుచుండిరి. ఇట్టి విశిష్టత వారియందు గలుగుటకు వారి సత్యవాక్యపరిపాలన, నిరాడంబర జీవితము, నిష్కళంకహృదయము, నిస్స్వార్థ ప్రవర్తన, సర్వజనాదరణీయ అవ్యాజ కరుణా కటాక్షము, నిరంతర ఈశ్వర ప్రణిధానాది సద్గుణసంపదయే కారణము. పరాశక్తి యొక్క ప్రథమాకారము సైతము, స్వచ్ఛమైన చిదంశమే గదా! అట్టిదానిని మాలిన్యముగల దానినిగా భావించి తదనుగుణముగ సంచరించుట మానవుని అవజ్ఞతకు జెందిన స్వయంకృతాపరాధమే! 'ఉన్నదిఉన్నట్లు గాంచలేని, మందమతులు అల్ప ప్రజ్ఞావంతులు సమీచీనబుద్ధికి (ఇది బాగుగ నున్నదని అభిలషించి దానియందు నివసించుటచే) లోనై మలిన మతులగుటచేతనే యథార్థము గుర్తించలేకపోవుట! అట్టి దృష్టిని మరల్చి, వారల సన్మార్గప్రవర్తకులుగ జేయుటకే అప్పటికప్పుడిట్టి మహనీయు లుద్భవించుట.

శ్లో॥ వాగర్థా వివసంపృక్తౌ, వాగర్థ ప్రతిపత్తయే ।
జగతః పితరౌవన్దే, పార్వతీ పరమేశ్వరౌ॥

అనునటుల, ఆ శివశక్త్యాత్మకమగు పరమాత్మయే శబ్దార్థము లుగ జగత్తులో వ్యవహరింపబడుచు, అవినాభావ సంబంధము గల వగుటచే, సరియైన శీలవంతుల ననుకరించుట వల్లనే యథార్థమును సులభముగ గుర్తించగలుగుట కేకైకమార్గము. దీని నే బృ॥ శ్రుతి, 3-5-7

"పితా మాతా ప్రజైత ఏవ, మనఏవ
పితా, వాజ్మాతా ప్రాణః ప్రజాః"

అని వివరించుటచే సత్పురుషుల సాంగత్య, సంభాషణ, పరి చర్యలే శరణ్యమనునది నిర్వివాదాంశము.

తే.గీ " యుగయుగంబుల వెలుగుచు 'నున్నదొకటె'
'ధరణిగా' తానె మెఱసెడి ధర్మమునను
భూమి నవతీర్ణులైన 'శ్రీరామకృష్ణ'
శక్తిరూపము గాదొకో 'శారదాంబ'"

అట్టి శ్రీ శారదామాతృదేవి కివే ధన్యవాదములు.

ఓమ్-తత్-సత్

# 10. శాక్తాఽద్వైత సిద్ధాంత సామరస్యము

శ్రు॥ యఏకోఽవర్ణో బహుధాశక్తియోగా । ద్వర్ణాననేకా న్నిహితార్థోదధాతి । విచైతిచాన్తే విశ్వమాదౌసదేవః, సనోబుద్ధ్యా శుభయా సంయునక్తు ॥ (శ్వే॥ 4-1)

మత్పరమహంస పరివ్రాజకాచార్య జగద్గురు శ్రీ శంకరాచార్యస్వామివారు, జగద్విఖ్యాతమైనప్రతిభతో షడ్దర్శనముల జేరొక్కని, అపూర్వమైన "అద్వైతసిద్ధాన్త"ము నప్రతిహతముగస్థాపించిన సందర్భమున, వారెచ్చోటను 'శాక్తసిద్ధాన్త' మనుదాని నిరూపింపక పోవుటచే, నిది యసమగ్రమైన యొక అవైదిక తన్త్రవిద్యయే ననియు, అద్వైత వేదాంతదర్శనమునకు విరుద్ధమే ననియు భావించుట లోకమునగలదు. ఇది కేవలము సత్యదూరము. శ్రీ స్వామివారిచే లోకప్రసిద్ధము గావింపబడిన బ్రహ్మసూత్రాది భాష్యములం దనేకచోట్ల, "జన్మాద్యారంభేతరవ్యపదేశాద్యధికరణములందున" ఛాందోగ్య - బృహదారణ్యక -ఐతరేయాద్యనేక ఉపనిషదంతర్గత శ్రుతి, స్మృతులయందును "కారణమున కాత్మభూతమే శక్తి యనియు శక్తి కాత్మభూతమే కార్యమనియు, అంగీకరింపవలయుననియు, కార్య - కారణములకు, ద్రవ్య-గుణములకు నశ్వ మహిషము వలె భేదబుద్ధిలేదు కాబట్టి తాదాత్మ్యము నంగీకరింపవలయుననియు" సెలవిచ్చిరి. ఇట్లు స్పష్టముగ విశదపఱచుచు, తాము ప్రతిఘటింపబూనిన అవైదిక దృష్టులయందుగాని, శ్రుతివిరుద్ధాన్వయజనిత, విపరీత సిద్ధాన్త విమర్శలయందుగాని, యీ శాక్త సిద్ధాన్తమును నిరూపింపకపోవుటచే, దీనియందు ఎట్టి భేదభావన లేని, సామరస్యమే వారి ముఖ్యాభిప్రాయమని మనము గ్రహింపక తప్పదు. అది శ్రీవారు గావించిన శ్రుతి-స్మృతి విమర్శనల నొకింత గమనించినచో నెంతయు స్పష్టము గాగలదు. మరియు ప్రాచీన సాంప్రదాయమునకును విరుద్ధము గానిపింపదు.

"ఏకమేవాఽద్వితీయం బ్రహ్మం" అను నుపనిషత్ప్రతిపాదిత శ్రుతి ననుసరించి, సర్వపరిపూర్ణమైన వస్తువు-సజాతీయ, విజాతీయ స్వగత భేద శూన్యమైనదిగ నిర్ణింపబడుచు - ఎట్టి విమర్శనలకును అవకాశములేనిదైయైనను, అది కేవలము,

శ్రు॥ "అనుభూతి పరంతస్మాత్సారం బ్రహ్మేతి కథ్యతే" అని (అన్నపూర్ణోపనిషత్ లో) చెప్పినట్లు, శుద్ధవిలక్షణమైనదై, అధ్యారోపాపవాద ప్రక్రియాను సారముగనే గుర్తింపబడుచు, అనుభవావసానమై, (మాం. అద్వైత ప్రకరణ 45 లో చెప్పినట్లు)

"నాస్వాదయే త్సుఖం తత్రనస్సంగః ప్రజ్ఞయాభవేత్"

నిశ్చల నిశ్చరచిత్త మేకీకుర్యా త్ప్రయత్నతః"—

గా "ఉండుటయే" పరమావధిగా సూచింపబడినది. అట్టిదాని "అస్తిత్వ గ్రహణమునకై" కల్పితంబైనను రెండవదని యొకటుండవలయునుగదా! దానికొఱకు సూ. భా. 1-4-3 లో "తదధీనత్వాదర్థవత్" అనుచోట. "శక్తిరహితుడగు పరమేశ్వరునకు బ్రవృత్తి యుపపన్నముగాదు గావునను, అది ప్రయోజనకారి గావునను, అవశ్య మంగీకరింపబడ దగినదనియు" దెల్పుచు, శుద్ధాద్వైతముగూడ దర్శనమేయగుటచే "సంసారులగు నెల్లజీవులు స్వరూపజ్ఞానము లేనివారై దేనియందు నిద్రించుచున్నారో, యాబీజశక్తి యవిద్యాత్మకయు, అవ్యక్త శబ్దనిర్దేశ్యయు, మాయామయియు పరమేశ్వరాశ్రయయునని" సెలవిచ్చిరి. మరియు దానిని స్పష్టీకరించుటకుగాను (ఛాం. 6-2-3 లో)

శ్రు॥ "సదేవసోమ్యేదమగ్రఆసీత్ - ఏకమేవాఽద్వితీయం - తదైక్షత బహుస్యాం ప్రజాయేయేతి"

అనుచోటను బృ. 3-4-7 న "తద్ధేదంతర్హ్యవ్యాకృతమాసీ తన్నామ రూపాభ్యా మేవ వ్యాక్రియత" యనుచోటను, (తైత్త. 2-7 న.) "తదాత్మానగ్ స్వయమకురుత" ఇత్యాది శ్రుతులయందును, "నామరూపాత్మకమగు నీ జగము ఉత్పత్తికిపూర్వమును, సజాతీయ, స్వగత భేదములేనిదియు, విజాతీయ భేదములేనిదియును, నిర్విశేష బ్రహ్మమేయైయుండియు, తానే అనేకముగా నగుదునని సంకల్పించి తన్నే 'సృజించు'కొని, నిమిత్తాంతరము నపేక్షింపకయే జగదాకారమున బరిణమించె ననియు" నెలవిచ్చిరి. అనగా నీ జగము ప్రాగవస్థయందు కారణరూపమై బీజరూపమునయుండి, సృష్టికాలమందు 'శబ్ద' రూపముచేతను, 'అర్థ' రూపముచేతను అభివ్యక్తమయ్యెనని స్పష్టపరచిరి. ఇట్లగుటచే, స్వకీయ సత్తాస్ఫూర్తులచే నెల్ల వస్తువుల వ్యాపించునదే గదా! 'ఆత్మ' యను దాని నిర్వచనము: ఇది కేవలము నామమాత్రమేయై, వ్యవహారార్థము గల్పింపబడినదేయగుటచే, 'పరమాత్మ' నామరూప భేదముల కతి దూరమేగదా! స్మృతియును "మనో మహాన్మతి ర్బ్రహ్మా పూర్బుద్ధిఖ్యాతి రీశ్వరః। ప్రజ్ఞా సంవిచితిశ్చైవ స్మృతిశ్చ పరిపఠ్యతే॥" అని వర్ణించినప్పుడును, "సర్వశక్తివంతమైనదియే గదా! ఎల్లచోట్లను వ్యాపించు టనేశక్తితో 'బ్రహ్మ' యని ప్రశంసింపబడుచున్నదా 'స'త్పదార్థము!"

అట్లు తాను నామరూపములనెడు వ్యాకృతి చేతనే అభివ్యక్తమైన దగుటచే శబ్ద ప్రమాణమువలననే తెలియబడునదియై, యెంత మాత్రము జగదాకారమునం బరిణామ ప్రసక్తికి లోనుగానిదైనను సూ.భా 2-1-28 లో "ఆత్మని చైవం విచిత్రాశ్చహి" వర్ణించినటుల, "స్వరూపోపమర్దన లేకయే,

వివిధాకారములను సృష్టి బ్రహ్మమునందు కాన్పించుచున్నదని” తెలుపబడినది. అనగా “బ్రహ్మ మవిద్యాకల్పితమును, నామరూప లక్షణమును, వ్యాకృతావ్యాకృత స్వరూపమును, బ్రహ్మమునిగాను, భిన్నమునిగాని, నిర్వచింపరానిదియునగు రూప భేదముచే పరిణామాది వ్యవహారములకెల్ల నాస్పదమగుచున్నది. పారమార్థికమగు రూపముచే నెల్ల వ్యవహారముల నతిక్రమించినదై యపరిణామియై నిలుచుచున్నది” అట్టి అవిద్యా కల్పితమైన నామరూప భేదము వాచారంభణమే యగుటచే ‘బ్రహ్మము’నకెట్టి విరోధమును లేదుగదా!

దానినే వరాహోపనిషత్తునందు

“స్వపూర్ణాత్మాతిరేకేణ జగజ్జీవేశ్వరాదయః।
న సంతి నాస్తి మాయా చ తేభ్యశ్చాహం విలక్షణః॥”

వర్ణింపబడుటచే, ‘మాయా’ అనునదికూడ అయథార్థమే యైనను వ్యవహారకాలమందు. (నిజము కాకపోయినను) నిజమువలె భాసించు ‘స్వభావ’ మయినటులుండుటవల్లనే దానిని పురస్కరించుకొని శాస్త్రము ప్రవర్తించుచున్నది. “స్వభావో నామ పదార్థానాం ప్రతినియతా శక్తిః అగ్నేరౌష్ణ్యమివ” అని ఆచార్యస్వామియే సెలవిచ్చియున్నారు. (శ్వేతా. 1-3) గాన ‘స్తంభము’ అని వ్యవహరించునపుడు యథార్థములో “ఉన్నది కొయ్యయే” యైనను కొయ్యలోనున్న శక్తియుండిన స్తంభము అగుచున్నటుల, (మట్టిలో జనియించినదే కుండ యగుటను హేతువయి, ఇసుక రేణువులతో కుండ కాజాలనటుల) అనగా కొయ్య-అజము, అవ్యయము-అయినను ఆ కొయ్యలోనున్న శక్తియే “మాయ” చేత స్తంభముగా వ్యవ

హరింపబడుచున్న దేగాని యథార్థముగా నున్నది-'కొయ్యయే' అగునటుల ఈ స్తంభము-కుండ వగైరాలన్నియు వాచారంభ ణములే గదా! కావున అట్టి వాచారంభణము అనుదానిని పరిశీలించినచో, పై నుదహరించినప్రకారము అనభివ్యక్త అభి వ్యక్తస్థితులకు సత్తాస్ఫూర్తులేగదా! ప్రకాశ విమర్శాత్మక ములు. దీనినే ఐత: ఉ. 1-1 లో

శ్రు॥ " 'అ' ఇతి బ్రహ్మ, తత్రాగత మహమ్"

అనుదానిని విమర్శించుటలో-అన్తర్లీనమైన, విమర్శరూపమే అభివ్యక్తమున, అనుత్తర లిప్యాకారమున 'అ' తో ప్రారంభ మగుచు, విమర్శలిప్యాకారమున 'హ' తో పరిసమాప్తిజెంది అంతర్గర్భిత పంచాశద్వర్ణ స్వరూపిణిగ "అహ" మను సంకే తముగా పరిగణింపబడుచున్నదని విశదీకరించిరి. దీనినే బృహ. 2-3-20 లో

శ్రు॥ "ఏష ఉ ఏవ బృహస్పతి ర్వాగ్వై బృహతీతస్యా ।
ఏషపతి స్తస్మాదు బృహస్పతిః॥

ఇట్లే 'అహం సువేపితరమ్ అస్యమూర్ధన్' ఇత్యాదులు ఋగ్వే దాదులయందును గాననగును.

కావున స్వప్రకాశమానమైన యీ ప్రజ్ఞానఘన స్వరూపానుభవము గలుగుట కిది యొకటియే ఆలంబన యని చెప్పబడుటచే, శివశక్తులని నామాంతరము గలిగిన ఆ ప్రకాశ విమర్శనలెంతయు శుద్ధాద్వైత దర్శనమునకు విరుద్ధ సిద్ధాన్త ప్రతిపాదికములు గా నేరవు. మరియు వికారజాతమైన యీ శబ్దవిస్తృతి యంతయు స్ఫురణాత్మకమగు "అహ"మాకారము కన్న వేఱుగానిదగుచు, ఇచ్ఛా, జ్ఞాన,క్రియాశక్తులని వేర్వేరు

పేర్లతో చెప్పబడుచున్నదైనను, శబ్దమాత్రమే యగుటచే, వాచ్యవాచకాభేదమున సర్వాధిష్ఠానమైనదొక్కటే యున్నటుల గుర్తించుటకేమియు నభ్యంతరముండనేరదు. దీనినే నృసింహోత్తరతాపినీ ఉపనిషత్తు 7–వ ఖండములో

శ్రు॥ 'పరిపూర్ణోఽహమితి విమర్శన్నేవబ్రహ్మ' యనియు, "కస్త్వ మిత్యహ మితిహోవాచ..." అని ఆరంభించి "సర్వాత్మక మాత్మాన మన్విచ్ఛ బ్రహ్మైవేదం సర్వం సచ్చిదానంద రూపమ్" అని పరిసమాప్తిజేసిరి.

త్రిపురారహస్యమునందును దీని నీ క్రింది విధముగ, "పూర్ణాహంతయే స్వాతంత్ర్యమువలన శివశక్తి ఘనమగు స్వాత్మరూపమును రెండు విధములుగాజేసి, యొక అంశచే జగద్భానమందు 'అహం ఇదం' అను భావమును, రెండవ అంశచే 'అహం అహం' గాను భాసించును. ఈ భాసించునప్పుడు క్రియాశక్తి యను పదములోని 'క్రియా' అను పదమునకు 'పరిస్పందము' లేక 'చలనము' అనేగాని పరిణామమని గాదు. మరేమనగా దర్పణమందు ప్రతిబింబాభాసమువలె జగద్రూపముగ అవభాసరూపమే! (నామ రూపముగ గోచరించుటయే.) ఈ అహంభావముతోనున్న "అహం ఇదం" అను జడాంశయే అవ్యక్త సంజ్ఞచేతను, "అహం అహం" అను చిదంశకే ఈశ్వరుండనియు వేదాంతములందుగానవచ్చుచున్నది ఆ ఈశ్వరుడే సత్తాస్ఫురణాత్మకుడై, భావాఽభావాములునై యున్నాడు. అతనే ఈ అవ్యక్తమును తనకంటె భిన్నముగ జూచుచున్నను, అది తానేయనెడి యైక్యమును ధరించి "అనేకముగా భాసించుచుండునని" బేర్కొనబడెను.

భగవాన్ శ్రీ రమణమహర్షియును తమ రమణగీతలందు "స్వయంమృత్వా స్వయంభూత్వా స్వయమేవావ శిష్యతే" అని సెలవిచ్చిరి. యథార్థముగ నుఖలయందు చలనము లేక పోయినను కిరణ ప్రసారముచేత రాయి కదలుచున్నట్లు గాన బడుచున్నదిగదా! అని తమ అనుభవమును వెల్లడించిరి.

భ. గీ. 9–4 లోను దీనినే విశదీకరించిరి.

"మయా తతమిదం సర్వం జగదవ్యక్త మూర్తినా" యని.

యోగవాశిష్ఠమందు ఉపశమ ప్రకరణమున 71 లో

శ్లో. "ఆత్మ సత్తైవ సత్తేషాం భావనాంన తతోఽధికా
తథైవ స్ఫురణంచైషాం నాత్మస్ఫురణ తోఽధికం।
స్వతస్సంతః ప్రకాశంతే భావాఘట పటాదయః
సేశ్వరస్య సమావేశా దిత్య స్సత్తర ముచ్యతే

అనగా ఎట్లు సూర్యుని ప్రకాశమునకును, కిరణ ప్రసారము నకును భేదమే లేక అవినాభావ సంబంధముగలిగి సర్వమును సూర్యప్రకాశమేయైయున్నను, దృష్టిమాంద్యముచే నదియే యెండమావులుగా పొడసూపి స్వరూప తిరస్కారముచే అభావమగు మృగతృష్ణగ భాసించుటయు, పిమ్మట ఆ పిపాస గొనిన మృగముయొక్క తృష్ణచే అదియే జలముగగూడ తోచుటయు నైజస్వభావమయినను, ఈ అసంభావన (యెండ మావులు) విపరీతభావనలు (జలభావము) పరదృష్టి కల్పిత ములేయైనను, వాటి స్ఫురణమాత్రము స్వతః ప్రకాశమానమై, సత్యమైన సూర్యప్రకాశమెట్లు, "స్వతస్సంతః" అని చెప్పబడు చున్నదో అట్లు నామరూపాత్మకమును, భావనామాత్రమును

అవిద్యా కామకల్పితములగు జగత్తు దేశకాల వస్తు విలక్షణ మగు దానియొక్క స్వతః 'సత్తు' వల్లనే స్ఫురింపబడుచున్నది. కావున నెట్లు ఘటాదులు వికారరూపముగ లేవని నిషేధింప బడినను, మృద్రూపముగ లేవని చెప్పదగనియట్లు, జగత్తు చిద్రూపమందు దృశ్యముగ లేదని నిషేధింపబడినను, దృగ్రూ పముగ నున్నదని చెప్పవలసినదేకాని లేదని చెప్పతగదు. మృత్తుతోగూడిన ఘటాదులవలె చిత్తుతో గూడిన జగత్తు భాసించుచుండును" గావున పరిచ్ఛిన్న జగద్వస్తువులు కల్పితము లగుటచే మిథ్యయనిత్రోసివేయగా నిషేధావధియగు చిద్రూ పానుభవమే పూర్ణ విజ్ఞానమగుటచే, శివ శక్త్యుభయాత్మక ముగా గోచరించునని, "సమ్యగ్దృష్టిని" ఏకమే యనునది సుస్పష్టము. అటులగాక నామరూపములచే పృథక్కరింప బడిన శక్తి, స్వతః సత్తుగలదానిగ ప్రశంసించుటచేతనే సాం ఖ్యాద్యనేక విపరీత సిద్ధాన్తములకు దారితీయ నవకాశముగలిగి శ్రుత్యుక్తనుభవ విరుద్ధమై నిరసింపబడుచున్నవి.

కావున శాక్తసిద్ధాన్తమనినను, అద్వైతసిద్ధాన్తమనినను, కేవలము శాస్త్రార్థములయొక్క సాధనకాలమందు విని యోగింప బడునవియై, "స్వవిమర్శో మోక్షః, జ్ఞానాదేవతు కైవల్యం" ఇత్యాది అద్వైత ప్రతిపాదిత శ్రుతుల కేమాత్రము విరుద్ధము నల్పక అనుభవావసానమైన యా అఖండైకరసుని గుర్తింప జేయుటయే యుభయత్రను ఏకైక లక్ష్యమైనందున ఈ శాక్తా ద్వైత సిద్ధాంతములు అభేదకములే.

ఓమ్-తత్-సత్

# II. శుద్ధాఽద్వైతము - అనుభవావసానము

## గీతమాలిక.

'ఏక' మనిగాని 'ఉన్నది' యిట్టిదనుచు
పలుక శక్యముగానట్టి పరుసయందు
'సూన్యమే' యని వాదించు మాన్యులకును
తెలియజేసెడి "ప్రత్యక్ష తెలివి" కాదవె ! ౧

ఉన్నదొకటె యుండుచు నుత్తముగ
ఉనికె సైతంబు యొరులక నూహలగుచు
అనుభవంబును దాటి తా నతిశయించ
"శుద్ధ"మైనది గాకెట్లు బుద్ధిగతమొ ॥ ౨

ఒరులకే తీరునైనను యెఱుగుబడక
"ఉన్న" దారీతి నెప్పుడు "నుండు" తఱిని
ఎండతెండల్లొ యెట్లెట్లొ హెచ్చరించ
వారి వారిది కాదదే వాదపటిమ ! ౩

ఎన్ని వాదము లేరీతి నిలను వెలయ
"ఉన్న"దానిని గుర్తించి యున్నతమును
స్థాయినుండెడు గాకను శాస్త్రచర్చ
దుఃఖ మేరీతి తొలగించి సుఖమొసంగొ ! ౪

"రెండు యుండిన నేగద్దా యుండుభయము"
భయము లేకుండ యుండను ప్రబలముగను
"ఎఱుగుటొక్కటె" యున్నది యేకమైన
"సచ్చిదానంద మయమని" - సంతతముగ ॥ ౫

అఖిల మనుభూతి కనువైన యాశ్రయముగ
అగ్నిఔష్ణ్యంబులను పోలియ నయమునను
ఉన్నదొక్కటె రెండుగా నెన్నబడిన
"నునికి" వెలుగను గావె తా యోగ్యమయెడు॥ ౬

"తానె" జ్ఞాతగ వ్యవహార ధర్మమునను
ఉన్న దొకదాని యునికిని యుజ్జ్వలించు
శక్తి పేరున "అహ" మను శబ్దమవగ,
"సచ్చిదానంద" మనినను శబ్దమవదె ? ౭

శక్తి - శక్తలు, రెండును శబ్దమగుచు
వాచ్యవాచక లక్ష్యమౌ "వస్తువొకటె"
ఉప్పుకల్లును కోలుచు నుండియుండ
ఏకరసమును గ్రోలంగ నేఱితరము? ౮

"పంచదారగ" తెలిసిన బాలుడొకడు
పరుగులెత్తునె? తల, తోక వాదములకు !
"పంచదార"ను సామాన్య వచనమైన
మధురమెఱిగింప గాదొకో? సాధనయెడు॥ ౯

అట్టిదానిని గుర్తించు టనునదొకటె
"తుష్టి నొసగెడు" యను గట్టిదృష్టిగలిగి
ద్వైత ప్రతిహత వేదాంత దర్శనమున
"శక్తి" యాలంబనము జూపె శంకరుండు ॥ ౧౦

'శక్తి' కైనను వారిదు స్థానమచట
"నామమాత్రమె యగుచును" నాటకమున
పతితులైనట్లు భావించు ప్రజలదృష్టి
మార్చి, సరియగు యనుభూతి గూర్చునటులె॥ ౧౧

'తాను శక్తగ నుండుటే' తగినదైన
అనుభవంబయి, యన్యమౌ 'అనుట' లన్ని
శక్తి విక్షేప రూపపు చర్యలవగ
'అనుట' గాదటె జగమున శాశ్రేయంబు! ౧౨

'అ—హ'మె శక్తిని పూర్తిగ 'నావరించి'
అంతరాళపు యంబడి యక్షరముల
తానె విక్షేపములతోడ తాండవించ
శబ్ద శక్తిని గుర్తింప శక్యమగునె? ౧౩

'శబ్ద మాత్రమో' యై, యిట్లు సాగు జగము
సారమేటియు లేనిదై జరుగుటలనె
'త్రోసి వేయుటె' యేకైక త్రోవయనుచు
"ఉన్నదున్నట్లు జూచుచు నుండుమనియె"॥ ౧౪

మృద్ఘటంబున ఘటనామ మృషయునైన
మృత్తుమాత్రము సత్యమై మెఱయునటుల
శక్తి విక్షేప సంపదౌ శబ్దజగము
సాంతమొకసంగ, "శక్తియు-శక్త" గాదె! ౧౫

అటులగాకను శ్రుతినెట్లొ నన్వయించి
'శక్తి' యున్నది, 'జగమును' సత్యమనగ
చిజ్జడంబులు రెండను స్థితులుదెలిపి
'స్వగత భేదము' జూటంగ స్వాస్థ్యమెటులో! ౧౬

గాన 'అద్వైత' దర్శన మనుసరించి
శక్తి కేవలాత్ర స్థానంబు శాస్త్రమిదెనో
అటులె నొసగుచు 'వైరాగ్య' మభ్యసించ
'శుద్ధచైతన్య మనుభూతి' సిద్దిగాదె॥ ౧౭

ఓమ్ - తత్ - సత్.

# 11. మాయావాదము

శ్లో॥ మాయా తత్కార్యదేహాది మమ నాస్త్యేవ సర్వదా ।
స్వప్రకాశైకరూపోఽహం అహమేవాహమవ్యయం॥
(బ్రహ్మజ్ఞానావలీమాలా)

'శివం, శాంతం, నిర్గుణం, ఇత్యాది వాచ్యమనిర్వాచ్యం చైతన్యం బ్రహ్మ' (నిరాలంబ) 'అఖండార్థపరంబ్రహ్మ' (బ్రహ్మోపనిషత్), 'తదరూపమనామయమ్' ఇత్యాద్యనేక శ్రుతులు, పరబ్రహ్మము నామరూపాదులు లేనిదగుటచే, సృష్టికిపూర్వపు స్థితి ప్రత్యక్షాది ప్రమాణముల కగోచరమైనదిగా ప్రతిపాదించుచున్నను, (గౌడ కారికలు—అద్వైత 24) లో

'నేహ నానేతి చామ్నాయాదింద్రో మాయాభిరిత్యపి ।
అజాయమానో బహుధా మాయయా జాయతే తు సః॥'

వర్ణించినటుల, ఆత్మవాచ్య నిరూపణకొఱకు సృష్టినికల్పించి, చివరకు మాయకమని (ఉన్నట్లు కనబడునది - వాస్తవమున లేనిది) నిషేధింప బడుచున్నట్లు విశదమగుచున్నది. అనగా యింద్రియ గోచరత్వము వ్యాకృత లక్షణమనియు, ఇంద్రియాగోచరత్వ మవ్యాకృత లక్షణమనియు, నామము శబ్దాత్మకమగుటచే వాక్కుచేతనే అభివ్యక్త మగుచున్నదనియు గ్రహింపవగు. దీనినే గౌడపాదులవారు - కారికలలో ప్రజ్ఞ యనునది ద్వివిధమనియు, అందు స్వరూపజ్ఞానము సత్యమై త్రికాలాబాధ్యమైనదిగను, రెండవది ఇంద్రియ వృత్తిజ్ఞానము-నిజముగ అసత్యమైనను సత్యముగ భాసించు స్వభావము గలదని - వర్ణించిరి. మరియు యధార్థమందు నిరవయవుడు నిర్వికారుడునై సృష్ట్యాదులయందు ఆరంభ-పరిణామాది వాదముల

కసంభవమేయైనను - యెట్లు యథార్థమైన రజ్జుభ్రాంతి సర్పముగ తోచునో యట్లు - స్వకీయ సామర్థ్యముచేత బ్రహ్మమే జగత్తుగాతోచుచున్నదని వివరింపబడెను. అనగా సృష్టికిపూర్వ మద్వితీయముగానున్న స్థితియందాత్మయనియు, సృష్టితరువాత నామరూపములచే నానాకారములుగ భాసించు స్థితియందు జగత్తనియు, నొకే వస్తువు వ్యవహరింప బడుచున్నదనియు గ్రహింపనగును. దీనినే వివర్తవాదము - మిథ్యావాదము, మాయావాదము, అను వేర్వేరు పేర్లతో శాస్త్రములందు వాడబడుచున్నది. కావున భ్రాంతికల్పితమైన సర్పము యథార్థ జ్ఞానమున నశించి సంపూర్ణముగ త్రాడే స్ఫురించుచున్నట్లు యథార్థమగు స్వస్వరూప జ్ఞానము కల్పితమైన జగన్నిరసన పూర్వకముగ కేవల పరబ్రహ్మను శేషించుచున్నది. దాననే

"యా చ ప్రాగాత్మనో మాయా తథాంతేచ తిరస్కృతా ।
బ్రహ్మవాదిభిరుద్గీత సమాయేతి వివేకినా॥" (వరాహోపనిషత్)

అత్మాఽనాత్మ వివేకముగల బ్రహ్మవిదునిచేత యీ సృష్టి మాయకమని తిరస్కరింపబడి జగన్మిథ్యాత్వము నిరూపింప బడినది.

శ్లో॥ జగద్విలక్షణం బ్రహ్మ బ్రహ్మణోఽన్యన్న కించన
బ్రహ్మన్యద్భాతి చేన్మిథ్యా యథా మరుమరీచికాః
(ఆత్మబోధ)

శ్రు॥ "ఆత్మా వా ఇదమేక ఏవాగ్ర ఆసీత్ నాన్యత్కించ్చ నమిషత్" (ఐత 1-1-1)

లు, ఆత్మేతరమెద్దియు లేదనియు, ఒకవేళనున్నట్లు గాన్పించి నను - త్రాడే సర్పరూపమున భాసించుచున్నట్లు - ఆత్మయే

జగదాకారమున మాయాశక్తిచే భాసింపఁగునని యు తెలుప బడినది. అట్లగుటచే యీ మాయాశక్తి సహజమనియు అట్లు భాసించుట స్వభావమేననియు సిద్ధమగుటచే దాని స్వరూప స్వభావ మొకింత విచారిపనగు.

సూర్యునికాంతి సూర్యునికంటె భిన్నము గానటుల, మాయా అనునది 'ఆత్మశక్తి' కన్న వేఱుగాదు. శక్తి శక్తి మంతున (శక్త) కంటె భిన్నముగా నేరదుగదా! అట్టి శక్తి యొక్క ప్రథానాకారమే 'అహం'. ఇదే ప్రథమాభాస. ఈ అహంకారమే చిత్-జడములకు తాదాత్మ్యము గలిగించునది. అహంకారమున్నంతవరకు జీవుడు పుట్టును. అటుల 'అహం' (నేను) అని 'అనుట' (స్వరూపతాదాత్మ్యము లేక అభిమానము)తోనే ప్రారంభించి సకలవ్యవహారాస్పదమై అనుభవి (తాదాత్మ్యముమీద తాదాత్మ్యము)గా నన్నను, రజ్జుసర్పాదుల సాదృశ్యముగ నాత్మయందారోపించి అధ్యస్త జగత్తుయొక్క జ్ఞానమువలన అధిష్ఠానజ్ఞానము గుదిరిన పిదప అధ్యారోపిత మసత్యమని త్రోసిపుచ్చుటయను అపవాదము నిర్వర్తించుటతో,

శ్రు॥ "అధ్యారోపాపవాదాభ్యాం నిష్ప్రపంచం ప్రపఞ్చ్యతే!

సార్థకమగుచున్నది. గాన యిట్టిఆరోపణకు కారణమధ్యాసయే! అనగా శ్రీ ఆచార్యస్వాములవారు శెలవిచ్చినటుల "స్మృతి రూపః పరత్ర పూర్వదృష్టావభాసః" స్మృతి రూపమువంటి రూపముగలిగి ఆవస్తువు కానిచోట ఆవస్తువు అనుకొనుటయే" అయితే యీ 'అవభాస' (కనబడుట – మున్దొకసారిచూచిన దానియొక్క సంస్కారము గలిగినటువంటి ఒక కనబడుట)

'పూర్వదృష్టవత్' అని పఠించుటవలన శ్రీ స్వాములవారు "యీ సంసారమంతయు మన సంస్కారస్మృతిచేతనే జరుగుచున్నదిగాని యథార్థముగ నుండనవసరము లేదు" అని శలవిచ్చిరి. మరియు యిట్లు పొరబడుట (1) ఒక వస్తువు మరొక వస్తువుమీద వేయుటగాని (పామును త్రాడుమీద వేసినటుల) (2) దానిధర్మము లారోపించుటగాని (జపా పుష్పపు ధర్మములను స్ఫటికముమీద నారోపించుటగాని) (3) వేసినట్లుగా ఒకదానిని రెండవ దానినిగా పొరబడుట (శుక్తియు లేక— రజతము లేక ఒకదానిని మరొకటిగా భ్రమించుట)గాని గాన వచ్చును. గాన యిచ్చట పాము కానిదానిని పామని అనుకొనుటయేగాని ఒకవస్తువును చూచి మరొక వస్తువునుగా అనుకొనుట కాదు. ఎందువలననగా 'ఆత్మ' పదితో పదనొకండవదిగాదు. అనగా సత్యమైన వస్తువు "ఆత్మ" వాచ్యమైనది. మిగిలినవన్నియు అనృతములే!

"ఉన్నది త్రాడే - చూచినది పామాయెనే" యీ అజ్ఞానమెట్టుల వచ్చినది? అను ప్రశ్నవలన అనవస్థాదోషము గలుగును. గాన యెప్పటికైనను యదినిజముగాక అధ్యాసయే (పొరబాటే) యైనదగుటచే దీనిని "అనాది" అని చెప్పక తప్పదు. "అనాది" అనగా కారణములేనిది. గాన కార్యము గాజాలదనిన్నీ అందువలన అసలే లేదనిన్నీ స్పష్టమగుచున్నది. దీనినే శ్రీ ఆచార్యస్వాములవారు "రజతవత్ అవభాసతే" అని వ్యాఖ్యానము జేసిరి. అటుల గుర్తింపజాలని హేతువుననే "త్రాడు" అని తెలిసిన పిదప పాము ఎలావచ్చినది? అను విచారణలోనికిదిగి నానావిధ సిద్ధాన్తములుత్పన్నమైనవి. గాన యీ తెలియకపోవుట (అజ్ఞానము) కు కారణమేమో తెలి

యదు అని చెప్పునది వేదాన్తమే! "ఘటముం"డగా కూడ "ఉన్నది" మాయయే! సత్యమైనదికాదు. ఒక అసత్యమైన పనిచేత సత్యమైనపనిచేయునప్పుడు ఆ "సత్యమైన వస్తువువలె" కనబడునదిగూడ లేనిదే! అనగా మాయగావున్నది = నిజము కాకుండా నిజమువలె నున్నది కేవలము నామరూపాత్మకమే!

శ్లో॥ ఆదావంతే చ యన్నాస్తి వర్తమానేఽపి తత్తథా
వితథైస్సదృశాస్సంతోఽవితథా ఇవ లక్షితాః॥—

(గౌ. కారికలు—వైతథ్య. 6)

శ్లో సూచించునటుల "ఉన్నది + లేనిది" = ప్రపంచము. అనగా సత్తు (అస్తిభాతిప్రియం) + అసత్తు (నామ + రూపము) యివి రెండును కలిసిన రెండెట్లగును ? అయితే మనము నిజమని అనుకొనుచున్నాము. గనుక నిజమే! ఇదే మాయా; ఇక్కడనే అసంభావన, విపరీతభావనల కుద్భవము. అట్టి "మాయాశక్తిని" వశీకరించియే తాను త్రికాలము లందును ప్రకాశించుచుండునని భ.గీ. 4-6 లో.

"అజోఽపి సన్నవ్యయాత్మా భూతానామీశ్వరోఽపిసన్।
ప్రకృతిం స్వామధిష్ఠాయ సంభవామ్యాత్మమాయయా॥"

భగవంతుడే విశదపరచెను.

"ఖ్యాతి" (మనసు వేఱేయుండి, ఆ మనసుతో వేఱే యొక వృత్తిని తీసుకొనుట) "వృత్తి" (మనస్సనునది వేరే లేక పొరబాటున ఒకదానిని మరొకదానినిగ తలచుట) అనునవి రెండును తప్పనియు, విషయితోనే విషయము వచ్చుననియు, నేను ప్రమాతగా నుండుటచేతనే ప్రమేయములు గలుగుచున్నవనియు, ఈ రెండును కాకుండా "నేను"యున్నా

నని యు చెప్పునదే "అద్వైతము". అచ్చట ద్వైతమునకు సావ
కాశ మే లేదు. గాన మనసనునది లేదు; కేవలము 'అనుకొనుటయే!'
"నేను వ్రాయుదును" అని యనుకొను నపుడుండు ప్రవృత్తి
నేననుకొనకుండునపుడుండునా? గాన "నేను" అను "అవిద్యను"
అనుటయే అవిద్యగాని, వేఱు అవిద్యయని లేదు. గాన అధ్యాస,
అజ్ఞానము, అవిద్య, మాయా, భ్రాంతి, మిథ్య, మనసు, జీవుడు
ఇత్యాదిపదములన్నియు నామమాత్రమేయై అనుకొనుటకన్న
వేఱుస్థాయి గలవిగాక- ఆయా కార్యములందట్లుగ వ్యవహరిం
పబడుచున్నవి. (శ్రుతియును-మహానారాయణం. ఉ-ఖండ 58)
"అహమజ్ఞః... అనాది సంసారేతి భ్రమవాసనా బలాత్సంసా
రేన ప్రవృత్తిః" అని చెప్పుచున్నది. మరియు యీ "అనుకొను
టను" గూడ నొకస్థితియున్నది. భ్రమకాలమందు పాముగా
జూచుటయే! భ్రమవీడినతరువాత "అనుకొనుట" అయినది.
యథార్థముగ బొందబడిన కాలములో "అనుకొనుట" జరుగ
లేదు. చూచుటయొక్కటియే తటస్థించినది. "ఈపాము ఎటుల
వచ్చినది?" అను ప్రశ్న చూచినమీదటనే గాని, అనుకొనుట
చేతగాదు. అటులనే యీ ప్రపంచమున్నూ ఒక "నేనే"
యుండిన తాదాత్మ్యము లేదు. రెండవదగు మనస్సనుశక్తి నాకు
యున్నది. ఆ మనస్సు ప్రపంచాకారమును తీసుకునేయున్నది.
గాని "నా" ఆకారమును తీసుకొనలేదు. గాన మనస్సు
"నా" ఆకారమును తీసుకొనుటయే - "తెలియుట" - దీనినే
"మనసైవానుద్రష్టవ్యం" (బృహ. 6-4-19) శ్రుతి వ్యాఖ్యాన
ములో - "కేవలం మనో బ్రహ్మ విషయీకుర్వదపి శ్రవణాది
సంస్కృతం తదాకారం జాయతే - తేన ద్రష్టవ్యం తదుచ్యతే"
అని (శ్రీ) ఆనందగిరి స్వాములవారు శెలవిచ్చిరి. అనగా నాకు

తెలిసినది "నేను ఒకడనుగాదు. రెండవవాడునుగూడయున్నాడనే నాను తెలిసినది. ప్రపంచమనగా, సజాతీయ, విజాతీయ, స్వగత భేదము గలదను జ్ఞానమే నానున్నది. గాన నాను తెలిసినది యీ ద్వైతమే! అంతేగాని "ఉన్నది" ప్రపంచముగా వ్యవహరింపబడుచున్నదని మనకు తెలియనే తెలియదు. అది వేదమే చెప్పవలయును.

గాన యీ ప్రకారము "ఆత్మశక్తిః" "నియతః పారమేశ్వరీ" యనునట్లు ప్రసిద్ధముగ నెల్లరి యనుభవములోనుండియు "మాత్యసాం విశ్వమితి మాయా" అను నిర్వచనము ప్రకారము సకల జగన్నిర్మాణ సామర్థ్యముగలదైన దానియందు జగతుగ మితమై యున్నదగుచు, ఇట్టిదని నిర్ణయింప శక్యముగాని స్వరూపముగలదియై, "అనుట" చేతనే అభివ్యక్తమగుచు, అయస్కాంతములోని ఆకర్షణశక్తిని బోలుచు అవినాభావ సంబంధము గలదిగా ప్రవర్తించుచున్నట్లుండుటచేతనే సమయాసమయములలో "బోధనా కాలనుందు అనిర్వచనీయ మనియు (చెప్ప వీలులేనిది) తెలుసుకొనేకాలమందు అపహ్నవ మనియు (అసలే లేనిది)" అందువలన మిథ్యాభూతంబైన మాయాఖ్యంబే నగుననియు పంచపాదికాది గ్రంథములందును వర్ణింపబడినది. అయినను ముముక్షువుల కేనాటికైనను ప్రతి జీవిలోనున్న యీ శక్తి విచారణరూపమునను రాక తప్పదనియు వివరింపబడెను. అప్పుడేగాని "స్వవిమర్శో మోక్షః" యనునది సార్థకముగా నేరదు. ఇటులనే పరశురామాదులు ఉత్తీర్ణులైనట్లు పురాణప్రసిద్ధము.

మరియు శ్రీ సురేశ్వరాచార్యులవారును తమ నైష్కర్మ్యసిద్ధి యను ప్రకరణగ్రంథమున 3-66/110 శ్లోకము

లలో "యీ భ్రాంతి కేవలము నిరాధారమైనదనియు నాశకార్య మందున్న రేగుపండు చందంబు అత్యల్పనిమిత్తములవల్లనే నివారింపబడుననియు, అయినను దాని స్వభావప్రవృత్తిని ఎవ్వాడును అతిక్రమింప జాలడనియు ఉద్ఘోషించిరి. మరియు తత్త్వమస్యాది మహావాక్య విచారజనిత స్వరూప జ్ఞానసాన్నిధ్యమున యీ భ్రాంతిజ్ఞానము - సూర్యకాంతియందు అంధకారమెట్లు నిలువజాలదో యట్లు-యెంతమాత్రము నిలువజాలదు. గాన "జ్ఞానమే నా స్వరూపము"ను 'తెలివి'దక్క అధ్యాసలో జేరిన అనుభవాదులు సైతము శాంతి నొసంగని కారణమున "జ్ఞానాదేవ తు కైవల్యమ్" అనునదే శరణ్యము.
దీనినే వరాహోపనిషత్ నందు (2వ అధ్యాయం)

> అద్వైతే బోధితే తత్త్వే వాసనా వినివర్తతే ।
> ఆరబ్ధాంతే దేహహాని ర్మాయేతింతీయతేఖిలా॥

అని ప్రతిపాదించినపుడు మాయావాద మనునది కేవలము శాస్త్రార్థముయొక్క సాధనకాలములో వినియోగపడునదగుటచే నదియు గౌణమే నగుననియు-శాస్త్రార్థానుభవకాలమందు 'అజాత' మైనది యథార్థములో అద్వితీయ శుద్ధచైతన్యమేననియు స్పష్టమగుచున్నది.

ఓమ్ - తత్ - సత్.

## 12. అజ్ఞాన మెట్టుల వచ్చినది?

> శ్రు॥ సంకల్ప మనసీ భిన్నే నకదా చ న కేనచిత్
> సంకల్ప జాతే గళితే స్వరూప మవశిష్యతే॥
>
> (మహోపనిషత్)

పాశుపత బ్రహ్మోపనిషత్ లో సూచించినటుల

"వ్యవహారికదృష్టేయం విద్యాఽవిద్యానచాన్యథా।
తత్త్వదృష్ట్యాతు నాస్త్యేవ తత్త్వమేవాస్తి కేవలమ్॥

సజాతీయ, విజాతీయ, స్వగత భేదరహితమైన సద్వస్తువే, సర్వదా ప్రకాశించుచుండినను, అట్టి అద్వైత పరమాత్మ సాక్షాత్కారముబొందుటకు తనయందొక విమర్శన శక్తియుండక తప్పదనియు, అట్టి విమర్శనశక్తిద్వారా నేగాని యది అపగాహనము కానేరదని వ్యవహరింపబడుచున్నది. ఈ జ్ఞానము నిత్యప్రకాశమానమైనదగుటచే, నొకప్పుడు స్వకల్పిత బాహ్య పదార్థములయొక్క సంబంధము గలిగినదైనను నశించిన యావత్సంసారముగల దశయందు ఆత్మస్వరూపమునే యవలంభించునదగుచున్నది. అనగా తన ధర్మమైన(తెలివియనుప్రకాశమును) దేహేంద్రియాదులందును, అంతఃకరణాది మనోబుద్ధ్యాదులందును, యెల్లప్పుడును ప్రతిఫలించియే యున్నది. ఇదియే చైతన్యమనిగాని, జ్ఞానమనిగాని, 'అహం'అను ప్రత్యయముతో గాని,పిలువబడుచున్నది. గాన అక్కడనుండిబయల్వెడలు యావద్వృత్తులు చైతన్యవంతములయే పుట్టుచున్నవి. యదార్థమటులుండుటచేతనే "ఆత్మబోధ-కర్తృత్వమపిమే నిష్టం కర్తవ్యం వాపినక్వచిత్" లో వివరించినట్లు, అవిద్యా, కామ, కర్మఫల రాగాదులనెడి గొప్ప బరువుచే నాక్రాంతుడై నిశ్చయమైన దేహాత్మభావన కలవాడై దైన్యముచేత పరితపించు జీవుడుగ తానుండ దయాళువైన యొకానొకనిచే యోగమార్గముదెలుపబడి, ఉపాధిశూన్యుడగు నీశ్వరునిగను, సాక్షినిగను 'తననే' తెలుసుకొనుచున్నాడు. అయినను పెక్కులు అభక్తజనులు, స్వస్వరూపమును దెలుసుకొని నష్టము లేకపోవుటకు, శోభ

నాధ్యాసాధీనంబులగు (ఇదిమంచిదను భ్రాంతి) కామములను విడుచుటయందయిష్ట మనస్కులగుటయే యిందుకు కారణము. గాన అట్టి జ్ఞానాజ్ఞానముల (తెలియుట - తెలియకపోవుట) యొక్క వివరణ శ్రీ సదానందగిరిస్వామివారు చేసిన (బృ. 4-1-17) వ్యాఖ్యానుసారము నొకింత నిట విచారింతము.

ఒక కర్త - ఒక క్రియ యున్నంతమాత్రమున నది వాక్యముగాదు - ఎట్లు "దున్నపోతు యీనినది" యనునది నామకః వాక్యమేయైనను అర్థరహితముయినదగుటచే నదెట్లు అసమంజసమో యట్లు - అటులనే 'బ్రహ్మను అజ్ఞానమున్న దనిగాని, ఎటులవచ్చినదను ప్రశ్నలుగాని, కూడదవు! అయినను సద్గురు కృపచే 'తత్త్వమసి' మహావాక్యార్థము తెన్నగ బోధింప బడి శ్రవణముచేసిన పిదపగూడ, మనలను బాధించునదేమి ? నాకు అజ్ఞానము (తెలియకపోవుట) యెలావచ్చినది? ఎపుడు వచ్చినదనేగదా! గాన దానికి కారణము తెలుసుకొని ఆ కారణమును తీసివేసిన ఆ అజ్ఞానము పోవునని, ఆ అజ్ఞాన కార్యమయిన సంసారము మనకు యుండదని గట్టిగా యున్నది. అందుకొఱకే యీఅజ్ఞానమునుగూర్చిన ప్రశ్నలు. అయితే యీ అజ్ఞానము 'నేను' పుట్టినప్పటినుండి నాకు యుండనే యున్నది. అనగా నాకు తెలియకపోవుట నన్నుగుఱించి, ఇతరమును గుఱించి! అయితే మనకు మధ్యమధ్య గలిగెడు జ్ఞాన (తెలియుట) మేమిటి? అనగా ఒక వస్తువునుగుఱించి - గాన యీ జ్ఞానము యెప్పుడు దేనిని గుఱించి విచారించెదమో దానిని గూర్చిన విషయ జ్ఞానమప్పుడుగలుగును. గాన నన్నుగుఱించి నాకు 'ఉన్నదని' తెలిసిన యజ్ఞానమును గుఱించిగూడ విచారించగా ఆ అజ్ఞానముపోవును. నాకుయున్న 'అజ్ఞానము' జగత్తు

లోని సర్వవిషయములనుగూర్చి నాకుయున్న అజ్ఞానములోని భాగమే గాని అదిలేని భాగములేదు. అనగా నా అజ్ఞానములుండగా, నాకు గలిగిన యీ స్వల్పజ్ఞానములుగూడ ఆ అజ్ఞానములోనివే! గాన యీకలిగిన వ్యావహారిక జ్ఞానం 'జ్ఞానము' కాదు. కారణమేమన అది నాకుయున్న సహజా జ్ఞానముచే భ్రష్టయి(Vitiated)పోయినదగుటచే! దీనినే భ.గీ 13/11లో

అధ్యాత్మజ్ఞాన నిత్యత్వం తత్త్వజ్ఞానార్థ దర్శనమ్ ।
ఏతద్ జ్ఞాన మితిప్రోక్త మజ్ఞానం యదతోఽన్యథా॥

అనియొక ఆత్మజ్ఞానము గలిగిన తరువాత గలిగిన జ్ఞానముతప్ప తదితర జ్ఞానమంతయు అజ్ఞానమే యని తెలుపబడినది. ఏ యాటంబాంబునో గురించి తెలుసుకొని నంతమాత్రమున నాకు తెలియనిది ఇక లేక పోవుటగాదు. "విచారణలోనికివచ్చినాను" అని తెలియవలెను. అనగా స్తంభాదులనుగురించి విచారించుటగూడ అజ్ఞానములోనిదే! గాన "ఎదుట ఒక ప్రపంచమున్నది - అందరు వ్యవహరించుచున్నారు. అందులో నేనుగూడా వ్యవహరించుచున్నాను" అని "అనుకొనుటయే" అజ్ఞానము!

ఈ ప్రకారము 'సమ్యక్కల్ప్యతే అనేనేతి సఙ్కల్పః' అనునట్లు లెస్సగా గల్పింపబడుట లేక అనుకొని యగుట కన్న వేఱు దినచర్య లేదనే భావనను విమర్శించగలుగుటయే విరాగము. ఇట్టి విరాగము దృఢమైనకొలది స్వస్వరూపజ్ఞానం హెచ్చును. భ-గీ. 13/21 లో వివరించినట్లు, తాను కూటస్థానంగచిద్రూపుడైనను, తన్ను దెలియక, కార్యకరణ సంఘాతమే తానని, తదాత్మకుడై శరీరతాదాత్మ్యమునుబొందుట

చేతనే “స్వాస్థ్యమును” కోల్పోవుచున్నాడు. ఇట్టి నిరవయవమైన ఆత్మను, సావయవమైన బుద్ధ్యాదులను సంబధము కేవల మాధ్యాసికము. స్వాజ్ఞానముచేతనే గలిగినది గావున వివేక విజ్ఞాన ముదయించగనే తప్పక నివర్తిల్లును.

మరియు ‘నేనెవరిని’ యను ప్రశ్నలోనే నా “ఉనికిని” గూర్చిన సంశయము నాకున్నట్లు స్పష్టమగుచున్నది. అనగా ‘నేను’ యెవరినో తెలియని గోలయే! నేననగా పుట్టువాడను, చచ్చువాడను, అని గట్టిగా తెలిసిన ‘నేనెవరిని?’ యనుప్రశ్న కేస్థానము లేదు. అట్లు ప్రశ్న వేశినాననిన ‘నేను’ తప్ప తక్కిన సంశయములన్నింటిని విచారించవలసినదే! మరియు ఈ అజ్ఞాన మెందులకువచ్చినది?’ యని ప్రశ్నించునపుడు మన అభిప్రాయము, కార్యమైన అజ్ఞానమునకు కారణమేమి యనియేగదా! కార్యకారణ సంబంధముగలదియే ప్రపంచమగుటచే కారణము తెలియగానే మరల ప్రపంచమను యీ గొలుసులోనే పడునుగదా! అయితే మనకు కావలసినది—యీ కార్యకారణములకు కారణమేమిటనియేగాని, యీ కనబడుదానికి కారణ మేమిటి ? యనిగాదు. అయితే యీ ప్రపంచమునుగుఱించి అయిదురకముల ప్రశ్నలు గలవు.

ఏమిటి (Name)ఎక్కడ (Space)ఎట్లు (Causation) ఎప్పుడు (Time) ఎందుకు (Purpose) అనగా యీ జగత్తు ఏమిటి? ఎక్కడనుండివచ్చినది?ఎట్లావచ్చినది?ఎప్పుడువచ్చినది? ఎందుకువచ్చినది ? ఇవియే విచారణకు దిగిన ప్రతిమానవుని బాధించు ప్రశ్నలు. ఇట్టిది విచారించగా తేలున దేమనగా యీ అజ్ఞానము (పొరబడుట) యొక కార్యముగాదనియు,

"నేను" యను జ్ఞానము గలిగినప్పటినుండి యీ అభిమానము (అభి = towards, మానము = me అనగా నన్నుగురించి నాకు తెలియకపోవుటను యజ్ఞానము) ఉండనే యున్నది. అనగా "నేను" అనగానే నాకున్న జ్ఞానం "నన్నుగూర్చిన విలువతో (Value) సహా, నేనెవరినో గ్రొకరినని—నేను పురుషుడను, సుఖని-దుఃఖని, ఇత్యాదియని) అభిమానముతో గూడిన జ్ఞానమే నాకు యున్నది. అనగా ఏదో నన్నుగురించిన జ్ఞానమే నాకుతెలిసినదిగాని ఏ వేరియు లేకుండాయున్న నన్నుగురించి నాకేమితెలియదు. ఇదియే నాస్వభావమగుటచే యీ నాకుయున్న జ్ఞానమునుగూడ విస్మరించుటయే ముక్తి హేతువు. దీనినే శ్రు॥ "స్వవిస్మృతిర్మోక్షః" యని తెలుపుచున్నది. మహానారాయణోపనిషత్ ఉత్తరకాండ 5-అధ్యాయములో—

"అహం అజ్ఞః కించిదజ్ఞోఽహం.........నవిద్యతే"

వివరించినప్పుడు, అజ్ఞానము అనాది = కారణములేనిది గాన కార్యముగానిది అందువలన లేనిదగుటచే యేవిధమగుప్రశ్నకు నావకాశము లేదని స్పష్టము జేయబడినది.

మరియు "తెలియలేదు" యనిన యెట్లు తెలియలేదు? అను ప్రశ్నకు అర్థములేదు. తెలిసినదనిన్నచో "యెప్పుడు తెలిసినది, యెలా తెలిసినది? యిత్యాది ప్రశ్నలుద్భవించును. గాన అజ్ఞానము మనస్వభావము. ప్రయోజనములేనిది యొక కారణముచేతపుట్టదు. అటులపుట్టినది, మొదటనున్నది, యొక జ్ఞానముమాత్రమే! గాన జ్ఞానమే మన స్వరూపము గావలయును. అనగా "ఇది పటమని తెలుసుకొనుచున్నాను; ఇది

ఘటమని తెలుసుకొనుచున్నాను; ఇది ఏమిటో తెలుసుకొన లేకున్నాను" ఇత్యాది వ్యవహారమునందు, ఘట పటాదులు "తెలివి" యందు ప్రతిఫలించుటచేతనే తెలియబడుచున్నవని గ్రహింపనగును.

అయితే యీ అజ్ఞాన మెటులపోవును? అనునదే ప్రశ్న! అనగా యీ అజ్ఞానవు స్వభావమునిన్ని, అట్టిది పోవలయు ననిన్ని, మానవుని స్వభావము. అట్లుండుటకు కారణము, యీ అజ్ఞానము యొక్క బలవత్తరమైన చలనశక్తియే ననియు, (dynamic) స్థావరమైన స్థిరశక్తి (static) గాదనియు, గాన నదెల్లప్పుడు తొలుచుచునే యుండుననియు, విచారించిన కాల మందు మాత్రమే లేకపోవుననియు, గాన ఆచార్యోపదేశమే దానినితొలగించుట కేకైకశరణ్యమనియు దెలియకపోవుటయే! ఎట్లు నీటి నావరించిన నాచు, నీరు ముంచునపుడు తొలగి పోయి ముంచుటాగినంతనే తిరిగి యెట్లు పరవంజుకొనునో యట్లు — అనగా నా స్వభావము అజ్ఞానములోనుండుట, తరు వాత యెప్పుడీ యజ్ఞాన విషయము తెలుసుకొనుచుండుట, మరల అజ్ఞానములోపడుట, అనగా తెలియకపోవుట, తెలియ దనిగూడ తెలియకపోవుట, పైగా మరొకవిధముగాగూడ తెలియుట, మరల తెలుసుకొనుట, స్వస్వరూపజ్ఞానము గలిగి యుండుట, యిదంతయు నా స్వభావమే! అనగా నా స్వభా వము వస్తువు యెప్పుడు, యెలాకనబడితే దాని నా ప్రకారము గ్రహించుటయే! అనగా, వస్తువుయొక్క స్వరూప స్వభావముల రెంటిని లెస్సగా గుర్తించుటయే. ఇదియే సమ్యగ్జ్ఞానము. (గాననే ముముక్షువు నిరంతరము వేదాంతవిచారణ జేయుచునే యుండవలయునని 'ఆసుప్తేరామృతే, కాలం న యే ద్వేదాన్త

చిన్తయా'యని ఇత్యాదిగా స్మృతులయందు వినవచ్చుచున్నది) దీనినే భ.గీ 8/3 లో 'అక్షరం బ్రహ్మ పరమం స్వభావోఽ ధ్యాత్మముచ్యతే'యని వర్ణింపబడినది. గాన 'అజ్ఞాన' మనగా కేవలము తెలియకపోవుటగాదు- తెలియకుండాయుండి తెలుసుకొనవలెనిప్రయత్నించడమే — ఇట్టి అజ్ఞానకార్యమే జీవుడు. సూ. భా. 2-3-17 "నాత్మా శ్రుతేర్నిత్యత్వాచ్చ తాభ్యః" అను చోట జీవునకుత్పత్తి సంభవింపదనియు తెలియజేయుచు, అవికృతుడగు బ్రహ్మమునకే జీవ శబ్ద వాచకరూపమున ఉనికియు — బ్రహ్మ స్వరూప సత్యమును స్పష్టముచేయ బడుచున్నది. గాన నీ విభాగమంతయు బుద్ధ్యుపాధిగతమే! గాన మానవుడు తన నిజరూపమును గుర్తించగలిగినంతనే జీవేశ్వరులను విభాగమున కేయవకాశము లేదు.

భ-గీ. 14/27 "బ్రహ్మణోహి ప్రతిష్ఠాఽహ.....కస్యచ" వివరించినటుల, "యే యీశ్వరభక్తిచేత భక్తానుగ్రహాది ప్రయోజనముకొఱకు, బ్రహ్మము ప్రతిష్ఠతమగుచున్నదో ఆశక్తి బ్రహ్మమే 'నేను'—శక్తి, శక్తిమంతుల నన్యమగుట వలన- అనగా "బ్రహ్మ" శబ్దవాచ్యమగుటవలన సవికల్పకమే బ్రహ్మము. ఆ సవికల్పక బ్రహ్మమునకు నిర్వికల్పక బ్రహ్మమగు 'నేనే' ప్రతిష్ఠను- ఆశ్రయమును- ఎట్లు లోకమునందు, 'నీవు'-'నేను' అనునపుడు "అహంశబ్ద మిదంశబ్ద" ములకు శబ్దోపాధిచే జ్ఞాతృజ్ఞేయరూపమున భేదము దోచుచున్నను, విచారింపగ వానికర్థముచే నేకత్వ ముపపన్నమగుచు, ప్రత్యక్ష విరోధము గాన్పించదో అట్లు—తనయందును, అంతటను బ్రహ్మమాత్ర దర్శన లక్షణమగు భగవత్ప్రీతిప త్తిరూపమైన బ్రహ్మనిష్ఠయందెవడు ప్రతిష్ఠితు డగుచున్నాడో అతడే గుణ

మయంబును, గుణతత్కార్య, తద్వ్యవహారరూపంబును నగు మాయను, తత్ప్రిత్యయుల సంతతి (అవిద్యాదులను) నతిక్రమించి, విదేహ కైవల్య సుఖమును” బొందుచున్నాను. అదియే అద్వైతసిద్ధి. పాముగాకనబడినపుడుగాని, తిరిగి నిజరూపమగు త్రాడే నని తెలిసినప్పుడుగాని, యథార్థములో నున్న త్రాడు నందేమియు మార్పు జరుగకపోయినను, యీ వైపరీత్యమున కంతయు‘అనుకొనుటయె’గదా కారణము! మరియు స్వప్నము రావటము సత్యమైనను, స్వప్నానుభవము లెట్లు సత్యమో! అనగా “స్వప్నానుభవ శరీరాదు లెట్లు ‘అనుకొనుట’ చేతనే గలుగుచున్నవో అటులనే జాగ్రద్దశలోను” యని శ్రీ అచార్య స్వాములవారు తమ ‘ఆత్మబోధ’ యందు విశదము జేసిరి.

“అవిద్యకం శరీరాది దృశ్యం బుద్బుదవత్క్షరమ్
ఏతద్విలక్షణం విద్య అహంబ్రహ్మేతి నిర్మలమ్” ॥

గాన అజ్ఞానమును (అనుకొనుట) మనోరూపాధివల్లనే యీ సర్వ విభాగము యేర్పడుచున్నట్లు. స్పష్టము.

మరియు సృష్టి ద్వివిధము ఈశ్వర సృష్టి - జీవసృష్టి యని

శ్రు॥ “ఈక్షణాది ప్రవేశాంతా. సృష్టిరీశేనకల్పితా
జాగ్రధాది విమోక్షాంత స్సంసారోజీవ కల్పితః” ॥

అని మహోపనిషత్‌లో వర్ణించినటుల, శివ శక్త్యాత్మకమైన స్త్రీ, పురుష విభాగము ఈశ్వర ప్రేరితమైయుండ, భార్యా భర్తలను యభిమానము జీవసంబంధములై, జీవసృష్టియే బంధము గొల్పునదగుచున్నది. గాన యీశ్వరసృష్టి మోక్షమే! అయినను అట్టి విభాగము కేవల ముపాధికల్పితమగుటచే____
ఆధ్యాత్మోపనిషత్ లో

"మాయాఽవిద్యే విహాయైవ ఉపాధి పరజీవయోః
అఖండ సచ్చిదానందం పరబ్రహ్మ విలక్ష్యతే ॥ "

వివరించినటుల, ఉపాధిరహితమైన శుద్ధవిలక్షణునియందు బంధ మోక్ష ప్రసక్తియే లేదు. గాన యీజీవేశ్వర విభాగమునైతము కేవలము ఉపాధి కల్పితములే! దీనినే, శుకరహస్యోపనిషత్

" కార్యోపాధిరయం జీవః కారణోపాధిరీశ్వరః "

యని సూచించుచు,— ఎట్లు మనుజుని మొగుట నొకవైపున మంచి అద్దమును రెండవవైపున అనేక ముక్కలుగా పగిలిన అద్దము నుంచినయెడల, ఆ మనుష్యుని ప్రతిబింబము మంచి అద్దమునందు స్వచ్ఛముగను, పగిలినదానిలో ననేకముగను గోచరించుటయు, మనకందఱకు ననుభవవేకా అట్లు - యదాధారములో ప్రతిబింబమునకు కారణభూతమైన మనుజునియందు యెట్టి వికారములు గాన్పింపక బోయినను, ఉపాదులననుసరించి భిన్నభిన్నములుగా గోచరించుట లేదా? అటులనే 'అనుట' చేతనే 'అయినట్లు' భ్రాంతిజెందుటగాన " అనుట యను ఈశ్వరత్వము" గాని, "అనుకొనుట యను జీవత్వము" గాని ఉపాధిగతములే. (స్ఫురణమాత్రమే) అట్లు గుర్తించుటయే "అగుట" కాని, కానివాడు అప్పుడు నూతనముగా అగుట కాదు. గాన ఆనందావిర్భావమునకు (అనుకొనుట యను) మనో ఉపాధిఉపశమమే ముఖ్యావశ్యకముగాని, విషయములు లేకపోవుటగాదు. తప్పుగా అనుకొనినయెడల సంసారము; ఒప్పుగా అనుకొనిన కైవల్యము. అయితే యీ జ్ఞానాఽజ్ఞానములు రెండును యదార్థమైన తత్త్వముగాదు. యెందుకన, యీ తెలిసినప్పుడును, తెలియనప్పుడునుగూడ " నేను "

ఉండనేయున్నాను. సూ. భా 3-2-11 "నస్థానతోఽపిపరస్యోభయలింగం సర్వత్రహి" యనుచోట, యీ యుపాధివలన నైతము బ్రహ్మమునకు ఉభయలింగత్వము సంబంధింపదని స్పష్టము జేయబడినది. "అహం", త్వం, అయం, ఇత్యాది వికారములన్నియు తన్మాత్రలే! వ్యవహారమందు సత్యమే! తత్కారణమును గుర్తింపజేయుటకు ముఖ్యావసరమైనదే! గాని ఇవి కేవలము పురుషాపరాధ ధీషణము నివృత్త్యర్థమే యీ యుక్త్యాదులుగాని తదితర ప్రయోజనమేమియు గానరాదు.

గాననే "సర్వవ్యాపార ముత్సృజ్య అహంబ్రహ్మేతి భావయః
అహంబ్రహ్మేతి నిశ్చిత్య అహంభావం పరిత్యజ" ॥
అని తేజోబిందు శ్రుతి ప్రతిపాదించుచున్నది.

మరియు శాట్యాయని ఉపనిషత్ లోని

"మనఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః
బంధాయ విషయాసక్తం ముక్త్యైన్నిర్విషయం స్మృతమ్"॥

ఎట్లు నీటితోనింపిన పెద్దతొట్టెయడుగుభాగముననున్నరత్నము ఉపాధిస్థానీయమైన జలము తీసివేయగా ఉపశమించిన తొట్టియందు రత్నము బహుసులభముగా ప్రస్ఫుటమగునట్లు, గాఢ సుషుప్తియందు మానవుడు సకల వ్యవహారోపశమముచే ఎట్లు హాయినిబొందుచున్నాడో యట్టి ఆనందమునే జాగ్రతందును బొందవలెననిన, ఆందోళనకరమగు మనోపాధి సంబంధ విషయాభిమానము లేకుండుటయే యవసరము. అయితే యీ గాఢ సుషుప్తికాలపు హాయి కేవలము బీజావస్థయే యగుచు, కోరికలన్నియు ముకుళించియున్న స్థితియగుటచే, నవి తిరిగి ప్రబోధసమయమున పైకివచ్చుట తటస్థించుచుండుటచే, యీ

బొందెడి హాయి అభిమాన రహితమైన జీవన్ముక్తి సుఖానుభవమునకు సాటిరానిదగుటచే, మనకు స్వాభావసిద్ధమైన సకలాభిప్రాయములను విచారణ పురస్సరమైన శాస్త్రాచార్యోపదేశములచే సంస్కరింపజేసుకొని ప్రవర్తించుటయే ప్రథమ కర్తవ్యము. అప్పుడే శుకాష్టకములో వివరించినది

“ నిస్త్రైగుణ్యోపథివి చరితాంకోవిధిః కోనిషేధః ”

సార్థకమగుచు, “నిత్యసత్వస్థ”మను తన యదార్థస్థితిని గుర్తించిన వాడగుచున్నాడు.

ఓమ్ - తత్ - సత్

## 13. ప్రణవోపాసన - ప్రాశస్త్యము

శ్రు॥ యస్మిన్ ద్యౌః పృథివీ చాన్తరిక్షమోతం మనః సహ
ప్రాణైశ్చ సర్వైః। తమేవైకం జానథ ఆత్మానమన్యా
వాచోవిముంచథ అమృతస్యైష సేతుః॥ (ముం.2-2-5)

మాండుక్యాద్యుపనిషత్తులలోని ‘ఓమిత్యేతదక్షరమిదగ్ సర్వం’ (మాం 1-1-1); ‘ఏతదాలంబనం’ (కఠ. 2-17); ‘పరంచాపరంచ బ్రహ్మయదోంకారః’ (ప్రశ్న 5-2); ‘ఓమితి బ్రహ్మ’(తై.1-8); ఇత్యాదిశ్రుతులవలనను, ‘ఓమిత్యేకాక్షరం బ్రహ్మవ్యాహరన్మామనుస్మరన్’ (భ.గీ. 8-13) మొదలగు స్మృతులవలనను ‘ఓం’ కారమును బ్రహ్మవాచకముగాను ప్రతిమవలెను, ప్రతీకముగాను ‘ఉపాసన’ చేయవలయునని మందమాధ్యమాధికారులకు బ్రహ్మప్రతిపత్త్యుపాయముగా, నిరూపింపబడుచు, కాలాంతరమందు ముక్తిగలుగగలదనే

సూచింపబడినది. ఇట్లాదేశించుటలో, ద్వైతప్రపంచోపశమమే ప్రధానమై, దృశ్యమానమగు నీ సకల వాక్ప్రపంచమును, ప్రాణాది ఆత్మవికల్ప విషయమును 'ఓం'కారమేయని నిరూపించి వాచ్యవాచకాభేదమును గుర్తింపజేయుచు, శబ్దాద్యుపలక్షణా నర్హంబును, సర్వధర్మ విశేషవర్జితమగుటచే, నశక్యమతీంద్రియ గోచరంబునగు "బ్రహ్మమే" యేకైకలక్ష్యమని తెల్పుటయే! గాన కేవలము ప్రణవమును జపించుచు యందు వలన గలుగు నాయా స్వల్పఫలములతో తృప్తిజెందక, 'ఉపాసన' యను 'అర్థపరిశీలన' గావింపనిదే శాఖాచంద్ర న్యాయముగ నిర్దేశింపబడిన యీవిధానము పూర్ణప్రయోజన కారి కానేరదు.

ప్రు॥ "ప్రాణాంత్సర్వాన్పరమాత్మని ప్రణామయతీతే తస్మాత్ప్రణవః" (అథర్వశిఖోపనిషత్) అనువాక్యము సూచించు నటుల "అనుటయు" పూర్వము అగోచరమై అనుటతోనే యావిర్భవించి, శాఖోపశాఖలుగా, మధ్యమాది రూపంబులం బొందిన యనంతశబ్దసముదాయమును తిరోభావముగావించగా నేర్పడిన ప్రథమావస్థయే సర్వరక్షాకరమైనదియై, మిక్కిలి స్తోత్రార్హమైనదిగా పరిగణింపబడుచున్నది.

అట్టిది 'అ'కారముతో మొదలయి, త్రిమాత్రాయుతమై ఏకపంచాశద్వర్ణాత్మకమునకు బీజభూతముగ ప్రజ్వరిల్లుచున్నది. అది వర్ణాత్మకమే యైనను నాశముకాని వస్తువును తెలుపున దగుచు, భూతభవిష్యద్వర్తమాన కాలమునందు తేజరిల్లు చుండినదగుటచే- ఎట్లు 'ఇది స్తంభముకాదు' అను నప్పుడును, 'ఇది స్తంభము' అనునప్పుడును, కార్యమైన స్తంభమునకును అసలు అధిష్ఠానమైన ఇదికిని, సంబంధము "కాదు" అనున

నెటులనో, యట్లే ప్రపంచమునకును, దానిని దాటినదానికిని ఓమ్ అనునదే అవధియగుటచే-నెంతయు విమర్శనీయము. గాన "ఓమ్" అనగా "కాదు" అని నిర్వచింపనగును. అనగా "ఓమ్" వాచ్యార్థమున అవరమగు ప్రపంచ విస్తృతిని, లక్ష్యార్థమున నిషేధావధియగు పరమునుగుర్తింపజేయు వారధి స్థానీయమగు చున్నది.

అదెట్లనిన "అస్మత్"లోని "స్మత్"ను, "యుష్మత్" లోని "ష్మత్" యను ప్రత్యయములను తీసివేయగా, మిగిలినవి "అ" - "ఉ"లేగదా! ఇవి "ష్మత్" యను ప్రత్యయము (జ్ఞానము) వల్లనే గుర్తింపబడుచున్నది. గాన ప్రపంచములో నున్నవి రెండురూపములు "అ" (నేను) "ఉ" (నీవు) అనగా "నీవు" అని చెప్పబడువిషయము, "నేను" అని చెప్పబడు విషయముగల విషయి. ఈ రెండు రూపములకు (అనగా విషయి—విషయములగు అ-ఉ లకు)"మ"=కాదు, చేర్చగా నేర్పడు "ఓమ్" అనుదానికి "నేను నీవు కాదు"అనియే చెప్పబడుచు "తత్త్వమసి" యను యుపదేశవాక్యము వెలయు చున్నది.

గాన "ఓమ్"అనియు, "తత్"అనియు, "సత్"అనియు నిర్దేశింపబడిన ఆ పరబ్రహ్మమే జగత్కారణ మగుటచే నతి ప్రసిద్ధమగుటవలనను, అవిద్వాంసులకు బరోక్షమగుటచే - తత్ యనియు, పరమార్థ సత్త్వ సాధుత్వ ప్రశస్త్యాదులచే - సత్ యనియు ప్రశంసించబడుచున్నది.

అట్టి "ఓమ్" పదవాచ్యము పరాఽపరాలంబనమై విరాజిల్లుచుండుటచేతనే పరమహంసాది విజ్ఞానవంతు లహర్నిశములు తమ యుత్థానావస్థయందు దానిని స్మరించుచు

స్వాస్థ్యమును బొందగలుగుచున్నారు. ఇదియే హ్రస్వ-ప్లుత-దీర్ఘోచ్చారణలను భేదమున నాదరూపమును దాటిన బ్రహ్మానందము నొనఁగూర్చుచు, సహజసమాధిని గలిగించుట కనుకూలించును. దీనినే వశిష్ఠభగవానులు

"సాంఖ్యాదయోఽపిహంసాః సదాప్రణవ సంస్థితాన్ ।
నాదోపరిమహాదేవం పశ్యన్తి జ్ఞాన చక్షుషా"॥

అని "పరమేశ్వరుడు బిందునాదాత్మ"క మనుచో టశెలవిచ్చిరి.

గాన యీ కనబడు దృశ్యప్రపంచమంతయు సత్త్వరజస్తమో గుణాత్మక త్రిమాత్రాయుతమై మాయాయత్తమై "అ"కారాది "క్ష"కారాంత ఏకపంచాశద్వర్ణమయమైన "అక్ష" రాఖ్యమైనదే యగుటచే నిస్సారమేయైనను - (గోపాలతాపినుపనిషత్) శ్రుతి—

"అస్తిభాతిప్రియం రూపం నామచేత్యంశపంచకమ్ ।
ఆద్యత్రయం బ్రహ్మరూపం జగద్రూపంతతోద్వయం"॥

లో చెప్పినటుల శక్తివంతమై త్రిగుణాత్మకమైన విలాసమున రమణీయముగ భ్రమగొల్పుచుండును. అట్టిదానినిజస్వరూపము గుర్తించుటకు "ఓమ్" పదవాచ్యమైన శబలస్థితిని శాస్త్రాచార్యోపదేశమున బోధింపబడినవారై అర్థపరిశీలనారూపమైన విచారణయందు ప్రవేశించనిదే యేనాటికిని జీవన్ముక్తి సుఖమనుభవము గాజాలదు. అటుల యథార్థస్థితిని గుర్తించగలిగి విదేహకైవల్యమను పరమోత్కృష్టశాంతిని బొందగలుగుటకే ప్రణవోపాసన మిక్కిలి సన్నిహితసాధనగ విరాజిల్లుచు అధికారానుభేదమున ఫలమొసంగుచుండునని గ్రహింపనగును.

ఓమ్ - తత్ - సత్.

# 14. అజపాగాయత్రీ.

శ్రు॥ బీజాక్షరం పరం బిందు నాదం తస్యోపరి స్థితమ్ ।
సశబ్దశ్చాక్షరే క్షీణే నిశ్శబ్దం పరమంపదం॥

(ధ్యానబిందూ,ఉ॥)లో సూచించినటుల 'అపరా'విద్య నామాఖ్యంబగు శబ్దబ్రహ్మము నతిక్రమించిననేగాని, నిర్విశేషమగు పరబ్రహ్మమును బొంద నలవిగాదని తెలియుచున్నది. అట్టి దానిని గుర్తింపజేయు విద్యయే 'పరా'విద్య యనియు, నిట్టి పరాఽపరావిద్యలు రెండును బ్రహ్మవిదుల కనుభవమే ననియు, ముండక శ్రు॥ 1-1-4.

"ద్వే విద్యే వేదితవ్యే ఇతి హస్మయద్బ్రహ్మవిదోవదన్తి" స్పష్టము చేయుచున్నది. ఇట్టి పరాఽపరవిద్యల కాలంబనముగ 'ప్రాణాంత్సర్వాన్పరమాత్మని ప్రణామయతీత్యేతస్మాత్ప్రణవః' అను "ప్రణవోపాసన" — "ఓమిత్యేకాక్షరం బ్రహ్మ" అని వర్ణించుచు - అగ్నియే దేవతగాను, బ్రహ్మయే ఋషిగాను, గాయత్రియే ఛందస్సుగాను, పరమాత్మయే స్వరూపముగాను సాయుజ్యమే వినియోగముగాను నిరంతరము జపించనగు ననియు, అట్టివారికి సర్వపాపములు హరించుటయేగాక, అంతఃకరణశుద్ధియు, (అవిద్యాతత్కార్య దేహేంద్రియాదికమగు సితరమునందు నేను - నాది అనునది మొదలగు నసత్ప్రత్యయములను, తత్కారణములైన వాసనలను నిశ్శేషనివృత్తి) గలిగి, తద్వారా సర్వపరిపూర్ణమైనదియు, సృష్టి స్థితి లయ కారణమైనదియు, శ్రేష్ఠమైనదియు అనగా కోరతగినదియు, అజ్ఞానమను చీకటిని పోగొట్టునదియు, సచ్చిదానందాత్మక స్వయంజ్యోతిరూపమైన యేపరబ్రహ్మ తేజస్సుగలదో యందే

పర్యవసానమగునట్టి గలుగగలదని ప్రతిపాదింపబడినది. ఇదియే పూర్ణగాయత్ర్యనుష్ఠాన ఫలము - గాని దీని యనుష్ఠానమందు మాత్రము, శీఘ్రఫలకారియగుటకు, త్రైవర్ణికులకును వేర్వేఱు విధములుగా నీ కలియుగమునందు నిర్ణయింపబడి నటుల శాస్త్రదృష్టాంతము. అందు "ఓం" అను ప్రణవపూర్వకముగా బ్రాహ్మణులును, "శ్రీం" అను లక్ష్మీబీజపూర్వకముగా క్షత్రియులును, "ఐం" అను సరస్వతీ బీజపూర్వకముగా వైశ్యులును అనుష్ఠింపనగునని చెప్పఁబడినది.

ఇట్టి గానము జేసినవారికి "గాయంతం త్రాయత ఇతి గాయత్రీ" యను నిర్వచనానుసారముగా తనను జపించిన వారికి సమస్తమును తెలియజేయుచు, రక్షించునని స్పష్టము చేయబడినది. ఛాందోగ్యశ్రుతి 3-12-1 యును "గాయత్రీ వా ఇదగ్ సర్వం భూతం" ఈప్రత్యక్షాదివిషయమైన స్థావరజంగమ రూపమగు భూతసముదాయమంతయు వాగ్రూపముగనున్న గాయత్రీ స్వరూపమేనని దృఢపరచుచు సూ. భా. 1-1-24 "జ్యోతిశ్చరణాభిధానాత్" అను వాక్యవివరణ సందర్భమున "గాయత్ర్యనుగతమైన బ్రహ్మముయొక్క విభూతిప్రపంచమంత పరిణామము గలదనియు, పూర్ణబ్రహ్మమన్ననో ప్రపంచము కంటె నధికుడనియు అది తనయొక్క యేకాంశముచే ప్రపంచ మంతయు నాచ్ఛాదించుచున్నదనియు (భ॥గీ॥ 10-42)మిగిలిన మూడంశములుగల అమృతస్వరూపముచే తాను స్వప్రకాశ రూపముగనే యుండెననియు తెలుపబడెను." అటుల తెలుప బడుటచే చతుష్పదమగు బ్రహ్మమునకు ద్యుసంబంధరూప మను త్రిపాద్విభూతియేది అమృతమని చెప్పబడినదో అదియే పరబ్రహ్మయని చెప్పబడుచు ఉపాసకులచే, ద్యుసంబంధముచే

హంసవాలు పట్టుబడుచున్నదని స్పష్టము. దీనినే యోగచూడా మణ్యుపనిషత్ లో

"సకారః ఖేచరీ ప్రోక్తా స్త్వంపదం చేతి నిశ్చితమ్
హకారః పరమేశస్స్యాత్తత్పదం చేతి నిశ్చితమ్"

'విసర్గ' (శక్తిః)రూపమగు'స'కార వాచ్యుడైన జీవుడు 'త్వం' పదముచేత జెప్పబడుచు, "బిందు" (శివః) రూపమగు "హ" కారవాచ్యమైన బ్రహ్మము "తత్" పదముచేత చెప్పబడుచు నీ రెంటికి నైక్యము "సకారోధ్యాయతే జంతుర్హకారో హి భవేద్ధ్రువమ్" అని జీవుడు తదేకదీక్షతో ధ్యానముజేయగా భ్రమర కీటన్యాయముగా - "హంస శ్శివస్సోహం" బ్రహ్మమే యగు చున్నాడు అని వర్ణింపబడెను. మరియు 'హంసహంసాయ విద్మహే పరమహంసాయ ధీమహి తన్నో హంస ప్రచోదయాత్' అను మంత్రవర్ణమునను ప్రతిభూతహృదయమునుండి వెడలుచు జీవబ్రహ్మైక్యమును తెలుపుచునే యున్నదని చెప్పబడెను.

ఇట్టి జ్యోతిస్స్వరూపోపాసనయందు 'ప్రజ్ఞానంబ్రహ్మ' యిత్యాది మహావాక్య మంత్రానుష్ఠానముద్వారా 'హంస ఋషిః, అవ్యక్తగాయత్రీఛన్దః, పరమహంసోదేవతా, హం బీజమ్, సశ్శక్తిః, సోహం కీలకమ్' అని అంగన్యాసకరన్యాస పూర్వకముగా జపించుటలో వాగ్రూపముగానే బాహ్యమునను గోచరించినను ఉచ్ఛ్వాసనిశ్శ్వాసస్వరూపముగా

"అథో నాద ఆధారాద్బ్రహ్మరన్ధ్ర పర్యంతం
శుద్ధస్ఫటికసఙ్కాశం స వై బ్రహ్మపరమాత్మేత్యుచ్యతే॥
(హంసోపనిషత్)

సర్వదా నాదము హంసరూపముగా సహోరాత్రులు 21600 మారులు సంచరించుచునే యున్నదని యెవడు సద్గురుకరుణచే గుర్తించగలుగునో ఆ ప్రాజ్ఞుడు "పరమహంస" ప్రీతిని బొందుచునేయున్నాడు. ఇట్టి మహాశక్తియుతమైనది సహజముగానే యుచ్చరింప బడుచున్నట్లుండుటచే ప్రయత్న పూర్వకముగ జపింపనక్కఱలేనిదగుచు 'అ-జపా' (న+జపా) గాయత్రీ యను సాంకేతమునను, భ॥ గీ॥ 9-10 లో చెప్పిన స్మృతి ప్రకారము

"మయాఽధ్యక్షేణ ప్రకృతిస్సూయతే సచరాచరమ్ ।
హేతునాఽనేన కౌంతేయ జగద్విపరివర్తతే॥ "

'దృశి కర్మత్వాపత్తి నిమిత్తముగ' జరుగుచుండిన జగత్తు యొక్క సర్వప్రవృత్తికి సాక్షీభూతుడై కేవల నిర్గుణుడేయైనను, యెవరి సామర్థ్యముచేత నీచరాఽచర సహితము అనవరతము వివిధముగా జరుగుచున్నదో, అట్టి స్వకీయ 'మాయాఖ్యంబైన శక్తిని' గలవాడయి దాని నధిష్ఠించినవాడగుచు గుర్తింపబడుటచే- (తై. నారాయణీ 4-10-5) శ్రు॥ 'అజామేకాం లోహిత శుక్లకృష్ణాం బహ్వీం ప్రజాం జనయంతీం సరూపాం' అని— అజ+పా (ప్రకృతిని పాలించువాడుగను) గాయత్రీ అను సాంకేత నామమున -ఉభయత్రా అది సార్థకమగుచునే యున్నది. శ్రీ విద్యారణ్యస్వామియు దీనినే "హంగ్సశ్శుచిష ద్వసురన్తరిక్ష......ఋతం బృహాత్" అనుచోట వ్యాఖ్యానము చేయునపుడు 'అజ్ఞానిదృష్ట్యా జగద్రూపేణ భాసమానం సర్వం జ్ఞానదృష్ట్యా బ్రహ్మైవేత్యర్థః" అని శెలవిచ్చిరి. కాన ఈ ప్రకారముగ

"యథాఽగ్నిర్దారుమధ్యస్థో నోత్తిష్ఠేన్మథనం వినా
వినా చాభ్యాసయోగేన జ్ఞానదీపస్తథా నహి॥"
(యోగకుండలి-ఉ)

సర్వభూతాశ్రయముగనున్న ఆ పరమాత్మ విచారణ కర్తవ్యము లగు సాధనాంతరములచే తెలియబడనిదనియు, స్థిరమైన బుద్ధిచేత విశుద్ధాంతఃకరణులొక్కరే పొందగలుగుచున్నారనిన్నీ స్పష్టము జేయబడినది. దీనిని గురించియే ధ్యానబిందూపనిషత్ లో

"అజపా నామ గాయత్రీ యోగినాం మోక్షదా సదా।
తస్య విజ్ఞానమాత్రేణ నరః పాపైః ప్రముచ్యతే॥
అనయా సదృశీ విద్యా చానయా సదృశో జపః।
అనయా సదృశం పుణ్యం న భూతం న భవిష్యతి॥"

చెప్పుచూ నిదియే పరమపదమునుబొందుట కేకైక మార్గమని సూచించిరి. కావున చరమవిద్యయని 'శ్రీ విద్య' యొకటియే ప్రశంసింపబడినను యీ 'అజపాగాయత్రి' యనున దెంత మాత్రము నిరసింపబడక జీవబ్రహ్మైక్యానుసంధానయోగమున మిక్కిలి సన్నిహితసాధనగ పరిగణింప బడుచున్నదనుటలో సందేహములేదు. ఓమ్ - తత్ - సత్.

## III. "నేతి నేతి"తి నకారద్వయ వివర్శన

శ్రు॥ నేతి నేతీత్యాత్మా గృహ్యోనహి గృహ్యతే,
అథాత ఆదేశో, నేతి_నేతి" (బృ॥హా॥ 4-3-6.)

తే॥గీ॥ జాతి, గుణ, రూఢ మాదియా ♦ శబ్దమొకటి
ఇంద్రియాతీతమగుచును ♦ నేది గాని
దాని నేరీతివర్ణించు ♦ ధరణిలోన?
ఒక్క "ప్రతిషేధము"నగాదె! ♦ యొప్పుచుండు॥ 1

తే॥గీ॥ రెండుసార్లును 'నేతి'ని ♦ విడువకుండ
శాస్త్రమెప్పుడు బోధించు ♦ సరళి జూడ
ముందు 'దృశ్య నిషేధంబు' ♦ మొదలు జేసి
'అనాత్మవాదము' గాదను ♦ టనుటగాదె!

తే॥గీ॥ దృశ్యమొక్కటె గాదని ♦ తృప్తి జెంద
'ద్రష్ట' భావన సైతంబు ♦ ధర్మమనుచు
'నిర్గుణం'బను శ్రుతి నెంతొ ♦ సిరసింప
'ధర్మవివరణ' సేయుటె ♦ మర్మమిచట!

తే॥గీ॥ "అనాత్మవాదను" పేరొంది ♦ "ఆత్మశక్తి"
ధర్మమయినట్లు సతతంబు ♦ తనరుచుండ
శక్తి, తత్త్వ - విలాసంబు ♦ సాంత మెఱిగి
త్రోసివేయుమి, నేతి ♦ తుష్టిగాంచు?

తే॥గీ॥ అటుల 'ధర్మంబె' జీవుడై ♦ యట్టెయుంటి,
నటులనున్నంత కాలంబు ♦ నదియుగూడ
త్రోసివేయుచు, తనరూప ♦ మసలు 'ఏది
కాదు, కాదని' చెప్పక ♦ గతులు గలవె!

తే॥గీ॥ ఇంత యేలనో! "యున్నది" ♦ యింపుగాను
"కార్యకారణమేమియు ♦ గాదటంచు"
తెలియ జెప్పనె, ప్రతిషేధ ♦ మిలను వెలయ
రెండుతడవలు "కాదన" ♦ కుండు టెటులొ?

తే॥గీ॥ అటుల ప్రతిషేధమొనగూర్ప ♦ "నాత్మదృష్టి
"విధిముఖంబున" విజ్ఞాన ♦ విలసితముగ
"ఆత్మకన్నను వేఱొక్క ♦ టసలదేమి లేని"
స్థితిగూడి స్వాస్థ్యంబు ♦ గనదె భువిని.

# మహావాక్యచతుష్టయమును ఏకార్థబోధకములె

శ్లో॥ సత్తామాత్రం, చిత్స్వరూపం, ప్రకాశం, వ్యాపకం తథా
ఏకమేవాద్వయం బ్రహ్మ, మాయయాచచతుష్టయమ్॥
(గోపాలతాపినీ—ఉప)

శ్లో చెప్పినటుల, "ఉన్నవస్తువు" స్వతః పరిపూర్ణమై, సజాతీయ, విజాతీయ, స్వగత భేదరహితమైనదేయైనను, ఉపాసకుల నుద్దేశించి, 'అస్తిత్వ గ్రహణమునకై' నామరూపాత్మకమైన ఉపాధులను కల్పించి, బోధింపబడుచున్నట్లుస్పష్టమగుచున్నది. అట్టిది నిర్గుణమేయైనను, స్వకీయమైన సామర్థ్యముచేతనే ధర్మాధర్మంబుల నెఱింగించుచు, పారంపర్యముచేత నభ్యసింప బడుచున్నందున అదియే 'వేద' శబ్దముచేత చెప్పబడుచున్నది. అట్లగుటచేతనే, అన్నపూర్ణోపనిషత్ లో చెప్పినట్లు—

" ఆభాసమాత్రమే వేదం నసన్నాస జగత్రయం ।
ఇత్యస్య కలనాత్యాగం, సమ్యక్ జ్ఞానవిదుర్బుధాః॥"

అని పరిహరింపబడుచున్నది. అయినను వ్యవహారకాలమందు,

(మాం-వైతథ్య 31)

"స్వప్నమాయే యథాదృష్టే గంధర్వనగరం యథా
తథా విశ్వమిదం దృష్టం వేదాంతేషు విచక్షణైః"

అని చెప్పినట్లు, స్వప్నతుల్యమేయైనను, యదార్థమును గుర్తించు పర్యంతమును,ఆధారాధేయములుగ భాసించుచున్న యీ సర్వవిస్తృతికిని, తగినట్లు విలువుంచక తప్పదు. అట్లొసంగిననేగాని శ్రుతి ప్రతిపాదితమైన "స్వాస్థ్య" మనుభవమునకు రానేరకున్నది.

నానా వాక్యార్థభేదములైన ఆ "పరవస్తువు" వేదైక గమ్యమే యగుటచే అట్టి లక్ష్యార్థమును స్మరింపజేయుటలో, త్రిమాత్రాయుతమగు "ఓం కార"మును, త్రిగుణాత్మకమగు "పురుషసూక్త"మును, వేదత్రయ స్వరూపమగు "ఋక్"ను, పశ్యన్త్యాది వైఖరీరూపమగు "పరాబిందు"వును, జ్ఞానేచ్ఛాక్రియా శక్తిరూపమగు "పరాశక్తి"యు, త్రేతాగ్నిరూపమగు "సంవర్తకాగ్ని"యు, త్రిలోకరూపమగు "సోమలోక"మును, విరాట్ హిరణ్యగర్భాదుల రూపమగు "చైతన్య"మును, విశ్వతైజస ప్రాజ్ఞరూపమగు "తురీయ"మును, త్రేత, ద్వాపర, కలిరూపమగు "కృత"మును (ఛాం4-3-8), భూత, భవిష్యద్వర్తమాన రూపమగు "కాలం"బును, శ్రవణమనన నిదిధ్యాసరూపమగు "సమాధి"యు, వర్ణాశ్రమాదుల రూపమున "బ్రాహ్మణ" "సన్యాసా"దులును, ఇత్యాద్యనేకముగ విభజింపబడి; పరమావధిగా ప్రశంసింపబడుచున్నను, విభాగములగు కార్యజాత మంతయుః "వికారో నామధేయం" అనునట్లు నామమాత్రమే యగుటచే, (భ. గీ. 4-13)

"తస్యకర్తారమపిమాం, విద్ధి అకర్తార మవ్యయమ్" ప్రకారము

"సత్యస్యసత్యం" అనునదే పారమార్థిక స్వరూపము.

అటులనే (1)గురూపదేశ వాక్యమయిన, సామవేద ఛాందోగ్య "తత్త్వమసి" మహావాక్యమున్నూ, (తా॥ "నామరూపములు, సజాతీయ విజాతీయ స్వగతభేదములేని, యే సద్వస్తువు సృష్టికి ముందున్నదో, యా సద్వస్తువే, నామరూపములును, భేద త్రయము గలిగిన సృష్టియైన తరువాతగూడ "తత్" అనుపద ముచే చెప్పబడుచు, సృష్టికి పూర్వమందున్న ఆ సద్వస్తువే

తనయందు గల్పింపబడిన ఉపాధులందు ప్రవేశించి 'త్వం' అను పదముచే చెప్పబడుచు, భాగలక్షణలచే నుపాధులను బరిత్యజింపగా నున్న 'బ్రహ్మము' నొక్కటే 'తత్త్వమసి' అను మహావాక్యముచే బోధింపబడుచున్నది.")

(2) శిష్యుని అభ్యాసమున కనుకూలమగుచు, యజుర్వేదాంతర్గత బృహదారణ్యక 'అహం బ్రహ్మాస్మి' అను మహావాక్యమున్నూ,

(తా॥ "అంతటను నిండియున్న బ్రహ్మమే యీ దేహమందు బుద్ధి వృత్తులకు సాక్షియై, వాని నెఱుంగుచు, ప్రకాశించుచుండి, నేనను పదముచే జెప్పబడుచున్నది. నే ననగా 'ఆ బ్రహ్మమే' కాని దేహాదులు కానేఱవు. ఒక దేహమందుండుటచే నా బ్రహ్మము నేనని చెప్పబడుచున్నది. బ్రహ్మమనగా స్వాభావికముగా సర్వ పరిపూర్ణమైనదగుటచే నేనే బ్రహ్మను.")

(3) అనుభవాత్మక మయిన, అధర్వణవేద మాండూక్య 'అయమాత్మా బ్రహ్మ'. యను మహావాక్యమున్నూ,

(తా॥ "బ్రహ్మమే యహంకారాది దేహాన్తమైన ప్రపంచములో నుండుటచే ప్రత్యగాత్మ యనియు, 'ఆత్మ' యనియు చెప్పబడును. జగత్తు కధిష్ఠానమైనది బ్రహ్మము. అదియే తనయందారోపింపబడిన జగత్తులో ప్రవేశించి, ప్రత్యక్షమును, స్వప్రకాశమును అగుటచే ప్రత్యగాత్మ యనబడెను. గాన ప్రత్యగ్బ్రహ్మలు వేఱుగావు.")

(4) ఏకార్థబోధకములేయగుచు, స్వపరిపూర్ణ బ్రహ్మస్వరూపము ప్రశంసింపబడిన, ఋగ్వేద ఐతరేయోపనిషత్ 'ప్రజ్ఞానం బ్రహ్మ' యను మహావాక్య ప్రతిపాదిత,

(తా॥ "సంకీర్ణమానమైన చైతన్యమే యంతఃకరణ వృత్తులంగూడి బాహ్యేంద్రియములద్వారా వ్యాపించి యాదృశ్యవిషయములను, తెలుసుకొనుచున్నది. ఆ తెలివియే ప్రజ్ఞానమనబడును. సమస్త భూతములందును చైతన్యమొక్క- టిగనే యున్నది. సమస్త భూతములందున్న యా చైతన్యమే బ్రహ్మము. అకారణమున ప్రజ్ఞానమని చెప్పబడు నాయం దున్న చైతన్యమును బ్రహ్మమే యగుగాని వేఱుగాదు.")

విలక్షణముగ సూచింపజేయుచున్నవై విలసిల్లుచున్నవి. అదెట్లనిన, 'ప్రజ్ఞానం బ్రహ్మ' యను దానివలన, సర్వజ్ఞేయ పదార్థములనుండి జ్ఞానస్వరూపుని గ్రహించుటయే, ప్రకైకలక్ష్య మగుచు, "తత్త్వమసి"-"అహంబ్రహ్మాస్మి" అను రెండు మహా వాక్యములచేతను, అంతర్ముఖుడైన స్థితియందు, సర్వనిషేధా వధిగా తన స్వరూపమును గుర్తించుటయైయై, "అయమాత్మా బ్రహ్మ" యను దానివలన, జ్ఞేయజ్ఞాన విభాగములలో నిక్కడ చెప్పబడిన జ్ఞేయము సన్నికృష్ణమైనదగుటచే "సః- అయం" అనువానియందున్న భేదమువలె పరోక్ష, అపరోక్ష విభాగము ననుసరించి బోధింపబడినవే! గాన 'ప్రజ్ఞానంబ్రహ్మ' యను దానిలో సూచితమగు అర్థమునే, 'అయమాత్మా బ్రహ్మ' యను దానివలన కూడ తెలియ జేయబడుచున్నది.

దీనినే సామాన్యముగా, 'తత్త్వమసి' యను దానివలన "అది నీవే కూడా"ననియు "అహంబ్రహ్మాస్మి" యను దానివలన అదే నేను కూడా' ననియు 'అయమాత్మ బ్రహ్మ' యను, దానిచే, 'అదే వాడుయున్నా' అని యు గురువు శిష్యునకు తెలియజేయుచు ప్రథమ - మధ్యమ - ఉత్తమ పురుషగా

నర్ణింపబడు నేను - నీవు - అది (వాడు - ఆమె = He,She It) అను జీవేశ్వరజగములు పూర్తిగ చెప్పినను బ్రహ్మ మేనియు నిరూపించుచు, జ్ఞానాజ్ఞానముల కతీతమై, సర్వ వ్యాపకమైనదే; "ఆ సద్వస్తువు" అని గుర్తింప జేయుట కాలం బనగా, నీ మ హా వా క్య చతుష్టయము బోధింప బడుచున్న దనియు చెప్పనగును. మరియు" నేను-నీవు-అది" అనునవన్నియు నామములు కేవలదా (సర్వ నామములు = Pro-inplace of. Nouns: 'SAT', Pro-nouns) శ్రుతియును ఐత 3-1 లో "ఇతి సర్వాణ్యేవైతాని ప్రజ్ఞానస్యనామధేయానిభవన్తి" అని బోధించుచున్నది.

గాన యీ ప్రపంచములోనున్నవన్నియు ఒకదాని కొకటి సహకారిగా నుండినప్పటికిని, ఏక కారణమునుండి యుద్భవించి, లయించు చున్నవనియు, స్వరూపముగానున్న వానివలెనుండినందున, యీ సర్వము ఏకమే గానగునని గ్రహించనగును. మ రి యు నిది ఆగమ ప్రధానమైనదిగాన శ్రవణాత్మకమైన విచారణ పూర్వకము గానేగాని గుర్తింపబడ నేరదను నదియు సుస్పష్టము.

ఓమ్-తత్-సత్

## 16 షడ్దర్శనముల ప్రతిపత్తి

శ్లో॥ దుర్దర్శమతి గమ్భీర మజంసామ్యం విశారదమ్ ।
బుద్ధ్వాపదమనానాత్వం నమస్కుర్మోయథాబలమ్॥

(గౌడ.4-100)లో ముగించినటుల, ప్రత్యక్షాది ప్రమాణముల చేత తెలుసుకొన నలవిగానిదియు, సర్వసంబంధ రహితమై

కూటస్థమని చెప్పబడినదియునగు, 'అజం - సామ్యం - విశా
రదమ్' అని వర్ణింపబడు బ్రహ్మాత్మమగు 'ఆ సద్వస్తువు'
ఉపనిషత్ప్రతిపాదిత 'ధర్మాద్యధ్యాసాపాకరణద్వారేణావగమ్య'
మని చెప్పబడుటచే, శాఖాచంద్రన్యాయముగ గుర్తింపబడునే
గాని, 'బ్రహ్మను నేను తెలుసుకొంటిని' యనునదంతయు
కేన 2-11 'అవిజ్ఞాతంవిజానతాం విజ్ఞాత మవిజానతామ్' అను
అనునట్లు - మిథ్యాజ్ఞానమే యగుటచే, మనోవాగాదుల
కవిదితమని తెలుసుకొను తత్త్వానుభవసారముగలిగి 'నేను
బ్రహ్మమునే అయితిని' యని తెలుసుకొనిననాడే కృతకృత్యు
డగుచున్నాడని స్పష్టమగుచున్నది. అటులగాక దానిని పలు
వురు పలువిధములుగ వర్ణించుటజూడ నదంతయు వారి వారి
సంస్కారానుగుణమగు బుద్ధిచాతుర్యమేయగుచు, వారి వారి
దృష్టుల సారాంశమేనని అర్థమగుచున్నది. ఇట్టు తాను
ద్రష్టగాయుండి, తానే తన దృష్టి ననుసరించి గుర్తించుదానినే
పర్యవసానముగ తలంచునంతవరకు, తన కన్యమును, మనో
గతములైన వాటినే గుర్తించగలుగుటచేతను, సర్వమునకును
ద్రష్టయైన తనను గుర్తించువాడు వేఱొకడు - శ్వేతా 3-18
'నచతస్యాస్తి వేత్తా' - లేనిహేతువునను, ఇవన్నియు కేవలము
దర్శనములే యగుచు యుత్పత్తి వినాశములకు లోనగునవియే
యగుచున్నవి. గావున నిట్టి యసత్యఫలప్రదములగు దర్శనము
లన్నియు ద్వైతమునకు జెందినవే యగుటచే, పరమోత్కృష్ట
శాంతి నొసంగజాలవు. అయినను, యీ దర్శనములన్నియు,
కార్యకారణములట్లు హేయోపాధేయములేయగుచు, ఉత్త
రోత్తర భూమికలకు సోపానములేయగుటచే వీటి నవలంబించు
టలో నెట్టి విప్రతిపత్తి యుండనేరదు.

అనగా అఖండాద్వైతకమగు అద్వైత దర్శనమున కవి, క్రమక్రమముగా నాయా యధికారులును వారి వారి యోగ్యతల ననుసరించి యుపయోగించుచునవియై యున్నవి. అట్టి వేదాంతదర్శనమును త్రిపుటీయుతమైనదిగా నే గాన్పించుచున్నను, బృహ. 6-3-23 "నహి ద్రష్టుర్ద్రష్టేర్విపరిలోపో విద్యతేఽవినాశిత్వాత్ నతు తద్ద్వితీయమస్తి" యను శ్రుతి ప్రకారము నిత్యప్రకాశత్వము స్వభావముగా గలిగిన ఆత్మకు, ద్రష్టత్వము గౌణమేయగుచు, నిర్విశేషాఖండాద్వైతయ సచ్చిదానంద రూపముననే నిలిచియుండుననుటలో సందేహము లేదు. ఈ స్థానమునందు రెండవదాని దృష్ట్యా విభక్తమైనటుల గోచరింపబడుచున్న దేగాని వాస్తవమునకాదు. కావున యట్టి సాధన పరంపరలో జేరి దర్శనములను జేర్చొనబడు క్రమ మార్గమున నొకింత విచారింతము.

మానవుని స్వభావ మెల్లప్పుడు సుఖము నపేక్షించుటయే! అయిన నదెల్లరును నేకతీరుగ నుండక వారి వారి దృక్పథముల ననుసరించియుండుటచే, దాని కనువైనట్లు వారి వారి సాధనాంతరములును భేదించుచుండును. దేహధారులగు మానవులకు దేహసంబంధమున్నంతకాలము దుఃఖరహితమైన కేవల సుఖము అనుభవమునకు వచ్చుట యసంభవము - కారణము, సుఖదుఃఖములు రెండును దేహధర్మములగుట చేతనే!-గాన అట్టి దేహధర్మములను సరిగా గుర్తించ నేరమినే యెవరెవరెట్లు గుర్తించగలుగుదురో వారి కాయా తీరున సుఖానుభవము గలుగుచుండును. వీటికే దర్శనములని పేరు. ఇవి అనంతములు. వాటిననుసరించి నానామతము లుత్పన్నమగుచున్నవి. అందలి 'మోక్ష' (శాంతి) ప్రాప్తియు, ఆయా

దృష్టుల ననుసరించియే నిర్వచింపబడినదగుటచే, దానికి తగి నట్లుగానేయుండును. అందు

"దృక్ బ్రహ్మ దృశ్యం మాయాస్యా దితి వేదాన్త డిణ్డిమః" యనునట్లు, అట్టి దృశ్యవర్గమునుండి మానవుడు తన దృష్టిని పూర్తిగమరల్చి స్వస్థానమున జేర్చిననేగాని, అఖండాద్వితీయ పరిపూర్ణ సుఖంబును బొందనేరడనునది, శ్రుత్యుక్తి ప్రసిద్ధము. ప్రాజ్ఞుల ప్రత్యక్షానుభవమును దానినే ధ్రువపరచుచున్నది. ఉన్నతస్థానీయశంఖ(ఖం ఖం శమయతీతి శంఖః లేక శం=సుఖం ఖనతి=జనయతీతి శంఖః) స్వరూపమును లెస్సగా గుర్తింప జూలనివారు, దాని నధిరోహించి, అగ్రము నధిష్ఠించిననే గాని సమగ్రదృష్టి బొందలేనట్లు, యీ పార్శ్వదృష్టులన్నియు వస్తుస్వరూపము సామూలాగ్రము గుర్తింపజేయలేక పోవునవగు టచే సంపూర్ణమైనతుష్టి నొసంగజాలనివే యగుచున్నవి. ఇట్టి ఫలమునుగోరువారు ఉత్పత్తి వినాశకరమగు దృశ్యవర్గముతో నెంతెంత గాఢముగ పెనవేసుకొందురో అంతంత అల్పమగు సుఖమును బొందువారలే యగుచున్నారు. వీరలకు వ్యవహార దృష్టియే ప్రధానమై, భోగానుభవమే పురుషార్థమై, చూచిన దెల్లయు సత్యమే యను దృఢవిశ్వాసమున సంచరించువారగు టచే వీరినిగూర్చి విమర్శన యెక్కువ విశిష్టమైనదిగా గానుపించదు. లోకాయుతులు, చార్వాకాది చతుర్విధ బౌద్ధమ తావలంబులు మొదలగువారందరికోటిలో చేరినవారే? గావు ననే శ్రీ శంకరాచార్య స్వాములవారు యిట్టి దృష్టిగలవారి నందరినీ, అవైదిక మతస్థులుగ త్రోసిపై చి, శ్రుత్యానుసార ప్రవర్తకులగు మహర్షి సాంప్రదాయపరులనే విమర్శనీయ దర్శనములుగ బేర్కొనిరి. అట్టి మహర్షులలో గౌతమ, కణాద,

కపిల, పతంజలి, జైమినులను సుప్రసిద్ధ పురుషులు క్రమముగ న్యాయ, వైశేషిక, సాంఖ్య, యోగ, పూర్వ మీమాంసములను వాటిని దీర్ఘకాలవిచారణ మొనరించి, తృప్తిజెందినట్లు గాన్పించుచున్నను, శ్రీవ్యాసభగవానులనువారవతరించి సర్వదర్శనముకుటముగ వేదాంతదర్శనమను నొకదాని నుద్ఘోషించి తదితర పార్శ్వ దృష్టులందుగల లోపముల సూచించుచు యవెన్నటికిని పర్యవసానములుగా పరిగణింపబడవనియు, ఉత్తరోత్తర భూమికారోహణమున సోపాన మార్గముగ నవశ్యమవలంబించదగుననియు విశదపరచిరి. మరియు పైన పేర్కొనబడిన దర్శన పంచకమున, న్యాయ వైశేషికంబులు కేవల తర్కమునే యాధారముగ గైకొనిన వాచ్యార్థ ప్రధానములే యగుటచేతను, సాంఖ్యయోగ దృష్టులు పూర్వులకన్న నతిశయమైనవేమైనను, లక్ష్యార్థమునే ప్రతిపాదించునవగుటచేతను, ముందు వాటన్నిటికన్నను విశిష్టతతో ప్రవర్తిల్లు జీవబ్రహ్మైక్యానుసంధాన సూచిక పూర్వమీమాంసాదర్శనము, తనయౌన్నత్యమును చాటించునదైనను, యివన్నియు ద్వైతమునకు జెందినవే యగుటచే అల్పములే యగుచు, వీటికి విలక్షణమగు శుద్ధాద్వైతాఖండార్థకమును బోధించు వేదాంత దర్శనమున కేమాత్రమును సాటిగాక పోవుటచే, నంతటి పరమానంద మొసంగజాలకున్నవి. అదెట్లనిన, దృశ్యమానమగు నీ చరాచర ప్రపంచమంతయు శబ్దబ్రహ్మపరము. ఈయది "సర్వంఖల్విదంబ్రహ్మ"(ఛాం.3-14) లో చెప్పినట్లు పరబ్రహ్మకన్న వేరు గాకపోయినను, దృష్టిభేదము ననుసరించి, ఆది భౌతిక, ఆది దైవిక, ఆధ్యాత్మిక విభాగమున వాక్మనోప్రాణములనుపేర వ్యవహరింపబడుటచే

తనకు స్వయముగనే గుర్తింపఁబడునట్టివి. తాము గుర్తింపఁ
బడును సంక్రమించిన భావనారూపమే యీ స్వప్నాదుల నిజ
రూపము. ఇట్టి త్రివిధములుగ గుర్తింపఁబడుచున్నను,
అంతయు "వాచారంభణం వికారో నామధేయం" మన్నట్లు
నైమిత్తికరూపమేయగుటచే దృష్టిబహిర్గతమైనప్పుడు కేవలము
"వాచ్యార్థమునే" స్ఫురింపఁజేయునవగుచు, విజ్ఞానా కౌశల్య
మున "లక్ష్యార్థక్షేత్రము" లెఱుఁగఁగూడదు. ఎట్లు నేను, నాది
యనునవి వాచ్యార్థమున పృథక్త్వమును సూచించునవైనను
(ఘనీభూతమగు పరమాణువు సూర్యాకారమున భాసించు
చున్నదో, యట్లు) విచారింపఁగా లక్ష్యార్థమున నేకత్వమునే
సూచించునవగుచు విరోధాభాసములను పరమందున్నట్టి గుణ
రహితమై సత్తారూపమగునట్టి అఖండార్థ ప్రకాశమునగు పర
బ్రహ్మనే గుర్తింపఁజేయుచున్నవి. యదార్థమిట్లుండ దీని
కలవడని వారు, వారి దృష్టిపథముల ననుసరించిచేయు సిద్ధాన్త
ముల ప్రతిపత్తినిఁగురించి విస్తారవిమర్శ జేయనేల?

ఈ విధముగ క్రియా, కారక, ఫలాత్మకములగు
మానవ శరీరములు సైతము, ఘనీభూతమగు తేజస్సు సూర్యా
కారముగ జెప్పబడుచున్నట్లు, బృహ. 3-6-1 శ్రుతిలో వ్యాఖ్యా
నించినటుల, "శబ్ద వ్యతిరిక్త స్వరూపా నుపపత్తే" యనునది
సిద్ధము. అనగా యీవాక్యమున ప్రాణములు, తేజోఽబన్నములు,
అగ్న్యాదిత్య వాయువులు మొదలగు విభాగమంతయు వ్యాప
కమునందు సమానములే యగుచు (సూ॥భా॥ 2-1-14) లో
"ఆరంభణ శబ్దాదిభ్య" యనుచోట వివరించినటుల, కేవలము
వాగేంద్రియముచే జెప్పబడుటయేగాక వేరు ఉపపత్తి లేని
దగుటచే వికారజాతమునకు, సత్యత్వము నిశ్చయమువలనను,

యను కారణమున కొక్కదానికే సత్యత్వావధారణ వలననేగాని పరిపూర్ణానందము గలుగఁజాలదు. గాన శబ్దమే సామాన్యవిశేషరూపములతో భాసించు చున్నను,

"నారాయణపరో ధర్మః పునరావృత్తి దుర్లభః
ప్రవృత్తి లక్షణశ్చైవ ధర్మో నారాయణాత్మకః॥"

(భార- శాంతి) లో సూచించినటుల, (రాః శబ్దాః, అయంతే నిగచ్ఛంతే, యస్మాత్పరాయణః; రాయణాదస్య అరాయణః అరాయణో న భవతీతి నారాయణః ఇతి శబ్దగమ్యః) శబ్దగమ్యుడగుటచే నాదోపాసన వలననే పొందగలుగునని తెలియ వచ్చుచున్నందున, యీ శబ్దార్థము లాశ్రయించును యదార్థ స్థానమును, వినియోగమును, తెన్నగ గుర్తించిన "కల్పితః రూప రహితమైన అకల్పిత నిష్ప్రతియోగిక స్వమాత్రస్థితి - విశబ్దార్థమునను విరోధముగాని శబ్దార్థములు గలది - నికష శీఘ్రములో నధిష్ఠించినవాడగుచున్నాడు. ఇదియే నిరతిశయానందావాప్తి యనంబడు సమ్యగ్దర్శనఫలము. అఖండాద్వైతార్థమును బోధించునది. ఇట్టి పరమోత్కృష్టమైన సమ్యగ్దృష్టి గలుగకుండుటకు "జగజ్జీవేశ్వరాదుల సత్యత్వబుద్ధియే" ప్రబల ప్రతిబంధకమై అత్యంత స్వల్పఫలము లొసంగునదగుచున్నది. ఎంతకాలము సకల శ్రుతులను సమన్వయపఱచ నేరక, వితర్క కుతర్కములకులోనై, సమయానుకూల విపరీతాన్వయములను శ్రుతులను ముడిపెట్టనెంచుదురో, అంతవఱకు పూర్ణమైన అంతఃకరణశుద్ధిని బొందనివారే యగుటచే, దోష యుక్తముగనే భాసించుచు, పూర్ణసుఖానుభవమనునది గగన కుసుమమే యగుచున్నది.

దీనినే శ్రీ ఆచార్యస్వాములవారు సూ॥ భాష్యం-ద్వితీయాధ్యాయ ప్రథమపాద మొదటి యధికరణములందు, ప్రప్రథమమున సాంఖ్యదర్శనదోషముల విపులముజేసి, 'ప్రధానమల్ల సిద్ధాంతన్యాయముగ' ఇతరేతర దర్శనముల దోషములం దెలిపి గుణముల సమన్వయముచేసి, సూ. భా. 2-1-3 'ఏతేన యోగః ప్రత్యుక్తః' అను సూత్రమున పతంజలివారి యోగస్మృతియును సంశయాహితముగ 'శ్రోతవ్యో - మంతవ్యో - నిదిధ్యాసితవ్యః' యను ప్రమాణశ్రుతికి విరుద్ధముగ విమర్శించి, 2-1-12 'ఏతేన శిష్టాపరిగ్రహా అపి వ్యాఖ్యాతాః' అనుచోట "శిష్టులంగీకరింపని యణ్వాది కారణవాదములు" నన్నింటిని నిరాకరించిరి. ఇట్లు చెప్పుట దర్శనపంచకము నందునను, ఏయే యంశమున ఏ దర్శనములు వేదములతో విరోధింపవో ఆయా యంశములను వేదాంత దర్శనమునకును ప్రామాణ్యమే యని స్పష్టమగుచున్నది. అనగా సాంఖ్యయోగములు చతుర్వింశతి తత్త్వాంశముచేతను, వేద విరోధ తర్కాది స్మృతులచేతను నిరాకృతములైనప్పటికి 'అసంగోహ్యయం పురుషః' (బృహ 6-3-15) అను శ్రుతిని సాంఖ్యులును, "అథతద్దర్శనాభ్యుపాయో యోగః" (సమ్యజ్ఞానము మోక్షసాధనమని నిశ్చయింపబడిన పిదప ఆ జ్ఞానసాధనమగు యోగము (ధ్యానము) చెప్పబడినది) యను యోగసూత్రమును యోగసాధనగ నంగీకరింపబడినవి. దీనినే యోగశిఖోపనిషత్ లో

> జ్ఞాననిష్ఠో, విరక్తోపి ధర్మజ్ఞో విజితేంద్రియః
> వినాదేహేపి యోగేన నమోక్షో లభతే విధే॥

అని వర్ణింపబడినది. గాన యీ పైన వివరించిన ప్రకారము శబ్దమే మూలమగు సిజగచ్చక్రమును దాటుటకు "స్వవిమర్శో

"మోక్షః" యనునదే ప్రశ్నగుని శ్రుతిచే స్పష్టపడినందున, నది
దృష్టియందిడుకొని మానవుడు తన "స్వస్వరూపాను సంధా
నము"నను గడంగుచో, దృశ్యమానమగు నీ బాహ్యప్రపంచ
దృక్పథముమారి, గ్రంథిత్రయంబును క్రమక్రమముగా సడలి,
లక్ష్యార్థమున ఆజ్ఞా చక్రాంతరాళమును దాటినవారలై అఖం
డాకార ప్రకాశంబగు సహస్రారమను స్వాస్థ్యమును జేరి, సమ్య
గ్దర్శనఫలమగు సహజసమాధిని బొంది నిరతిశయానందవ్యాప్తిని
యుండగలరనునది స్పష్టము. ఇదియే షడ్దర్శనములయొక్క విని
యోగము. గాన ఈ దర్శనముల నన్యముగా దలంపక, ప్రతి
మానవునియందు సహజముగ గోచరించు అవాంతర భేదములు
గనే గుర్తించి, శ్రుత్యనుభవసిద్ధమగు అద్వైతదర్శనమే
లక్ష్యముగ గైకొని విశ్వాసముతో ప్రవర్తించుటయనదే కర్త
వ్యము. ఓమ్-తత్-సత్.

# 17. ప్రస్థానత్రయము

శ్రు. వేదాన్తవిజ్ఞానసునిశ్చితార్థాః సంన్యాస
యోగాద్యతయః శుద్ధసత్త్వాః। తే బ్రహ్మలోకేషు
పరాన్తకాలే పరామృతాః పరిముచ్యన్తి సర్వే ॥
(ముం. 3-2-6)

అని ముండకములో చెప్పినట్లుల, వేదాన్తముల
వలనబుట్టిన బ్రహ్మజ్ఞానమునందెవరికి గట్టినమ్మకముగలుగునో,
వారుమాత్రమే సన్న్యాసముం బొంది, శుద్ధాంతఃకరణులై,
యిటనే ముక్తులగుచున్నారని ప్రతిజ్ఞ చేయబడినది. ఇటుల
చెప్పుటలో, వేదాంతవిచారణపూర్వకముగనే 'జ్ఞేయమగు

బ్రహ్మపదార్థము తెలియనగునని స్పష్టముగు చున్నది. పర మాత్మవలన గలిగిన వేదములోని కడపటిభాగములయి, "మంత్ర బ్రాహ్మణ యోర్వేద నామధేయం" బను నట్లు మంత్రబ్రాహ్మణాంతర్గతము లేయగుటచే, ఈ వేదాంతములే 'ఉపనిషత్తు' లను నామాంతరముచే ప్రసిద్ధికెక్కి యున్నవి. ఇట్టి యుపనిషత్తులయందు, జీవ స్వరూపము, బ్రహ్మ స్వరూపము, మోక్ష స్వరూపము మొదలగు విషయములు వివరింప బడియున్నవి. అట్టివానినే శ్రీ వేద వ్యాసులవారు సర్వజనో పకారముగ, బ్రహ్మసూత్రములను పేర జతపఱచి, పైవిషయము లనే విస్పష్టమగునట్లు గావించిరి. పై రెంటనుంగాక, సమస్త వేదార్థసారసంగ్రహభూతముగ, మందమధ్యమాధికారులకు నైతము బుద్ధి ప్రకాశించ ననువగునట్టుల ప్రవర్తిల్లు శ్రీమద్భగ వత్ప్రణీతంబగు గీతాశాస్త్రమనునదియుం జేరి, ప్రస్థానత్రయ మను పేర మూడుపద్ధతుల వేదాంతార్థమును బోధించునవిగా విరాజిల్లు చున్నవి. ఇట్టి గీతాశాస్త్రమునకు "పరమంబగు ప్రయోజనము నిశ్శ్రేయసమనంబడు, సహేతుకమైన సంసా రమున కత్యంతో పరమమే" నని భగవంతుని చేతనే నిర్దే శింపబడినది. మరియు దానిని ఆత్మజ్ఞాన నిష్ఠవలననే పొంద నగునని కూడ స్పష్టపఱచి,

"గవామనేక వర్ణానం క్షీరస్యాప్యేక వర్ణతా ।
క్షీరవత్పశ్యతేజ్ఞానం లింగనస్తు గవాం యథా॥"

(అమృత బిందు.)

'జ్ఞానాదేవతుకైవల్య'మనుదాని నిరూపించిరి. ఇట్లన్ని విధములుగ ప్రతిపాదింపబడినను

"కృష్ణద్వైపాయనం విద్ధి వ్యాసం నారాయణం ప్రభుమ్"

అను స్మృతిప్రమాణానుసారముగ, సత్పురుషోపకారార్థకమైన భగవదవతారమే యగుచు 'లక్ష్య' మేకమేయగుటచే, ఈప్రస్థానత్రయమును, అపౌరుషేయమగు గాన, వాని విమర్శనెంతేనియు సార్థక మగుచున్నది. 'ప్రస్థాన' మనగా (ప్రస్థీయతే ఇతిప్రస్థానం) సిద్ధమును, సిద్ధమునగు నొకదానిని పొందుటను ఎవరు గదలిపోవుట—అను వ్యుత్పత్త్యర్థము ననుసరించి, బ్రహ్మజ్ఞానమును బొందుటను చేయుప్రయాణములో ముఖ్యపద్ధతులు గానవచ్చుచున్నవి 'ప్రస్థానత్రయ' మనుటవలన తెలియవచ్చుచున్నది. గాని అట్టిమార్గము లసంఖ్యాకములగాని, యొకే యొకటియనిగాని చెప్పక కేవలముమూడే యని వక్కాణించుటలో నొక విశేషముండకతప్పదని స్ఫురించుచున్నది. దానికి తగినట్లు, మూడుగ్రంధములనే (ఉపనిషత్తులు_భగవద్గీతలు-బ్రహ్మసూత్రములు) ఉదహరించుటజూడ, ఒక్కొక్క టొక్కొక్క విషయమును ప్రధానము జేసికొని ప్రవర్తిల్లుచు, సమగ్రముగ మూటినేకవాక్యత చేసిననేగాని, ఆసద్వస్తువుయొక్క దృఢాపరోక్షానుభూతి గలుగనేరదనియు, గాన నివియే యత్యంత సన్నిహితోపకారకములనియు విశదమగుచున్నది. అందు ఉపనిషద్జ్ఞాన లక్షణమును భగవద్గీతలు విశదపఱచగా బ్రహ్మసూత్రములు తల్లక్ష్యమును సిద్ధాంతము చేయునని వర్ణింపబడినది. అనగా 'తత్' పదార్థ విమర్శన బ్రహ్మసూత్రములవల్లను 'త్వం' పదార్థశోధన "ఉపనిషత్తుల" వలనను, 'అసి' అను సమైక్యత భగవద్గీతలవలనను తెలుపుటను, భగవంతునిచేతనే యీ ప్రస్థానత్రయమును సృష్టింపబడినదని యొక సాంప్రదాయికము. "జన్మాద్యస్యయతః" ఇత్యాది బ్రహ్మసూత్ర వాక్యములును, "ఐతదాత్మ్యమిదగ్

సర్వం తత్సత్యగ్ స ఆత్మా తత్త్వమసి శ్వేతకేతో" ఇత్యా ద్యుపనిషత్ శ్రుతులును, "యదాభూత పృథగ్భావమేకస్థ మనుపశ్యతి। తత ఏవ చ విస్తారం బ్రహ్మసంపద్యతే తదా॥" (భ. గీ. 13-30) ఇత్యాది స్మృతివచనములును, ఇట్టి యేక వాక్యతనే బోధించుచున్నవి. దీనినే శ్రీ ఆచార్యస్వాముల వారును భ. గీ. 2-20-21 శ్లోక వ్యాఖ్యానములో సూచించు నట్లు అర్థమగుచున్నది.

అట్లు పరస్పరసంబంధమును, అవినాభావ విశేషమును గల ప్రస్థానత్రయమును క్రమముగ శాంతినొనర్చక, యేయొక 'పద్ధతి' నైనను అనుసరించగా గలుగు పరోక్షజ్ఞానముతోడనే కృతకృత్యులమైనట్లు భావించువారు శాస్త్రహృదయ మెఱుం గనివారే యగుటచే, (మైత్రేయీ. 2 అ.)

"అనుభూతిం వినా మూఢో వృథా బ్రహ్మణి మోదతే।
ప్రతిబింబితశాఖాగ్ర ఫలస్వాదనమోదవత్॥"

అనునట్లు, నీటియందు ప్రతిఫలించిన ఫలమునుజూచి సంతో షించువారివలె, విశేషప్రయోజనము బడయజాలనివారే యగుచున్నారని తెలియవచ్చుచున్నది. మరియు,

"ద్వే బ్రాహ్మణీ హి మంతవ్యే శబ్దబ్రహ్మపరంచయత్।
శబ్దబ్రహ్మణి నిష్ణాతః పరంబ్రహ్మాధిగచ్ఛతి॥"
(త్రిపురతాపినీ)

చెప్పినట్లు, తెలిసికొనదగిన ఏ పరాఽపర విద్యల రెంటి యం దును 'అపర' విద్యయందభినివేశమువదలి, ఏది తెలిసిన పరి దృశ్యమానమగు నీ జగత్తంతయు దెలియబడునో, యట్టి 'పర' విద్యనభ్యసించిననేగాని నామరూపాది సూచితమగు

స్వరూపముకంటె వేఱయిన స్వప్రకాశరూపుని బొందలేరని బోధించుటకే యీ ప్రస్థానత్రయము వెలయుచున్నవి. అట్టి ప్రస్థానత్రయమునందు 'తత్త్వ'ద లక్ష్యార్థమును ప్రతిపాదించు బ్రహ్మసూత్రముల ప్రతిపత్తి యెట్టిదనిన-మానవుని క్షుద్బాధ తీరుటకు అన్నమే కారణ్యమగుచు, అన్నముకన్న వేఱయిన దానివలన నెన్నిదారణగా నేమి, ఎట్టిసాధనలనైన నా అన్నమునే సంపాదించి, అనుభవించినగాని "ఆకలితీరుట"నుపూర్ణ ఫలము గలుగ నేరనువది లోకమునందెట్లు ప్రత్యక్షమో యట్టులనే — బ్రహ్మసూత్రముల ప్రధానలక్ష్యము "తత్త్వ"ద శోధనే యని తెల్పుచు,

> "సత్యం జ్ఞాన మనంత మానందం సర్వజ్ఞత్వాద్యుపేతం।
> మాయోపాధికం తత్పదార్థః పరమాత్మా॥"
>
> (సర్వసారోపనిషత్)

వేదాంతములకెల్ల నద్వితీయమగు బ్రహ్మమునందే సర్వమునకు సమన్వయము ప్రతిపాదించి, బ్రహ్మవిషయములగు సగుణ-నిర్గుణ వాక్యముల కవిరోధ మెఱుకపఱచి, తత్ప్రాప్తి సాధనముల నిర్ణయించి, అట్టిసాధనానుష్ఠానపటిమవలననే గాని ముముక్షువులకెట్లు అఖండాపరోక్షానుభూతి గలుగనిదియు స్పష్టముచేయబడెను. ఇక 'త్వం' పదవివివరణ సూచితములని ప్రసిద్ధిగాంచు 'ఉపనిషత్తు'లో "సత్యం జ్ఞాన మనంతమానందగ్, సర్వశరీరోపాధివినిర్ముక్తం, కటకమకుటాద్యుపాధిరహిత సువర్ణవ ద్విజ్ఞానఘన చిన్మాత్రస్వభావ మాత్మచైతన్యంబ్రహ్మ యదవభాసతే తదవిద్యోపాధికం 'త్వం' పదార్థ స్సప్రత్యగాత్మా" (సర్వసార.) అని వర్ణించుటచే, 'త్వం' పదశోధన

యందే పర్యవసించునదై, సృష్ట్యాది నిర్వికల్ప సచ్చిదానంద మయ తేజోమయంబగు, నాదవృత్తి మాత్రమగుచుండెను, మహా వాక్య చతుర్వింశతి తత్త్వములనియు, సర్వస్వరూపము లనియు స్ఫురించి ప్రత్యగాత్మాది నామముల వ్యవహరింపబడు చున్నదియు, అదియే అభివ్యక్త నామరూపాత్మకమగు నీ ప్రపం చాకారమున భాసించుచున్నదియు, నిమిత్తోపాదానకారణముగ నదే సర్వకార్య కారణమగు దానినెల్ల గుర్తింపజేయగలుగు చున్నదియు నాలుగు అంశములను పూర్వాపర సంబంధము లతో బాగుగ శోధించగల జ్ఞానము నొసంగుచు, శీఘ్రగతిని అద్వితీయానందమును చేకూర్చగలిగినదియు వివరము చేయబడి నది. అనగా సర్వజ్ఞుడై, సకల జగత్కారణుడైన చేతనుడు, (శబలబ్రహ్మ) "తత్" పదమునకు వాచ్యార్థమనియు, కించి జ్జ్ఞుడై, సుఖ దుఃఖాది భోక్తయైయున్న చేతనుడు (శబలబ్రహ్మ) "త్వం" పదమునకు వాచ్యార్థమనియు దెలియందగు. ఇట్టి రెండు వాచ్యార్థములకు పరస్పరవిరుద్ధ గుణములున్నందున ఐక్యము సంభవించదు. గావున తత్పదార్థ, త్వం పదార్థములయందుగల "సర్వజ్ఞత్వాది, కించిజ్జ్ఞత్వాది" విశేషణములను పరిత్యజించిన మొదల కేవల చేతనుడే" శేషించియుండును. కావున వారి ఐక్యమును "తత్త్వమసి" అను మహావాక్యమును ప్రతిపాదించు చున్నది.

అన్వయవ్యతిరేకాభ్యాం వినా వాక్యార్థబోధనమ్
న స్యాత్తేన వినా ధ్వంసో నాజ్ఞానస్యోపపద్యతే ।
వినాఽజ్ఞాన ప్రహాణేన పురుషార్థస్సుదుర్లభః॥

(నైష్క. 2-14)

అని శ్రీ సురేశ్వరాచార్యస్వామివారు సెలవిచ్చి నప్పుడు,

"అన్వయవ్యతిరేకములలో వినగా వాక్యార్థజ్ఞానము (అహం బ్రహ్మాస్మి యనెడి జ్ఞానము) గలుగదనియు, అట్లు వాక్యార్థ జ్ఞానము గలుగనియెడల అజ్ఞానముయొక్క వినాశము పుట్ట దనియు, అజ్ఞానవినాసము గలుగనియెడల స్వరూపావస్థానమైన మోక్షము సంభవింపనేరదనియు" ఉద్ఘోషించిరి.

అటుల 'తత్త్వమసి' యను మహావాక్యముచేత ప్రతిపాదింప బడెడి ప్రత్యగ్బ్రహ్మైక్యము ప్రత్యక్షాది విరుద్ధము గానందున అట్టిదాని ప్రాప్త్యుపాయముగనే, శ్రీ భగవద్గీతలను ఉద్గ్రంథ మును 'అసి' యను పదార్థసూచకముగ, నొకదానిని భగవం తుడే సృష్టించి, వైరాగ్యాది గుణసంపత్తుగలవారికే వాక్యము స్వార్థమును బోధించును గాని అన్యులను బోధింపనేరదని స్పష్టపరచిరి. అట్టి యుత్కృష్ట గీతలను, భగవంతుడు కేవల మర్జునునికొఱకు యుద్ధభూమియందు జేసిన తాత్కాలిక, సమర సన్నాహ హితోపదేశముగానే యెంచుటెంతయు అవజ్ఞత యనియే చెప్పకతప్పదు. ఆనాడర్జునుడు పొందిన విషాదము, మానవునను సందిగ్ధ సమయములందు సహజముగ గలిగెడి యభిమాన, ధర్మసందేహములే! ఈ దైవాసుర సంపదలకును, పుణ్యాపాపములకును జరిగెడి సమరము ప్రతి మానవుని హృదయమందును నిత్యము సన్నిహితమయియే యున్నది. కావున నీ హితోపదేశ పూర్వకమగు గీతాశాస్త్రము, "ధర్మ సంస్మరణమును, ధర్మసంకీర్తనమును ధర్మజిజ్ఞాసలతో తుల దూగుచు, ఆత్మసంయమమను యోగమునకు" మిక్కిలి సులభమగు మార్గమును సూచించుచున్నది. (బృ.3-4-7)లో

"న హి వేదాన్తేషు బ్రహ్మాత్మ విజ్ఞానాదన్య త్పరమ పురుషార్థసాధనత్వే నావగమ్యతే" అని శ్రీ ఆచార్యస్వాములే

సెలవిచ్చినట్లు, "ఆత్మను బ్రహ్మగా నెఱింగుటవల్లనే ముక్తి
యగుటచే" సర్వోపనిషత్సారమైన బ్రహ్మవిద్యాపరమైన
యోగశాస్త్రమని చెప్పబడు నీ భగవద్గీతలందు, అర్జునుని
నిమిత్తముగా జేసికొని, సాక్షాద్భగవంతుడే, సర్వసంసారా
త్యంతోపరమమే ప్రయోజనముగాగల నీ శాస్త్రమును
అర్జునున కుపదేశింపబూని, "ప్రథమమున భగవదర్పణ
బుద్ధిచే నిష్కామ కర్మానుష్ఠానము (ఫలాభిసంధిరహిత) ను
జేయుమనియు, అందుచే నంతఃకరణశుద్ధికలిగి తీవ్రమైన వైరా
గ్యముచే వివిదిషయుత్పన్నమైన పిమ్మట సర్వకర్మసన్న్యాసము,
శ్రవణమనననిదిధ్యాసముగ వేదాంతవాక్య విచారణకొఱకు
గర్తవ్యంబని" యుపదేశించెను. దీనినే వార్తికకారులు

"ప్రత్యగ్వివిదిషాసిద్ధ్యై వేదానువచనాదయః ।
బ్రహ్మావాప్త్యైతు తత్త్యాగ ఈప్సన్తీతి శ్రుతేర్బలాత్ ॥

అనుచోట, ప్రత్యగాత్మజ్ఞానేచ్ఛ సిద్ధించుట కొఱకై వేదాను
వచనాదులును, బ్రహ్మప్రాప్తికొఱకు వేదానువచనాది త్యాగ
మును కోరుచు శ్రుతి నాశ్రయించునని వివరింపబడినది.

అట్లు బ్రహ్మసూత్రములందు వస్తుతత్త్వ విచారణయే
ప్రధానమగుటచే, నీ విషయము అందు గానరాదు. కావుననే
యీ విషయ మెట్టుల వచ్చినదో తెలియబఱచునది భగవద్గీ
తయే యగుటచే, ఉపనిషత్తులలో జెప్పిన విషయమును బ్రహ్మ
సూత్రములలో ప్రతిపాదింపబడిన విషయముతో సమైక్యముచేసి
భగవద్గీతలు పూర్ణయోగమును సిద్ధింపజేయుచున్నవి. ఇదియే
ప్రస్థానత్రయముయొక్క ప్రాశస్త్యము. అందలి భగవద్గీతలను
నవి ఉపనిషదంతర్గత యాజ్ఞవల్క్యాది ఆఖ్యాయికలంబోలు

మహాత్మ్యమును బోధించునదియై యున్నదే, ఏసలును పొంద వ్రుఙు తనయొక్క సహజస్వరూపమును బెఱిగి పుణ్యము, వారి ఏకాదశేంద్రియములను పరిమార్చి శుభను జ్ఞానము విజయమునొందినటో ఎసూచించుటయేకాక, మానవు లెల్ల రమయందలి మైపిప్రవృత్తులను మూలాధారాది సంజ్ఞలుగలిగిన సప్తచక్రములను క్రమక్రమముగ రక్షించుట యను సాధనతో సహజమై స్వేచ్ఛావిహారమునకు ప్రాణాది సకలామ ప్రవృత్తులను ఏకాదశేంద్రియ బాహ్యసంసర్గమును నుడ్డించి, శుద్ధాంతఃకరణగలిగినవారెట్లు మోక్షమనుభవించగలుగుదురో యనునది తెలియజేయుటయే యగుటచే, అష్టాదశాధ్యాయములుగ విభజింపబడి, ప్రతియొక్క భాగమును "యోగ" మనుపేర బ్రశంసింపబడుచు, భ.గీ. 18-78 లో

"యత్ర యోగేశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః ।
తత్ర శ్రీర్విజయో భూతిః ధ్రువా నీతిర్మతిర్మమ॥"

అనునట్లు పూర్ణానందావిర్భావమెట్లు గలుగునదియు విశదము చేయబడినది. దాననేకదా! 'యోగ'మనినను బహ్మాత్మైకత్వ లక్షణమైన జ్ఞాననిష్ఠయని నిర్వచింపబడినది. అట్టిదాని కధికారిగా సాధనచతుష్టయసంపత్తు గలిగిన పూర్ణజిజ్ఞాసపరుడనే బ్రహ్మసూత్రములందును, భగవద్గీతలయందును ఉపక్రమింపబడినది. ఇట్లాధిక్యమును బొందినదగుటచేతనే శ్రీమచ్ఛంకర భగవత్పాదులవారు వీనిమూటిని సమన్వయముచేసి, మంగళాచరణమునందు

"నారాయణః పరోఽవ్యక్తా దణ్డమవ్యక్తసమ్భవమ్ ।
అణ్డస్యాన్తస్త్విమేలోకాః సప్తద్వీపా చ మేదినీ॥"

కల్పితమైనను అధిష్ఠానముకంటె అతిరిక్తమైన స్వరూపము తెలియజేసి, వాచ్యములు కల్పితములైనను లక్ష్యము బ్రహ్మ మాత్రమే యగుటచే బ్రహ్మాత్మైక్య విషయమును సూచించు చున్నదని సెలవిచ్చిరి.

ఇట్టి తత్త్వత్రయమును (ఆత్మ-విద్య-శివ) నతిక్రమించి న నేగాని "త్వంపదార్థాదౌపాధికా, త్తత్పదార్థాదౌపాధిక యభేదా ద్విలక్షణ మాకాశవత్సూక్ష్మం కేవల సత్తామాత్ర స్వభావం పరబ్రహ్మేత్యుచ్యతే" అను పరతత్త్వ మధిష్ఠించిన వాడుగాడు. అనగా అప్పుడే ఈశ్వరత్వజ్ఞానముగూడ నశించి, తానే నిరుపాధికమును, నిర్గుణమును, స్వయంప్రకాశము, సత్తామాత్రమైన పరబ్రహ్మమను సమగ్రమగు అద్వైతసిద్ధి గలుగును. ఓమ్-తత్-సత్

# 18. సమ్యగ్దర్శనము

శ్రు॥ పరాఞ్చిఖాని వ్యతృణత్స్వయం భూస్తస్మాత్పరా
ఙ్పశ్యతినాంతరాత్మన్ । కశ్చిద్ధీరః ప్రత్యగాత్మానమై
క్షదావృత్తచక్షురమృతత్వ మిచ్ఛన్ ॥ (కఠ-2-1-1)

సృష్ట్యావిర్భావకాలమునందే, స్వతంత్రుడైన పరమేశ్వ రుని స్వభావముచే నింద్రియాదులు బాహ్యవిషయైక ప్రవృ త్తములుగ జేయబడినవగుటచే నవి శబ్దాది విషయగ్రహణము నందే సామర్థ్యము గలవియై అంతరాత్మను జూడలేకున్నవి. అట్టి ప్రవృత్తిని "మహతా ప్రయాసేన స్వభావప్రవృత్తి నిరోధనం కృత్వా ధీరః ప్రత్యగాత్మానం పశ్యతి" యని శ్రీ ఆచార్యస్వామివారు శెలవిచ్చినటుల, నవి స్వభావసిద్ధముగ

నిరంతర బాహ్యాభిముఖములగల వైనను, వాటిని మరలించుటకు అమృతత్వము గోరిన యొకానొక వివేకమాత్రమే విశేషమైన స్థైర్యసాహసములతో ప్రయత్నించును. అట్టి వానికే •సది సాధ్యమై 'అమరణత్వము' సిద్ధించును. గాక మందమతులు, అల్పప్రజ్ఞావంతులు దృష్టాఽదృష్ట ఫలభోగాభిలాషచే పీడింపబడువారై, మృత్యువను 'అవిద్యా కాను కర్మ సముదాయము నకులోనై, పరితపించ వలసినవారై యగుచున్నారు. గాననే కఠ 1-3-12

శ్రు॥ ఏషసర్వేషు భూతేషుగూఢోత్మా న ప్రకాశతే ।
దృశ్యతే త్వగ్ర్యయాబుద్ధ్యా సూక్ష్మయాసూక్ష్మదర్శిభిః ॥

అని, ఏకాగ్రమును సూక్ష్మమునునగు బుద్ధి సహాయముచేతనే సూక్ష్మదర్శిన కుశలులగు పండితులచే 'ఆత్మదర్శింప' బడి అమృతత్వమును బొందబడు చున్నదని' తెలుపబడెను. దానినే యిట నొకింత విచారింతము.

'ఈశావాస్యమిదం సర్వం' అని సూత్రప్రాయముగ వర్ణింపబడినటుల, నస్వర స్వభావముగల యేయేవస్తువుగలదో నదంతయు పరమాత్మచేతనే ఆచ్ఛాదింపబడినదనియు అట్లు గుర్తించుటకు చిత్తశుద్ధియేయుపాయమగుటవలన నది సిద్ధించు మార్గము' 'కుర్వన్నేహకర్మాణి' యని మరొకమంత్రములో శాస్త్రవిహితములైన కర్మములు నిష్కామనయా నాచరించుటవల్లనే లభ్యమగుననియు నిర్దేశింపబడినది. దీనివలన మానవులకు సహజముగనే 'తెలిసినది'(విజ్ఞాతం)'తెలిసి-తెలియనిది' (విజిజ్ఞాస్యం) 'తెలియనిది' (అవిజ్ఞాతం) అను మూడవస్థలు జన్మదారభ్య యున్నట్లు స్పష్టమగుచున్నది. గాని సామాన్య

ముగ నిట్టి విచక్షణ గోచరించుటవలననే లోక వ్యవహారము నైసర్గికమై సర్వత్ర గాన్పించుచు, వివేకులలో సైతము 'పశ్వాదిభిశ్చా విశేషాత్' అనునట్లు వ్యామోహానోకని యందదిస్ఫురించు చునేయున్నది. ఇంత బలవత్తరమైన దానిని తొలగించుకొని సమ్యగ్దర్శనమున కలవడుటకు అంతర్దృష్ట్యంగము గాగల పూర్వాపర విమర్శనయే, యేకైకమార్గము. ['అనుట'కు పూర్వ మగోచరమైనదే, 'అనుటతో' ప్రాణమనోవాగ్రూపములుగ విస్తరించి (బృ 3-5-3) 'అధ్యాత్మిక, అధిదైవిక' అధిభౌతిక'ములను సాంకేత పదములతో విరాజిల్లు చుండినట్లున్నను, అంతయు పరాశక్తి విలసనరూపమే యగుటచే, నీ విస్తృతియంతయు స్వప్రకాశమైన 'సద్వస్తు'వే యని స్పష్టమగుచున్నది. అనగా అల్పములైన వర్ణాత్మకావరణలుగల వాటినిగ భావించుటచే భౌతికములో గోళములుగను (విజ్ఞాతమైన వైఖరీరూపాదులుగను) అధిదైవికమందు తేజోమయములుగను (అనుమానాస్పదములగు విజిజ్ఞాస్యంబను పశ్యంతి మధ్యమాలుగను) అధ్యాత్మిక మందతి సూక్ష్మములుగ 'తెలియబడని' వను (అవిజ్ఞాతంబను పరాశక్తి స్వరూపములును) విభాగములేర్పడినవేగాని యీ ఆవరణలు లేనిచో, అధ్యాత్మికాది విభాగమునకే స్థానము లేకపోవుటచే, నట్టిదానిని విమర్శించి, గుర్తించుటయే సమ్యగ్దర్శనయొక్క విశిష్టత. ఈ విమర్శన కౌశల్యమే క్రమక్రమముగ, అంతర్ముఖతను (Subjective-View)గట్టిజేసి సమ్యగ్దర్శనమునపర్యవసించును అటు లంతర్ముఖతను నిచ్చగించక పోవుటయే, అవి చారిత్ర రమణీయమైన జగద్రచనకు నాందియై, వాఙ్మనప్రాణముల ప్రసారము నాధారము జేసుకొని, పురుషుడు, భోక్త-భోజ్య

మయునగ, బహిర్దృష్టి(Objective-View) గలవారై, జనన మరణ ప్రవాహమున నీదులాడుట ప్రసంగించుచున్నది. అట్టి ప్రవాహమునుండి బయటపడుటకే, "కర్మయోగ" మనువేన, స్వార్థరహితమగు, (నిష్కామ) కర్మలు నిర్ణయింపబడుటచే వాటిని కేవలము పురుషార్థములుగ నెంచక-ఎట్లు నదినిదాటుటకు పడవల నుపయోగించుదు, నా పడవలలో కాపురము చేయకపోయినను, వాటి పరిశుభ్రత జాగ్రత చూపెదవో అట్లు - స్వపక్షోచిత కర్మల ననుష్ఠించుటవలన చిత్తశుద్ధిగలిగి, క్రమక్రమముగా, భక్తి-జ్ఞాన-వైరాగ్య-తత్త్వచింతనల కలవడునట్లుల జేసి, సమ్యగ్దర్శనము ముక్తి హేతువగునని వేదశాస్త్రములు ఘోషించుచున్నవి. సూత్రకారులగు వ్యాసాదులును దీనినే సూచించుచు, "భా-గ-వ-త-ము"ను, బ్రహ్మవిద్యను రమించు సూచకముగ, "భా-రత"మును, క్రీడాశ్రేయంబుగ, "రామాయణము"లను ప్రబంధముల రచించునపుడు, భావార్థ విశేషముల నే దృష్టి యందిడుకొని, ఆఖ్యాయకలనియు, ఉపాఖ్యానములనియు సోపాన పరంపరలనిర్మించి, కథారూపమున వెలిబుచ్చిరె, గాన నవి పలుమారు చింతన జేయుటచే తప్పక సమ్యగ్జ్ఞాన ముద్భవించ గలదని నిరూపించిరి. అట్లు ప్రాచీన మహాత్ము లెంత ఔదార్యముగలిగి, 'చికీర్షు ర్లోక సంగ్రహమ్' అను విశాలబుద్ధితో ప్రవర్తించి, శాస్త్ర హృదయ మెఱింగించిరో తెల్పుటకీ క్రింది ఆఖ్యాయకలే సాదృశ్యము. ఇట్టివి, వేద, శాస్త్ర, పురాణేతిహాసములయందు లెక్కకు మిక్కుటముగ గాన వచ్చినను నవియెల్లయు నేకైక లక్ష్యమునే ప్రతిపాదించుననుటలో సందేహ మేమియు లేదు.

బృహదారణ్యక, షష్ఠాధ్యాయ, చతుర్థ బ్రాహ్మణ యాజ్ఞవల్క్యజనక సంవాద "మోక్షవిమర్శన"సందర్భమున, "సహస్రంపదామి" అని జనకుడు పలుమారులు ప్రతిజ్ఞ చేయు టంగో, జనకుని భావన - సన్న్యసేనతనుంత్యజేత్ - అనునట్లు, "సర్వేషణ పరిత్యాగమును నిరూపించి, తాను పరబ్రహ్మగ నుండుటయే"గాని, ధన, కనక, వస్తు, వాహనాదులను యాజ్ఞవల్క్యుని విద్యా కౌశల్యమునకు మెచ్చి, పారితోషిక ముగ నొసగుటనుపదిగాదు - అట్లనే "మైత్రేయీ బ్రహ్మణ మున" యాజ్ఞవల్క్య మహర్షికి, మైత్రేయీ, కాత్యాయ, యని యిరువురు భార్యలు గలరనియు అందు కాత్యాయని యను కనిష్ఠ భార్యకు తన సర్వస్వము నర్పించి, జ్యేష్ఠ భార్య యగు మైత్రేయీతోగూడి, తాను పరమోత్కృష్ట శాంతి ననుభవించుటకు వనవాసంబుల కరిగెననియు నాఖ్యాయిక రూపమున బోధింపబడినను, కేవలము బాహ్యమునకు గోచర మగు ప్రరోచనార్థ ఆఖ్యాయికకే ప్రాధాన్యనిచ్చిన అల్ప ప్రయోజన మొసంగునదియె గాన, శాస్త్రహృదయమును గుర్తింపనెంచిన, అంతర్ముఖుడై విచారించిననేగాని కృత కృత్యులు గానేరరని మహర్షులయభిప్రాయము. అనగా యాజ్ఞ వల్క్యుడు ధర్మాధర్మ నిర్వహణాధికారియగు ముముక్షువగు కర్త. జ్యేష్ఠ భార్యయైన మైత్రేయీ యనబడు జ్ఞానమును, ద్వితీయ భార్యయైన కాత్యాయనీయను వైరాగ్యమును ఆశ్ర యించిననేగాని తన కర్తృత్వభ్రాంతి తొలగి అవి క్రియాత్మ జ్ఞానముద్భవించదనియు, అందుకుగాను మున్ముందు పూర్ణ విరాగము గృహస్థాశ్రమమునందు గలుగనిదే, తొందరపడి సన్యసింప రాదనియు తెలుపుటకుగానుచిత్తశుద్ధి గలుగుపర్యం

తను శాస్త్రోపదిష్ట విహితకర్మల నాచరించి సాధనచతుష్టయ
సంపత్తిఁగలిగినపిదప శ్రవణాదియుక్తులతో సర్వదృశ్యమును విమ
ర్శించి పూర్ణవిరాగమును బొందుటనునదే కాత్యాయనియను
గృహస్థాశ్రమమునుండి మారుటగా చెప్పబడెననియు, పిదప
మైత్రేయీ యను పారివ్రాజక లక్షణాయుతమైన జ్ఞానాభ్యాస
నిరంతరానుసంధానమును జ్యేష్ఠ(శ్రేష్ఠ)భార్యతోఁగూడి 'వన'
మను (బ్రహ్మభావన) యందుండుట యనునదే "ముఖ్యార్థ
మని సూచించిరి. ఇటులనే కఠోపనిషత్ యందలి
"యమ-నచికేతస", సమాగమన రూపమున బోధించిన ఆఖ్యా
యికయు, బ్రహ్మవిద్యా ప్రాశస్త్యమును నిరూపించి, తన్మూ
లమున, "అవిద్యాకామకర్మసముదాయమను మృత్యుముఖము"
నుండి యెట్లు విడివడగలుగగలడను తెన్నుగ గుర్తింపజేయు
టయే యందలి విశేషము. ఇట్లనే భాగవతములోని "శుక
యోగి పరీక్షన్నరేంద్రుని ఆఖ్యాయికయు, భారతములోని
"కృష్ణార్జున సంవాదరూప గీతోపదేశమును, రామాయణము
లోని రామరావణ సంగ్రామాద్యనేక దేవాసుర యుద్ధఘట్టము
లును మొదలగునవన్నియు, కేవలము కవిచాతుర్యాదులతోఁ
గూడిన చరిత్రాంశములుగనే గ్రహించి బాహ్యార్థములతోనే
తృప్తిజెందక యోగార్థరూప ఆధ్యాత్మికదృష్టిని సూక్ష్మ విమ
ర్శన జరిపిననేగాని, నిస్సారమైన యీ వైఖరీ శబ్దప్రపంచ
మోహజాలమునుండి విడివడుట కేమాత్రమును మరొక
మార్గము గానరాదు.

మరియు బృ—6-4-5 శ్రుతి "యథా కామోభవతి
తత్క్రతుర్భవతి యత్క్రతుర్భవతి తత్కర్మకురుతే - యత్కర్మ
కురుతే తదభిసంపద్యతే" యని సూచించునటుల పై ప్రకారము

ఆయా వాఙ్మన ప్రాణము యథార్థస్వరూపము గుర్తించక, వాటి విస్తృతినే యభిమానించి (అనగా వానియందు తాను బాగున్నదని తలచి, సేవించి) ఆయా చరమవృత్తుల ననుసరించుటచేతనే తదనుగుణమైన శరీరాదులను బొందుచు బాహ్యాభిముఖుడయే సంచరించును గాన యేనాటికైనను అట్టి సృష్టిని విసర్జించి, అంతర్ముఖుడై శాస్త్రార్థ విమర్శనకు గడంగనిచో సమ్యగ్దర్శన మనునది గగనకుసుమమే ! గలిగినదని సంతసించు 'ప్రశాంతము' మరుమరీచికయే! దీనినే శ్రీ ఆచార్య స్వామివారును

" అన్తర్జ్యోతిః బహిర్జ్యోతిః ప్రత్యగ్జ్యోతిః పరాత్పరః ।
జ్యోతిర్జ్యోతిః స్వయంజ్యోతిః ఆత్మజ్యోతిః శివోఽస్మ్యహమ్ "

(బ్రహ్మజ్ఞానావళీమాల)

అనుచోట, - ఫేన, బుద్బుద, తరంగముల ప్రాయముగ నెన్ని వికారములు సముద్రమందు గాన్పించినను 'ఉన్న దంతయు నీటిమయమే' యను అంతర్దృష్టియే తృప్తినొసంగునట్లు, 'వికారమయమై' శబ్దమాత్రమేయైన యీజగమంతయు పరమాత్మకన్న భిన్నముగాదు. అని గుర్తించి, దృఢమైన నాడేగాని సమ్యగ్దర్శన ఫలమగు పూర్ణశాంతిని బొందజాలరని ఉద్ఘోషించుచున్నారు.

ఓమ్-తత్-సత్

# IV. మనీషాపఞ్చకమ్

(ఆంధ్ర పద్యానువాదము)

సారాంశము.

శ్లో॥ జాగ్రత్స్వప్నసుషుప్తిషు స్ఫుటతరా యా సంవిదుజ్జృమ్భతే
యా బ్రహ్మాది పిపీలికాన్తతనుషు ప్రోతా జగత్సాక్షిణీ ।
సైవాహం న చ దృశ్యవస్త్వితి దృఢప్రజ్ఞాపి యస్యాస్తి చే
చ్చణ్డాలోఽస్తు స తు ద్విజోఽస్తు గురురిత్యేషా మనీషా మమ ॥

పం॥ జాగ్రదాదుల వికసించి సాక్షిగాను
బ్రహ్మ మొదలగు జీవుల వ్యాప్తిచెంది
ఉండు 'తెలివియె' తానుగ నుజ్జ్వలించి
"ద్విజుడు - చండాలు"డను భేదదృష్టి లేమి
తెలియకుంటిని దేనిని తొలగమనిరో ॥ 1

శ్లో॥ బ్రహ్మైవాహమిదం జగచ్చ సకలం చిన్మాత్ర విస్తారితం
సర్వం చైతదవిద్యయా త్రిగుణయాశేషం మయా కల్పితం
ఇత్థం యస్య దృఢా మతిః సుఖతరే నిత్యే పరే నిర్మలే
చణ్డాలోఽస్తు స తు ద్విజోఽస్తు గురురిత్యేషా మనీషా మమ ॥

'బ్రహ్మమేయగుచును నేను' ప్రజ్వలించి
చిద్విలాసపుటజ్ఞాన చిత్రజగము
త్రిగుణమయమనే గుర్తించి దృఢముగాను
"ద్విజుడు - చండాలు"డను భేదదృష్టి లేమి
తెలియకుంటిని దేనిని తొలగమనిరో ॥ 2

శ్లో॥ శశ్వన్నశ్వరమేవ విశ్వమఖిలం నిశ్చిత్య వాచా గురో
ర్నిత్యం బ్రహ్మనిరన్తరం విమృశతా నిర్వ్యాజ శాన్తాత్మనా

భూతం భాతిచదుష్కృతం ప్రదహతా సంవిన్మయేనాపకే
ప్రారబ్ధాయ సమర్పితం స్వవపురిత్యేషా మనీషామమ ॥

నశ్వరంబని జగమెల్ల విశ్వసించి,
చిత్తశుద్ధిని 'బ్రహ్మాత్మ' చింతజేసి
పాతకంబులు జ్ఞానాగ్ని పరమొనర్చి
వపువునర్పించ ప్రారబ్ధ బలమునకును,
తెలియకుంటిని దేనిని తొలగమనిరో ॥ 3

శ్లో॥ యాతిర్యఙ్నరదేవతాభి రహమిత్యన్తః స్ఫుటాగృహ్యతే
యద్భాసాహృదయాక్షదేహవిషయా భాన్తిస్వతోఽచేతనాః
తాంభాస్యైః పిహితార్కమణ్డలనిభాం స్ఫూర్తింసదాభావయ
న్యోగీ నిర్వృతమానసోహి గురురిత్యేషామనీషామమ ॥

దేవ, దానవ, నర, జంతు దృశ్యమనెడి
సకల జడవర్గమున కేది సంశ్రయమగు
నఖిల, యాభాసయుతమైన యట్టి "అహమె"
యోగి హృదయాంతరంబుల నుల్లసిల్ల
తెలియకుంటిని దేనిని తొలగమనిరో ॥ 4

శ్లో॥ యత్సౌఖ్యామ్బుధిలేశలేశతఇమే శక్రాదయోనిర్వృతా
యచ్చిత్తేనితరాం ప్రశాన్తకలనే లబ్ధ్వా మునిర్నిర్వృతః
యస్మిన్నిత్య సుఖామ్బుధౌగలితధీ ర్బ్రహ్మైవ బ్రహ్మావి
ద్యః కశ్చిత్ససురేన్ద్రవన్దితపదోనూనం మనీషామమ ॥

దేని "యునికి"ని శక్రాదిదీప్తి, సుఖము,
లేశమగుటను, మును లవలీలగాను
వృత్తిరాహిత్యమునుబొంది నిత్యసుఖము
గాంచగలిగిరో, దాని "నే" గలిగియుండ
తెలియకుంటిని దేనిని తొలగమనిరో ॥ 5

# 19. " ఉన్నది 'నేనే' "

శ్రు॥ అర్ద్రంజ్వలతి, జ్యోతిరహమస్మి । జ్యోతిర్జ్వలతి, బ్రహ్మాహమస్మి । యోఽహమస్మి, బ్రహ్మాహమస్మి । అహమస్మి బ్రహ్మాహమస్మి । అహమేవాహం, మాం జుహోమి స్వాహా॥

• (తై-నా 4-1-41)

లో వివరించినటుల, సృష్టికి ప్రాక్కాలమందు సద్రూపముగ నున్న వస్తువే, సంకల్ప మాత్రమున ఆ సృష్టిని జేయ నిచ్ఛగించినదై, చిత్స్వరూపమును బొంది, తేజోఽబన్న రూపమగు నీ చతుర్విధ సృష్టిని (అండజ-స్వేదజ-ఉద్భిజ్జ-జరాయుజములను పేర) కొనసాగించుచున్నను, బ్రహ్మాత్మ భావమును బోధించుటకు ప్రయోగింపబడిన యుక్తులు, మారోపితమేయగుటచే, "బ్రహ్మసత్యం-జగన్మిథ్యా, జీవో బ్రహ్మైవ నాపరః" (వేదాంతడిండిమం) లో మ్రోగుచున్నట్లు, సర్వాధిష్ఠానమైన బ్రహ్మమే సత్యమనియు, తదితరములందు ప్రత్యేకమగు 'సత్తా' లేనందున మిథ్యయే యగుననియు, అట్లుగుర్తించిన వివేకియే తానెంత జీవుడుగా భాసించుచున్నను, గుర్తించుటయే తడవుగా తానుపూర్వసిద్ధమైన బ్రహ్మమే యగుచు, అంతర్ముఖచిద్విశ్రాంతిని బొందగలుగు చున్నదియు, విశదము చేయబడినది. అట్లగుటచేతనే, శాస్త్రమంతయు, మానవునకు తననుగురించి తనకు సహజముగనున్న అపోహలను తొలగించి, పైన జెప్పబడిన వివేక విజ్ఞానమును గలిగించుట యందే పర్యవసించునదై యున్నది. అనగా 'నేను ఉన్నాను' అని అందఱికి తెలిసినప్పటికిని ఈ 'నేను'ను గురించిన విశేషములు సవిస్తరముగ తెలియ జేయుటయందే శాస్త్రవినియో

గము. అట్టి 'నేను' ఈ దేహమే నే ననువారు చార్వాకులు గను, మనసేంద్రియములు 'నేన'ను వారిని నాస్తికులుగను, ఇత్యాది వేలువేలుసాంకేతనామములతో పెక్కు-విధములుగ సంబోధింప బడుటచే, యథార్థముగ ఈ 'ఉన్న నేను' ఎవరి నైనది, దాని ప్రతిపత్తియేమి,' మొదలగు విచారణ మొంతయు ముఖ్యావసరముగా కాన్పించుచున్నది.

తత్త్వోపదేశమందు ఏకైక మార్గముగ నిరూపింప బడిన మహావాక్య చతుష్టయ విచారణలో బోధనాపరమగు' తత్త్వమసి' యను మహావాక్యార్థమును 'లెస్సగ శ్రవణము' చేసిన ముముక్షువు, 'అహంబ్రహ్మాస్మి' యను తన అనుభవమును (అనుసరించి యుండుట, లేక, అగుట) వెల్లడి చేయుటతోనే కృతకృత్యత నొందినట్లు ప్రశంసింపబడుచుండుటచే, ఈస్వాత్మ మంత్రమని ప్రసిద్ధిగాంచు,'అహంబ్రహ్మాస్మి'యనునదే - తేజో బిందు 3-7 4

"సర్వమంత్రాన్ స్యముత్సృజ్య ఏతన్మంత్రం సమభ్యసేత్ ।
సద్యోమోక్షమవాప్నోతి నాస్తిసందేహమణ్వపి॥ "

లోవివరించినట్లు, సద్యోముక్తిలభించుటలో అణుమాత్రమైనను సంశయములేదని తెల్లమగుచున్నది. స్మృతియును భ.గీ.10-20

"అహమాత్మాగుడాకేశ! సర్వభూతాశయస్థితః"

యని వర్ణించినపుడు, ముఖ్యాధికారులకు సైతము, నిర్విశేష రూపమగు ఏ తదుపాసనమే కర్తవ్యమని స్పష్టము చేయబడి నది. అదెట్లనిన, శబ్దమునకు ఒక శక్తియున్నది. నిద్రలో నున్నప్పుడు పిలిచినవెంటనే "ఓయ్" యని నిద్రనుండిలేచుట మన నిత్యానుభవమే! అట్లే అనాదినుండి అజ్ఞానములో పడి

యున్న మానవుడు, నిద్రనుండి బైటకు శబ్దముచేతనే మేలుకువ గావింపబడినట్లు, "తత్త్వమసి" యను మహావాక్యార్థ జ్ఞానము వలననే తెలిసికొను వాడగుచున్నాడు. మరియు "ఆప్నోతీతి ఆత్మ" యను వ్యుత్పత్తిచే, సత్తాస్ఫూర్తులచేత సర్వత్రవ్యాపించి నదియు, "అ-హం" అను ఆద్యంతముల మధ్యనున్న అంబడి వర్ణముల కనచమైన "అహంపదవాచ్యము"ను నగు "అ సేద్వా స్తువే," సృష్ట్యనంతరమున జగత్ (గమ్యతే జన్మైరితి జగత్) అని వ్యవహరింప బడుచుండుటచే, శబ్దగమ్యమె యగుచు, భ. గీ. 10-8లో "అహం సర్వస్యప్రభవో మత్తస్సర్వం ప్రవర్తతే" యని వివరించినట్లు, సర్వైకైవంతముగ భాసించుచున్నందున, యథార్థములో "ఉన్నది నేనే" గాని, అనాత్మ యను దానికేమాత్రమును సావకాశము లేదు! అదెట్లనిన, దేహము, ప్రాణముతో కూడక పుట్టుట జరుగదు. ప్రాణము లేని శిశువును యంత్రసాయమున తీసివేయుటయనుప్రక్రియలో ఇది మనకు ప్రత్యక్షానుభవమగు విషయమే! అట్టిసమయమున ప్రాణము, శరీరములని చెప్పబడునవి రెండేమిటి? ప్రాణము చైతన్యమగుచు, శరీరము జడమయినపుడు ఆ రెంటికి కలయిక యెట్లు? కాని అట్టి చైతన్యవంతమగు ప్రాణము (ఆత్మ) ను గూర్చిన విషయ మెన్నటికిని తెలియదు. తెలిసినదనిన "అశరీర" మనియేగదా! (శరీరము కానిద నేగదా!), ఏదైన ఒక వస్తువునకు దానంతట దానికి పేరువచ్చునా? వ్యతిరేక ముగా చెప్పబడునా?

•

అనగా "స్తంభము" అని యొకవస్తువును చెప్పునపుడు, స్తంభము కానిదానిని "అస్తంభమనియు," అటులనే "అస్తంభము" కానిదానిని "అనస్తంభమనియు" చెప్పుదుమా? అటు

లనే యొక వస్తువును "ఆత్మ" యని చెప్పినప్పుడు, "ఆత్మ"
కానిదానిని "అనాత్మ" యని చెప్పనగునా? కాన "అనాత్మ"
యని యుండుచో దానికి ప్రత్యేకముగా పేరు ఉండవలెను.
కాని శరీరమనినను "ఆత్మయే" గాని "అనాత్మ" యని చెప్ప
రాదు. ఎప్పుడు, ఎవరికి, ఏదేది తెలియునో దానిని సరిగా
నిర్ణయించుటవలనే పేరుండును. అనగా మనకు తెలిసినది
చైతన్యవంతమగు ఆత్మయే (నేనే)! దీనినే వరాహోపనిషత్‌లో
"సత్యం జ్ఞాన మనంతం యత్పర బ్రహ్మాహమేవతత్" అని
వర్ణించినప్పుడు, కాలత్రయాబాధ్యమైయుండుట సత్యమనియు.
స్వయముగ ప్రకాశించుట జ్ఞానమనియు, దేశ కాల వస్తు పరి
చ్ఛేదము లేకుండుట అనంతమనియు, అట్టి పరబ్రహ్మమే తా
ననియు విశదము చేయబడినది. అందు మనకు ప్రత్యక్షముగ
తెలిసినది "ప్రకాశించుచు ఉన్న నేను", తెలియనిది "అంతవంత
మగు దేశకాల వస్తుపరిచ్ఛేద జగత్తు", అట్టిదానిని (జగత్తును)
నిషేధపూర్వకముగ తెలిపి, దేశకాల వస్తు పరిచ్ఛేదరహిత
మైన దానిని నిరూపించుటకే "న" కలిపి, "అనన్త" మని
సూచింపబడినది. ప్రపంచములోని ఉపమానములు చూచినను
కొయ్య కారణమై స్తంభము కార్యమైనప్పుడు కారణమైనకొయ్య
దృష్టిలో కార్యమైన స్తంభము లేదు. అటులనే కారణమైన
పరమాత్మ దృష్టిలో కార్యమైన జగత్తు లేదు. అందువలన
కొయ్యదృష్టిలో కొయ్యయే యున్నటుల, పరమాత్మదృష్టిలో
నున్నది పరమాత్మయే! గాని స్తంభమును గురించి చెప్పవలసి
వచ్చినప్పుడు "స్తంభము కొయ్యకన్న వేఱుగాదు" అనే
చెప్పవలయును. అందువలన కార్యమగు స్తంభమునకు (అనగా
నామరూపాత్మక జగత్తునకు) అనిర్వచనీయమని పేరు పెట్టి

నిలసివచ్చినది. అనగా "స్తంభము కాదు" - "అసలు లేకను పోలేదు," ఇటులనే వ్యవహారము జరుగుచున్నది. అయితే కొయ్యనుగురించి చెప్పవలసి వచ్చినప్పుడు, కారణమగు 'అది' స్తంభ మెంతమాత్రము కాదనే చెప్పవలెను. "స్తంభము" అయిన దనగానే దానికొక మొదలున్నది. ప్రారంభించగానే దానికి దేశ-కాల-కలనము లున్నవి. కాని యీ మూడును లేనిది "కొయ్య" ఈకొయ్య స్తంభాకారముగ మారినప్పటికి 'కొయ్య' లేదు. 'కొయ్య' అనగా 'కొయ్యతనము' పోయిన గదా ? లేదు. కొయ్యతనము స్తంభము కాకపోయినపుడు, అయినపుడు, చెడిపోయినపుడుకూడ ఉండనేయున్నది. అప్పుడు స్తంభముఉన్నదా? లేక కనబడుచున్నదా? కావున కనబడున దంతయు ఆరోపితమే ! ఉన్నది కనబడదు. అటులనే 'ఆత్మ' అనాత్మయొక్క శూన్యం. ఇట్లు శూన్యమని చెప్పబడిన దాని హృదయము గ్రహించనేరమినే, బుద్ధుని శిష్యులయందు శూన్యవాదములు ప్రబలుటకు హేతువు గాని యథార్థములో ఉన్నదంతయు "దృశ్యశూన్యమైన 'దృక్' మాత్రమే!" యని గ్రహించనగును. దీనినే యొకపాశ్చాత్య తత్త్వవేత్త అనిర్వచనీయమనుదాని నీ క్రింది విధముగ యుక్తితో నిరూపించ గలిగెను. ఆంగ్లవాక్యమగు 'This is a pot' అను దానిని పరిశీలించినచో, 'This is not a pot' అనుఅర్థమునే యొసగునట. అదెట్లనిన, మొదటి వాక్యమగు 'This is a pot'లో 'Is' అనునది 'This' అను సర్వనామమునకు క్రియ (Predicate) అగుటచే, 'Pot' అను నామమునకు 'క్రియ' ఏమిటాయని విచారించగా, ఏదైన కావచ్చును గాని 'Is' మటుకు కాదని నిర్ణయమునకు రాగలిగెనట. అనగా

'anything other than 'is' ' గాన 'Pot' అనునది (1) అనిర్వచనీయమనియు, (2) కార్యమగుటచే కారణముకన్న వేఱుగాదనియు (3) 'Is' అనిన 'Is not' అని అర్థమేననియు ఊహించెనట.

ఇదియే మరొకవిధముగాగూడ విచారించిన 'ఉన్నది నేనే' యని స్పష్టము కాగలదు. ఈపంచభూతములలో సామాన్యముగా, 'ఉన్నది-ఉన్నది' యనునదితక్క మరొకటిలేదు. 'స్తంభము' అనునప్పుడు 'ఉన్నదికొయ్య'. స్తంభములేనపుడు "ఉన్నది కొయ్యయే" అట్లనే "నేను జీవించి యున్నప్పుడు "ఉన్నది నేనే"- పోయినపుడు "ఉన్నది నేనే". పోయినదొక ఉపాధియే"! (అనుటచే నేప్పుడినశరీరమే). అనగా స్తంభముగా నున్నప్పుడు, లేనప్పుడుగూడ కొయ్యయే! గాన ఉపాధి రూపముగా నున్నప్పుడు లేనప్పుడుగూడ "ఉన్నది నేనే". అనగా ఒకప్పుడు "ఉన్నది"——స్తంభముగా నున్నది, మరొకప్పుడు ఉన్నది——స్తంభములేకుండా 'యున్నది'. అనగా సాదృశ్యమైన వస్తువు సమానవస్తువుగా చూచుటచేతనే సంసారము ఎడతెఱిపిలేకుండా జరుగుచున్నది. అందువలన మన కర్తృత్వమంతయు, ఉండని శరీరమును ఉంచుటకొఱకే ప్రయత్నము! గాన నేను (ఆత్మ) మారకుండగనే అనేకముగా వ్యవహారములో నుండుట యగుచున్నది - ఎట్లు రజ్జువని తెలియనపుడు "ఉన్నది" ఆ రజ్జువనుచు ఉండను. తెలిసినది పాము. అనగా రజ్జువుతో సంబంధము లేకుండనే యీపాము మొదలగు సర్వ వ్యవహారము జరుగుచున్నది. అట్లే యీప్రపంచక్షోభయును—గాన ఆత్మ యెల్లప్పుడు చైతన్యవంతమే! జడరహితమే! ఉన్నదొక్క చైతన్యమే. శరీరాదులనునవన్నియు నామమాత్రమే.

అనుటతోనే వాటి అధిష్ఠానము. అనగా పారమార్థికమున జగత్తునకు సృష్టికర్తనుగా బ్రహ్మను నెఱుగుట అజ్ఞాన ప్రవర్తితము. స్వసాక్షినగు నా సాన్నిధ్యమాత్రంబుననే నా ప్రకాశబలముచే దేహేంద్రియ ప్రాణ మనో బుద్ధ్యాదులకు తమ తమ విషయములందు ప్రవృత్తియు, నివృత్తియు, ఇష్టానిష్ట సుఖదుఃఖాది జ్ఞానంబును సిద్ధించుచున్నది. గాన ఇట్టి నా అసలు స్వరూపమును - ఉపాధి కృతస్వభావమును గుర్తించి, జగత్తునందు ఉదాసీనునివలె సంచరించుటయే నా సహజ ధర్మము. అదియే బంధరహితమైనదియు, శాంతినొసగూర్చు నదియునైయున్నది. కాననే

శ్లో॥ అస్య ద్వైతేంద్రజాలస్య యదుపాదానకారణమ్ ।
అజ్ఞానం తదుపాశ్రిత్య బ్రహ్మకారణముచ్యతే॥

ఇట్లు మిథ్యాభూతమగు ద్వైతమను నీ యింద్రజాలమున కేది యుపాదానకారణ మయిన యజ్ఞానము గలదో దాని నాశ్రయించియే బ్రహ్మకారణమని చెప్పబడుచున్నది. అనగా ఆత్మ యని పిలువబడు ఆ మారనివస్తువునకు ఒక శక్తి యున్నది. "మారినట్లుగాఅనుకొనుట,ఎంతమారినను మారటములేదు", అనే సామర్థ్య మా శక్తికి ఉన్నది. ఈ మారునదిగూడ (Universal energy) మారని యొక దానిమీద ఆధారపడి యుండవలెను. అనగా ఆ శక్తి ప్రలయములోనికి పోగానే, సృష్టిలోగూడ ఎడతెగకయుండునట్టి యొక అధిష్ఠానమున్నది. ఆత్మ యని పిలువబడు ఆ సద్వస్తువే యీ అధిష్ఠానశక్తికి (అన్వయఅధిష్ఠానమునకు) అధిష్ఠానము (కూటస్థఅధిష్ఠానము) ఇదియే సర్వాధిష్ఠానం. దీనినిగుఱించి సామాన్యాధిష్ఠానమను అన్వయాధిష్ఠానమునకుగాని, వృత్తులకుగాని తెలియదు.—

ఎట్లు పీట అనేది యొక వృత్తి. కొయ్య మఱొక వృత్తి. ఈ రెండు వృత్తులకు సర్వాధిష్ఠానం కొయ్య. ఈ వృత్తుల సంగతి యొకదానికొకటి తెలియదు. ఆ కొయ్యకు తెలియదు - కారణం అది మారలేదు గాన- అయితే యీ వృత్తులసంగతి, అధిష్ఠానం సంగతి తెలిసికొనునదెవరు? ఇది తెలియకపోవుట చేతనే "అధిష్ఠానమే తెలిసికొనుచున్నది" అని లోకవాడుక. గాని యథార్థములో ఇక్కడనే రెండధిష్ఠానములున్నవి. (1) ఈ వృత్తులను తెలిసికొనునదొకటి, (2) అట్లు తెలిసికొను చున్నాను అని తెలుపునదొకటి. అటులగానిచో (ఎప్పుడు కొయ్యయే తెలిసికొనునదయిన) "కొయ్యకు" అగుట స్వభావమే యగుచు, మోక్షప్రసక్తియే లేకపోవును గాన నిమిత్తోపాదానకారణములుగ రెండధిష్ఠానము లుండవలెను. గాన ఛాం. 6-2-2 శ్రు॥ "బహుస్యాం ప్రజాయేయ" యను దాని వివరణలో చూపినటుల, బ్రహ్మయే నిమిత్తకారణము, తానే ఉపాదానకారణమున్నూ; అనగా "బహుస్యాం" అని "అనుటయే" నిమిత్త కారణము - అగుటయే ఉపాదానకారణముగను గ్రహించవలయును. గాన అనుకొనుటయే జగత్తు. అనుకొనక ఉండుటయే బ్రహ్మ లేక ఆత్మ. గాననే (1) అభిమానించేవాడను, (2) అనుభవించేవాడను, అనగా 'నేనుసంసారి'నని సుఖదుఃఖముల ననుభవించే వాడనుగ వ్యవహరించుచున్నాను. అట్లున్నను, పారమార్థికమున "మోక్ష"మనే నిర్వచనముగలిగిన నా యథార్థస్వరూపమునే స్మరించినపుడు ఎట్టి కోరికల కవకాశముండును? ఒక్క "నేనే" యుండిన తాదాత్మ్యము లేదు. రెండవదగు నా "మనస్సు" అను (అనుకొను) శక్తి నాకుండుటచేతనే యీ తాదాత్మ్యము. ఇది

చూచినప్రతివస్తువుతో తాదాత్మ్యముబొందిన బంధము, చూడకపోయిన మోక్షమే, గాన మోక్షముకూడ తాదాత్మ్యమే!

ఇట్టి అధిష్ఠానపరాశక్తి (universal energy)కి వ్యక్తగతశక్తిని(individual energy)తొలగించుటయే కార్యము. ఈ పరాశక్తి పరబ్రహ్మకన్న భిన్నమనిగాని, అభిన్నమనిగాని చెప్పవీలులేదు. — ఎట్లు నాకంటె నా మనస్సు వేఱుగాక పోయినను, "నేనే"యున్నపుడు మనస్సు ఉండనవసరములేక, మనస్సునుచు నుండవలసివచ్చినప్పుడు "నేను" ఉండక తప్పదో అట్లు—దీనినే అమృతబిందూపనిషత్ లో— "మనోహిద్వివిధం ప్రోక్తం శుద్ధం చాశుద్ధ మేవ చ। అశుద్ధం కామసంకల్పగ్, శుద్ధం కామవివర్జితమ్॥" అనుచోట సూత్రప్రాయముగా సర్వాధిష్ఠమైన "నేనే" రెండుగ— ఈశ్వరునిగను, జీవునిగాను వ్యవహరించుచున్నానని తెలుపబడినది. గాన నిత్యమైన వస్తువొకటియే సత్యము. తదితరములన్నియు ప్రమాత్రువశములే గాన అట్టి ప్రమాతను సంస్కరించుటయే ప్రధానకర్తవ్యము. అట్లు సంస్కరించగా ప్రపంచమంతయు విలయమొంది, చివరకు మిగులునది దృశ్యశూన్యమైన దృక్కే! ఇదియే పాశ్చాత్యులు "There is an end of the matter"అని సామాన్యముగా వాడు దాని అంతరార్థమే.

గాన మనమీ ప్రపంచమును ప్రపంచదృష్టితో చూచుట కలవడుటచేతనే (బాహ్యదృష్టికి) ఈక్షోభ— ఎట్లు పాముకనంబడినట్లుచూచుట గలుగుటచే ఆ పాము కనంబడుచున్నదో అట్లు—గాన అట్టి దృష్టిమారవలయునని, పాముఅనునది లేనే లేదు. కేవలము నా మనోవిలాసమే! యని గట్టిగా తెలియవలెను. దీనినే మహోపనిషత్ లో—

"సఙ్కల్ప మనసే భిన్నే నకదాచన కేనచిత్;
సఙ్కల్ప జాతే గళితే స్వరూప మన శిష్యతే;
అహం, త్వం, జగత్యాదౌ ప్రశాంతేదృశ్యసంభ్రమే॥"

అనివర్ణింపబడినది, అనగా ఇది గుఱ్ఱము – నీవు మనిషి – ఇది స్తంభము ఇత్యాది వ్యవహారమునందెల్ల, మనము చూచునది విషయమగు దృశ్యము (ఇది-నీవు) నే! గాన మన మడుగునది 'దీనిని' గురించియే! గాన ఈ గుఱ్ఱము – మనిషి – స్తంభము – ఇత్యాదుల మధ్యనున్నది 'ఇదే' గాని ఆ 'ఉన్నది' యీ మాదిరిగా లేక 'ఖాళీగానున్నది' గాన మనము చూచుచున్నది 'ఇది' నే. అయితే యీ మధ్యవచ్చే "పదార్థములు" ఆ "ఇది"ని తెలియజేయుచున్నవి. అనగా ఈ దృశ్యమువల్లనే ఆ "ఇది" తెలియబడుచున్నది. అయితే ప్రతిలక్ష్యములోను, "లక్ష్యత" (చూడబడుట) అనునదొకటియున్నది. ఈ లక్ష్యత సర్వత్ర నున్నది. అయితే యీ వస్తువులు (పదార్థములు)వచ్చి ఆ లక్ష్యతను విచ్ఛిన్నముచేయుచున్నవి. గాన ప్రతి పరిచ్ఛిన్నానుభవముద్వారా మనకు కలుగుచున్నది అపరిచ్ఛిన్నానుభవమే! అనగా పరిచ్ఛిన్నమైన నాటినన్నిటినుండి వచ్చునది అపరిచ్ఛిన్నమైనసంపూర్ణమే! అయితే యీ కనుబడున దెవరికి? మనమెవరము? చూచేవాళ్ళ మగు మన మందఱము "నేను"లమే! (ఇది మన్నను, తలుపుతట్టునపుడు వచ్చు జవాబులగు, "నేను–నేను" అనువాటియందును, "నీవు" అని సంబోధించునప్పుడు "నేను" అని సాగు ఉపక్రమ ప్రత్యుత్తరము లందును ప్రత్యక్షానుభవమే). అనగా ఈ అన్ని "నేను" లకు వెనుకనున్నది ఒక "నేనే" ఒక్కొక్క "నేను" తనకెట్లు కనబడుచున్నదో అట్లు చూచుచున్నది. గాన ఈ అపరిచ్ఛిన్న

"ఇది"కి, ఈ అపరిచ్ఛిన్న "నేను"ను మధ్యనున్న అపరిచ్ఛిన్నత పోగానే శేషించియున్నది ఒకటే— "ఇది—నేను." గాన సర్వాధిష్ఠానమైన నాలోనే, "నేను—ఇది" కాగల గుణము (స్వభావము) ఉన్నది. అట్టే త్రాడుగా చూచుట, పాముగా చూచుట ఈ రెండు స్వభావములు నాలోనే యున్నవని గ్రహించినచో, "త్రాడు లేదు – పాము లేదు" గాన మిగిలినది అఖండాద్వితీయ స్వరూపుడను "నేన"ని చెప్పబడు "అహంపదలక్ష్యమే!" గాన యథార్థమును తెన్నుగ గుర్తించి "ఉన్నది – ఉన్నట్లు చూచుటయే" మనము చేయవలసిన పని. ఇదియే సమ్యగ్దర్శనము. ఇట్టి స్థితియందు, భ.గీ. 11–1లో వివరించునట్లు, "మోహో ఽయం విగతో మమ" ఆత్మాఽనాత్మవివేచనలేని అవివేకపు బుద్ధిపోయి, (అనగా "ఇది" అని చెప్పుటచే అంతకుపూర్వము మోహమే తానయిపోయిన యవివేక మోహమును సూచిన వాడాయెనని శ్రీ మదానందగిరి వ్యాఖ్యానము.) భ.గీ 18–73 లోని "కరిష్యే వచనం తవ" అనినట్లు, కోరలుత్రీసిన యీ అజ్ఞాన వృత్తుల మధ్య నిర్భయముగా సంచరించ గలము.

అట్లు "తెలివి" యే స్వరూపమగు "నేను" సూర్యునివలె స్వయంప్రకాశమానుడ నగుటచేతనే, నా స్వభావముచే తెలిసికొనువాడనుగనుగూడ కల్పింపబడుచున్నాను. అట్లయినను, అవతల పదార్థములు లేనంతటనే నా జ్ఞాతృత్వము పోవచ్చును గాని నేను ప్రకాశించుటమాత్రము పోనేరదు. ఇట్లు దృశ్యవ్యాప్యత్వము లేక జడవర్గమునకే ప్రవృత్తి లేని సందర్భమున, సర్వప్రవృత్తులకును "అనుకొనుట"కన్న వేఱు ఉపపత్తి కానరాదు. గాననే "విశ్వం పశ్యతి కార్యకారణతయా..." అని వివరింపబడినది. గాన అద్వితీయమగు బ్రహ్మమునందు

జగత్తును గల్పించునట్టి మలినబుద్ధియగు పురుషుని బుద్ధియందు – ఎట్లు స్వప్నమందు స్వబుద్ధిసంభవగు ప్రపంచము గల్పింప బడుచున్నదో అట్లు – జగత్తు వుండనేయున్నది. గాన "బంధ షాంతఃకరణవాసనా కల్పితమే, నామ రూపాత్మకమైన యీ సర్వదృశ్యముగాని వాస్తవంబున లేదు" అనునది నిస్సంశయము. నేను–నాది యనునంతకాలము అది ఆత్మకాదు. ఎక్కడ "నేను" అనువాని లోనే ఆగిపోవునో అదే ఆత్మ! అత్యంత విలక్షణ మైనది. దీనినే అష్టావక్రసంహితయం దుదహరించినటుల, గ వివేకి

"ఆత్మాబ్రహ్మేతి నిశ్చిత్య భావాఽభావౌచకల్పితౌ ।
నిష్కామః కింవిజానితి కింబ్రూతేచ కరోతికిం ॥"

గుర్తించుచున్నాడో, వానికి కర్తృత్వమనునదే లేక – ఎటుల నిద్రలోనుండి మెలకువరాగానే "ఉండి సాగించు స్వప్నకర్మలు సాగించుటకు ప్రమాతాది త్రిపుటి లేనటుల – జ్ఞానికి అహం బ్రహ్మాస్మి" అని తెలియగానే త్రిపుటీరహితమై, తెలియుట – తెలియకపోవుటగూడ శబ్దమాత్రమే యనుచు, తానెల్లప్పుడు "సర్వానుభవానుభవ" మందే యున్నవాడగుటచే,

"ఘటమద్యాదికం సర్వం మృత్తికా మాత్రమేవహి ।
తద్వద్బ్రహ్మ జగత్సర్వం ఇతివేదాన్తడిణ్డిమః॥

అనునట్లు "ఉన్నదంతయు తానే ననియు– తనకన్న వేఱేమియు లేదనియు నిస్సంశయముగ తెలిసికొనగలుగు చున్నాడు (శ్రీ) విద్యారణ్యస్వామియు తమ "పంచదశి"యను ప్రకరణ గ్రంథములోని తృప్తిదీపములో,

"ఆత్మానం చేద్విజానీయా దయమస్మీతి పూరుషః ।
కిమిచ్ఛన్ కస్య కామాయ శరీరమనుసంజ్వరేత్ ॥" బృహ. ఉ.

అనుసరించుచున్నప్పుడు, ఏ పురుషుడు స్వయం ప్రకాశ స్వరూపుడగు ఆత్మను తానే యని యెఱుంగునో, అప్పుడు భోగ్యభోక్తృ స్వరూపమైన ప్రపంచమంతయు మిథ్యయే యగు నను గుర్తించునగాని ఆత్మస్వరూపుడగు తాను, ఏ తృప్తిచే దేనిని గోర్చి పరితపించునని ప్రశ్నించెను!

మరియు "ఆత్మైవేద మగ్ర ఆసీత్, బ్రహ్మైవేదం సర్వం, నారాయణ ఏవేదం, బ్రహ్మైవేదం సర్వమ్, అహమేవేదం సర్వం, సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ" ఇత్యాది శ్రుతులన్నియు సదసత్తులు సాక్షులుగాగల అతడగుడై, పరమార్థమునఆ సదసత్తులను పరుడై, ఏది దేనిచేత వ్యాపింపబడినదో అది "తన్మాత్రమే" యను న్యాయమున నదియే అనంతరూపమున వ్యాప్తమైనటుల భాసించుచున్నను, అద్వితీయమైనదే యగుటచే ఈ పై విషయమగు "ఉన్నది నేనే" యను దాని నెంతయు ధృవపఱచుచున్నవి. గాన రామతాపిన్యుపనిషత్, [–

"చిన్మయస్యా ద్వితీయస్య నిష్కళస్యా శరీరిణః ।
ఉపాసకానాం కార్యార్థం బ్రహ్మణో రూపకల్పనా॥"

లో చెప్పినటుల, లోకములో నేను – నీవు – ఇది, యిత్యాది ప్రత్యయములకు గోచరించునదంతయు అధ్యాసను జెందినదే యగుటచే, దానిని అధ్యారోపాపవాద ప్రక్రియానుసారమున గుర్తించిన యెడల "ఉన్నది నేనే" యనునదెంతయు స్పష్టము గాగలదు.

ఓమ్–తత్–సత్

# 20. జీవన్ముక్తి

శ్రు॥ "జీవః పశ్చాద్విరక్తః స్వకల్పిత చతుర్వింశతి తత్త్వం
పరిత్యజ్య, షడ్వింశః పరమాత్మాఽహమితి
నిశ్చయాజ్జీవన్ముక్తో భవతి॥" (పైంగల బ్రాహ్మణ. ఉ.)

పరిదృశ్యమానమగు ఈ చరాచర ప్రపంచమునందు సకల జీవరాసులు ఎల్లప్పుడు 'సుఖము'నే కోరుచుండుటయు, దానికొఱకు కష్టపడినను సఫలురగుటయు కల్లయ కనుభవమే! ఇంతజేసిన నది సులభముగ నందనేపోవుటయు, ఎంత స్వయప్రయాసలను బొందినను, అది తమ జన్మసాఫల్యమనతె దానికై వెనుగులాడుచుండుటయుజూడ, దానియందొక విశిష్టత యుండక తప్పదని స్పష్టమగుచున్నది. దీనినే బ్రహ్మోపహాస్యోపనిషత్ 20 వ మంత్రమున, 'ఆత్మకన్న వేఱుగాని బ్రహ్మము నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావమని చెప్పనే, లోకములోని సర్వజీవులును, తామెల్లప్పుడు (Eternally) జ్ఞానముతో (Knowing everything) ఆనంద (Happiness) మనుభవించుచు, ముక్తులై (Independent) స్వతంత్రులుగా (Ruling over others) ప్రకాశించుచుండవలెనని యే కోరుచుండుట సహజమని వివరింపబడెను. కావననే మానవులు సామాన్యముగా, మృత్యువనినంతనే భయపడుచు, తామెంత యవివేకముగ ప్రవర్తించుచున్న నంగీకరింపక, తుచ్ఛసుఖాలోలుపులై, తామెవరినీ లక్ష్యముసేయక, స్వేచ్ఛానుసారము ప్రవర్తింపనెంచుటయుండే దృష్టిగలవారగుచుండుటయు గానవచ్చుచున్నది. ఇన్ని విధములగు వికారచేష్టల కలవడినను, ఏకైకలక్ష్యము 'సుఖాపేక్షయే' యగుటచే, స్వార్థపరులై

[illegible]స్తువనగనే తోచనిదియైనను, ఆ జాగ్రత్స్వప్న[illegible]
[illegible]లుచుండుట! కాని యథార్థము [illegible]
[illegible] సూక్ష్మవిచారపరులకు [illegible] కలుగుచున్నది.
[illegible]కులు ఎంత[illegible]ప్రజ్ఞ[illegible] [illegible]
[illegible] నాగుచున్నారు. "ద్వితీయాద్వై భయం భవతి"
అనుశ్రుతుల భయకారణము [illegible] వస్తుప్ర[illegible] యనియేగదా! మరి ద్వితీయానుభవమునందు, [illegible]
తానొక్క [illegible]
నుండుట ప్రత్యక్షము. అట్లుగాక తనకన్న వేఱుగా
జాగ్రత్స్వప్నములందుగాంచు సమస్తదృశ్యమంతయు
యథార్థమేయని భావించునంతకాలము, ఆ వస్తుసంబంధ
లభ్యాఽలభ్యయోగములెట్లు [illegible]ములను గానిరావు
కాకుండును? అట్టితరి తానెల్లప్పుడు [illegible] యపేక్షించు
చుండుటచే, తనకన్యముగ గోచరించు దృశ్యమునొకట
యథార్థసత్యమని గుర్తించ ప్రయత్నించవలసియే యుండును.
అనగా ని దృశ్యమంతయు సత్యమైనదైనను గావలెను, లేక
కేవలము కల్పితమై భ్రాంతి (లేనిది ఉన్నదానివలె తోచుట)
మాత్రమైనను గావలెను. అందు సత్యమే యగుచో,
భ. గీ. 2–16 లో "నాఽసతో విద్యతే భావో నాఽభావో
విద్యతేసతః" అని వివరించినటుల, లేనిదానికి ఉనికియు, ఉన్న
దానికి లేమియు పొసగనందున, నిరంతర సుఖాపేక్షితుడనైన
'విషయి' నగు 'నేను'ను, సుఖబాధకములైన ఉత్పత్తి వినాశము
గల 'విషయము' లగు దృశ్యమున్నూ రెంటికిని ఉనికి అసంభ
వము. ఇది కేవలము ప్రత్యక్షానుభవవిరుద్ధము. ఇక
రెండవపక్షమగు నీ దృశ్యమనునది తనకన్న వేఱుగాకుండ

వలయును. అనగా ఉన్నత్రాడును మందదృష్టి నొకడు పాముగ పొరపడి, భీతిజెందునటుల, తానే తనయందు లేని పోనివన్నియు కల్పించుకొని భయమొందుచుండవలయును. యథార్థములో పంచదారముక్క మధురత్వమే పంచదార చిలకలోని శీర్షాది పుచ్ఛ పర్యంత అవయవ సముదాయము నందు నిండియున్నదైనను, "పంచదార"యను సామాన్య శబ్దముచేతనే తెలియనగు యా తీపిని విస్మరించి, విశేష నామరూపములగు అవయవ విభాగజనిత బాహ్యదృష్టియందే నిమగ్నులై, బాలురట్లు 'తమను తలయో కావలయును-తోక వలయు' అని కొట్లాడుదురో, యట్లే సృష్టికి పూర్వము, అవ్యాకృతనామరూపముగనున్న ఆత్మపదార్థమే సృష్ట్యనంతరము, విశేషనామరూపములకు లోనై, ప్రపంచముగ పరిగణింపబడు చున్నందున 'ఏనస్వరూపుడగు నా పరమాత్మయే' అనుస్యూతముగ సర్వవస్తుసముదాయమున ప్రకాశించుచున్నను, గుర్తించనేరని మందమతులకది భయకారణమును, భ్రాంతి నొసగునదే యగుచున్నదిగదా! నామరూపాదులతో వ్యవహరింపబడు వేఱువేఱు నదులలోని జలము, సముద్రోదకముకన్న భిన్నమా? అవన్నియు సాగరమును జేరిన పిదప వాటి పృథక్త్వమును గుర్తించనగునా? యథార్థములో నటులున్నను గుర్తింపనేరకపోవుటకు 'తెలియకపోవుటయే' గదా కారణము! అటులనే మానవుడు, తానఖండ అద్వితీయ పరిపూర్ణుడేయైనను, స్వభావజనిత జ్ఞానేచ్ఛాక్రియల సామర్థ్యమున తనయందులేని పరిచ్ఛిన్నతను తనయందారోపించుకొని, దేహేంద్రియ సంఘాత సంసర్గాధ్యాసవలన, "తానే దేహి"నని భ్రాంతిజెంది దేహధర్మముల తనవిగా తలంచి, 'జలమునుండి

చిన 'తత్త్వము' ప్రకారము 'ప్రకృతి' యనునది వాస్తవముగ లేకపోయినను 'నేను ప్రకృతిని' అని అనుకొనుటయే యీ ప్రకృతికి ఉనికి హేతువని వర్ణింపబడెను.

ఆ॥వె॥ ప్రకృతినొంటిగి తన్ను బన్నుగాఁ జూచు, వి
వేకదృష్టి బంచవింశకుండు
సంగరహితమైన షడ్వింశపదము, ని
స్సంశయముగ గాంచు నంశవర్య॥

(భార. శాంతి. 6-156)

ఈ ప్రకారము వాసనావాసితుడయిన వాడగుటచే, తన నైజ సచ్చిదానందరూపమును స్పృహకు తెచ్చుకొని గుర్తించుట యందు గలుగు అపరోక్షానుభూతిలోని తర తమ భేదములే సప్తజ్ఞానభూమికలుగ వర్ణింపబడుచున్నవి. అదెట్లనిన, జ్ఞానులు రెండురకములనియు, నందు తామే తెలిసికొని సుఖపడువారు కొందఱనియు, తాము తెలిసికొనినదానిని ఇతరులకుగూడ బోధచేయఁ సమర్థులగు తత్త్వదర్శులు రెండవరకమనియు చెప్పబడుదురు. వీరిరువురకును తెలిసికొనిన దొకటేయైనను, దాని వినియోగ ప్రయోగములందు భేదముగలదు. వీరినే శ్రీ విద్యారణ్యస్వాములవారు తైత్తిరీయ భాష్యమునందు "త్రివిధో బ్రహ్మవిత్" అని వర్ణించునపుడు, (1) లోకవిధాన ప్రధానులనియు (2) వివేకప్రధానులనియు (3) సమాధి ప్రధానులనియు విభజించిరి

కృష్ణో భోగి శుకస్త్యాగి రాజానో జనక రాఘవః।
వశిష్ఠః కర్మనిరతః పఞ్చైతే జ్ఞానిన స్సమా॥

అనునదిట వివక్షితము. దీననే మఱొకవిధముగ శ్రీ ఆచార్య స్వాములవారు సెలవిచ్చుట, "అవతారపురుషులని-సామాన్య

మనుజులని భేదము, జ్ఞానము గలిగిన నరులవలె లేవని భ.గీ. 2-11 శ్లోక వ్యాఖ్యానమందును, సూత్ర భాష్యం. 2-1-12, 3-3-32, వాక్యవిచారణ సమయమునను గాన్పించు చున్నది. అట్లగా జీవన్ముక్తులు కల్పాంతమునందు వారివారి పుణ్యాతిశయముచేతనే తిరిగి జన్మించుచుందురనియు వివరింప బడినది. మరియు శ్రీశంకరాచార్యుల సన్యాసాదిశిష్యులు చెప్పబడిరి.

అందలి యుక్తిప్రసిద్ధులకే జీవన్ముక్తి, విదేహముక్తి యను నామాంతరములచే ప్రసిద్ధి. అదెట్లనగా:

“సాధనచతుష్టయ సంపత్తి” యనబడు నిత్యానిత్య వస్తువివేకాది పూర్వక ఫల పర్యవసాయియగు మోక్షేచ్ఛ - శుభేచ్ఛ యనబడునది అందు ప్రథమము. గురువు నుపసర్పించి వేదాంతవాక్య విచారణయుక్త శ్రవణ మననాదులు రెండవ దగు-సువిచారణము. పిమ్మట నిదిధ్యాసనాభ్యాసముచే మన సున సూక్ష్మవస్తు గ్రహణ సమర్థత - తనుమానసయనంబడు మూడవస్థితి-ఈ భూమికలు మూడును సాధనరూపములయినవి-వీనినే యోగులు జాగ్రదవస్థయందురు. జాగ్రదవస్థయందువలె జగత్తు భేదబుద్ధిచే గనబడుచున్నది. అంత వేదాంతవాక్యము వలన, నిర్వికల్పక బ్రహ్మాత్మైక్య సాక్షాత్కారము చతుర్థ భూమిక ఫలరూప - సత్త్వాపత్తి. ఇందు సమస్త జగత్తుగూడ మిథ్యగా స్ఫురించుటవలన, నిది స్వప్నావస్థయని చెప్పబడు చున్నది. ఈ భూమిక బొందిన యోగి బ్రహ్మవిదుడని ప్రశంసింపబడుచున్నాడు. ఇందుమృత్యువందగువానికి జీవన్ముక్తి లేకున్నను విదేహకైవల్యమునుగుఱించి సంశయము లేదు. పంచమ - షష్ఠ - సప్తమ భూమికలో జీవన్ముక్తికే అవాంతర

భేదములు. ఇచ్చట సవికల్పక సమాధినభ్యసించుటచే మనసు విశుద్ధముగాగా నిర్వికల్పసమాధి సిద్ధించును. ఇదియే అసంసక్తియని పిలువబడు సుషుప్తితుల్యమగు ప్రథమ సుషుప్తి భూమిక. నిమిత్తములు గలిగినపుడును, అరూఢస్థితినుండి చ్యుతినొందక, ప్రారబ్ధ సుఖదుఃఖముల ననుభవించుచున్నను మద్యపాయులవలె నొడలెఱుంగక యుందురు వారు. అందుండి తానే లేచుటవలన ఆ యోగి బ్రహ్మవిద్వరుడని సంబోధింపబడుచున్నాడు. దీనినే భ. గీ. 2-54-72 శ్లోకములలో, వ్యుత్థానసమాధిస్థితులను పేరున స్థితప్రజ్ఞుని లక్షణములుగ వర్ణింపబడినవి. దీనిపిదప గాఢ సుషుప్తియను పేరుగల షష్ఠమభూమిక బ్రహ్మవిద్వరీయునిది. ఇందు చిత్తనిరోధాభ్యాసాతిశయముచే చిరకాలము నిలిచియుండునట్టి యీ యవస్థ పదార్థాభావనయని పిలువబడుచున్నది. ఇందుండి తానై లేవక పరప్రయత్నముచేతనే లేచును. ఇట్టి యుత్తము జ్ఞాని బాహ్యాంతర సమాధిస్థుడై, చిత్రవిచిత్రములగు ప్రారబ్ధ ఫలము లనుభవించుచున్నను, హర్షవిషాదములు లేనివాడై, స్వరూపస్థితిని విడువక, సదా శాంతచిత్తుడై యుండును. ఇకనే సమాధ్యవస్థనుండి తన యంతటను సప్రయత్నమునను గాని వ్యుత్థితుడు కాడో, స్వపరభేదదృష్టియు లేకపోవుటచే, ఎల్లప్పుడును తన్మయుడైయే తన దేహవ్యవహారము నైతము నితరుల నిర్వహింప, దాను పరిపూర్ణపరమానందఘనుడై యుండునో యతని తురీయమను సప్తమభూమిక. దీనిం బొందినవాడు బ్రహ్మవిద్వరిష్ఠుడని కీర్తింపబడుచున్నారు. ఈతండు అనిర్వచనీయావస్థ పొందినవాడు. వాక్కులకు గోచరముగాని పరమావధి. ప్రశాంతము. దీనినే విదేహ

ముక్తియని చెప్పబడును. ఎట్లు పాము కుబుసము పుట్టయందు మృతమై విడువబడినదై పడియుండునో యట్లే యీ శరీరము పడియుండును. ఇక నశరీరుడు - అమృతుడు - ప్రాణము. బ్రహ్మమే తేజస్సు అని శ్రుతులయందు వర్ణింపబడుచున్నది. దీనినే శ్రీ మధుసూదన సరస్వతీ స్వామివారు

తే.గీ. "నాలుగవభూమిగొప్ప జ్ఞానంబనంగ
బాహ్యములు మూడు భూమికల్ పొందు సాధ
నాభిధానంబు, భూమిత్రయంబు పరము
పరగు బరచు జీవన్ముక్త్యవస్థలనగ"

అని వర్ణించిరి. ఇటుల వర్ణింపబడిన జీవన్ముక్తిస్థితి, జాగ్రదవస్థ యందే, అభేదావస్థాత్రయమును బొందినవానివలె విషయములను తెలియక ఆత్మయందే దృష్టిగల తన్మయస్థితి యగుటచే వారు శాశ్వత సుఖానుభవముగల కృతకృత్యులనుటలో సందేహ మేమియు లేదు.

ఓమ్-తత్-సత్

## 21. 'బ్రహ్మవిదో.వరేణ్యం చ విహితమ్'

అనుదాని విమర్శ.

శ్లో॥ తూష్ణీమేవం స్థితస్తూష్ణీం తూష్ణీం సత్యం న కించన।
పరమాత్మా గుణాతీతః సర్వాత్మా భూతభావనః॥
(తేజోబిందు 4-41)

'నిశ్శబ్దం పరమం బ్రహ్మ పరమాత్మా సమీయతే'
(నాదబిందు)

అను శ్రుతివాక్యము మొదలు సామాన్య లోకోక్తి యగు 'మౌనేన కలహం నాస్తి' యనుదాని పర్యంతము వినబడు 'మౌన'పదమునుజూడ నిదియెంతయో ప్రశంసార్హమై సర్వోత్కృష్ట శాంతిదాయకముగ పరిగణింపబడుచున్న దనుటలో నతిశయోక్తి యేమియు గానరాదు. అందు మొదటి వాక్యమగు 'నిశ్శబ్దం పరమం బ్రహ్మ' అనుదాని చేత తేజోబిందు (I-20) 'యస్మాద్వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ యన్మౌనం మౌనిభిర్గమ్యం తద్భవేత్ సర్వదా జడైః' బ్రహ్మము మనోవాక్కులకు అగోచరమైనది. కావున జడములయిన వాగాదికరణములచేత పొందుటకు నశక్యమైనదని ఆయా ఇంద్రియములయొక్క వ్యాపారము వదలుట యనుదానిచే విశదమగుటవలన 'సిద్ధునియే' చెప్పబడుచున్నను, రెండవ వాక్యమువలన నది సాధ్యసాధక పరమనియుగూడ సూచితమగుచున్నది. అటులగాక పరిదృశ్య మానమగు నీ చరాచర ప్రపంచమంతయు సకల చైతన్య స్వరూపిణియగు పరాశక్తి స్వరూపమేయై, నామ రూపాత్మక మున విలసిల్లుచుండినను, దాని నిజస్వరూపము గుర్తించ జాలక శబ్దానుసంధాతలై రాగద్వేషాది ద్వంద్వముల కలవడి నట్టి మందమతులు యీ విభాగమున కతిదూరమైన వారగుచు సర్వానర్థములకు లోనుగావలసి వచ్చుచున్నా రనునదియు స్పష్టము. గాన ఇట్టి శబ్దజాలములోనుండి 'జ్ఞానముతోడ నుపరమించుటయే' మునియొక్క భావమగు 'మౌనము'గ నిర్వచింపనగు. 'మునుల' నిర్వచనము జూచినను "ఆత్మ మాత్రమే యథార్థమైనది - తద్భిన్నమైనదంతయు మిథ్య"అని సర్వదా మననము చేయువారలేగదా! అట్టి మౌనము,

బ్రహ్మను గుర్తించినవారికి విశేషశ్రేయోదాయకము, లేక, శ్రేయస్కరమనియే గుర్తించవలెనుగాని అవశ్యము కర్తవ్య మని విధిపరముగ నన్వయింప జనదు. ఎట్లన రెండవ వాక్య ములో, మానము సాధ్యమై, సాధనాపేక్షను గలిగియున్నది. అట్టి సాధనము-సాధకుడు-సాధ్యము అను త్రిపుటితో గూడినదగుటచేతను, "వికారమంతయు నామధేయమే" యగుటచేతను ఇది బ్రహ్మవిదున కనుపపన్నము. శ్రుతియును (బృహ. 6-4-20) "నానుధ్యాయాద్బహూన్ శబ్దాన్వాచో విగ్లాపనగ్ హి తత్" అనుచోట, "అద్వితీయస్యాత్మనస్స ద్వితీయజ్ఞానం ప్రమాదం" అని నిరాకరింపబడినది. దీనినే అమృత బిందూపనిషత్ శ్రుతియు,

> "గ్రంథమభ్యస్య మేధావీ జ్ఞానవిజ్ఞానతత్పరః।
> పలాలమివ ధాన్యార్థీ త్యజేద్గ్రంథమ శేషతః॥"

గ్రంథములే (శబ్దములే) ఒకానొక సమయములో గ్రంథులని నిరూపింపబడినవి.

మరియు-"మౌనం వ్యాఖ్యాప్రకటిత పరబ్రహ్మతత్త్వం" అనుచోట వివరింపబడినట్లు, బ్రహ్మవిదునకు మౌనస్వరూపమే యై, ఆధ్యాత్మికమందు 'స్వభావజమని' వర్ణింపబడు సహజ స్థితిని సూచించుచున్నది. అనగా అవిక్రుతమగు పరతత్త్వమును తానుగా గుర్తించిన బ్రహ్మవిదుడు, సహజమైన యీ వికార భూతమై నామరూపాత్మకమగు సర్వకృత్యము, సముద్ర, తరంగ, ఫేన, బుద్బుదప్రాయముగ భాసముగలిగియుండునేగాని -అనగా నీటిమయముగనే గాంచునటుల - స్వతః సత్తునుగలిగి సాధనాంతరములచే నిషేధింపబడవలసినదిగా నుండజాదు.

అప్పుడు స్వభావ - "స్వభావో నామ పదార్థానాం ప్రతి
నియతా శక్తిః అగ్నే రౌష్ణ్యమివ"- జనితమైనశక్తి విలాసమన
బఱగు శబ్దాదివిషయాదులు, వాటివలన గలుగు సుఖదుఃఖా
దుల యుదాసీనతిని గుర్తించినవాడగుటచే, 'సహించునే'గాని
యాదు తాదాత్మ్యమునుఁబొంది సంచరించడు. దానినే పలు
వుఱు శాస్త్రకారులు పలువిధములుగ అసంప్రజ్ఞాతము, నిర్వి
కల్పము, సహజము, విద్వత్ సన్న్యాసము, ఉన్మనీస్థితి,
మాయాశబలిత, ఈశ్వరత్వమని యెట్లు వర్ణించినను యీ
నివృత్తియోగిక స్వమాత్రస్థితియందు - "ఏ శబ్దార్థమునకును
విరోధంబుగాని శబ్దార్థంబుగలది" - నిస్తరంగ జలధివలె
"తూష్ణీం స్వభావముగ శేషించి స్వప్రకాశమాత్రముచే నుం
డుటయే" దక్క- వేఱొకటేమియు లేని హేతువున 'తత్పరం
పురుషఖ్యాతేర్గుణవైతృష్ణ్యమ్' అను సూత్రము ననుసరించి,
సంప్రజ్ఞాత సమాధిపాటవముచే గుణత్రయాత్మకమైన ప్రధాన
మునుండి వివిక్తుడగు పురుషఖ్యాతి సాక్షాత్కరించుచున్నాడు.
ఇదియే పరమవైరాగ్యమను చిత్తోపశమ పరిపాకమునగలుగు
మానసిద్ధి గాన బ్రహ్మవిదునకు లక్షణముగా జెప్పబడిన యీ
'మానము సిద్ధమే' గాని, సాధ్యమేమాత్రము గానేరదు.

ఇక రెండవదియగు సాధనాపేక్షితమైన సగుణధ్యాన
పరమగు 'మానము'. ఇత్యాది శ్రుతి (ఐత1-1-1) 'ఆత్మావా
ఇదమేక ఏవాగ్ర ఆసీత్' ననుసరించి తానేవరైనదియు, తన
కన్యముగ గోచరించు దృశ్యమంతకును కారణంబగు తన శక్తి
యొక్క విజృంభణమే యీక్షణాది క్రియారూపమగు అభివ్యక్తి
స్థితియనియు, ఆరోపితమగు నామరూపములు కేవలమసత్య
ములే యనియు దృఢమగుటకుగాను చేయబడు శ్రవణాది

పూర్వక ధర్మాధర్మవిచారణ. "బ్రహ్మయందు నామరూపాద్యనాత్మాధ్యారోపణ నివృత్తియే కార్య"మని శ్రీ ఆచార్య స్వాములవారు సెలవిచ్చినందునను, వాక్ప్రచారముున్న యెడ, నీవు - నేను, ఇది - అది ఇత్యాది విపరీత ప్రత్యయములు నశింపవు గనుకను, జాతిగుణక్రియాది వికారోపేతమైన శబ్దము నిర్గుణము, నిష్క్రియము, నిష్కలంబును, "శాంతం అద్వయం అని వర్ణింపబడు పరబ్రహ్మమును తెలియజేయలేదు గనుకను, వాసనాక్షయము మనోనాశము కొఱకు సదా విషయానుసంధానరహితతయు, మౌనమును అవశ్యమాచరణీయము. దీననే భ.గీ. 18-52 న 'యతవాక్కాయ మానసః' అని పేర్కొనబడినది. శ్రుతియును (బృహ. 5-5)

"తస్మాద్బ్రాహ్మణః పాండిత్యం నిర్విద్య బాల్యేన తిష్ఠాసేత్। బాల్యం చ పాండిత్యం చ నిర్విద్యాథ మునిరమౌనం చ మౌనం చ నిర్విద్యాథ బ్రాహ్మణః"॥

దెల్పుచు, శ్రవణమనన నిదిధ్యాసనములను నిశ్చయముచే పొంది, పుష్కలమైన జ్ఞానము గలిగినపిమ్మట "నేను బ్రహ్మమును" అను సాక్షాత్కారముగల బ్రాహ్మణుడు "అగుచు ఉన్నాడు" - అని తెలుపుచున్నది.

దీనికి అపరవైరాగ్యమని చెప్పబడు యతమాన, వ్యతిరేక, ఏకేంద్రసంజ్ఞలు అంతరంగికసాధనములుగాగల సంప్రజ్ఞాత సమాధియే పూర్వరంగమగుచు, పరిపాకవశమున, వశీకార మను పేరున పూర్ణవైరాగ్యమునకు హేతువగుచున్నది.

భ.గీ 6-35 శ్లోకమునను "అభ్యాసేన తు కౌన్తేయ వైరాగ్యేణ చ గృహ్యతే" అనుచోట "దృష్టాఽదృష్టేష్ట

భోగములయందు దోష దర్శనాభ్యాసమువలన తృష్ణ లేకుండు టయు, చిత్తముయొక్క సమాన ప్రత్యయావృత్తిచేత విక్షేప రూపమయిన చిత్తప్రచారము నిగ్రహించుటచేతను. "మనసో వృత్తిశూన్యస్య బ్రహ్మాకారతయాస్థితిః" అను యోగశాస్త్రాను సారమున ఉపరతి వృత్తికంబై, పరమాత్మాకారంబున బరి ణతంబై నిలుచుచున్న" దని విశదీకరింపబడినది. గాన వాక్సం యమహేతువగు మనస్సంయమమే మౌనము. అనగా "సగుణమునుగాని - నిర్గుణమునుగాని యనుసంధించుచుండు టయే మౌనముగాని వాఙ్మాత్ర నిరోధముగాదు. అట్లుగాదేని పశ్వాదులకుగూడ మౌనము గలదనవలసివచ్చు" నని భ.గీ. 17-16 శ్లోక వ్యాఖ్యానమున శ్రీ ఆచార్యస్వాములవారే శెలవిచ్చియున్నారు.

గాన యిూ పైన జెప్పబడిన ద్వివిధమగు మౌనము నందేదేని యనుసరించక విషయములనుండి ఇంద్రియములను మరల్చనేరక, రాగద్వేషాది సంకులమగు ప్రవృత్తియందే సదా చింతనజేయుచు, కేవలము వాఙ్నిరోధము మాత్రమే (మాటలాడకుండుట) చేయుచుండినంతమాత్రమున నది "కాష్ఠ మౌనమే" యగుగాని శాంతిసౌఖ్యముల నెన్నటికి నొసగూర్చ నేరదు. కదాచిత్ గా తాత్కాలిక విశ్రాంతి బొందగలిగినను పరమోత్కృష్టమైన శాంతిని బొందనలెనన్నచో పై జెప్పబ బడిన సగుణ, నిర్గుణరూపమైన మౌన మవలంభించుటకన్న వేఱుమార్గములేదు. అప్పుడే కృతకృత్యులు గాగలరు. అట్టి వారలే లోకకల్యాణము గావించుచు, శాశ్వత శాంతిప్రదా తలు గాగలరు.

ఓమ్ - తత్ - సత్.

# 22 అమృతత్త్వము

"నకర్మణా నప్రజయా ధనేన త్యాగేనైకే అమృతత్త్వమానశుః"

(కైవల్యోపనిషత్)

మృత్యువనునదానిని పలువురు పలువిధములుగ, తమతమ సంస్కారముల ననుసరించి సమర్థించుచున్నను, ఔపనిషదులు మాత్రము "ఏకమేవాఽద్వితీయం బ్రహ్మ, - ద్వితీయాద్వై భయం భవతి" ఇత్యాది శ్రుతుల నాధారమున మృత్యువను నది కేవలము "అవిద్యా కామకర్మమే" నని నిర్ధారణచేసి యుండిరి. దీనినే "ప్రమాదోమృత్యుః" అని వర్ణించుచు, అనాత్మయందు ఆత్మను భావించుటయే మృత్యువని "సనత్సుజాత మహర్షులవారు తమఅభిప్రాయమును తెలియజేయుటలో, "అతః ప్రమాదాన్నపరోఽస్తి మృత్యుర్వివేకినో బ్రహ్మవిదః సమాధౌ" (వి-చూ) సూచించునట్టుల స్థానత్రయ ధర్మవిలక్షణుడయిన ఆత్మకు జననమరణములులేక యేకమేవాద్వైతమైనను, నానాత్వమును అవిద్యచే దానియందారోపించుటచే భయమును జెందినవారై, ప్రమాదవశమున (పొరబడుటచే) ఒక భయము నుంచి మరొక భయమును బొందుచున్నారనియు, అట్టితఱి అప్రమాద స్థితియను తన్ను తానెఱిగి, తానే బ్రహ్మమను "దృఢాపరోక్షానుభూతియే" నప్రమాదాత్ పరమాప్నోతి కశ్చిత్" అనునట్లు, మృత్యుంజయత్వమను, అమృతత్వసిద్ధి యని తెలవిచ్చిరి. దీనినే భయకారణమగు ద్వైతదృష్టిగల వారలై, భిన్నభిన్న దృష్టులలో నొకదానివెంబడి మరొక దానిన బొందుచు, బ్రహ్మమునందు లేని నానాత్వమున్నట్లు తెలియుచున్నాడో, యతనికి "మృత్యోస్సమృత్యుమాప్నోతి"

యనునదే ఫలమని బృ॥శ్రుతి 6-4-19 స్పష్టముచేయుచున్నది. గాన మృత్యుంజయు లనగా గ్రహాతిగ్రహము (నామరూపములు) లను ఆధ్యాత్మికాదిభూతములు రెండును లేనివారై (ఇటుల చెప్పుటలో ఆధిదైవతము రెంటికి సహాయపడుననే సూచన) అనగా నిమిత్తములైన శబ్దాది విషయములనుండి విడివడి, అపరిచ్ఛిన్న స్వరూపుడయిన తనను తాను గుర్తించుటయే! గాన మృత్యుపదమునకు కర్తృత్వాభిమాన మనియు, (అనగా చేయవలయుననెడి యభిలాష) అదియే సంసార బంధరూప దుఃఖహేతు వనియు చెప్పనగు. ఇట్లభిలషింపతగినవి అతిగ్రహములని చెప్పబడు విషయములును, గ్రహములని పిలువబడు ఇంద్రియములునగుటచే, నీరెండును మృత్యుహేతువులే! ఏదేది నామరూపాత్మకమో అదంతయుమృత్యువునకు 'అన్నం' అనగా పుట్టినదెల్ల నశింపక తప్పదనిదానిఅర్థము. అందువలననే విరాడ్ఢిరణ్య గర్భాదులు సైతము మృత్యుగ్రస్తములే! ఒక్క సర్వాత్మకమయిన పరమాత్మయే మృత్యువునకు మృత్యువు.

ఈ సర్వము నామరూపాత్మకమై భావనమాత్రమే యైనను, దృఢమయిన హేతువుచే, ఘనీభవించిన ఉప్పుకల్లు వలె శరీరాదులుగ నేర్పడి, చతుర్వింశతి తత్త్వములనియు, వాఙ్మనోప్రాణాదు లనియు సర్వవ్యవహారములు యథార్థము వలె సాగుచున్నను, భావనచేత, యేర్పడిన యీ సర్వదృశ్యముతోటి సంబంధము, తిరుగ బ్రహ్మభావన చేతనే విడుదల చేసుకొనవలయును గాన, దృశ్యవర్గమునుంచి - ఎట్లు సుషుప్తిలో విడివడి మనము హాయిని బొందుచున్నామో అట్లు - స్వప్నజాగ్రతలలోగూడ, చిద్రూపముగనున్న యీ సర్వమునను, నామరూపాదులను విడిచి,

శ్లో॥ మయ్యేవ సకలంజాతం మయిసర్వం ప్రతిష్ఠితమ్
మయిసర్వం లయంయాంతి, తద్బ్రహ్మాద్వయమస్మ్యహమ్॥
(కైవల్య)

నాకన్న భిన్నముగాదను సమ్యగ్దృష్టిలో చూడగలిగిననే గాని హాయిని బొందలేరని స్పష్టమగుచున్నది. ఏట్లనగా నామ రూపాత్మకమగు నీ వికార జాతమంతయు, 'అనుకొనుట' (సంకల్పము) చేతనే సాగుచున్నదినుటచే

శ్లో॥ 'సమస్తం కల్పనామాత్రం ఆత్మా ముక్తస్సనాతనః'
(అష్టావక్ర సంహిత)

ఉప్పుగడ్డలో నున్నది ఉప్పునీరు + కఠినత్వమేనై, అట్టి ఉప్పు కల్లు నీటిలో వేయుటచే వెంటనే నీరయిపోగా కఠినత్వము కానరాక పోయినను, జలమంతయు ఉప్పునానేయుండి గడ్డ మటుమ కనబడనట్లు, యీ మహాభూతమైన పరమాత్మలో యిపుడు మనకున్న అనుభవములచే గడ్డకట్టి 'అహమితి' అనుభావము- ఎట్లు సూర్యుడు- వాయువు సహాయమున ఉప్పునీరు గడ్డకట్టునో యట్లు - అజ్ఞానముచే (అనుకొనుటచే) ఉద్భవించుచు, 'తాను కర్తను, భోక్తను' అను జీవభావమును బొందుచుండును. తిరిగి 'శాస్త్రాచార్యోపదేశమువలన నది తీసి వేయబడగా- ఎట్లు తిరిగి ఉప్పు, నీటియందు వేఱుబడదో యట్లు కేవలము 'విద్యా' స్వరూపమైన బ్రహ్మభావననే బొందగలుగును. గాన నిత్య (నిద్ర) నైమిత్తిక (మరణము) ప్రాకృత (సృష్టి), ఆత్యంతిక (బ్రహ్మభావన) ప్రళయములని, చెప్పబడునవన్నియు, శబ్దవిస్మృతిరూపమగు శక్తివిలాసమేనై, నదియొక్క నామరూపములను త్రోసివేయగా మిగిలిన సముద్రజలమురీతి,

శ్లో॥ యథానద్యః స్యందమానాః సముద్రేఽస్తం గచ్ఛన్తి
నామరూపే విహాయ,
తథావిద్వాన్ నామరూపాద్విముక్తః పరాత్పరం పురుష
ముపైతి దివ్యం. (ముండకం 3-2-8)

ప్రళయమను 'యేకీభావము' బొందినంతనే స్వరూపనిష్ఠ గల విద్వాంసుడు, 'పూర్వప్రజ్ఞ యందు తానన్మాత్రముగ బృ 6-1-6 లో చెప్పినటుల శేషించి స్వావస్థను బొందును.

ఇటు 'అనుకొనుట' చేతనే ఆరంభమయి, "ప్రారబ్ధ" మను పేర వ్యవహరింపబడు యీ శరీరత్రయమునకు మూల కారణంబగు వాసనామయభావన, విద్వాంసునకు క్రమక్రమముగ, 'ప్రారబ్ధంభోగతో నశ్యేత్', 'అవశ్యమేవ భోక్తవ్యం కృతం కర్మ శుభాఽశుభం, అనునట్లు, ఆరబ్ధకార్యములగుటచే, ఫలానుభవావసాన పర్యంతము, కౌమారాద్యవస్థలవలె దేహపాతమును యొక సామాన్యస్థితిగ నుండునేగాని, నూతన శరీరోద్భవమ్మున కెన్నటికిని హేతువులు గానేరవు.

ఇక ఆత్మాఽనాత్మ వివేకశూన్యులగు మూఢులకో తమలోనుండు ఆత్మను యెఱుంగక, అనగా తామే అవినాశి యగు నాపరమాత్మ స్వరూపుల మని తెలుసుకొనలేక పోవుటచే, సంసారకూపమను నీమృత్యుభీతి ననుభవించుచు, జననమరణ ప్రవాహములో నరుగుచున్నారు. మరియు 'ప్రమాదో ధీమతామపి' యనునట్లు యీ విధముగ పొరబడుట లోకమున నైసర్గికమైనను విశేషమైన మహాపురుషప్రయత్నము చేతనేగాని దీని బారినుండి తప్పించుకొన సాధ్యము గాకున్నది. ఇట్టి మహోత్కృష్ట పురుషప్రయత్నము కేవలము సాధకుని

[illegible]జ్ఞానమిచే సాక్షాత్కరించిన [illegible] స్వీకేతాదిపరిస్థితుల వలన స్పష్టమగుచున్నది. [illegible] [illegible] [illegible]నని [illegible] [illegible] చేయుటలో [illegible] [illegible] [illegible] [illegible] [illegible]. అతి శీఘ్ర [illegible]లములోనే [illegible] [illegible] [illegible] [illegible]త్వమును [illegible]గలదని నిరూపించుటకై: [illegible] [illegible] ప్రపంచమును స్వప్నమాత్ర [illegible] భిన్నముగా చూచి దాని యొక్క సుఖదుఃఖములను [illegible], మెలకువ [illegible] నే తనకన్న యది భిన్నముగాదని దాని యథార్థస్థితిని గుర్తించి యెట్లు విలాసమాత్రముగ జూచునో, అట్లే జాగ్రత్ప్రపంచమునుగూడ చూడవలెనని ఉపమానపూర్వకముగ, 'పాములాని త్రాడును పామనుకొనుటకు అధ్యాస = (అతస్మిన్ తద్బుద్ధి) గ ఈ శక్తి విలాసమగు దృశ్యమంతయు, కేవల మాత్మయం దారోపితమే గాన భయకంపాదుల కెంతమాత్రము తావు లేదని సూత్రప్రాయముగ బోధజేసెను.

మరియు బృ 7-1-2 లో సూచించినటుల 'బ్రహ్మ సత్యం' అనుదాని వివ్యాఖ్యానమందును "స-తీ-యం" అను వర్ణ విభాగ విచారణయందును ఆద్యంతములు (స-యం) మృత్యురూపాభావములనియు మధ్యవర్ణము (తీ) "మృత్యుర్వనృతయో సకార సామాన్యాత్" అని అనృతమైన మృత్యువును నిషేధించుచు ఉభయత్ర సత్యబాహుళ్యమునే నిరూపించి అట్లు గుర్తించిన ఉత్తములను యేయొక సమయమునను ప్రమాదమున కవకాశము లేదని సూచింపబడెను. అట్లు యథార్థములో అఖండానందాంబుధిఁ బోలుచు రెండవదను దానికి స్థానమే లేకపోయినను స్వకీయ సామర్థ్యముచేతనే సముద్రమునందు

వాయుసంబంధమువలన ననేకములగు జలతరంగములుబుట్టుచు గిట్టుచున్నట్లు నేనుపుట్టితిని - ఉంటిని - చచ్చెదను - ఇత్యాది విపరీతజ్ఞానము లుద్భవించు చున్నట్లుండును. గాన పుట్టుట గిట్టుటలనునవెట్లు తరంగములకేగాని సముద్రము కేమాత్రము జెల్లవో అట్లే సర్వాధిష్ఠాన అఖండ పరిపూర్ణునియందు జనన మరణాది షడ్భావ వికారములు చెల్లనేరవు. అది కేవలము భ్రాంతి మాత్రమే !

ఇట్లు బ్రతుకుచున్నను, అది తెలియక "బ్రతుకే తానయి పోయిన" అవివేకి పైనపేర్కొనబడిన విధముగ మృత్యువనున దొకభావనమాత్రమేననియు తాను వాటికన్న విలక్షణుడనని గుర్తింప నేరకపోవుటచేతనే జననమరణ నదీ ప్రవాహములో జలావర్తనమున కీటకముకవలె తిరుగుచుండు టగుచున్నది. చీకటిని చూడవలయుననిన మనము చీకటిలోనే యుండవల యునుగాని దీపసహాయముకోరిన మనము చీకటినిచూడలేము గదా ! అట్లులనే మనము బ్రతుకును చూడవలయు ననిన బ్రతుకవలయునేగాని బ్రతుకే మనమయిపోకూడదు. అట్లులనే చావునుకూడ చూడవలయునని బ్రతికియుండగానే లోకము నను తాను శవమైనప్పుడే తన చావును తాను చూడగలడు. మృత్యువును జన్మాంతరమందు "అనుభవించి" యుండినందునే మృత్యువు "స్మృతి" మాత్రముననే అంతభయము గొల్పున దగుచున్నది,

దీనినే శ్రీ భగవాన్ రమణమహర్షులవారు తమ అను భవమును పురస్కరించుకొని " స్వరములు ఎన్నిరకములుగ వినవచ్చుచున్నను సప్తస్వరములకు శ్రుతియే ఆధారమై యే మాత్రము చలించనట్లు తానే సకల ప్రపంచమున కాధారమై

తనవల్లనే సర్వము సాగుచుండినను తాను మాత్రము ఎపుడు తెలిసి లేక సాగు నీ భావసంపదలకు విలక్షణుడై యాత్మారామిముఖుడైననేగాని అభయస్థితియను నామాంతరముగల నొప్పు అమృతత్వమును పొందజాలడు" అని తెలిపెను.

లోకములో సామాన్యముగ చావను కారణముండవలయుననియు ఆ కారణమును సరిచేసుకొనుచుండిన తాము శాశ్వతముగ జీవించియుండగలమనియు నొక నైసర్గిక అపోహ ప్రబలియుండుటచేతనే యథార్థస్థితి విచారణను దిగనాడుట జరుగుచున్నది. అనగా అసలు శరీరమంటే యేమిటో పూర్తిగ తెలియకపోవుటచేతనే కొందఱియందీ విపరీతజ్ఞానము గానవచ్చుచున్నది. మరియు "నిత్యం సన్నిహితో మృత్యుః" అని మాట మాత్రముగ చిలుక పలుకులవలె నుచ్చరించుటయే దక్క యథార్థముగ చావు సన్నిహితము, ఏక్షణమునందైనను ఏవిధముగనైనను "తామనుకొనునట్టి శరీరమైనను" పడిపోగలదను వివేక మిసుమంతైనను గలిగిన మానవుడు తన పూర్వప్రవృత్తిని యథాప్రకారము అవిచ్ఛిన్నముగా కొనసాగించ ప్రవర్తించునా? కాన మానవులు తాము కోరినను కోరకపోయినను "జాతస్యహి ధ్రువో మృత్యుః" అనునట్లు (పుట్టుట గిట్టుటకొరకే) జరుగుచుండుటచే వ్యవహారమంతయు పైన పేర్కొనబడినట్లు మృత్యువిమర్శన కనుకూలమగు శుద్ధబుద్ధిని బొందుటకనువైన క్రోధాది ద్వాదశ మహాదోషములు విడుచుటయందే శ్రద్ధగలవారలై శమాది షట్కసంపత్తి ననవరతము ఆలంబనముగ గైకొనుటయందే వినియోగింపవలెను. అప్పుడే వివేక ముదయించి ప్రమాదము (పొఱబడుట) కంటె వేఱు మృత్యువనునది లేదను దృఢమైన

జ్ఞానము గలుగును. అప్పుడే 'అమృతమేవమృత్యోర్గంతరమ్' అను వేదవాక్యము పరస్పరవిరుద్ధసూచకమైనను, విచారింపగ మృత్యువులోనే అమృతత్వ మున్నదనునది శాస్త్రదృష్ట్యా విశదమగుచున్నది. ఏదైన ఒక వస్తువు నాశనమైనదనిన అది తనస్వరూపమును బొందినదనేగదా! అర్థము. కుండ జ్ఞానము నాశనమైతేనేగాని తదధిష్ఠానమైన మట్టి జ్ఞానము లోనికి రానట్లు మనము లోకమునకు శవమైతేనేగాని మన స్వరూపమును చూడలేము. అధిష్ఠానము లేకుండ సృష్టి స్థితి లయములు లేవు. శూన్యములోనుండి యే యొక్క వస్తువును రాజాలదుగదా! అట్టి సర్వాధిష్ఠానము నిత్యమైన తన స్వరూపమని, నామరూపములను వికారనుంతయు అస్థిరమై ఆగమాపాయినము లేనని గుర్తించిననాడే అమృతత్వము. అట్లనే ఛాం 7-24-1 శ్రుతి.

శ్రు॥ 'యోవైభూమ తదమృతమథ యదల్పం తన్మర్త్యమ్'

అల్పమయిన శరీరేంద్రియాదులం దభిమానమే మృత్యువని తెల్పుచున్నది. అనగా ప్రమాణములకు మితములై నశించు స్వభావము గలవి. ఈ స్వభావసిద్ధమైన అజ్ఞాన జనిత ఆసక్తివల్లనే అహర్నిశము లు కర్మలను జేయుచు పరిణామాదుల జెందుటయే మృత్యువుగాన,

నారద పరివ్రాజక ఉపనిషత్తులోని

శ్లో॥ 'తమేవజ్ఞాత్వా విద్వాన్ మృత్యుముఖా త్ప్రముచ్యతే',

శాట్యాయని ఉపనిషత్తులోని

శ్లో॥ 'తదైవ విద్వాన్ ఇహైవామృతా భవంతి',

బ్రహ్మవిద్యోపనిషత్తులోని

శ్లో॥ 'యత్రయత్ర మృతోజ్ఞానీ పరమాక్షర విత్సదా,

యోగతత్త్వోపనిషత్తులోని

శ్లో॥ 'పరబ్రహ్మణి లీయేత నతస్యోత్క్రాంతిరిష్యతే'

ఇత్యాది ప్రమాణములన్నియు, అపరోక్షజ్ఞానముచే బ్రహ్మ సాక్షాత్కారమును కలిగిన విద్వాంసుడు సంసారరూప మృత్యుముఖమునుండి విడువబడినవాడై యీ దేహములోనే జీవన్ముక్తి సుఖమనుభవించుననియు, అట్టి జ్ఞానికి దేహపాతా నంతర లోకాంతర గమనముచునది లేక 'బ్రహ్మైవ భవతి' 'బ్రహ్మవిదాప్నోతిపరం' అనునట్లు బ్రహ్మమే యగుచున్నా డని తెలియనగును. మరియు ఛాం 6-11-3 లో చెప్పినటుల జననమరణ శబ్దములు శరీరోత్పత్తి వినాశములందే ప్రవృత్త ములుగాని జీవునియందలి గౌణములే ననియు, బృ 6-3-8లో చెప్పినటుల నవి శరీర సంయోగవియోగ నిమిత్తములేయని తెల్పుచున్నందున, జాతకర్మాది విధానముసైతము, జీవున కుత్పత్తిలేదు గాన దేహప్రాదుర్భావము నపేక్షించినదియే ననియు, అందువలన ఆత్మ నిత్యుడని గుర్తించి బృ 6-4-7లో చెప్పినటుల

శ్లో॥ 'యదా సర్వే ప్రముచ్యంతే కామాయేస్య హృదిశ్రితాః
అథమర్త్యోఽమృతోభవత్యత్ర బ్రహ్మసమశ్నుతే॥

సర్వకామములచే విడువబడినవాడయి, చేయవలసిన దేమియు లేనివాడగుటచే అమృతత్వమగు బ్రహ్మమునే బొందిన వాడగుచున్నాడు.

దీనినే శ్రీ రామకృష్ణపరమహంస-
'When shall I be free?' అని అడిగినదానికి When 'I' shall cease to be. అని గంభీర ఫలోక్తి విసరెనట. గాన ముముక్షువు లెల్లరును దీనిని లెస్సగా గుర్తించిన, అమృతత్వమును బడయగలరనునది నిస్సంశయము.

ఓమ్-తత్-సత్

శ్రీ జగద్గురు శంకరాచార్య విరచిత

## V. ధన్యాష్టకమ్.

(ఆంధ్ర పద్యానువాదసహితమ్.)

శ్లో॥ తద్ జ్ఞానం ప్రశమకరం యదింద్రియాణాం
తద్ జ్ఞేయం య దుపనిషత్సు నిశ్చితార్థం
తే ధన్యా భువి పరమార్థ నిశ్చితేహా
శ్శేషాస్తు భ్రమనిలయే పరిభ్రమన్తః.

తే॥గీ॥ జ్ఞాన మింద్రియ ప్రశమన ఘనత లొసగి
జ్ఞేయ ముపనిష దర్థమౌ శ్రేయ మిడగ
నిశ్చయంబుగ బరమార్థ నియతిపరులె
ధన్యులౌదురు యజ్ఞులే యన్యులిలను.

శ్లో॥ ఆదౌ విజిత్య విషయాన్ మదమోహరాగ
ద్వేషాది శత్రుగణమాహృత యోగరాజ్యాః
జ్ఞాత్వా మతం సమనుభూయ పరాత్మవిద్యా
కాంతాసుఖం వనగృహే విచరన్తి ధన్యాః.

తే॥ గీ॥ మోహ విషయాది పగతుఁ మొదట గెలిచి
యోగ రాజ్యాభి షిక్తులై యుత్తము లగు
అమృత పానానుభవులగు నాత్మవిదులె
ధన్యు లౌదురు వన గృహ తలని జేరి. ౨

శ్లో॥ త్యక్త్వా గృహే రతి మధోగతి హేతుభూతా
మాత్మేచ్ఛయోపనిషదర్థరసం పిబన్తః ।
వీతస్పృహా విషయభోగపదే విరక్తా
ధన్యాశ్చర న్తి విజనేషు విముక్తసఙ్గాః.

తే॥ గీ॥ గృహము జేకూర్చు భోగాది స్పృహను వీడి
మనసు నెప్పుడు యుపనిషద్ జ్ఞానమనెడి
"ఆత్మ విజ్ఞానరసమునే" యనుభవించు
సంగరహితుడె ధన్యుడై సంచరించు. ౩

శ్లో॥ త్యక్త్వా మమాహమితి బంధకరే పదే ద్వే
మానావమానసదృశా స్సమదర్శి నశ్చ ।
కర్తార మన్య మవగమ్య తదర్పితాని
కుర్వన్తి కర్మపరిపాకఫలాని ధన్యాః.

తే॥ గీ॥ నేను నాదను పదముల నిగళ మెడలి
ద్వంద్వ మన్నను సమదృష్టి నొందగలిగి
కర్త కర్మయు ఫలమును కారయితయు
తాను గానని తెలియంగ ధన్యుడగును! ౪

శ్లో॥ త్యక్త్వైషణాత్రయ మవేక్షిత మోక్షమార్గా
భైక్ష్యామృతేన పరికల్పిత దేహయాత్రాః ।
జ్యోతిః పరాత్పరతరం పరమాత్మ సంజ్ఞం
ధన్యా ద్విజా రహసి హృద్యవలోకయన్తి.

తే॥ గీ॥ ఈషణాదుల విడనాడి యాత్మనయును
మోక్షమందున లక్ష్యమై భిక్షువగుచు
దేహయాత్రను పరమందె దృష్టి నిలిపి
తన్మయంబున ద్విజుఁడుండ ధన్యుఁడనరె.

శ్లో॥ నాస న్నసన్న సదసన్న మహా న్నచాణు
నస్త్రీ పుమా న్నచ నపుంసక మేకబీజం
యై ర్బ్రహ్మ తత్సమనుపాసిత మేకచిత్తై
ర్ధన్యా విరేజు రితరే భవపాశబద్ధాః.

తే॥ గీ॥ ఉన్నదనిగాని లేదని యుభయగతిని
పురుషుఁ డనియును స్త్రీయు నపుంసకుఁడను
హెచ్చు తగ్గులు లేనట్టి యేకబీజ
మెఱుఁగ ధన్యుఁడు, లేకున్న దిరుగు సుడుల.

అజ్ఞానపఙ్క పరిమగ్న ముపేతసారం
దుఃఖాలయం మరణ జన్మ జరావసక్తం
సంసారబంధన మనిత్య మవేక్ష్య ధన్యా
జ్ఞానాసినా తదవశీర్య వినిశ్చయన్తి.

తే॥ గీ॥ జన్మ మృత్యువు ముదిమినా జగతిబరగు
సారహీనపు దుఃఖ సంసారమెల్ల
జ్ఞాన శూన్యులు దలతురు శాశ్వతమని
తద్జ్ఞులిల దాని విడనాడి ధన్యులయెదు.

శ్లో॥ శాంతై రనన్యమతిభి ర్మధురస్వభావై
రేకత్వ నిశ్చిత మనోభి రపేతమోహైః
సాకం వనేషు విదితాత్మ పదస్వరూపం
తద్వస్తు సమ్యగనిశం విమృశన్తి ధన్యాః.

తే॥ గీ॥ సుప్తిరూపముచు నేత్రా దృష్టికలిగి
శక్తి శబ్దుల వేద్యారు తెంపుపడిగి
ప్రజ్ఞ గూడుచు శాస్త్రముపగ విముక్త
ధర్మ మనుచును జేయుచు ధన్యులెపుడు.

ఓం - తత్ - సత్.

# 23. గీతాహృదయము

(సహేతుక సర్వసంవాదార్థానువాదనము)

---

1-1 శ్లో॥ ధర్మక్షేత్రే కురుక్షేత్రే, సమవేతా యుయుత్సవః।
మామకాః పాండవాశ్చైవ, కిమకుర్వత సంజయ॥-

తా॥ ధర్మక్షేత్రమగు మానవ శరీరమునందు దైవాసుర ప్రవృత్తుల కహర్నిశము ఘోర సంగ్రామము జరుగుచుండును. అట్టి సర్వప్రవృత్తులను, మూలాజ్ఞానజములగుటచే వాని యభిభూతమునకు 'వివేక విజ్ఞానమే' శరణ్యము.

1-47 శ్లో॥ ఏవముక్త్వాఽర్జున స్సంఖ్యే రథోపస్థ ఉపావిశత్,
విసృజ్య సశరం చాపం శోకసంవిగ్నమానసః॥

తా॥ గానమే బ్రహ్మజిజ్ఞాసువుడైన శుద్ధాంతఃకరణుడు మాత్రమే, జీవేంద్రియ విలసితమైన ప్రవృత్తిని విడిచిపెట్టి ఆత్మాభిముఖుడగుచున్నాడు.

2-16 శ్లో॥ నాఽసతో విద్యతే భావో నాఽభావో విద్యతే సతః।
ఉభయోరపి దృష్టోఽంతస్త్వనయోస్తత్త్వదర్శిభిః॥-

తా॥ అట్టి విసర్జనకు సదసద్వివేకమే ప్రధానము.

స్వప్న జాగ్రతలలో గాంచబడు ప్రపంచము, సుషుప్త్యవస్థలో లేనిదగుటచే 'అసత్తే' యగును. ఇట్టి మూడవస్థలయందలి, 'ఉనికి-లేమి' లను గుర్తించునట్టి "జ్ఞానమో" సాక్షి మాత్రముగ నుండుటచే 'సత్తు'. తత్త్వదర్శుల కనుభవమగు నీ దృష్టియే, అమృతత్వమునకు సమర్థమును, తితిక్ష నోనగూర్చునదియు, నగుచున్నది.

2-45 శ్లో॥ త్రైగుణ్య విషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున,
నిర్ద్వంద్వో నిత్యసత్త్వస్థో నిర్యోగక్షేమ ఆత్మవాన్॥

తా॥ గాన కామనా పూర్వక కర్మానుష్ఠానములందే యిచ్ఛగలవాడవై యోగక్షేమములమీద మనస్సు పెట్టక, నిత్యశుద్ధ సత్వస్వభావము గలవాడవై సద్గురువును జెంది 'జ్ఞానము'ను బొందిన పిమ్మట 'అహం' బుద్ధికి విషయము 'ఆత్మయే' యగునట్లు జేయువలయును.

3-28 శ్లో॥ తత్త్వవిత్తు మహాబాహో! గుణకర్మవిభాగయోః
గుణాగుణేషు వర్తంత, ఇతి మత్వా న సజ్జతే॥

తా॥ మరియు వాగాదులే వచనాదులందు ప్రవర్తించుచున్నవనియు, తాను కూటస్థానంగ చిద్రూపుడనియు యదార్థము గుర్తించినవాడెన్నడా కర్మములందు కర్తృత్వాభిమానము జెందడు.

3-30 శ్లో॥ మయి సర్వాణి కర్మాణి సన్యస్యాధ్యాత్మ చేతసా,
నిరాశీర్నిర్మమో భూత్వా యుధ్యస్వ విగతజ్వరః॥

తా॥ గాన యట్టి ప్రవృత్తి నలవఱచుకొనుటకు, 'ఆత్మయోగబుద్ధితో సర్వకర్మములను, తత్ఫలంబులను, తనయందారోపించుకొనక,-ప్రభువుయొక్క యాజ్ఞానుసారము

భృత్యుఁడెట్లు ఫలాభిసంధిరహితముగ కర్మలాచరించునో యట్లు– అహంకారము, మమకారములవిడిచి, స్వధర్మములనే యాచరించిన నగు.

4–6 శ్లో॥ అజోఽపిసన్నవ్యయాత్మా భూతానామీశ్వరోఽపిసన్
ప్రకృతిం స్వామధిష్ఠాయ సంభవామ్యాత్మమాయయా॥

తా॥ ఎందుకనగా, యథార్థములో, జనన మరణ శోక మోహాది గుణవికారములేని తత్త్వయుక్తై, ధర్మాధర్మము లనునవి లేనివాఁడే యైనను, తనయొక్క ప్రభావముచేతనే, దేహధారిగను, జన్మాదు లొందినట్లుగను గోచరించుచుండును.

4–13 శ్లో॥ చాతుర్వర్ణ్యం మయాసృష్టం గుణకర్మవిభాగశః
తస్యకర్తారమపిమాం, విద్ధ్యకర్తార, మవ్యయమ్॥

తా॥ ఈ గుణకర్మవిభాగ మంతయు, తన శక్తియొక్క విలాసమే! తానే, తన తెలియని మహిమచేత, అవ్యక్తము, మహత్తత్త్వము, అహంకారము, తన్మాత్రలను పేరున, విభజింపబడి సర్వవ్యవహారాస్పదమైనట్లు గోచరించుచుండునే గాని, యథార్థములో నాశరహితమైన, నిత్య శుద్ధబుద్ధ ముక్త స్వభావుడే !

5–14 శ్లో॥ నకర్తృత్వం నకర్మాణి లోకస్య సృజతి ప్రభుః
నకర్మఫలసంయోగం స్వభావస్తు ప్రవర్తతే॥–

తా॥ అనగా 'ఆత్మ' (తాను) ఒకరిచేత నేమియు జేయింపక తానేమియు జేయక, చేసిన వానికి ఫలమొసంగు వాడును గాక, స్వయం ప్రకాశుడై–యథార్థములో మణుల యందు చలనములేక పోయినను కిరణ ప్రసారముచేత రాయి,

కదులుచున్నట్లు గానబడునటుల యున్నను – "తెలియనేరమి" యను స్వసామర్థ్యము చేతనే, తానొక జీవుడనియు, యీ సర్వకార్యములు తానే జేయుచున్నట్లును తలపోయుచుండును.

5–15 శ్లో॥ నాదత్తే కస్య చిత్పాపం న చైవ సుకృతం విభుః
అజ్ఞానే నాఽఽవృతం జ్ఞానం తేన ముహ్యంతి జంతవః ॥

తా॥ ఇటుల 'విద్యాఽవిద్య స్వ'రూపమగు నా పరమాత్మను (విద్య = చరమవృత్తి రూప జ్ఞానము; అవిద్య – భేద భ్రాంతి రూప జ్ఞానము; స్వ=పరబ్రహ్మాత్మక జ్ఞానము) పరమార్థమున నెట్టి పాప పుణ్యములతోగాని సంబంధము లేకపోయినను, అవివేకులగు సంసారులచే "తా మీశ్వరు నారాధించుచుంటి మనియు, ఈశ్వరు డనుగ్రహించుచున్నాడనియు" తలచుట అజ్ఞానముచే జ్ఞానమావరింపబడిన ఫలమేగాని వేరొండుగాదు.

6–5 శ్లో॥ ఉద్ధరే దాత్మనాత్మానం, నాత్మాన మవసాదయేత్
ఆత్మైవ హ్యాత్మనో బంధు రాత్మైవ రిపురాత్మనః ॥

తా॥ ఇట్లు స్వభావసిద్ధమైన తనను తానే సంసార సముద్రము నుండి యుద్ధరించుకోవలయును. అనగా శత్రు స్థానీయమగు శబ్దాది విషయములను వినుటచే బరిపూర్ణంబగు బాహ్య దృష్టిని, సాధనచతుష్టయ సంపత్తిచే, శ్రవణాది సముత్పన్న మయిన ఆత్మజ్ఞాన నిష్ఠాపూర్వక అంతర్ముఖము గావింప వల యును. మోక్షమను సర్వాత్మతాసిద్ధికి బాహ్యాలంబనమేగదా! ప్రతిపక్షము.

6–8 శ్లో॥ జ్ఞానవిజ్ఞాన తృప్తాత్మా కూటస్థో విజితేంద్రియః
యుక్త ఇత్యుచ్యతే యోగీ సమలోష్టాశ్మ కాంచనః॥

తా॥ అట్లుపకారముగాని, యపకారముగాని తనకు తానే చేసుకొనవలయును. గాన పైన చెప్పబడిన విధమున, కార్య కారణా, కర్తృత్వ హానమగు అంతఃకరణ నిగ్రహముచేసి, శాంతిచే, శాస్త్రజన్య పరోక్ష జ్ఞానముచేతను, అనుభవరూప పరోక్ష జ్ఞానముచేతను తృప్తి నొందిన మనస్సుగలవాడైన వివేకియే, దేహధారియై యుండియు, సంస్కారవశమునచే ప్రాప్తించిన సుకృత దుష్కృతసంభవమగు ఖేదమోదసముడై సమ్యగ్దృష్టి యను యోగమును కలవాడును.

7-14శ్లో॥ దైవీహ్యేషాగుణమయీ మమ మాయాదురత్యయా
మామేవయే ప్రపద్యంతే మాయామేతాం తరంతితే॥

తా॥ గాన యిట్లు కల్పితమగుటచే అయథార్థమును, నానా విధ జగతునకుపాదానకారణముగ గాంచబడు, యీశబలాఖ్యమైన ఆత్మశక్తిగలదో, యది, ఆత్మ(తన)కన్న వేఱుగాదనిగుటచే, "తత్త్వజ్ఞాన" ద్వారంబుననే గాక మరొక మార్గమున దాని నతిక్రమింప శక్యముగాదని సిద్ధించుచున్నది.

7-19శ్లో॥బహూనాం జన్మనామంతే జ్ఞానవా న్మాం ప్రపద్యతే
వాసుదేవ స్సర్వమితి సమహాత్మా సుదుర్లభః ॥

తా॥ ఈప్రకారము సర్వాత్మత్వ సమాధి సిద్దినిబొందిన మహాత్ములు మిక్కిలి అరుదు. అనగా సృష్టికాధారమగు యథార్థ తత్త్వమును తెలుసుకొని, పరబ్రహ్మమే యీ సర్వకారణమను నిశ్చయబుద్ధి, అనేక జన్మార్జిత బ్రహ్మనిష్ఠా పరిపాక చరమజన్మయందేగాని లభింపదు.

8-3శ్లో॥ అక్షరం బ్రహ్మపరమం స్వభావోఽధ్యాత్మముచ్యతే
భూత భావోద్భవకరో విసర్గః కర్మసంజ్ఞితః ॥

తా॥ "సత్తామాత్ర"మేయై, క్షరాక్షరముల కతీతమై, అవాఙ్మానసగోచర మగునదే "బ్రహ్మ"శబ్దముచే చెప్పబడుచు, పరమార్థ బ్రహ్మనపానమగు నాసద్వస్తు స్వభావమే "ఆధ్యాత్మమని" చెప్పబడుచున్నది. అనగా స్వస్వరూపమే ప్రతి శరీరమందును. "అహం" ప్రత్యయముచే, ప్రత్యగ్రూపంబున వేద్యంబై వర్తించుచున్నది. ఇదియే శబలాఖ్యమైన జ్ఞానశక్తి స్వరూపము అట్టి శుద్ధ సత్వప్రధానమగు దానియందు శబ్దార విలసితమగు క్రియారూపమే కర్మసంజ్ఞచేత దెలియవచ్చు చున్నది.

8-22శ్లో॥ పురుష స్స పరః పార్థ! భక్త్యా లభ్యాస్త్వనన్యయా,
యస్యాన్తః స్థానిభూతాని యేన సర్వమిదం తతమ్॥

తా॥ అట్టి పరబ్రహ్మము, నామరూపాత్మక చరాచరమగు సర్వభూతములేపురుషుని యంతఃకరణమందు దర్పణాంతఃపురమువోలె, (అనుటచేత నే)దోచుచున్నవో, మరియు సర్వభూతాంతఃకరణమందు యేపురుషుడు ప్రతిఫలించుటచే సర్వము ప్రకాశించుచున్నవో, అదియే యగుచు, ఆ పురుషుడన్నిటికన్న నధికుడు గాన, యాతడాత్మవిషయికమైన జ్ఞాననిష్ఠచేతనే బొందనగునను యుపాయము తెలియవలయును.

9-4 శ్లో॥ మయాతతమిదం సర్వం జగదవ్యక్తమూర్తినా,
మత్స్థాని సర్వభూతాని నచాహం తేష్వవస్థితః॥

తా॥ అదెట్లనిన, బ్రహ్మశబ్దముచే చెప్పబడు నీ పరత్వ త్తము, సూత్రములందు కూర్చబడిన మణులవలె సకలములో నంతర్యామిగానుండి వాటికన్నింటికి తానే యాధారముగ నున్నట్లు కనబడుచున్నను, ఆయా భూతములయొక్క-

ప్రవర్తనయందు తనకెట్టి కర్తవ్యమును, సంబంధమును లేని వాడయియున్నాడు.

9-5 శ్లో॥ నచమత్స్థాని భూతాని పశ్య మే యోగమైశ్వరమ్,
భూతభృన్న చ భూతస్థో మమాత్మా భూతభావనః

తా॥ అనగా యథార్థ తత్త్వమును విచారించినయెడల, సర్వభూత సృష్టి స్థితి లయాదులకు కారణమగు పరాపరగ ప్రకృతిద్వయముతో నెట్టి సంగమును లేని అసంగుడగు ఆత్మ (తాను) యున్నాడు. (పరాప్రకృతి=మూల ప్రకృతి యనబడు శబలస్థితి, అపరాప్రకృతి=అష్టప్రకృతులనబడు శబ్ద విస్తృతి)ఇదియే కడు చిత్రమైన ఆత్మశక్తి విలాసము. ప్రకృతి యనగా అంతఃకరణోపహితమైన బ్రహ్మ చైతన్యమేగదా!

10-3 శ్లో॥ యో మా మజమనాదించ వేత్తి లోకమహేశ్వరమ్,
అసమ్మూఢ స్స మర్త్యేషు సర్వపాపైః ప్రముచ్యతే॥

తా॥ ఈ ప్రకారము ఎవడు "తన"ను, ఆద్యంతరహితునిగను, సకలలోక నియామకునిగను, అజ్ఞాన తత్కార్య వివర్జితునిగను, నిశ్చల జ్ఞానముచే తెలుసుకొనుచున్నాడో, ఆ మానవుడు సర్వప్రతిబంధములనుండి విడువబడిన వాడగుచున్నాడు.

10-11 శ్లో॥ తేషా మేవానుకంపార్థ మహ మజ్ఞానజంతమః
నాశయా మ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా॥

తా॥ పైన వక్కాణించిన విధముగ ఆత్మజ్ఞానము గలిగినంతమాత్రముచే, సాక్షాత్కారమనెడి స్వానుభవముగల్గుట దుర్లభము గాన, తానే తన యంతఃకరణ వృత్తియందున్న వాడై ప్రకాశమానంబగు జ్ఞానదీపముచే, తనయవివేక జన్యం

15-4 శ్లో॥ తతఃపదం తత్పరిమార్గితవ్యం । యస్మిన్గతా
న నివర్తంతిభూయః
తమేవచాద్యం పురుషంప్రపద్యే । యతఃప్రవృత్తిః
ప్రసృతాపురాణీ॥

తా॥ ఇట్టి భోగప్రవృత్తికి కారణమైన యీ అనాది సంసారము, యేపరమపురుషుని శక్తివలన వృద్ధియగుచున్నదో, అట్టి పరమపురుషునియందు లక్ష్యముంచి, యా పరమాత్మనే శరణు పొందుటకు వేదాంత వాక్యములను విచారించియే, యెఱుంగవలయును. అట్టి భావమును పొందగలిగిన విద్వాంసుడు (జ్ఞాని) తిరిగి శరీరమును బొందడు.

16-21శ్లో॥ త్రివిధం నరకస్యేదం ద్వారం నాశనమాత్మనః
కామఃక్రోధ స్తథాలోభ స్తస్మాదేతత్త్రయంత్యజేత్॥

తా॥ ఇట్లు సంసార విముక్తికి సాధనముగా తోడ్పడు దైవీసంపత్తున కవరోధము గలిగించునవియు, ఆత్మజ్ఞానమును గలిగింపక, అగ్నికి పొగగప్పినట్లు, ఆత్మ నావరించునవియు, నరకమునకు ద్వారమని శాస్త్రప్రతిపాదితమును నగు అసుర సంపత్తనబడు, కామాదుల నవశ్యము విసర్జించవలయును.

16-24 శ్లో॥ తస్మాచ్ఛాస్త్రం ప్రమాణంతే కార్యాకార్య వ్యవస్థితౌ । జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మకర్తు మిహార్హసి॥-

తా॥ అందువలన ధర్మాఽధర్మంబుల నిశ్చయమెఱుంగుటకు ప్రమాణమయిన శాస్త్రమునే మానవులు గుర్తించి, తత్ప్రకారము నడచుటయే కర్తవ్యము.

17-2 శ్లో॥ త్రివిధా భవతి శ్రద్ధా దేహినాంసా స్వభావజా, ।
సాత్త్వికీ, రాజసీచైవ తామసీచేతితాంశ్రుణు ॥-

తా॥ ఇట్లు శాస్త్రమునే ప్రమాణముగ గైకొనినను, ప్రాణులు, తమ తమ పూర్వ సంస్కార వాసనాబలముచేతనే వారి వారి శ్రద్ధ స్వభావసిద్ధముగనే అభివ్యక్తమగుచు, దాని కనువగు చేష్టలయందే ప్రవర్తించుచుందురు.

17-8 శ్లో॥ ఆయుస్సత్త్వ బలారోగ్య సుఖప్రీతివివర్ధనాః
రస్యాస్స్నిగ్ధా స్థిరాహృద్యా ఆహారాస్సాత్త్వికప్రియాః

తా॥ అందువలన ఆహార విహారములందు కడు జాగరూకులై, దైవీసంపత్తును వృద్ధిపఱచు ననువగునదే యవలంబించిన, శీఘ్రకాలములో చిత్తశుద్ధినిగలింగిచి, త్రివిధ గ్రంథులను నశింపజేయగల జ్ఞానము ప్రకాశించును. ఆహార పరిణామాములే గదా! మనో వాక్ ప్రాణములు.

18/66 శ్లో॥ సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణంవ్రజ,
అహంత్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః॥

తా॥ గాన యీ గీతాశాస్త్ర హృదయమేమన, స్వబుద్ధ్యస్థమగు సర్వప్రవృత్తిని విడిచివేసి, శాస్త్రాచార్యోపదిష్టమగు బోధయందే లక్ష్యముగలవాడవై, సర్వాత్మకుడైన తనకన్న వేఱొకటి లేదను నిశ్చయ బుద్ధితో తనయందు తానే శరణాగతుడై, ప్రారబ్ధ భోగముల ననుభవించుచు, జ్ఞాన నిష్ఠతోనుండిన,-అది ధర్మా-ధర్మ రహితమగు స్థానమగుటచే-సహేతుక సర్వసంసారాత్యంతోపరమము దానంతటదియే సిద్ధించునని సారాంశము.

18-78 శ్లో॥ యత్రయోగేశ్వరః కృష్ణో యత్ర పార్థోధనుర్ధరః
తత్రశ్రీ ర్విజయోభూతి ర్ధ్రువానీతి ర్మతి ర్మమ॥

కారణ, కర్తృత్వముగల క్షేత్ర క్షేత్రజ్ఞుల కేది యాధారమగు చున్నదో, ఏది సర్వశబ్దముల కవిషయమో, 'యదియే' పర బ్రహ్మమనియు దానిని గుర్తించుటయే నిర్విశేష జ్ఞానమగుచు, నిరతిశయానందావాప్తియనియు దెలియందగు.

13-34 శ్లో॥ క్షేత్రక్షేత్రజ్ఞ యో రేవ మంతరం జ్ఞానచక్షుషా,
భూత ప్రకృతి మోక్షంచ యే విదుర్యాంతి తేపరమ్॥

తా॥ అనగా వ్యక్తనామరూపాత్మకమై 'సత్'ని జెప్ప బడునట్టి జగత్తు (శబ్దబ్రహ్మ) ను, అట్టి జగత్తునను గారణ మగు అస్పష్ట నామ రూపాత్మక మవ్యక్త 'అసత్తు' (శబల బ్రహ్మ) లను రెంటి 'అభానమును' ఎవరు శాస్త్రాచార్యో ప్రదేశమువలన గలిగిన పరమార్థస్వరూపజ్ఞాన (పరబ్రహ్మ) మనెడి చక్షుసుచేత లెస్సగా గుర్తించుదురో వారికి సర్వాఽ నర్థములు నివర్తిల్లి పరమ పురుషార్థము సిద్ధించును.

14-19 శ్లో॥ నాన్యం గుణేభ్యః కర్తారం యదాద్రష్టాను పశ్యతి
గుణేభ్యశ్చ పరం వేత్తి మద్భావం సోఽధిగచ్ఛతి॥

తా॥ గాన (1) కార్యకారణ విషయ రూపముల బొందునట్టి సత్వాది గుణములకన్న వేఱుగా (2) సుఖ దుఃఖాది మూలములగు కర్మముల నాచరించుటకును, అట్టి కర్మఫలముల ననుభవించుటకు కర్త గలడని తలంపక (అను కొనక)-గుణములే సమస్త కారణ విషయ రూపమునుబొంది, సర్వ కర్మలకును కర్తలగుచు కర్మములను జేయుచున్న వనియు, 'తాను' సర్వగుణ వ్యాపార సాక్షిభూతుడును, గుణ సంపర్కము లేనివాడ ననియు నెఱుంగు వివేకి, బ్రహ్మైకాత్మ్యాను సంధానసిద్ధిని బొందినజీవన్ముక్తుడగుచున్నాడు.ఇట్లు చెప్పుటచే

క్షేత్రసంభవమగు గుణవికారములను బొందుచున్నట్టి 'అజ్ఞానము' క్షేత్రజ్ఞునకు సహజమై అనాది వాసనా సహిత మైన ప్రతిబంధకమువలె దోచుచుండుటచే అట్టి క్షేత్రమునకు సాక్షియై అసంగుడుగ ప్రకాశించుచు, స్వస్వరూప లక్షణమును గుర్తెఱిగిన జ్ఞాని, జీవించి యున్నప్పుడే, యేవిధమైన ప్రతి బంధకమును లేక పరమోత్కృష్ట శాంతిని బొందుచున్నాడు.

14-27శ్లో॥ బ్రహ్మణోహి ప్రతిష్ఠాఽహ మమృతస్యాఽవ్యయ స్యచ । శాశ్వతస్యచ ధర్మస్య సుఖస్యైకాంతికస్యచ॥-

తా॥ అదెట్లనిన, ఏ ఈశ్వరశక్తిచేత భక్తానుగ్రహాది ప్రయోజనము కొఱకు బ్రహ్మము బ్రతిష్ఠితమగుచున్నదో- అనగా ఆ బ్రహ్మశక్తిరూపుడగు తానే, అమృతమును, అవ్యయమును, నిత్యమును, 'జ్ఞానయోగ' రూప ధర్మంబుచే ప్రాప్యంబును, నిత్యానంద రూపమునగు బ్రహ్మము గావున- తన్ను తానే భజించుకొనుచో విద్వాంసుడు బ్రహ్మమే యగుచున్నాడు.

15-3 శ్లో॥ నరూపమస్యేహతథోపలభ్యతే । నాంతో
నచాదిర్నచసంప్రతిష్ఠా,
అశ్వత్థమేనంసువిరూఢమూలా । మసంగ
శస్త్రేణ దృఢేన ఛిత్త్వా॥

తా॥ ఈ పైన పేర్కొనబడిన ప్రతిష్ఠ కేవలము కల్పి తము. విషయాభిలాషయే మూలము. అట్టి ఆద్యంత స్థితులు లేనట్టి యీ విచిత్రమగు సంసార వృక్షము, దృఢమైన వైరాగ్య పూర్వకమగు సన్న్యాసంబను ఖడ్గముచేతనే బీజ సహితము ఛేదించుట ముఖ్య కర్తవ్యము.

బగు మిథ్యా జ్ఞానంబును, (మోహాదులను) నశింప జేయుచుం డును. గాన అనన్య భక్తియే సన్నిపత్యోపకారకమని గ్రహింప నగు.

(ఇటుల చెప్పుటలో, నా దీపమునను భక్తియే నూనె,
(2) ధ్యానాభ్యాసాసక్తియే ఆ దీపమును ప్రకాశింపజేయు వాయువు,
(3) బ్రహ్మచర్యము మొదలగు సాధన సంపత్తె - వృత్తి;
(4) వైరాగ్యముకల అంతఃకరణమే-ప్రమిద, (5)లోకవాసన, దేహవాసన, శాస్త్రవాసనలను విషయములనుండి తొలగి రాగద్వేషములనెడు దీపము నార్పివేయు గాలి లేనిదగు స్థానమే - నిశ్చలచిత్తము;
(6) తైలధారవలె నెడతెగక జేయుధ్యానముచే గలుగు స్వాను భవమే - దీపమను ప్రకాశమని గ్రహించ వలయును.)

11-54 శ్లో॥ భక్త్యా త్వనన్యయాశక్య అహమేవం విధోఽర్జున!
జ్ఞాతుం ద్రష్టుంచ తత్త్వేన ప్రవేష్టుంచ పరంతప! ॥-

తా॥ గాన యిట్టి తన యదార్థ తత్త్వాతీత స్థితిని గుర్తించుటకు స్థిరమైన, "అనన్యభక్తి"యే శరణ్యముగాని, అధ్యయనాది ఘోర తపస్సు లెంతమాత్ర మా "పద సందర్శన" మొసంగజాలవు.

11-55 శ్లో॥ మత్కర్మకృన్మత్పరమో మద్భక్తస్సంగవర్జితః
నిర్వైర స్సర్వభూతేషు యస్స మామేతి పాండవ ॥-

తా॥ అటుల సర్వకాల సర్వావస్థలందును, సాధన పంచకమని ప్రసిద్ధిజెందిన, ఫలాపేక్షరహితమగుభవగద్దృష్టితో కర్మలజేయుట, తానే పరమగతిగా నిశ్చయించినవాడయి,

సర్వ వస్తు సముదాయమును బ్రహ్మముగనే యనుసంధించుచు, భోగములందు భ్రాంతిని వీడి, తన కన్యముగు ప్రకృతియందు లక్ష్యము లేకయుండుట కేముముక్షువు సమర్థుడో, వాడే విదేహ కైవల్యమును సులభముగ పొందనర్హుడని విశదము జేయ బడినది.

12-3/4శ్లో॥ యేత్వక్షరమనిర్దేశ్య మవ్యక్తం పర్యుపాసతే,
సర్వత్రగమచింత్యంచ కూటస్థమచలం ధ్రువమ్॥-
సన్నియమ్యేంద్రియ గ్రామం సర్వత్ర సమబుద్ధయః
తే ప్రాప్నువంతి మామేవ సర్వభూతహితేరతాః॥-

తా॥ ఇట్లు పరంపరయా సుకరమైనభక్తిమార్గముచేతనే కైవల్యము సిద్ధించునని చెప్పుటచే, భగవత్స్వరూపులై, జ్ఞాన కర్మేంద్రియ సమూహమును లెస్సగా స్వాధీనము జేసుకొని, యే ప్రమాణముచేతను దెలియ నలవిగానిదియు, కావున శబ్దముచే నిర్దేశింప శక్యముగానిదియు, మనస్సునకవిషయమై, మాయా ప్రపంచమునకధిష్ఠానమై చలనంబు లేనిదియు, నిత్యంబునునగు, అక్షరము నుపాశించు వారినిగూర్చి చెప్ప నేల? ఇట్టి అవ్యక్తత్త్వమును గ్రహించి ఉపాసన జేయుట, (తైల ధారవలె సదాఽఽఖండాకారవృత్తి యందుండుట) ఉత్తమాధి కారిలక్షణమగుటచే, సర్వత్రా నిది అసాధ్యమే!

13-12 శ్లో॥ జ్ఞేయం యత్తత్ప్రవక్ష్యామి యద్ జ్ఞాత్వాఽమృత మశ్నుతే। అనాది మత్పరం బ్రహ్మ న సత్తన్నాసదుచ్యతే॥-

తా॥ ఇంతయేల! ఏది తెలుసుకొనిన తరువాత మోక్షము లభించుచున్నదో, ఏది ఆద్యంతములు లేక స్వయం ప్రకాశమానమై అసంగత్వముచే విహరించుచున్నదో, కార్య,

తా॥ ఇట్టింటిదేని, సర్వయోగములకు బీజస్థానమయి, సర్వప్రవృత్తుల కాధారమును సకలవృత్తి ప్రకాశన పరమును "తానే" యగుటచే, యెచ్చట నిరుపమమైన స్థిర జ్ఞాననిష్ఠ ప్రబలుచుండునో, అచ్చటనే సర్వదుఃఖనివృత్తి పూర్వక పూర్ణానందావిర్భావము గలుగుననుటది నిస్సంశయము.

షరా:- ఈ 36 శ్లోకములు గీతా హృదయమును సూచించున వగుటచే నిత్య పారాయణకెంతయో యుప యోగపడును.

ఓమ్-తత్-సత్

# 24. కర్మతత్త్వము.

శ్లో॥ కర్మణోహ్యపి బోద్ధవ్యం, బోద్ధవ్యంచవికర్మణః
అకర్మణశ్చ బోద్ధవ్యం, గహనా కర్మణోగతిః॥

(భ-గీ 4-17)

సామాన్యముగ లోకములో 'కర్మ' యను పదము (ఉత్పత్తిననుసరించి క్రియా చ దుకృఞ్ కరణే=చేయుటగనుక కర్మ, క్రియయు, నని తెలియవచ్చుచున్నను)పని యనియే వాడ బడుచున్నది. అట్టి వ్యాపారము (పని) నిర్వర్తించుటకు శక్తి మూలాధారము. అనగా శక్తిహీను డేపనియును జేయఁ జాలడు. అట్లెంత 'శక్తి' ముఖ్య పాత్ర వహించుచు సర్వజగదాశ్రయముగ ప్రశంసింపబడుచున్నను, అది కేవలము జడమేయగుటచే, తదాశ్రయమైన చైతన్యము, ఔష్ణ్యమున కగ్నియు, శీతలత్వమునకు జలమును, కిరణప్రసారమునకు సూర్యుడునగురీతి, అవినాభావ సంబంధముగలిగి ప్రస్ఫుట

మగుచునేయుండును. గాన చేష్టలనిననే, శక్తిమాత్రమయి కార్యనిర్వాహకమందు గానుపించుచుండినందున, సకల వ్యాపారము, సర్వకారణ కారణమగు పరబ్రహ్మ ప్రేరకమనే చెప్పక తప్పదు. అనగా పరబ్రహ్మము,

'ఏతస్యవా అక్షరస్య ప్రశాసనేగార్గి'

యను శ్రుతిలో వివరించినటుల, నిరుపాధికమును, వర్ణ సము దాయాత్మకమనగు 'నోం' కారమునకు పరమైనది యగునదే, దేహమునందు 'స్వయముగతానే' ప్రత్యగ్రూపంబున 'అహం' ప్రత్యయముచే వేద్యంబై వర్తించుచు పరబ్రహ్మావసానము గలదైనందున, తన యస్తిత్వగ్రహణంబు నుద్దేశించి, యుక్త విశేషణంబగు వైదిక శబ్దార్థరూపమున కర్మ బ్రహ్మముగా గూడ కీర్తింపబడుచున్నది. ఇట్టి కర్మయొక్క యథార్థ స్వరూ పమును తెన్నగ గుర్తించుట బహు దుర్లభతరమనియు, యొక్క "జరామరణ మోక్షముకొఱకు పరబ్రహ్మమునందే సమాహిత చిత్తముగల వారెవ్వరు సర్వదా యత్నము జేయు చుందురో వారే పరబ్రహ్మము నెఱుగుటయెగాక, నదియె సమస్త ప్రత్యగాత్మ వస్తువనియు, సమస్త కర్మమనియునెఱుం గుచున్నారని"

శ్రీ శంకరాచార్యస్వాములవారు భ. గీ. 7/29

శ్లో॥ జరామరణ మోక్షాయ మా మాశ్రిత్య యతంతియే
తే బ్రహ్మతద్విదుః కృత్స్నమధ్యాత్మం కర్మచాఖిలమ్ ॥

యనుచోట శెలవిచ్చిరి. మరియు నేది యుత్తమాధికారికి జ్ఞేయంబగుచున్నదో, నదియే ముముక్షువగు మధ్యమాధికారికి ధ్యేయంబగుటచే, లక్షణావృత్తిచేత నిరూపింపబడినదే ముఖ్య

వృత్తిచేత 'తత్పద' ప్రతిపాద్యంబగునదే కర్మ బ్రహ్మముగా గూడ నిరూపింపబడుచున్నందున, అట్టి బ్రహ్మస్వరూపమును పూర్తిగ గుర్తించుటెంతయో యవసరంబు. అదెట్లనిన

" సర్వేలోకా ఆత్మని బ్రహ్మణి మణియఇవోతాః ప్రోతాశ్చ"

యని సర్వ లోకంబులును సర్వాత్మ యగు బ్రహ్మమునందే యోతప్రోతములని (నిలువుగాను - అడ్డముగాను అంతట వ్యాపించినవి) ప్రతిపాదింపబడుచు, సద్రూపంబునను - స్ఫురణంబునను, సర్వానుస్యూతుడగు స్వప్రకాశ పరమానంద చైతన్య ఘనుడగు పరమాత్మకంటె అదిష్ఠానాఽజ్ఞాన లక్షణమైన భ్రమచేత జగదాకారముగ భాసించుచున్నను, బృ॥ 7-5-3 "తస్యోపనిషదహంఅలో వివరించునటుల, క్రియాకారక ఫలాత్మకంబగు దేహమందున్న "సత్యబ్రహ్మమునను" అహం అనునది రహస్యాభిధానమై వాని ప్రకాశత్వము ననుసరించి భాసించుచు, ఆ సద్వస్తువే మధ్యమాధికారుల నుద్దేశించి యుపాసనానుకూలముగ నామ - రూప - కర్మములను మూడువిధములుగ విభజింపబడుచున్నట్లు స్పష్టమగుచున్నది. ఇట్టి విభజన కేవలము కాల్పనికంబును, దేసలోద్దేశంబున విడువబడిన "పదార్థములే" యగుటంజేసి, నవియొక సంకల్ప మాత్రమే యగుచు, యథార్థవస్తు సంగ్రహోపకారకములుగ వెలయుచున్నవనుటలో సందేహములేదు. అయిన నటుల గుర్తింపనేరక, కేవలము "చలనమాత్రమే" యని విశ్వసించు అల్ప ప్రజ్ఞామంతుల సంశయ నివారణార్థ మీ క్రింది వివ్ర్య నెంతయు గమనార్హము

పైన వివరించిన ప్రకారము, ఈ క్షణసంకల్పాత్మకమ

అయిన మాయా పరిణామములే, బుద్ధ్యహంకారాదులు, పంచతన్మాత్రములు, అపంచీకృత మహాభూతములు, సకల జగన్నిర్వాహక కర్తయగు అంతఃకరణావచ్ఛిన్న జీవుడును యగుటచే, సమస్త కర్మములును 'పరాస్యశక్తిర్వివిధైవశ్రూయతే' యనునట్లు, పరాశక్తియొక్క పరిణామములనునది సుస్పష్టము. కాననే 'ఈశ్వరానుగ్రహాదేవపుంసామద్వైతవాసనా' యను స్మృతియు, ముముక్షువులెట్లు కర్మతత్త్వమును పూర్ణముగ గ్రహింపవలసినదియు, అప్పుడేగాని జ్ఞానంబును, తత్సాధన సామగ్రియు, మోక్షమును లభ్యముగానిదియు తెలుపుచున్నది. అనగా సకల జగదాయతనత్వము మొదలగు నానావిధ విషయాంతరములు పరిహరించినపుడుగదా, మనసు ధ్యానింపబడుచున్న భగవంతుని యందే ప్రతిష్ఠితంబగును! యోగమనినను 'దుఃఖ సంయోగ వియోగమని' యెగదా! తెలుపబడుచున్నది. కాన అభ్యాస యోగముచే, దేహావచ్ఛిన్నమైన యంతర్యామియై యున్న స్వస్వరూపము యొక్క జ్ఞానమునకు సాధనోపాయమగు కర్మవిభాగమెంతయు విచారింపదగినది. అనగా సర్వమునకు నధిష్ఠానమయిన "సన్మాత్రము" యొక్క జ్ఞానముచే గల్పితములగు సర్వంబును బాధితములుగాగా, సన్మాత్రమే పరిశేషించుటవలన, దాని జ్ఞానముచేతనే కృతకృత్యులగుట దీనినే టిప్పణికలయందు

శ్లో॥ కర్మాఽకర్మ వికర్మమర్మసుధియాం బోద్ధవ్యమేవాఽఽదితః
కర్మస్యాద్విధి పూర్వకంతు మనసా సర్వేంద్రియవ్యాపృతిః।
తద్ద్వేధా సఫలం, ఫలేనరహితం, త్వాద్యం వికర్మ స్మృతం
బన్ధాదన్య దకర్మశుద్ధి కరణా న్నైష్కర్మ్యతా మాగతమ్॥

యని వివరించినటుల, సత్త్వయుక్తమైన మనస్సుతో శాస్త్రీయముగ నాచరించిన కర్మ - ఫలాభిసంధితో గూడి నప్పుడు-బంధజనకమే యగుచు అనిత్యమగు స్వర్గాది ఫలంబు లొసంగునదేయగుటచే 'వికర్మమే' యనియు, నటులగాక, కర్మ సమాప్తి రూపమైన నైష్కర్మ్యమువలన 'అకర్మ' త్వము సిద్ధించి, (రెంటియందున విధి సమానమే యైనను)- ఫలాభి సంధిరాహిత్యముచే - అంతఃకరణశుద్ధి నొసరించి, తాను పరతినిబొంది, జ్ఞానస్థానమును జేరుచున్నదై మోక్షము నొస గూర్చునదగుచున్నదని వివరింపబడినది. యదార్థమటు లున్నను, లోకములో కర్మమనగా దేహాది చేష్టలనియు, అకర్మమనగా నేమియు జేయక నూరకుండుటనియు, వికర్మ యనిన నిషిద్ధకర్మాచరణమనియు మొదలగు విపరీత భావ ములతో నిండియుండుటచేతనే, 'కర్మణాబధ్యతే జన్తుః విద్య యాచవిముచ్యతే' యనునది సార్థకమగుచు, రహస్యము గుర్తింపనేరని పండిత మన్యులనేక విధములుగ కొట్టుమిట్టాడు వారగుచున్నారు. అటులగాక కర్మతత్త్వమును పూర్ణముగ గుర్తించిన విద్వాంసుని కర్మ, అవిషయమే యగుటచే 'తంవిదిత్వానలిప్యతే కర్మణాపాపకేన' యను శ్రుత్యాను సారమున, వాతనికి గర్మలేపనమెంతమాత్రము గలుగజాలదు. అది పైన వివరించిన ప్రకారము అకర్మమే యగుటచే బంధ మెంత మాత్రము కానేరదు.

మరియు 'తమేవ విదిత్వాఽతి మృత్యుమేతి' యని ఆత్మ తత్త్వజ్ఞానము వలననే ముక్తి కలుగునని శ్రుతులయందు వినవచ్చుచున్నను, జన్మాది హేతువులగు కర్మములనుండి విడి వడుటయనునదే ముక్తి యగుటచేతను, అట్టిది కర్మాఽకర్మల

తత్త్వము పూర్ణముగ గ్రహించిననేగాని సులభసాధ్యముగానం గున కర్మములయొక్క రహస్యము తెలుసుకొనవలసినదే! పైనవివరించినప్రకారము పరిశీలించగా, కర్మాఽకర్మ వికర్మల యొక్కయు ఆకాశాదిప్రపంచము సమస్తముయొక్క తత్త్వము బ్రహ్మమే! అట్టి బ్రహ్మము విదితంబగునేని సమస్తముయొక్క తత్త్వమును విదితంబగును. అదెట్లనిన, కర్మమనగా మహత్తు మొదలుకొని స్థూలమువఱకుగల బ్రహ్మ కార్యంబగు జగత్తు- ఎట్లు ఒకేజలమునందు తరంగ, ఫేన, బుద్బుదాదులవలన భేద కల్పనంబు గావించబడుచున్నదో, ఎట్లు ఒకే భూమియందు గృహక్షేత్రాది కల్పనంబులు గావింపబడుచున్నవో, అట్లే యీ మిథ్యాభూతమయిన చరాఽచర ప్రపంచ మంతయు "నిష్కళం, నిష్క్రియం, శాన్తం, నిరవద్యం, నిరంజనమ్"బగు పరమాత్మయందు కల్పింపబడుచున్నవి. గాన నీనామరూపాది భేదకల్పనంబంతయు భ్రమమూలక మగుచున్నదేగాని వాస్త వంబునగాదు.

ఇట్లు పరతత్త్వమును గుర్తించిన విద్వాంసుడు సమస్తమయిన జగత్తును పరబ్రహ్మముగానే చూచుచున్నాడు. గాన యదార్థ ములో కార్యజాతమునందు గాంచునది కారణభూతమైనదే యగుటచే కర్మయందు అకర్మత్వమే సిద్ధించుచున్నది. మరియు నాములనే యదార్థములో నున్నది, సర్వ వేదాంత ప్రతిపాదిత మగు ఏకమేవాఽద్వితీయంబగు శుద్ధచైతన్యరూపమే యైనను, ఎట్లు రజ్జువు తానెపుడు నొకటియేయైయుండియు 'స్వభావము' న శిరవృచ్ఛాది భేదమున సర్పాకారముగ భాసించుచున్నదో, ఎట్లు మరీచి మరుభూమియందు సహజముగనే జలతరంగాద్యా కారమున దోచునో, అట్లే బ్రహ్మమునందు భ్రాంతిచే ద్రవ్య-

గుణ - కర్మాది భేదంబున జగద్రూపముగ దోచుచున్నది. అనగా తనయందే, సహజమైన స్వభావముచే, జగత్సృష్ట్యాది నిర్వాహకము జరుగుచున్నది; గాన ముముక్షువు తాను కాల త్రయాతీతుడనను నిష్క్రియాత్మ జ్ఞానదృష్టినే నిశ్చయముగ గలిగి, తద్విపరీతమగు భేదదృష్టిని తొలగించుకొనుటయే కర్తవ్యముగ నెంచిన, అకర్మయందు కర్మను గ్రహించనగును. ఇట్లు కర్మా-ఽకర్మములను పరస్పర విశేషణ విశేష్యభావ (బ్రహ్మము జగత్తు, జగత్తు బ్రహ్మము)దర్శనము దృఢమయి నంతనే, అనగా భ్రమ కల్పితమగు నామరూపాది ద్వైత దర్శనమును విడిచి, మోక్షమును గోరువాడు సంశయ విపర్యయ ములు నిశ్శేషముగా నశించునట్లు, నామ - రూప - గుణ - కర్మముల సమస్తమును ప్రత్యగ్దృష్టిచే పరబ్రహ్మముగానే, తరంగ ఫేన బుద్బుదములు జలముకన్న వేఱుగానటుల, యెవ డెంచుచున్నాడో, యెంచుటయేగాక దృఢానుభూతిని బొందు చున్నాడో, వాతడే భ.గీ. 4/18 "సబుద్ధిమాన్మనుష్యేషు సయుక్తః కృత్స్నకర్మకృత్" లో వివరించినట్లు, అశుభము నుండి ముక్తుడగుచున్నాడు. ఇట్టి విపరీతభావమునకు దేహా ద్యాశ్రయంబగు కర్మము "సఏవ మాయాపరిమోహితాత్మా శరీరమాస్థాయకరోతి సర్వమ్" అనునట్లు వాయు వున్నప్పుడు వృక్ష చేష్టవలె, నాత్మయం దధ్యారోపించి, "నేను కర్తను, కర్మను జేయుచున్నాన"నియు, "నేనూరక యున్నాను - అం దుచే సుఖించుచున్నాను" ఇత్యాదులుగా ననుకొని అభిమా నించుటయే కారణము ! ఆత్మ యదార్థములో నిష్క్రియుడే యైనను, ఇట్టి సక్రియత్వము కేవలము అధిక మోహమునకు లోనైన గాఢవిపరీతదర్శనమే గదా ! గాన వ్యవహారకాల

మందు కార్యకరణ నిష్ఠంబగు కర్మము నిజరూపంబునయున్న దయ్యును, అక్రియాత్మయందు, 'దేహమే నేను' యను ఆరోపముద్వారా విదియును ఆరోపింపబడుచున్నది. గాన ప్రవృత్తి, నివృత్తులు రెండును కర్తృతంత్రములే యగుటచే, 'అహం' కారమే కారణము గాగల కర్మమును వాస్తవము గుర్తించి, కర్మము, కర్మాభావ మనునట్టి విభాగములేని కూటస్థుని [illegible] మార్గంబున దెలుసుకొనుటయే ఇట్టిది నివారించుట కేకైకమార్గము. ఇదియే కర్మసమాప్తి రూపమయిన నైష్కర్మ్యసిద్ధి. దీనినే యోగారూఢావస్థయని భ.గీ 3/17 శ్లో॥ 'యస్త్వాత్మరతిరేవస్యాత్' యనుచోట వర్ణించుచు, నిట్టి స్థితియందు కర్మప్రసక్తియే లేనట్లు గుర్తింపబడినది. గాన ఆరురుక్షువగువాడుగూడ తప్పక నీ ప్రకార మాచరించుటచే, జీవించియుండగనే, బ్రహ్మమునందు పరిపూర్ణమయిన సర్వానర్థ నివృత్త్యుపలక్షితమగు నిర్వృత్తిని, నిరతిశయానందావిర్భావలక్షణమయిన స్థితిని బొందుచున్నాడు.

పరమార్థమున భ.గీ 5/14 'నకర్తృత్వం నకర్మాణి లోకస్య సృజతి ప్రభుః' యని కర్తృత్వభోక్తృత్వైశ్వర్యములు 'ఆత్మ'కు లేనివియయ్యె, కేవల మవిద్యాకృతములే యగుటచే, తనయందు తానే అనాద్యవిద్యాకామవశమువలన ప్రవృత్తి స్వభావము గలిగించుకొని, ఈ జీవేశ్వర జగద్భేద ప్రతీయమానముగలిగి, మూఢునివలె భ్రమించుచున్నాడు. ఇట్లుండుట చేతనే, కర్మయోగాదిక్రమంబున, బ్రహ్మజ్ఞానము గలిగిన, ఆ పిమ్మట జేయు విద్వాంసుని కర్మము బంధ మెంతమాత్రమును గా నేరదు—తానే సర్వభూతాశ్రయుడగుటవలన—ఇక నూరకుండుట యనునది బ్రహ్మనిష్ఠునకుదక్క మఱెవ్వరికిని ఘటిల్ల నేరనిదగు

టచే, పూర్వసంస్కారమువలన సంభవించునట్టిక్రియను నిశ్శేష
ముగా విడుచుట సామాన్యుల కెవ్వరికి శక్యముగానిదగుటచే,
అంతఃకరణ వృత్తిని బ్రహ్మాకారముగా జేయుటకై కర్మయోగ
మొక్కటేనియు పరంపరయా నుపయోగపడుచు, చిరకాలాభ్యాస
పాటవమున నంతఃకరణశుద్ధిని గావించి, జ్ఞానోత్పత్తిని గలుగ
జేయుచున్న దనుటలో సందేహము లేదు. అదెట్లనిన:—
జ్ఞానయోగము, సిద్ధించుటకు ప్రప్రథమముగా లోకములోని
విక్షేపశక్తిని దొలగించుట కనువైన శాస్త్రీయ కర్మలను
యథావిధిగా నాచరించుటచే చిత్తమున కైకాగ్రత లభించి,
నదియే భక్తిశ్రద్ధలతో చిరకాలాచరణవలన యీశ్వరానుగ్ర
హమునకు పాత్రత గలిగించి, తన్మూలమున యంతఃకరణగత
మాలిన్యమును దొలగించి, క్రమక్రమముగా ఆత్మాఽనాత్మ
వివేకము గలిగించి, బాహ్యవస్తువులందు దోషదృష్టిని
బెంపొందింప జేయుచున్నది. ఇటుల ఈశ్వరార్పణ బుద్ధితో
జరుపబడిన కర్మయోగమే అభ్యాసపరిపాకవశమున శ్రవణాదు
లందు లక్ష్యతగుదిరించి, జగన్మిథ్యాత్వమును నిరూఢపఱచి
క్రమముగ సగుణ నిర్గుణోపాసనల కలవర్చుచున్నది. ఇట్లు
కర్మ, భక్తి, ఉపాసనలు జ్ఞానమున కంగములుగా పేర్కొన
బడినను, నిదంతయు ముముక్షువులకు సత్త్వశుద్ధి కొఱకేగాని
తాత్త్వికముగాని కారణమున, యదార్థములో "అజ్ఞానమనునది
జ్ఞానాభావముగాక ఆవరణ విక్షేపశక్తులు గలదియై, అనా
దియు, ఆనిర్వచనీయంబును, అకృతంబును, అనర్థసమూహము
నకు మూలంబును, 'అవిద్యా, మాయా,' యిత్యాది సాంకే
తములతో విరాజిల్లుచుండునదియు నగు అజ్ఞానము, "నాకు
తెలియదు" యను భ్రమ కలిగించుటయందే మేటియగునది—

పై విధముగ నిర్మలమయిన అంతఃకరణముయొక్క వృత్తి రూపమును, శోధితములగు 'తత్త్వం' పదార్థముల యభేద రూపమయిన సచ్చిదానందాఖండరసవస్తు మాత్రమే విషయము గాఁగలదియగు నిర్వికల్ప సాక్షాత్కారముచేత-ఎట్లు సూర్యుఁడు తానుదయించుట మాత్రముననే చీకటి నిశ్శేషముగా నివర్తిల్లు చున్నదో యట్లు- బ్రహ్మజ్ఞానముగూడ. శుద్ధసత్త్వ పరిణామం బగుటవలన, వ్యాపక ప్రకాశరూపముగుటచే, దాను బుట్టుట మాత్రముననే ఇతర సహకార మపేక్షింపకయే, సత్యజ్ఞానా నంతానంద రూపమగు, ఏకమేవాఽద్వితీయమగు, పరమాత్మ తత్త్వమును ప్రతిచ్ఛాయాగ్రహణ మాత్రంబుననే, కర్తృత్వము లేకయే, యభివ్యంజించుచున్నదని" వివరింపబడినది. దానచే యీ కర్మ భక్త్యుపాసనాదు లనునవన్నియు సాధకుని కాయా అంతస్థులయందు విభిన్నరూపములుగా గానవచ్చుసాధనలుగా నుపయోగపడుచున్నను, పారమార్థికమున కేవలము గౌణములే నని చెప్పక తప్పదు.

గాన పూర్ణమైన తత్త్వానుసంధానము కుదురు పర్యం తమును,

> "తద్దినం దుర్దినం మన్యే మేఘాచ్ఛన్నం న దుర్దినమ్
> యద్దినం హరిసల్లాప కథాపీయూష వర్జితం "

లో సూచించునటుల, ఘోర జీమూత సమూహముచే నావ రింపబడిన అభ్ర భాగముగల దినమే భయము గొల్పునదిగా తలంపక, అవిచ్ఛిన్న తైలధారవలె యహర్నిశములు స్వస్వరూ పాను సంధానామృతము గ్రోలుట కంతరాయ సంఘటనమే దుర్దినముగనెంచి, నీకార్యకరణ సంఘాతము కేవలము భగవద్వ్యా

లాసము నాస్వాదించుటయును, యాతని యసంగ చిద్రూప
త్వమును గుర్తించుట కనువైన యాయతనముగనే గుర్తించి,
తగినంతమాత్రమే దానియందు లక్ష్యముంచి, వారివారి యధి
కారానుసారముగ కర్మాదుల నాచరించు టెంతయో శ్రేయో
దాయకము. ఇట్టి కర్మాచరణ అచ్చటచ్చట మహాజ్ఞాను
లందును యొకానొకప్పుడు గానవచ్చినను, అది వారివారి
ప్రారబ్ధభోగ శేషమే యగుచు, వారు చేయతగిన దేమియు
యదార్థములో లేదని శాస్త్రము ఉద్ఘోషించుచున్నందున,
ప్రమాదములకు లోనుగాక, కర్మతత్త్వము పైవిధముగ
గుర్తించి ప్రవర్తించు టనునదే కర్తవ్యము.

ఓమ్ - తత్ - సత్.

## 25. ధర్మ సూక్ష్మము

శ్రు॥ "యోవై సధర్మ స్సత్యం వైతత్"
(బృ॥ 3-4-

'ధరతి విశ్వం ధర్మః' (ధృఞ్ ధరణే) అను ధాత్వర్థము
ననుసరించి, విశ్వమునుధరించు దానికే ధర్మమనియు, అట్టిది
'ఏష ధర్మ స్సనాతన' - 'తాని ధర్మాణి ప్రథమాన్యాసన్'
ఇత్యాది వేదవచనములచే వేదవిహితమయిన కర్మముగ, నదే
జనులచేత బూనబడుచున్నందున గూడ (ధ్రియతే వా జనై రితి
ధర్మః)ధర్మమనే ప్రసిద్ధిగాంచుచున్నది. ఇట్టి యుక్తగుణ విశేష
విశిష్టమయిన ధర్మము నెఱుంగకపోవుటచేతనే పురుషులు
జనన మరణ ప్రవాహమునందు బడద్రోయబడుచు, దాని
మహత్త్వమును గుర్తించగలిగిన శ్రద్ధావంతులు, నిష్ఠావంతులు

మాత్రమే దానిచే నియమింపబడుచు, సర్వోత్కృష్ట శాంతిని
పొందుచున్నారనియు, శ్రుతి - స్మృతులయందు గానమొనర్చ
చున్నది. అట్లగుటచేతనే ఆత్మజ్ఞానరూపంబగు నీధర్మము అను
ష్ఠానమునకు పూర్వమేది సత్యమని వ్యవహరింపబడుచున్నదో,
యాచరణ యందదియే ధర్మమని కీర్తింపబడుచు (సత్యంవద-
ధర్మంచర) మిక్కిలి బలవత్తరమగు నియంతగ ప్రసిద్ధిగాంచు
చున్నదని వ్యాఖ్యానింపబడుచున్నది. ఇట్టి ధర్మముయొక్క
యాచరణ క్రమముగా జరుగుటకే, 'తాని చ నిసర్గతఏవ
కర్మాధికార నిమిత్తాని' యని భాష్యకారులే ధర్మవ్యవస్థను
జూపి, తత్తదధికారులను శాస్త్రమే నిర్దేశించినటుల తెలవిచ్చిరి.

అనగా అగ్నికి ఔష్ణ్యము, ప్రకాశము ధర్మమగుచు,
కేవలము తదధిష్ఠానమును గుర్తింపజేయుట యందే ప్రధాన
ముగా నెట్లు వినియోగింపబడుచున్నదో, అటులనే సృష్టికి
ప్రాక్కాలమున నున్న 'యా సద్వస్తువు' స్వకీయ సామర్థ్యము
చేతనే ప్రకాశమను ధర్మమును గలిగి బృ॥ 4-5-11 వ్యాఖ్యా
నములో వివరించినటుల, "సత్య ధర్మయోశ్చ భేదేన నిర్దేశః
కృతః శాస్త్రాచార లక్షణయోః" అను సత్యధర్మముల కొకటే
యర్థమున సామాన్యవిశేషరూపముల నిరూపింపబడినవి (సత్య
ధర్మములు) రెండును 'ఏతద్ధ్యేవై తదుభయం భవతి' అను
శ్రుతి ప్రమాణానుసారమున బ్రహ్మరూపమే యగుచున్నదని
స్పష్టముచేయబడినది. అట్లు తానే విశ్వరూపమును ధరించిన
వాడగుటచే జగత్తునకు మర్యాదలేమి ప్రసక్తింపగా దానిని
వ్యవస్థ(శాస్త్రనిరూపితమైన క్రమము)చేయగోరినవాడై తానే
రెండువిధములుగ నీధర్మమును సృజించెను. అవియే వేదోక్త
మగు, జ్ఞానవైరాగ్య లక్షణంబగు నివృత్తి ధర్మమనియు,

ప్రవృత్తిలక్షణ ధర్మములను నామములచే విరాజిల్లుచున్నవి. అట్టి ధర్మద్వయముచేత నేధర్మాఖ్యంబగు ఆ జ్ఞానస్వరూపుని' గుర్తించి, పరమశాంతిని బొందనగునుగాని వేఱొకమార్గమేమియు లేదని స్పష్టముచేయబడినది. గాన దాని సూక్ష్మ విమర్శనజేయుటెంతేని యావశ్యకము.

అందు నివృత్తిలక్షణంబగు ధర్మము, జ్ఞానమే స్వరూపమగుచు సర్వత్రా నావరింపబడినదై

"ఫలతోఽపి చ యత్కర్మ నా నార్థే నాఽనుబధ్యతే
కేవలప్రీతి హేతుత్వాత్తద్ధర్మ ఇతి కథ్యతే."

అను న్యాయమున (ఏ కర్మము ఫలముచేతగూడ అనర్థము కలిగింపదో కేవల ప్రీతి హేతు వగుటవలన ఆ కర్మము ధర్మమని తా.) శ్యేనయ్యాగమునుం బోలు కర్తవ్యర్థత్వమే (ought = చేయదగును) గలిగినదగుటచే చోదనాఽజన్యమైన జ్ఞానమే లక్ష్యమై వైరాగ్య మాభిలషించున దగుచున్నది. అనగా యిట్టి ధర్మాచరణవలన స్వతస్సిద్ధమైన వస్తువు జ్ఞాపకమునకు వచ్చునేగాని ప్రత్యేకమగు అపూర్వఫల మొకదాని నొసంగునది కాదు. అట్టి చిన్మాత్ర స్వరూపమగు యీ సద్వస్తువు 'అహంపదవాచ్యమే' యగుటచే నివృత్తిలక్షణ ధర్మప్రతిపాదకమగు నివృత్తిశబ్దము 'బంధముల' నివర్తింపజేయుటకు తగినట్లు ప్రవర్తించుటయేనని నిర్వచింపబడుచున్నది. మరియు పాణిని సూత్రములందలి రెండవదగు 'చోదనా లక్షణోఽర్థోధర్మః' యనుదాని స్థానమున వ్యాససూత్రములందును రెండవదిగా గానవచ్చు 'జన్మాద్యస్యయతః' యని చెప్పబడునది ప్రమాతసూత్రమేయైనను ప్రేరకమైన సాధ

నముల్లో భేదములేమిటనే "నకర్మణా న ప్రజయా" "ఆత్మావా అరే ద్రష్టవ్యః" "తత్త్వమసి" ఇత్యాది శ్రుతి వాక్యములందు గానవచ్చు బ్రహ్మచోదన కేవలము "ఉదాసీన మాన మేవో బ్రహ్మ" యను రత్నప్రభ వచనానుసారముగా "బ్రహ్మనని" తెలుసుకొనుటయేగాని జ్ఞానము విధిజన్యముగాదని యింక పలయును – కారణము, జ్ఞానము పురుష వ్యాపారాధీనమైనది గాక సిద్ధమే యగుచు విచారించినను విచారించకపోయినను విచారించుచున్నప్పుడును యెల్లప్పుడును ఉన్నదై "నాస్త్య కృతః కృతేన" యనునట్లు తెలుసుకొనవలసినదే యగుటచే.!

ఇట్టి ధర్మము తన స్వరూపమే యగుటచే దానిని గుర్తించుట కందరు అర్హులైనను కామోదయంబున వివేక జ్ఞానములు క్షయించుట కారణముగా ధర్మరి బహిర్భూయ మానంబై (లొంగదీయబడినదై) అధర్మంబు వర్ధిల్లుటచే అనేక విక్షేపములకు లోనయి చ్యుతులగుటకు హేతువగుచున్నది. అటుల వారు తమ తమ కామోద్రేకముల ననుసరించి "యత్క్రతుర్భవతి తత్కర్మ కురుతే తదభి సంపద్యతే" అను శ్రుత్యానుసారమున యేయే సంకల్పములు (బాగుగానున్నవని అనుకొనుట) కలవారగుచున్నారో ఆయా కర్మముల జేయుచు నాయా ఫలములం బొంది వాటి ననుభవించుట కనువుగా (వృ ధాతువులోనుండి యుత్పన్నమైనదే• వర్ణము గాన)నాయా జన్మలను• వరించి ఆయా దేహములను తెచ్చుకొన్నారు. ఇట్లు వారు తమ మూలస్థానమును గోల్పోయి బహుదూర గతులను బొందినవారగుటచేతనే తిరిగి వారాలక్ష్యమును జేర దలచుకొనునపుడా పతనమునకుదగినట్లు వేర్వేరు సాధనముల నవలంబించవలసినవారై ఆ యా కృషికి తగిన ఫలంబులనే

బొందగలుగుచున్నారు. ఇదియే వర్ణాశ్రమధర్మమనబడును.
"దేహమే నేను" అని అభిమానమెంత గాఢముగ నుండునో
యంత మాంద్య(gross) ములైనజన్మలు సంపాదించుకొనును.
ఎంతెంతవరకు "నేను-దేహము"యనువాని విచక్షణ గ్రహించ
గలుగునో అంతంత సూక్ష్మవిమర్శనా కౌశలమైన (subtle)
జన్మలు గలుగును. ఈ అహంకారము (నేను) ను తీసివేయు
టకు అందరికిని అధికారము గలదు. అదియే జ్ఞానము! గాని
యీ అహంకారమును పెంచుటకు(అనగా దేహతాదాత్మ్యభి
మానము విడుచుటకు) ఒక క్రమమున్నది. అది అందరు పెంచ
లేరు. అనగా అనుకొనుట కొక క్రమమున్నది. బహు కష్ట
సాధ్యము. అనుకొనకుండుటకు క్రమము లేదు. కడు తేలిక!
గాన యీ ధర్మము లనునవి ఆయా జన్మలలోని అంతస్థుల
ననుసరించి యుండును. వీనికే (ఆశ్రామ న్త్యస్మిన్నితి-ఆశ్రమః
=తపోయుక్తులగు స్థితి) ఆశ్రమము లని పేరు. అదియును ఒక
నికే ఒకప్పుడున్న ధర్మము మరొకప్పుడు లేకపోవును. గాన
ఆయా వికసన ననుసరించి ఆయా ధర్మము మారుచుండును.
గాన వర్ణాశ్రమము లనునవి లేకపోయినచో ధర్మమనునదే
లేదు. దీనినే భ.గీ. 18-41 శ్లోక వ్యాఖ్యానములో 'వారి
వారి స్వభావముచే గలిగిన సత్త్వాదిగుణములను బట్టి వేరు
వేరుగా ధర్మములు శాస్త్రముచే విధింపబడిన' వని వివరింప
బడినది. గాన జీవులకు తాము తమ వర్తమాన స్థితులలోని
యంతరముల వృద్ధిజేసుకొనదలచినచో ప్రప్రథమమున తాను
ధర్మాత్ముడై యుండవలెనను కోరిక గలుగవలెను. అప్పుడే
సనాతనధర్మ ప్రతిపాదకములగు శాస్త్రమును సమీపింప
గలుగును. అట్లగుటకు దేశకాల నిమిత్తములతో సంబంధము

లేదు. ధర్మాచరణ మెప్పటికప్పుడే మొదలు పెట్టనగును. పైన పేర్కొనబడినట్లు, యీజన్మనందలి యనుభవమంతయు పూర్వజన్మ ధర్మాఽధర్మ ఫలములేయై బీజములన్నియు జన్మలోనే వచ్చునవగుటచే భ. గీ. 7-28 శ్లోకములో వర్ణించినటుల "వర్తమాన జన్మమందు పుణ్యకర్మ లధికముగా జేసినవారి కెవ్వరికి బాపక్షయమొందునో వారలకే ప్రత్యక్తత్త్వవిజ్ఞానముగలిగి ఆనందావిర్భావ మగునని తెలుపబడినది. ఇట్టి ప్రవృత్తి లక్షణమగు ధర్మము వర్ణాశ్రమవ్యవస్థాపనను పాలించునదే యైనను సూ.భా. 3-4-26 "సర్వాపేక్షాచ-" యను వ్యాఖ్యానుసారమున వైదిక నియమానుష్ఠాన పరిపక్వముచే జ్ఞానోత్పత్తి కెంతయో ఉపయోగపడుచున్నది. అదెట్లనిన "ప్రవర్తక మానమేయో ధర్మః" అను చోదనా సూత్రము చెప్పున విధినిబట్టి యనుష్ఠించిన కర్మమే (కర్తవ్యతాంశను బొందిన (should=చేయవలయును) 'స్వర్గకామోయజేత'లో చెప్పబడినట్లు ధర్మమగును గాని వ్యాపారమాత్రము ధర్మము గాదను ప్రవృత్తిపరులును భ.గీ. 2-47 శ్లో॥లో 'కర్మణ్యేవాధికారస్తే మాఫలేషు కదాచన' అని వివరించినటుల ధర్మమో అధర్మమో ఆచరించుటయందే అధికారులై ఫలాభిసంధినివిడిచి చేయుటయే నిష్కామ కర్మమనియు అటుల చేయుటచేతనే నియమానుక్రమంబున స్వధర్మాచరణ చేసినవారలై చిత్త శుద్ధిగలిగి నిశ్శ్రేయసంబను స్వాస్థ్యమును బొందగలుగుదురనియు స్పష్టముచేయబడినది. ఈభావమునే సూచించునటుల 7-12-1948 సం॥లో భారతదేశ ప్రధానామాత్యులు హైదరాబాద్ చర్చల సందర్భములో యీ క్రింది విధముగ తమ కర్తృత్వమును వెలిబుచ్చుచు, పండిట్ నెహ్రూగారిట్లు నుడివిరి.

"No individual can guarantee for himself success; but every one can guarantee for himself a good effort and a good run, and a good work in life without caring for the result. We have done the job and we have had the joy for it"

గాన పూర్వజన్మార్జితమయిన శుభాశుభ కర్మఫలములను రాగద్వేష రహితుడయి అనుభవించుచున్నవారై, నూతనముగ ఫలాభిసంధితోగూడిన కర్తృత్వ భోక్తృత్వాభిమానము లేనివారలగుటచే వర్ణాశ్రమాభిమానమును దాటినవారలై, 'నే నధికారము గలవాడనను' యభిమానము నైతము లేనివారగు చున్నందున అవిద్యాలేశమువలన పుట్టుచున్న వాగాది వ్యాపారములు కేవలము కర్మాభాసములే యగుచు నూతనముగ బంధ జనకములు గాజాలవు. ఇదియే అర్జునుడు కృపణుడై భ.గీ 2-7 శ్లోకములలో వెలిబుచ్చిన "ధర్మసూక్ష్మ" మెఱింగింపు డని కోరినపుడు శ్రీకృష్ణ భగవానులు చేసిన బోధయొక్క సారాంశము.

భూతహింసలేని జపయజ్ఞము సర్వ ధర్మముల కన్నను పరమ ధర్మమగుటచే యేయొక్క క్రమమునకు లోనుగాక హింసయే ప్రధానమై దేశకాల కలనములకులోనై ప్రవర్తించు జగత్తు నతిక్రమింపదలచి వారల కెల్లరకును అంతఃకరణ పరిశుద్ధిని గావించు నీ స్వధర్మాచరణమే ప్రశస్తమైన జపతపాదులు! అప్పుడే రాగద్వేషము లుండవు. వారివారి అధికారానుగుణముగ జేసిన ప్రతి కర్మయు స్వధర్మమనియే వచింపబడుచున్నది. అనగా తనకు ఇహలోక మందును, పరలోక మందునుగూడ సౌఖ్యమిచ్చునదే స్వధర్మము.దీనిని శాస్త్రమే

సూచించవలెను. ఏలనగా, శాస్త్రము నివర్తకముగాని ప్రవర్తకము గాదు. గాన వైదిక కర్మ మనగా అభ్యుదయాది నిశ్శ్రేయస పర్యంతము భ.గీ. 2/52 శ్లో॥ వివరించినట్లు అవివేక రూపమయిన కాలుష్యమును తొలగించి చిత్తశుద్ధికి హేతువగునదే! అప్పుడే అనాత్మ విషయంబయిన విరాగ ముదయించును. అటులగాక అర్జునునివలె ముందు ఫలము కోరియు యుద్ధసన్నద్ధుడై తిరిగి. శోకమోహములకు లోనై ధర్మసూక్ష్మ మెఱుంగక యుద్ధవిరమణ జేయనెంచుట విరాగ లక్షణమా? లేక చిత్తశుద్ధి నిదర్శనమా? గాన భ.గీ. 18-47 శ్లో॥ వివరించినటుల బాగుగా జేయబడిన పరధర్మముకన్న గుణహీనమైనను స్వధర్మానుష్ఠానము మిక్కిలి శ్రేయో దాయకము.

సామాన్యముగ జనులందరును ఇహలోక సుఖాపేక్ష గలవారగుటచే నొక రకపు (ఆధిభౌతిక) నియమములను, ఇహ పరలోక సుఖములను (అభ్యుదయమును) గోరువారు వైదిక కర్మానుష్ఠాన (ఆధిదైవిక) నియమములను, కేవలపర లోక సుఖమునే(నిశ్శ్రేయసము)గోరువారు యీవైదిక కర్మాదులను గూడ నియమించిన (ఆధ్యాత్మిక)నిష్ఠయును, యిందెందును జేరని కేవలమూఢులు ఇహపరలోక సుఖముల రెంటి యందును దృష్టిలేనివారై పశుప్రాయముగ సంచరించుటయు కలుగుచున్నది. దీనినే విమర్శించుచు నిషే (Nichie) అను జర్మనీ తత్త్వవేత్త తన మానవాతీత సిద్ధాంతములో (Super man theory) 'నే నెవరిని' యను ప్రశ్న వేసుకొని తాను మనిషినిగానవనియు దాని పైవాడ ననియు, యీ కనబడు నర పశువును కట్టుబాటులో నుంచువాడనుగ నుండియు బుద్ధిహీన

తచే మనుజునై పోతిననియు తెలియజేసెనట. మరియు జగద్విష
యములో గూడ ఈ ప్రకారము యెల్లకాలములందును యొకే
మాదిరి తిరిగి తిరిగి వచ్చుచుండుననియు, యీ సర్వవస్తువుల
కధిష్ఠాన దేవత లుండుటచే నాయా దేవతలను మన తపస్సుచే
స్వాధీనము చేసుకోఁగలిగిన, ఆ జాతినంతయు తెలుసుకోఁగల
మనియు సూచించుట. అనగా నీలోకములో నున్నశక్తులెన్న
టికిని తగ్గవనియు (జగత్తు శక్తి విలాసముకన్న వేరుగాని దగు
టచే) అట్లు తగ్గినట్లయిన యీ జగ మేనాటికైనను నశించక
తప్పదు. గాన యీ ప్రపంచ మనాది. అనంతముగా నిట్లేజరుగు
చుండవలసినదే యనియు యే యే స్థితికి ప్రపంచ మొచ్చినదో
అనేకసార్లింతవరకు వచ్చుచునే యున్నదనియు, తిరిగి రాగల
దనియు విశదపఱచెను. దీనినే శ్రుతియును 'ధాతా యథాపూర్వ
మకల్పయత్' యని ప్రతిపాదించుచున్నది. గాన "Similar
conditions produce similar effects" అనునట్లు మనుజు
డనను వదేర్పడుటకు కారణములున్నచో తిరిగి యావన్నియు
యేర్పడక తప్పదు. అందువలననే నను నదీ జగచ్చక్రములో నొక
స్ఫురణే యగుననియు, యీ జీవితములు ప్రవాహ నిత్యములే
యనియు, తాను మటుకు నిత్యుడే ననియు అట్టి జ్ఞానము లేక
మారుటవల్లనే మనుజులు బలహీనులై హీనస్థితికి వచ్చుటయు
కడకు నాస్తికత్వములోనికి జారుటయు తటస్థించుచున్న
దనియు సూచించెనట. అందువలన తాత్కాలిక సుఖములకే
తంటాలుపడుచు యీ కొంచెములోనే మనుజుడు తన జీవిత
మంతయు ధారపోయుట గలుగుచున్నది. ఇట్టి యనర్థమునుండి
బైటపడదలచిన ధర్మమునే యాచరింపవలయును. అదియును
లోక - వేదవిరుద్ధము కానిదిగా నుండవలయునే గాని, నిరా

ధారమైన తర్కమువలన స్థాపింపబడదు. తర్కమున కెప్పుడును యే యొక్క విషయము తేలకుండనుండుటయే భూషణము. అటుల తేలినట్లయిన తిరిగి తర్కమున కవసరమే యుండదు. అప్పుడు లోకవ్యవహారము సాగకపోవును. ఈ రోజున యెట్లు జరుగుచున్నదో రేపు గూడ నట్లే జరుగగలదను తర్కము (ఊహ) లేకపోతే వ్యవహారమే లేదుగదా! గాన తర్కమున కెంతవరకు స్థాన మీయవలెనో అంతవరకే సీయనగును. అనగా సూ. భా. 2-1-11లో వివరించినటుల శ్రుత్యుక్తమైన తర్కమునే ప్రమాణముగా గైకొని వ్యవహరించిన సర్వవర్ణ సామాన్యధర్మమని బిలువనగు నీతికైనను సార్థక్యమేర్పడును. నీతి నిర్వచనమును విచారించినను నయనం=నయః=పొందించుట(అనగా యెవరైనను ఒకచోటునకు వెళ్ళదలచుకొన్నచో వారి నక్కడకు తీసుకొనిపోవునది) ఇట్టి నీతి మనుజులందరిలోను గాన్పించుచున్నను సంసారము (అనాత్మ) లోని నీతి దేశకాల కలనాతీతమైన ఆత్మజ్ఞానమును పొందించి శాశ్వత సుఖ మొసంగుటకు గావలసిన నీతిని చెప్పదు. తాత్కాలిక దేశకాల పరిస్థితుల ననుసరించి పొట్టకూటికై చేయు కర్మ స్వధర్మము కానేరదు. ఆహారాదులు సంసారనీతి కవుసరము. అదియును యేదో విధముగ సంపాదించుటకు మొదలిడిన నది పశుప్రాయమే! యేయే రకముగ సంపాదించిన ఆయా జన్మలు లభ్యమగును. అనగా నా సంపాదించుటలోగూడ నొక నీతి కలదు. ఏదైన గమ్యస్థానము లేకపోయిన నీతి యనునది లేదు. వ్యవహారమునందు తనకును యితరులకును కష్టనష్టము లొసంగక సుఖము నిచ్చు ప్రవర్తనయే యుత్తమమైన నీతి. గాన సుఖమునే గోరి చేయు లోకవ్యవహారమునందు గూడ క్రమ

మైన నీతి-నియమముల ననుసరించి చేయనగును. లేనిచో యెట్టి అశాంతికైనను దారి తీయకపోదు. గాన ఒక గమ్యము పెట్టుకొననిది దానిని బొందుట కడుదుర్లభము. జీవునియొక్క 'శరీరమే నేను' యని అభిమాన మెంతవరకుండునో అక్కడ నుండి వారు బయలుదేరవలయును. గాన ఆహారాదుల విషయము సైతము వారివారి జన్మలననుసరించినే మొదలగును.

అట్టితరి శాశ్వత సుఖాపేక్ష గలవాడై దానికను వయిన స్వస్వరూపానుసంధానము చేయదలచినవారు దాని కుపకరణమగు బుద్ధిని సంస్కరించుటయే ప్రధానమగుటచే, యీ సంసారమును సాధనముగానే పెట్టుకొనవలెనే గాని గమ్యముగా పెట్టుకొనిన ప్రయోజనము లేదు. సంసారసుఖమే కావలయునని మనకున్నది గాన మానవుడు ఎన్ని వినినను తాను మారకపోవుటకు కారణము. నిజముగ ఆత్మస్వరూప సుఖమునే యభిలషించిన, దానికి తగిన నియమము లెంతేని అవుసరము.

అట్టి ఆత్మపదార్థమే 'ధరతిలోకా నితి ధర్మః' అను నిర్వచనానుసారమున లోకములను ధరించునదియై 'సూచ్యత ఇతి సూక్ష్మం' యనునట్లు లెస్సగా కానబడకుండుటచేత సూచింపబడునదియై ప్రకాశించుచుండ, భ. గీ. 18-66

సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ।
అహంత్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామిమా శుచః॥

వివరించినటుల,

ఇన్ని విధములుగ భాసించు "ధర్మము" యొక్క యథార్థమును గుర్తించి, సత్యమయిన తనకన్న వేఱువస్తువు

లేదని నిశ్చయ బుద్ధిచేత తనయందే తాను స్వాస్థ్యమును బొందియుండుటకన్న వేరు కర్తవ్యమేమియు లేదని గ్రహించి యుండుటయే "ధర్మసూక్ష్మము" యొక్క పరమావధి.

ఇటుల 'ధర్మసూక్ష్మము'ను గుర్తించి, మానవుడు లోకమందు సంచరించగలిగినచో, చతుర్విధపురుషార్థములలో భౌతిక వ్యాపృతి గలిగిన 'అర్థకామములు' సైతము నియమాతిక్రమమునకు లోనుగాక, పరమ పురుషార్థమగు నిశ్శ్రేయసమున కెంతేని యుపకరించునవగుచున్నవి. గాన మూలకందమగు 'ధర్మసూక్ష్మము'ను గుర్తించి, తదనుగుణముగ ప్రవర్తించుటందే యప్రమత్తులై యుండవలయును.

ఓమ్ - తత్ - సత్.

## 26. సన్న్యాసము.

శ్లో॥ కర్మత్యాగాన్న సంన్యాసో, నప్రేషోచ్చారణేనతు
సంధౌజీవాత్మనోరైక్యం, సన్న్యాసః పరికీర్తితః॥-
(మైత్రేయీ- ఉ-)

శ్రు. "న్యాస ఇతి బ్రహ్మ బ్రహ్మహి పర ఇతిన్యాస ఏ వాత్యరేచయత్" అని సన్న్యాసమే బ్రహ్మస్వరూపమనియు, సర్వోత్తమమనియు, శ్రుతి యుపదేశించుటచేం "బాహ్య విషయములను బొందక (సమ్యక్ + న్యాసము = బాగుగా విడచుట) చిత్తము బ్రహ్మమునందు బ్రహ్మరూపంబున నుండుట"యను నిర్వికల్పసమాధిని బొంది స్వస్వరూపంబున 'నుండుట'యే సన్న్యాసమని స్పష్టమగుచున్నది. ఇట్లు స్వతఃసిద్ధమైన స్వరూపమే యైనను భ.గీ. 3-4

'నచ సన్న్యసనాదేవ సిద్ధిం సమధి గచ్ఛతి'

యనుటను, కర్మజన్యమైన చిత్తశుద్ధి లేనిచో, సరి గుర్తింపబడ నేరనందున ఏదో యొక విధమున ఔత్సుక్య మాత్రమున 'సన్యాస' మవలంభించినను అది ఫలజనకము కానేరదని తెలుపబడిన్నది. అనగా

ప్రత్యక్తత్త్వ వివేకాయ సన్యాసస్యాకర్మణామ్
శ్రుత్యావిధీయతే యస్మాత్తత్త్యాగీపతితోభవేత్ ॥

యను స్మృత్యానుసారమున, సన్న్యాసముగూడ కర్మమే యగుచు, "తాను కర్తనుగాననియు, కూటస్థాసంగచిద్రూపుడ ననియు చక్కగా నెఱుంగుటచే తనకు సంచితాద్యశేష కర్మ సంబంధము లేదని లెస్సగా గుర్తించుటయే" సన్న్యాసయోగ మగుటచేతను, ఎవరెవరు శ్రౌత, స్మార్తాది కర్మంబుల నీశ్వ రార్పణ బుద్ధితో జేసి పరమేశ్వరున కర్పింతురో, (సం + ని + అస్ = బాగుగా ఉంచుట) వారలంతఃకరణశుద్ధి బొంది, జీవించి యున్నప్పుడే కర్మబంధముల వీడి విదేహకైవల్య మవశ్యము బొందగలుగుచున్నారు. దీనినే భ.గీ 9/28 శ్లోకములో

శుభాశుభ ఫలైరేవం మోక్ష్యసే కర్మబంధనైః
సన్న్యాసయోగ యుక్తాత్మా విముక్తో మా ముపైష్యసి॥

అనివర్ణింపబడినది. మరియు యధ్యాత్మ మీమాంసయందును

శ్లో॥ సమ్యజ్ఞ్యాన సమాప్తిర్విమలతరధియఃకర్మణాసంవిధాప్తా సన్న్యాసోయ ధ్వధధ్యాన్వయము పగతిగ్రాహ్యవక్త్రిం ప్రవేశ్య రమ్యాభావద్వివృద్ధింభజతి ఫలభరంయావదుచ్ఛైఃప్రసూతే హాసంపశ్చాత్తథైవా ఽమృతమభిలషతోజ్ఞానముత్పాద్యకర్మ॥

అనుచోట చక్కగా శుద్ధమైన అంతఃకరణముగల పురుషునకు
సంపూర్ణత నొందగలదని అదియే సన్న్యాస శబ్దార్థమనియు గాని
కర్మ త్యాగంబును కేవల ప్రేషోచ్చారణంబును గాదనియు
విశదపఱచుచు అందుకు దృష్టాంతములుగా- ఎట్లు మార్గము
పథికుని గ్రామ ద్వారమునఁ జేర్చి తానే యుపరమించుచున్నదో
యనియు మఱియు యెట్లు అంటుకొట్టు తాను ఫలమొసంగెడిదనుక
వృద్ధిజెంది పిదప తానే యుపరతిని బొందుచున్నదో యట్లు-
అమృతత్వ మభిలషించు పురుషులకీ కర్మలు జ్ఞానమును
బుట్టించి తామే యుపరమించునని విశదము జేయబడినది.
ఇట్టి సాధనపరమగు 'సన్న్యాసము' భ.గీ. 6/2 'యంసన్న్యా
సమితి ప్రాహు ర్యోగంతంవిద్ధి పాండవ' ఇత్యాది స్థలంబున
సన్న్యాసమే యోగశబ్దముచేతను, భ.గీ 6/16 'నాత్యశ్నతస్తు
యోగోఽస్తి' యనుచోట 'సమాధి' యోగశబ్దముచేతను,
ముం. 3-2-6 'సన్న్యాసయోగాద్యతయః' కైవల్యోపనిత్ 2
'త్యాగే నైకే అమృతత్వమ్' ఇత్యాది శ్రుతులవలనను, "నాచే
నిది సన్న్యస్తము త్యక్తము" యను వ్యవహారమువలన సన్న్యాస
త్యాగ శబ్దములకు వేదమునందును లోకమునందును "విడు
చుట" యొక్కటియే యర్థముగా, వినవచ్చుటచేతను, కర్మ-
యోగ-సమాధి-త్యాగ సన్న్యాస పదములన్నియు అధికారాను
గుణముగ నానా వ్యవస్థలయందు నంతఃకరణశుద్ధిని గలిగిం
చుటలో వినియోగపడునవై పర్యవసానమున, ప్రత్యగాత్మ
దృష్టియుంచి అనాత్మ ప్రత్యయములు నిరసించుటయను సవి
కల్పక సమాధి నొనగూర్చగలుగు చున్నవనుటలో నొంత
మాత్రము సంశయములేదు. అటుల చెప్పబడియున్నను,
సాధనశూన్యుడగు అవిద్వాంసుడు సాహసంబున సన్న్యసించ

రాదనియు, కర్మములనే ఈశ్వరార్పణ బుద్ధిచే జక్కగా చేయవలయుననియు, అదియే క్రమంబున, 'న్యాసమేషాం, తపస్సా, మతిరిక్తమాహుః' యనునట్లు, యుత్కృష్టమగు తపస్సను సన్న్యాసమును గూర్చగలదనియు తెలియవచ్చుచున్నది. అదెటనిన

కామన యున్నంతవరకు కర్మలనుష్ఠేయములే యగుచున్నవి. 'పరీక్ష్యలోకాన్ కర్మచితాన్ బ్రాహ్మణో నిర్వేదమాయాత్'లో వివరించినటుల, సంపాదింపబడిన లోకములను బరీక్షించి అవి అనిత్యములని తెలిసి, నిర్వేదమును బొందిన బిమ్మటనే కామ్య నిషిద్ధకర్మలను విడిచి, నిష్కామముగా నిత్యనైమిత్తిక కర్మముల నాచరింప వలయును. వీనిచే క్షీణపాపంబగు చిత్తమున కెప్పుడు వివేకమునందు యోగ్యత గలుగునో అప్పుడు దృఢమైన నిత్యాఽనిత్య వివేకము గలుగును. అంత క్రమంబున విరాగముదయించి, "యతమానః" (జగంబున-యేదిసారమో-యేది అసారమో అనునది గురు శాస్త్రమువలన నెఱుంగుట) "వ్యతిరేక" (తన చిత్తమునుండి పూర్వదోషములను వివేకాభ్యాసముచే నివి ఫక్వములైనవి- ఇవి మిగిలియున్నవి. యను వివేచన) "ఏకేంద్రి" (విషయ ప్రవృత్తి దుఃఖాత్మకంబని తెలియుటచే తృష్ణబహిరింద్రియ వృత్తులను బుట్టింపకున్నను మనసున ఉత్సాహము మాత్ర ముండుట) ములను స్థితులనుదాటి, "వశీకారమును" (మనసునందు గూడ తృష్ణలేక సదా వితృష్ణతో చిత్త వృత్తి ప్రసాద రూపంబున నుండుట) ఇహాముత్రార్థ ఫలభోగవిరాగము గలుగును. అనగా సంసారమనబడు "అనుకొనుటయే" తాదాత్మ్యమై, తత్ప్రకారమగుటకన్న వేఱు దినచర్యలేదనే

భావనలను (సంకల్పములను) విమర్శించగలుగుటయే విరాగ్యమునకు పరిపూర్ణత. అందువలన శమాది షట్కసంపత్తి కలిగి సన్న్యాసము స్థిరమగును. అట్లు సర్వమును దోషదృష్టి నవలోకించి బరిత్యజించుటవలన దృఢమైన 'ముముక్షు' పుట్టును. అనగా నిత్యాఽనిత్యవస్తువివేక మనిన "బ్రహ్మ సత్యం - జగన్మిథ్య" యని నోట యుచ్చరించుటయే 'కాక దీపముయొక్క చుఱ్ఱు తగిలిన తరువాత పిల్లవాడెట్లు దీపము దగ్గరకు పోకుండునో, అటులా తెలివి గలిగిన తరువాత వైరాగ్యమే ఫలమగును. అనగా ఆత్మాఽనాత్మ వివేకము తానంతటదే ఇహాముత్ర ఫలభోగ విరాగము గలిగించవలెను. అనగా విరాగము గలుగనిది ఆత్మాఽనాత్మ వివేకము గలిగినట్లు సూచింపబడదు. అటులనే విరాగము గలిగిన పిదప శమాది షట్కసంపత్తి గలుగవలెను. విరాగమనునది రాగమున్నచోటనే గలుగవలయునుగాని, లేని చోట విరాగము (అభావముచేత) యుండనేయున్నది. గాని అది ఫలకారియగు విరాగముకాదు. చిత్తశుద్ధి గలిగించి జ్ఞానోదయమున కుపకరించదు. గాన భ.గీ 12/16 శ్లో.

అనపేక్ష శ్శుచిర్దక్ష ఉదాసీనో గతవ్యథః।
సర్వారంభ పరిత్యాగీ యో మద్భక్తస్సమే ప్రియః॥-

చెప్పినటుల,లభ్యమై చేతియందున్నవాటినే వదిలివేయవలెను. మరియు, అట్లు శమాది షట్కసంపత్తుతో గూడిన మూటిని గలిగి హాయిగా కూర్చున్నవారు పెక్కుమంది గలరుగాని ముముక్షుత్వము లేనిచో నది నిరర్థకమే యగు. అనగా చనిపోయిన తరువాత యేమి జరుగును ? ఈ జనన మరణ బంధమునుండి యేనాఁడు విముక్తి గలుగును? అను పరితాపమే

ముముక్షుత్వ సూచకము. ఈ బంధమునుండి, అనగా, కర్తృత్వాభిమానమునుండి బయటపడిన వారికే మిగిలిన మూడును యున్నప్పటికిని గాన హేతువున్నను ముముక్షుత్వము చాల ప్రధానమైనది. గాన 'తితిక్ష' మొదలగు సంపత్తును పొందుట యనగా శీతోష్ణములు ననారోగ్యము గల్గిన వెంటనే ప్రతీకారము చేయక,

"సహనం సర్వదుఃఖానా మప్రతీకారపూర్వకమ్
చింతావిలాపరహితం సా తితిక్షా నిగద్యతే॥ (వి.చూ.)

యనునట్లు సహించుటయే పరమ సాధనము. దీనినే భ.గీ. 2/11

ఆగమాపాయినోఽనిత్యాస్తాంస్తితిక్షస్వ భారత॥

యని శ్రీకృష్ణ భగవానులాదేశించినది. అట్లుగాక ప్రతీకారము నకే పొందవలసినచో విచారణ కవకాశము గలుగదు. ఎంత కాలము శరీరారోగ్య విషయకమైన ఆలోచనగలుగునో అంత పర్యంతము దేహమే నేననుకొనుచున్నా యను ఆలోచనయే గలుగును! అట్లు విచారణలోనికి వచ్చిననాడే ముముక్షుత్వము గలిగిన దనుటకు నిదర్శనము. అట్లు ముముక్షువులు వదలపెట్టగలిగినది వదలి, అవర్జనీయములగు (వదలలేని అవసరములను) కాటియుంచును రాగద్వేషములు విడిచి యుండగలిగిననే నిజమైన స్వస్థత లభించును. గాన సర్వకామ్యసన్న్యాసమే సన్న్యాస లక్షణమగుటచే, దానిని పొందనిది ఆత్మజ్ఞానసంభవము. గాన దాని పూర్వాంగముగానే వివిదిష పొందవలెననియు, అట్టి వివిదిష లభ్యమగుటకే శ్రు॥ "తమేత మాత్మానం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషన్తి, యజ్ఞేన, దానేన, తపసాఽనాశకేన" అని బోధించుచున్నది. అట్టుల నాయా ఆశ్రమ ధర్మంబుల నాలంబనము

చేసుకొని. సాత్త్వికమగు ఫలాభిసంధి త్యాగపూర్వక కర్మాను
ష్ఠాన రూపమగు త్యాగముచే శుద్ధాంతఃకరణుడై, వివిదిష
నొంది, శ్రవణాది సాధనములు శ్రవణోత్తర వేదాంత విచారణ
కొరకు పరిత్యజించును. గాన యిట్టి సాధన చతుష్టయ
సంపత్తి గలవారు ముముక్షువులు, అంతట బుద్ధిప్రసన్నులగుదురు
నగుదురు. దేహాభిమానము నశించి, వివిదిష దృఢతరమగు
చుండును. అట్టివారే బ్రహ్మజిజ్ఞాస కధికారులనియు, "అథాతో
బ్రహ్మ జిజ్ఞాసా" అనుచోట వివరింపబడినది. వారికే నిజమైన
వైరాగ్యము గలిగినట్లూహింపవలెను. దీనియొక్క పరిపూర్ణత
యొకానొకనికి జన్మాంతర కృతమగు సాధనాభ్యాసముయొక్క
పరిపాకమువలన నీ జన్మమునందు మొదటనే యాత్మబోధము
నొంది కృతకృత్యుండగుచున్నాడు. అట్టి వారికి స్వతస్సిద్ధం
బగు ఫలాభిసంధి కర్మముల పరిత్యాగమే ఫలము. ఇదియే
విద్వత్సన్న్యాసమని చెప్పబడుచున్నది. గాన సన్న్యాస
మనగా శ్రీ ఆచార్యస్వాములవారు ఐతరేయోపనిషద్భాష్యము
నందు తెలిపినటుల, 'బ్రహ్మాశ్రమః' (బ్రహ్మజ్ఞాన సాధన
భూత ఆశ్రమేతి బ్రహ్మాశ్రమః) అనియే చెప్పవలెను. ఇది
సకల నియమాభావమైన, స్వసమ్బన్ధ రాహిత్య పరమహంస
పరివ్రాజకరూప లక్షణమై విరాజిల్లుచు, భ.గీ 3-17/18 లో
వర్ణించునటుల, "బ్రహ్మమే నేను యను బ్రహ్మాత్మైకత్వ
విజ్ఞానమప్రతిబద్ధముగ వికసించి, సర్వమును తాను గానే
చూచువాడగుటచే, దేని నాశ్రయించి సాధింపవలసిన
ప్రయోజనమును లేక తనయందే తాను కృతకృత్యుడై యుండ
గలుగు పదము. ఇట్టిది పరమోత్కృష్టమైన విద్వత్సన్న్యాస
ముగ శాస్త్రములందు ప్రశంసింపబడి, వర్ణాశ్రమాది ధర్మ

స్వరూపస్థితికొరకే ప్రాధాన్య మొసంగబడినను, జ్ఞానమున కంతరాయమే యగుటచే

"యదహరేవ విరజేత్ తదహరేవ ప్రవ్రజేత్" (జాబాలోపనిషత్) అని సూచించుచున్నట్లు, పూర్ణ విరాగముగలిగిన వెంటనే, సర్వకర్మ సన్న్యాస మొనర్చినను, యెప్పుడైనను చేయనగు ననియు, జనకాదు లందఱును అట్టి తత్త్వవేత్తలే గృహస్థులై లోక సంగ్రహార్థము కర్మలుజేసినట్లు వివరింపబడుచున్న దనియు, చతురాశ్రమము లందును తురీయస్థితియగు — "(గాయత్రీ - ప్రాజాపత్య - వైదిక - నైష్ఠికంబులను నాలుగింటిలోని నైష్ఠిక బ్రహ్మచారిత్వమును; వార్తావృత్తి - శాలీన వృత్తి - యాయావరము - ఘోరసన్న్యాస మను నాలుగింటిలోని ఘోర సన్న్యాసత్వంబును; ఔదుంబర - ఫేనప - సంప్రక్షాళి - పూర్ణములను నాలుగింటిలోని, పూర్ణత్వమను వానప్రస్థస్థితియు; కుటీచక - బహూదక - హంస - పరమహంసలను నాలుగింటిలోని పరమహంస పరివ్రాజక మను తురీయ సన్న్యాసస్థితియు"-) నదిదే యట్టి సన్న్యాస లక్షణమును వృద్ధిజేసుకొనుట కనువైన అవకాశ మనియు వర్ణింపబడినది. మరియు నిట్టి సన్న్యాసములో బాహ్య వేషము ధరించుటను దేశకాల పరిస్థితులుకూడ యనుకూలపడిననే గాని సాగవు. దీని నే శ్రీ విద్యారణ్యస్వామివారు తమ 'జీవన్ముక్తి ప్రకాశిక' యను గ్రంథమున 'నీ బాహ్య సన్న్యాసము యితరులకు బోధజేసి తమగొప్పతనమును వెల్లడిజేసుకొనుటయందే విశేషముగ నుపకరించునుగాని, తాను పరమశాంతిని పొందవలయుననిని మానసిక సన్న్యాసమే ముఖ్యమని స్పష్టముజేసిరి. మరియు శ్రీ ఆచార్య స్వాములవారును, బాహ్య సన్న్యాసమున

కొచ్చెటను విశేషప్రాధాన్యత నొసంగక పోవుటచేతను, వారి శిష్యులలో నొకరగు శ్రీ తోటకాచార్యులనువారు

"జటిలో ముణ్డీ లుఞ్చితకేశః ... ... ... బహుకృతవేషః"

యనియు, మరొకరగు శ్రీ మహానందగిరిస్వాములవారు

"యోగరతో వా భోగరతో వా సఙ్గరతో వా ... ... నన్దత్యేవ"

యని విస్పష్టము జేయుటచేతను, 'ఆత్మజ్ఞాన విశిష్టతను పేర్కొనుచు, అదిలోపించిన సన్న్యాసము నెట్లు నిరసించినది తెలియవచ్చుచున్నది. అనగా సన్న్యాసమును వదలిపెట్టుట, పూర్ణ విరాగముతో మానసికముగా "నాది కాదు అని అనుటయే" గాని శరీరమును పోగొట్టుకొనుట కాదు.

గాన సన్న్యాసమునందు ప్రధానమగు కర్తవ్యము సంసారి ధర్మమగు 'అహంకారమమకారధారణలను సమూలము నిర్మూలించుట'యే గాని 'దేహధారణ వీడుట'గాదను నదెంతయు స్పష్టము' గాననే భ. గీ 4/23 శ్లో॥ లో

గతసఙ్గస్య ముక్తస్య జ్ఞానావస్థిత చేతసః
యజ్ఞాయాచరతః కర్మసమగ్రం ప్రవిలీయతే ॥

సమస్తదృశ్య ప్రపంచమందును ఆసక్తి లేనివాడై, ధర్మాధర్మ సంబంధమునుండి విముక్తుడై, జ్ఞానమునందే మనసును నిలిపియుండువాడు, పరమేశ్వర ప్రీతితో గర్మముల నాచరించినను, బ్రహ్మమునందే ఆత్మభావము గలిగిన వాడగుటచే, అహంకారరహితుడే! అందువలన ముక్తుడే! నని వర్ణింపబడినది. అనగా వీరు దేనిచేత నీ జ్ఞానమును సంపాదించిరో దాని యందే మనసుగలవారై 'బాలోన్మత్త పిశాచవత్' ("అను

న్మాత్తో వృన్మ త్తవ దాచరన్"— పరమహంస పరివ్రాజక ఉపనిషత్) తాపత్రయ రహితులైయుండుటే! వీరినే భ.గీ2/71

శ్లో॥ విహాయ కామాన్యస్సర్వాన్ పుమాంశ్చరతి నిస్స్పృహః,
నిర్మమో నిరహంకార స్సశాంతి మధిగచ్ఛతి ॥—

గా, శ్రీఆచార్యస్వాముల వారు వర్ణించునపుడు, "ఏసన్న్యాసి సర్వ విషయములను బరిత్యజించి, జీవనమాత్ర వ్యాపారమే మిగిలి తినుచున్నాడో, వాడు ముక్తుడై బ్రహ్మ భావమును బొందుచున్నాడని" వివరించిరి. ఇటుల జెప్పుటలో గృహస్థు గూడ మనసున సమస్తాభిమానమును విడిచి, కూటస్థుడైన బ్రహ్మమే నని భావించుచుండిన బ్రహ్మ నిర్వాణమును బొందగలుగు ననునది నివారించుటకే సన్న్యాసాశ్రయము యొక్క ప్రాశస్త్యము వివరింపబడినది.

"దశభిర్జన్మభిర్వైదైః । వేదార్థం శతజన్మసు॥
సహస్ర జన్మభిస్సోమః । సన్న్యాసం కోటిజన్మసు॥"

మరియును, శ్లో॥ద్వావిమౌ పురుషౌలోకే సూర్యమండలభేదినౌ
పరివ్రాడ్యోగయుక్తశ్చ రణే చాభిముఖోహతః॥—

అను ఆర్యవచనము లిచట నేగదా ప్రమాణము! గాన సన్న్యాస మనగా 'సర్వసం సారోపరమమే' యని శ్రీ ఆచార్యస్వామి వారు శెలవిచ్చినదెంతయు గమనార్హము. ఇట్టిపరమోత్కృష్ట మైన సర్వకర్మ సన్న్యాసమును బొందుటకుగాను సాధనాంత రములుగా నీ క్రింది తరగతులు చేర్కొనబడినవి.

వివిదిషా సన్న్యాసము:— 'సన్న్యస్య శ్రవణంకుర్యాత్' అను స్మృతి విహితమైన సన్న్యాసము శ్రవణాంగమగుటచే,

వివిదిషదృఢమైన ముముక్షువు, గురువునుపసర్పించి, వేదాంత శ్రవణాదికమునందు ప్రవేశించగా, క్రమంబున నది యే మనన పరిపాకవశంబున నిదిధ్యాస నిష్ఠయగును. అందువలన చిత్త ముక్షీణదోషమగుచు, మహావాక్యార్థ జ్ఞానము వలన తత్త్వసాక్షాత్కారము గలుగును. ఇట్టి చిరకాలాభ్యాస పాటవంబున అకర్త్రాత్మ సాక్షాత్కారమను పరమార్థసన్న్యాసము లభ్యమగును. ఇటులు ఫలప్రదమగుటలో తారసిల్లు అవాంతరభేదములే యీ వైరాగ్య సన్న్యాసము, జ్ఞాన సన్న్యాసము, కర్మ సన్న్యాసము, జ్ఞానవైరాగ్య సన్న్యాసములను పేర చెప్పబడుచున్నవి.

<u>ఆతురసన్న్యాసము</u>:- ఇది కర్మ సన్న్యాసమను దాని లోని అవాంతర భాగము. ఇది మానవునకు వైరాగ్యము గలుగకపోయినను, శాస్త్రమునందు శ్రద్ధాభక్తులు గలవాడై బ్రహ్మచర్యాది నాలుగాశ్రమములు క్రమముగ బొందని వారినిగూర్చి చెప్పునది. ఇది సాధారణముగ సర్వజనానుభవములో నుండునదే! ఆయా ఆశ్రమములందు సంక్రమించు సుఖదుఃఖానుభవముగూర్చి విసుగుచెంది, శాస్త్రాదేశములందు విశ్వాసము గలవాడగుటచే,

> 'ఆపద్యపిచకుర్వీత సన్న్యాసం బ్రాహ్మణోత్తమః
> యదనుస్థాన మాత్రేణ ప్రయాతి బ్రహ్మణఃపదమ్॥-

అనునట్లు, సన్న్యాసమునకు బ్రహ్మస్థానము ఫలముగా చెప్ప బడుటచే, ఆపత్కాల మాసన్నమైన వెంటనే ఆతురతతో సన్న్యసించుట. "అయితే యెటులైనను అవసానకాల మాసన్న మైనదిగదా! ఇక సన్న్యాసమువలన ప్రయోజన మేమి?" యని

ఉపేక్షింపక, "బ్రతుక వలయును." అను దానిని సన్న్యసించుటయే యిందలి విశిష్టతయగుటచే,నదియు 'ఉత్తమమైనదే ననియు' దానికి బ్రహ్మలోకావాప్తి ఫలమనియు నిర్దేశింపబడినది. అనగా ఆపత్కాలంబున సన్న్యసించియు, మరల జీవించినవాడై వివేకంబున శ్రవణాదికము సేసి, జ్ఞానమును సంపాదించి, "జ్ఞానాదేవతు కైవల్యమ్" అనునట్లు ముక్తుడగుచున్నాడు. లేదా భావి జన్మము నందైనను తదనుగుణమైన సంస్కారాదులతో విలసిల్లును. గాన

" ప్రవృత్తిలక్షణం కర్మ జ్ఞానం సన్న్యాసలక్షణం
తస్మాత్ జ్ఞానం పురస్కృత్య సన్న్యసే ఇహాబుద్ధిమాన్ "
(నారద పరివ్రాజక)

లో ఉపదేశించినట్లుల, జ్ఞానమే సన్న్యాసలక్షణం బగుటచే, ఆత్మజ్ఞానము దృఢమగుటకే కుటీచకాదిషడ్విధ సన్న్యాస నియమములున్న నిర్ణయింపబడినవి. అవియు క్రమముగ అభ్యాస వైరాగ్యములమీాద నాధారపడిన వగుటచే, ముముక్షువున కెంతెంత తీవ్రవైరాగ్యము ఘనీభవించునో, అంతంత ఉత్తమస్థాయి నధిష్టించు వాడగుచున్నాడు. దీనినే భ.గీ6/35 లో 'అభ్యాసేనతు కౌంతేయ ! వైరాగ్యేణ చ గృహ్యతే' యని సూత్రప్రాయముగ జెప్పబడినది.

అట్టి షడ్విద సన్న్యాస స్థితులలో అంత్యమగు పరిపక్వ స్థానము 'అవధూత' యని చెప్పబడుచు,

" అక్షరత్వా ద్వరేణ్యత్వా ద్ధూత సంసారబంధనాత్
తత్త్వమస్యాది లక్ష్యత్వా దవధూత ఇతీర్యతే "
(అవధూతోపనిషత్)

భ.గీ 12/19 శ్లోకములో వర్ణించునటుల,

నిందాస్తుతులలో సమముగా దలంచుచు, మౌనముగలిగి ఆహారాము లెట్టివి దొరికినను సంతోషించుచు, నియమితమైన స్థలము లేనివాడై పరమార్థవస్తు విషయమయిన స్థిరబుద్ధి గలవాడుగ సంచరించుచున్నాడు. విద్వత్సన్న్యాసమను నామాంతరముచే తులదూగు నీ"సనసన్న్యాసఆత్మజ్ఞానము" సాంప్రదాయసిద్ధమైన బాహ్యలింగములతో గూడిన మానసిక పరిణామ రూపవిరక్తి సర్వ సంసార ధర్మాతీతనుగు తానుదక్క వేఱొకటి లేదని గుర్తించుటయందే పర్యవసించునదగుటచే, నెంతయో ప్రశస్తమైనది. ఇది బ్రహ్మవేత్తలకు స్వరూపమే యగుటచే, యీ స్థితియందు సాధ్యసాధన సాధకవిభాగమేమియు లేక కేవలము పరమపావనమైన బ్రహ్మమునందు పరబ్రహ్మరూపముననుండుటయే! దీనినే భ.గీ 18/49 'సన్న్యాసేనాఽధిగచ్ఛతి' యనుచోట బ్రహ్మనిష్ఠ (సత్తు = బ్రహ్మమునందు, ఆసము = ఉనికి) యని వర్ణింపబడినది.

నిరాలంబోపనిషతు శ్రుతియు నిట్లే చెప్పుచున్నది.

" సర్వ ధర్మాన్ పరిత్యజ్య, నిర్మమో నిరహంకారో భూత్వా, బ్రహ్మేష్టం శరణముపగమ్య. 'తత్త్వమసి' 'సర్వం ఖల్విదం బ్రహ్మ' 'నేహనానాఽస్తికించన' యిత్యాది మహావాక్యార్థానుభవ జ్ఞానాద్బ్రహ్మైవాహమస్మీతి నిశ్చిత్య, నిర్వికల్ప సమాధీనాం, స్వతంత్రోయతిశ్చరతి స సన్న్యాసీ,సముక్తస్సపూజ్యో స్సయోగీ, స్సపరమహంసోఽవధూత స్సబ్రాహ్మణ ఇతి" యని ప్రశంసింపబడుచున్నది.

ఓమ్ - తత్ - సత్.

శ్రీ జగద్గురు శంకరాచార్య విరచిత

# VI. యతి పఞ్చకమ్.

(ఆంధ్ర పద్యానువాదము - వాక్యార్థ లక్ష్యార్థములు)

మూ॥ (శ్లోకము.)

వేదాన్త వాక్యేషు సదారమన్తో
భిక్షాన్నమాత్రేణ చ తుష్టిమన్తః।
విశోకవన్తః, కరణైకవన్తః
కౌపీనవన్తః, ఖలు భాగ్యవన్తః॥-

ఆ.వె (వాక్యార్థము)

విసుగు జెందకుండు వేదాంతగోష్ఠిని
భిక్షమెత్తి తనదు కుక్షినింపి,
శోకమోహ మసలె సుతరామునోల్లని
'గోచికట్టు' కేమి కొదువ భువిని॥-

తే.గీ (లక్ష్యార్థము)

శబలశక్తిని రమ్యమౌ శబ్దముసను
సంచరించుచు తానుండి సంతసమున
కర్త, భోక్తగ, భాసించి కర్మలెపుడు
సేయకున్నను విశదమౌ సేవ్యుడతడె॥-

మూలము (శ్లోకము.)

మూలంతరోః కేవలమాశ్రయన్తః
పాణిద్వయంభోక్తు మమత్రయన్తః।
కన్థామివ శ్రీమపికుత్సయన్తః
కౌపీనవన్తః, ఖలు భాగ్యవన్తః॥-

ఆ. వె (వాక్యార్థము)

వృక్షమూలమందె విశ్రాంతి గైకొని
కరముపాత్రగానె గాంచుచుండి
చింపిగుడ్డరీతి సిరిసంపదల నెంచు
'గోచికట్టు' కేమి కొదువ భువిని॥-

తే.గీ (లక్ష్యార్థము)

అంకురంబెట్లు బీజపునాశ్రయమున
వృక్ష శాఖాదులను బేఱు, వేఱుగాని
అటుల 'యాధేయ' మగుచున్న 'ఆదిశక్తి'
చేయకున్నను, విశదమా, సేవ్యుడతడు॥-

మూలము (శ్లోకము)

దేహాదిభానం పరిమార్జయన్తః
ఆత్మాన మాత్మన్యవలోకయన్తః।
నాన్తం, నమధ్యం, నబహిఃస్మరన్తః
కౌపీనవన్తః ఖలు భాగ్యవన్తః-

ఆ. వె (వాక్యార్థము)

తానె దేహమనెడి తబ్బిబ్బులను మాని
పారమార్థికమునె బరగుచుండి
బైట, మధ్య, లోన భాగితమ్మె లేని
'గోచికట్టు' కేమి కొదువ భువిని॥-

తే.గీ (లక్ష్యార్థము)

ధర్మమను బేర తానె యీ ధరణిగాను
తనరుచుండుటె సహజమౌ తనువుగలిగి
ఆది మధ్యాన్తరహితుడై అనయముండి
సేయకున్నను, విశదమౌ సేవ్యుడతడు॥-

మూలము (శ్లోకము.)

స్వాసన్ద భావె పరితుష్టిమ న్తః
సంశాన్త సర్వేంద్రియ దృష్టిమ న్తః।
అహర్నిశం బ్రహ్మణిరమన్తః
కౌపీనవ న్తః ఖలు భాగ్యవ న్తః॥

ఆ. వె (వాక్యార్థము)

సహజ సంతసమున సంచరించుచు తాను
శాంత చిత్తుడగుచు సకల మెఱిగి
రాత్రిపవలు లనక, రమియించ నీశుని
'గోచికట్టు' కేమి కొదువ భువిని॥

తే.గీ (లక్ష్యార్థము)

నిత్యతృప్తిని వికసించు నిష్ఠగలిగి
సహజ శాంతిని దులదూగి జనెడురీతి
సచ్చిదానందమయుడుగ సతతముండి
సేయుచున్నను, విశదమౌ, సేవ్యుడతడె॥

మూలము (శ్లోకము)

పఞ్చాక్షరం పావన ముచ్చర న్తః
పతిం పశూనాం హృది భావయ న్తః।
భిక్షాశనాదిక్షు పరిభ్రమ న్తః
కౌపీనవ న్తః, ఖలు భాగ్యవ న్తః॥

ఆవె (వాక్యార్థము)

"ఓం నమశ్శివాయ" యొనరంగ పలుకుచు
దృష్టినెపుడు శివుని దిక్కు నునిచి,
క్షుద్రమైన తలపు శోధించి విడనాడు,
'గోచికట్టు' కేమి కొదువ భువిని॥

తే.గీ (లక్ష్యార్థము)
అస్తి భాత్యాకృతైకగ నావరించి
'అ-క్ష' రంబుల నడుమ తానక్షయముగ
భావనాదుల కెంతయో పరుసుగాను
చేయకున్నను, విశదమౌ, సేవ్యుడతడా॥—
ఓమ్ - తత్ - సత్.

వరా:— గోచికట్టు = నైష్ఠిక బ్రహ్మచారి.

# 27. యోగ ప్రభావము

శ్రు॥ జ్ఞానేంద్రియాణి సర్వాణి నిగృహ్య మనసా సహ।
ఏకత్ర భావనాయోగః క్షేత్రజ్ఞ పరమాత్మనోః ॥

(పరిమళము)

యోగ మనగా చిత్తవృత్తి నిరోధమని కొందఱును, మన్త్ర, హఠ, లయ, రాజయోగము లేనని కొందఱును, జీవేశ్వరుల సంయోగమని కొందఱును, భోక్తాభోజ్యము భోగములకు బ్రహ్మభావన యేకత్వభావనయని కొందఱును, జ్ఞాతాజ్ఞానము జ్ఞేయములకు యేకత్వ భావనయని మరికొందఱును, ఇటుల పలువురు పలువిధములుగా భిన్నాభిప్రాయములు జూపుచున్నను, 'యుజ్యత ఇతియోగః' అను ధాత్వర్థము ననుసరించి, 'కూర్చబడునది' యనిమాటకు తేలుచున్నందున రెండుపదార్థముల ఉనికిని స్ఫురింపజేయుటయేగాక, వాటి కలయికకు గూడ సావకాశము జూపుచు యోగశబ్దార్థము సార్థకమగుచున్నది. అట్టిది అప్రాప్తమైనదానిని సంపాదించుట యందే ప్రధానమైన వినియోగ మగుటచే సర్వ దుఃఖాదుల యొక్క నాశమగున దేది మోక్షమని జెప్పబడుచున్నదో

దానిని సాధించుటయందెంతేని యుపకరించుచున్నది. ఏవ్యక్తి కైనను జ్ఞానము, యోగము రెండును గలిసినప్పుడేగాని మోక్షము గలుగదు అందు యోగమువలన జ్ఞానము సులభ సాధ్యముగాని, జ్ఞానమువలన యోగము సులభము గానేరదు. అందువల్లనే కర్మయోగ, భక్తియోగ ఉపాసనాదులు జ్ఞాన మునకంగములుగా వివరింపబడినవి. దీనినే యోగ శిఖోప నిషత్:-

> యోగాత్సంజాయతే జ్ఞానం జ్ఞానాద్యోగః ప్రవర్తతే ।
> యోగజ్ఞానపరో నిత్యం స యోగీ న ప్రణశ్యతి ॥

యని స్తరింపబడినది. గాన ఆత్మ దేహేంద్రియాది వ్యతిరిక్తుడు కర్త, భోక్త ఇత్యాది విశ్వాసముతో ధర్మాఽధర్మముల వివేచించి ఏ ఈశ్వరారాధన పూర్వకమగు కర్మముచే పురు షుడు మోక్షముకొఱకు యోగ్యుడగుచున్నాడో అట్టి పరం పరా సాధనమయిన పూర్వోక్త ధర్మ మనుష్ఠించిననేగాని చిత్త శుద్ధి గలుగనేరదు. చిత్తశుద్ధిగల్గనంతనే గాని స్వాత్మజ్ఞానము ప్రకాశించదు. గాన చిత్తశుద్ధికి యోగభ్యాస మెంతేని ముఖ్యము.

చిత్తము యే యవస్థలోనున్నను సర్వదా 'ఆత్మా' కారమే యగుటచే ఆత్మ పదవైయర్థ్యంబును సంభవించును. ఏలయన, చిత్తము ఆత్మాకారమగుట యోగముచేతగాదు: మరేమన, తనయంతనే యాత్మాకారమయియున్న చిత్తమున కనాత్మాకారత యోగముచే నివర్తింపబడుచున్నది. గాన భ.గీ. 6/12

> తత్రైకాగ్రం మనః కృత్వా యతచిత్తేన్ద్రియక్రియః ।
> ఉపవిశ్యాసనే యుంజ్యా ద్యోగమాత్మ విశుద్ధయే ॥

యని వివరించినటుల శ్రవణానంతరమున నిదిధ్యాసువు అంతః కరణశుద్ధి (అనగా అవిద్యా తత్కార్య దేహేంద్రియాదికమగు నితరమునందును, 'నేను-నాది' మొదలగు స్వస్వత్వయము లకును, తత్కార్యములయిన వాసనలకు నిశ్శేష నివృత్తి సిద్ధించుట) కొఱకు బ్రహ్మమునందే ఆత్మభావంబున పురుషుని జేర్చుచున్నది గాన ప్రత్యక్ప్రత్యయావృత్తిచే యోగము (సమాధి) ననుష్ఠింపవలెనని స్పష్టమగుచున్నది. అనగా యోగవాశిష్ఠ ఉపశమ. 57

"సంసారోత్తరణే యుక్తి ర్యోగశబ్దేన కథ్యతే ।
ఆత్మజ్ఞానప్రకారోఽస్య ప్రాణానాం సంయమస్తథా॥"

లో వివరించినట్లు భవబంధమునుండి తరించు నుపాయముగా 'యోగము' నియమింపబడుచున్నది.

ఇది రెండువిధములు (1) బ్రహ్మవాది మతంబైన జ్ఞాననిష్ఠాపూర్వక ఫలభూతమైన బాధపూర్వక సమాధి. (2) పాతంజల మతానుసార ప్రాణాయామరూపక లయ సమాధి. ఇట్లు చెప్పుటచే అంతఃకరణ రూపమగు మనస్సువలన జరుప బడు సర్వ కర్మలును, తత్ఫలములును అనాత్మ ధర్మములగు టచే వాటి నానందించుటగాని, ద్వేషించుటగాని లేనట్టి చిదాభాసుని బుద్ధియొక్క 'ప్రజ్ఞ'నే కీర్తింపదగినదని చెప్పి యుండుటచేత వాసనాహితమగు అంతఃకరణవృత్తులను అంతః కరణ సాక్షియగు క్షేత్రజ్ఞునియం దారోపించక యుండుటయే జ్ఞానయోగమని ప్రశంసింపబడుచున్నది. అట్లారోపించుటయే అజ్ఞానము. ఇదియే భగవన్నిష్ఠను బ్రతిబంధకము. ఇదిజీవునకు స్వభావమేయగుటచే భ.గీ. 6-25లో వివరించినట్లు విచారణ

పూర్వకముగ తొలగించుటవలన గ్రాస్తమగు ప్రశాంతమే రాజయోగ సమాధి యనియు తద్భిన్నమైన ప్రక్రియవలన తొలగింప నెంచుటనున దంతయు హఠయోగాదుల క్రిందనే పరిగణింపబడుచు అల్పఫలము లొసంగునవే యగుచున్నవి.

మరియు పర్యాయపదమగు "సమాధి" యనినను "సమ్యగాధీయతే మనోఽత్రేతి సమాధిః" యనునట్లు, అంతఃకరణము నందు ఒక నిశ్చయమైనబుద్ధికి తీసుకొనివచ్చుటయేగాని కండ్లు మూసుకొనికూర్చొనుట గాదుగదా! సూ.భా. 2-1-14 లో 'తదనన్యత్వమారమ్భణశబ్దాదిభ్యః' యను న్యాయమున కారణమునకు భిన్నముగా కార్యము లేనుండుటవలన గార్యకారణాత్మకంబగు ప్రపంచమున్నను పంచీకృత పంచభూతాత్మక సృష్టియందొక దానియందొకటి అనుసంధించుటచే చైతన్యమాత్ర విషయంబగు నే సమాధిగలదో అది లయపూర్వకంబయినను, అందు తత్త్వమస్యాది మహావాక్యార్థ జ్ఞానము లేకుండుటచే అవిద్యా తత్కార్య కర్మలు నశింపకుండుటవలన మరల కారణమగు అవిద్యాదు లుండుటచే సమస్త ప్రపంచము తోచుచునే సుషుప్తివలె "సబీజ సమాధి"యే యగుచున్నది. అటులనే హఠయోగ సమాధియందును సుషుమ్నయందు ప్రాణవాయువును నిరంతరము ప్రవేశపెట్టుటచే ప్రాణనిరోధము వలన గలిగిన ఆయాసము తగ్గి శిరస్సునుంచి భారము క్రిందకు దింపి నిప్పటివలె అధికసుఖము గలుగుచు మదమెక్కినట్లుగా మనస్సు లీనముగునుగాని యీసమాధికాలమందు విక్షేపములు లేకపోయినను అజ్ఞానమనెడి ఆవరణ లేకపోలేదు.

ఇక జ్ఞానయోగ సమాధియను నామాంతరముచే విరాజిల్లు బాధపూర్వక సమాధి తత్త్వమస్యాది మహా

వాక్యార్థ సాక్షాత్కారముచే అవిద్యా నివృత్తియగుటచే సృష్టి క్రమంబున దత్కార్యముగూడ నివర్తిల్లుటవలన అనాద్యవిద్యకు మరల నుత్థానము లేమింజేసి తత్కార్యమునకుగూడ మరల నుత్థానము లేనుండుటవలన నిర్బీజంబగు బాధపూర్వక సమాధియే యగుచు ప్రశస్తతమమని కీర్తింపబడుచున్నది. అనగా జ్ఞానయోగికి శ్రవణ మననాదులచేత నిర్వికల్పక చిదాత్మతత్త్వ మెఱింగిన వాడగుటచే సమాధియొక్క పూర్వాపరమందునుగూడ వికల్పాంశను మిథ్యగావిడిచి సాక్షియందు గల్పితమగు సాక్ష్యము అనృతంబగుటవలన ఉన్నదియే కాదనియు, సాక్షిమాత్రమే పరమార్థసత్యుడు - కేవలుడున్నాడను విచారణచే తాను సాక్షియై నిర్వికల్ప చిన్మాత్రగా నుండును. ఇట్టి ఔపనిషదులకు అధిష్ఠానజ్ఞానము దృఢమైన దగుటచే తనయందు గల్పితము బాధితంబగు చిత్తముయొక్కయు, తద్దృశ్యముయొక్కయు అదర్శనము అనాయాసముగ లభ్యమగుచున్నది. ఇదియే యుత్తమమగు జగత్సంబంధము లేని సంవిద్దశ. ఈ స్థితియందు జ్ఞానికి వ్యవహార ముదయించిన దయినన్ను, భూత భౌతికములన్నియు సచ్చిదానందాంశముచే సత్యమనియు, వానియందలి కల్పిత నామరూపములచే నసత్యములనియు గల "బాధ"చే జగత్తుగూడ సంవిత్తుగానే భాసించును. గాన వారి వ్యవహారము సైతము సమాధితుల్యమే గాన నిటుల విచారముచేతనే చిత్తదోషము నిరాకృతంబగుటచే 'చిత్తవృత్తి నిరోధ'మును ప్రతిపాదించు యోగాదుల నావశ్యకములే! గాననే గౌడపాదులవారు తమ కారికలు 3/39

అస్పర్శయోగో వై నామ దుర్దర్శ స్సర్వయోగిభిః।
యోగినో బిభ్యతి హ్యస్మాదభయే భయదర్శినః॥

అని వర్ణించెను. ఇది యొకటి యస్పర్శయోగికి తప్ప తదితరు
లకు తెలియరానిదనియు, యితరులందరు 'యోగము' నకు
పరుగులిడుదురే కాని యీ 'అస్పర్శయోగము' యితర
యోగముల మాదిరిది కాదనియు వినోదముజేసిరి. ఇది నిర్మల
మైన అంతఃకరణయందు ప్రస్ఫుటమైన స్వరూపమే యగుటచే
గౌ. కా. 3/45 శ్లో.

నాస్వాదయేత్సుఖం తత్ర నిస్సఙ్గః ప్రజ్ఞయా భవేత్।
నిశ్చలం నిశ్చరచ్చిత్తమేకీకుర్యాత్ప్రయత్నతః॥

వర్ణించినటుల ఆస్వాదమునకైనను యే మాత్రము స్థానము
లేదు. అట్లున్న యెడల ప్రజ్ఞమునగుపడి ఆస్వాదనమే మిగు
లును! — ఎట్లు అద్దములో చూచుకొనకపోయినను ముఖము
స్వతస్సిద్ధమైయే యున్నను, పిల్లవాడు అద్దము లేనిచో తన
ముఖము కనబడనందున అసలు ముఖమేలేదని గల్లంతుపడునో
అట్లే గాన 'యస్సాక్షాదపరోక్షాద్బ్రహ్మ' యనునట్లు ఉన్న
ముఖమె తిరిగి చూడబడుచున్నట్లు సద్గురువువలన తన నిజ
రూపము స్ఫురింపజేయబడగా విషయవాంఛలెల్ల దొలగి
స్వరూపజ్ఞానము తానంతటయదే ప్రస్ఫుటముగాగలదు. గాననే
ఒకసారి తెలిసినవానికి ఆత్మనుగాని, అనాత్మనుగాని తెలుసు
కోవలసిన పనిలేక 'తస్యకార్యం న విద్యతే' యనునది సార్థక
మగుచున్నది. ఇట్టి స్థితికి మానవుడు రావలయుననిన, బ్రతికి
యుండగనే తాను సర్వ వ్యవహారమునకు శవమయిపోవలెను.
అనగా ఉపాధిగతమే సమస్త విక్రియయును ఆత్మను స్వభా
వంబును లేనిదగుటచే "పరమార్థ దర్శియగువాడు సమస్త
కర్మంబులను వివేకబుద్ధిచే సన్న్యసించి జితేంద్రియుడై

తోఁచిన్నది ద్వంద్వములుగలిగి తాను ప్రభువుగాఁడై ఇంద్రియాది పౌరులతో గూడినదై పురమునందుండు దేహమునందు దానుజేయకయు ఇంద్రియాదులచేఁగూడ జేయింపకయు, బాహ్యాపేక్షలేమియు లేనివాఁడగుటచే సుఖముగా నున్నాడని వర్ణింపబడినది.

ఇట్టి స్థితిని బడయుటకు హఠయోగాదులందు నిరూపింపబడిన క్రమపూర్వక అష్టాంగ (యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధ్యాన, ధారణ, సమాధులు) విధానముగాక త్రిశిఖి బ్రాహ్మణోపనిషత్తులో వివరించినట్టుల దేహేంద్రియాదుల యందు విరాగమె యమమనియు, పర తత్త్వమందు ననురక్తియే నియమముగను, స్వాంతస్థ ఉదాసీన భావమే ఉత్తమమైన ఆసనముగను, 'జగత్సర్వమిదం మిథ్య' యనునదే ప్రాణాయామముగాను, చిత్తముయొక్క అంతర్ముఖతయే ప్రత్యాహారముగను, 'సోఽహం' భావనయే ధ్యానముగను, అట్టి ధ్యానమునందు చిత్తముయొక్క నిశ్చలీభావమే ధారణగను, చివరకు ధ్యానధారణలయందు విస్మృతిగాంచి విమర్శాఽభావమున సహజమైన అచల స్థితియందుండుటయే ఉత్తమమైన సమాధి యనియు దానికిదియే యేకైక సాధనమనియు నిర్ణయింపబడినది. అప్పుడే సమాధి యనగా బ్రహ్మతో సమాధానపడుట యనునది లభించుచున్నదని స్థూలముగ చెప్పనగును. అనగా నామరూపములతో సమాధానము లేకుండుట యనునది దీని అంతరార్థము. అనగా ఇదిగాక మిగిలిన సమాధులని చెప్పబడునవన్నియు అనాత్మ (నామరూపములు)కు సంబంధించినవే. సమాధాన మెల్లప్పుడును రెండు పక్షము లున్నప్పుడేగదా! అనగా వారిరువురును

వారి వారి అభిప్రాయముల విడనాడక రాజీ పడుచుకొను
టయే సమాధానముయొక్క ముఖ్యోద్దేశము. అటులనే అద్వైత
యోగియు ఆత్మయందు సమాధానపడుటయనిన కనబడని
వాటితోనే కనబడుచున్న అనాత్మయందుండి ఆత్మతో
సమాధానపడుట. అంతేగాని యొకదాని నాశ మెప్పటికిని
గానేరదు. ఆద్యంతవంతమగు అంతఃకరణయందు విషయ
లోలత్వమును; దోషమును గుర్తించి—ఎట్లు మృగతృష్ణయొక్క
యథార్థస్వభావ-స్వరూపముల దెలిసినపిదప యెంతదాహమైన
నను నీటికొఱకు పరుగులిడరో అట్లు — విషయములనుండి విర
మించి ఆత్మనే అంతఃకరణయందు విషయము గావించుకొను
టయే ఉత్తమమైన సమాధానము = సమాధి లేక యోగము
గాన అంతఃకరణమందలి విషయ దోషములను తీసివేయుటకే
ప్రయత్నము. అంతమాత్రముచే ఆయా ఇంద్రియములు వాటి
వాటి స్వభావసిద్ధమయిన ప్రవృత్తిని పూర్తిగ మాననవసరము
లేదు. అటులు చేయగా, చేయగా ఆత్మ స్వరూపజ్ఞానము
గలుగుటచే ఇంద్రియములకు వాటి ప్రవృత్తియందు వేగము
తగ్గి కడకు పూర్తిగా ఉపశమిల్లును. ఇదియే యోగముయొక్క
ప్రయోజనము.

'విరూపాక్ష పంచాశిక' యను గ్రంథమునందు శ్రీ
వ్యాసులవారు యోగమహిమను వర్ణించునపుడు ప్రపంచ
మంతయు ఈశ్వరుని అహంకారమే యగుటచే 'అహంకరోమి'
(నేను చేయుచున్నాను) అనుదానిలోని అహంకారము పోవు
టనగా 'ఈ నేను చేయుట మనునది అనుకొనుటకన్న వేరు
గాదనియు ' — ఎట్లు 'రజ్జువు'మీద 'పాము'ని అనుకొనుట
యెట్లో అట్లు — గాన యీ అహంకారము నేనుకాదని అను

కొనుటకూడ అనగా 'చేప్పేవాడు' అహంకారముతో గూడి యుండినవాడేగాన సర్పమును 'బాధించి' రజ్జువును చూచినట్లు ఈ అహంకారమును (శక్తిస్వరూపమును) 'బాధించి' స్వస్వరూపమును గుర్తించుటయే రాజయోగసమాధియని సూచించెను. గాన యిదిగాక మిగిలిన సమాధులన్నియు కాష్ఠసమాధులే! ఎట్లన ఉత్తమమైన యీ సహజసమాధియందు శరీరముపడని అహంకారము వదలక, ఇతర అహంకారమును వదలగలుగుటయే దీనివిశిష్టత. దీనికి భిన్నమైన సమాధులన్నిటిలోను 'నేను' అనగా నాకు మొదటయే జ్ఞానము ఉన్నదో ఆ అంతరములో సమాధివచ్చుటచే, యీ సమాధులన్నియు శరీరసంబంధమైనవే. అనగా అహంకారముతో గూడినవే! అహంకారమెటులుండునో ఆ రకపు జన్మలు వచ్చును. పసిపాపలు మెడ నిలుపునది అహంకారచిహ్నమే గదా! అది మొదలు మెల్లమెల్లగా మానవులందఱికి వారి వారి వర్తమానము లేర్పడుచున్నవి. ఇది మనకు నిత్యానుభవమే - అనగా నిద్రవచ్చు కాలమునందు అహంకారము తగ్గుటయు, క్రమముగా నిరాహంకారములోనికి పోవుటయు - గాన సర్వవ్యవహారము అహంకారమే! ఇది తగ్గగానే శరీరము పడిపోవును. ఏ అంతరములో అహంకారముదయించునో, ఆ అంతరములో సమాధానము గుదురును. గాన సంసారికి, హఠయోగికి, తదితరులకుగూడ వారి వారి స్థితుల ననుసరించి సమాధి యుండనేయున్నది. గాని అది వారికి తృప్తినిచ్చునది గాకపోవుటచేతనే ఉత్తరోత్తర ప్రశస్త సమాధులకు యోగానురక్తులై పరుగులిడుటగాని అవేవియు పూర్ణసంతుష్టి నొసంగ జాలనివగుటచే, అందలి యేకాగ్రత మొదలైన

అష్టాంగసాధనలను ఆ సంసారమునుండి తొలగించి "ఆత్మ
యందుంచవలెను" అనునదే పర్యవసానము. అనగా నేనియు
చేయక యన్నిటినుండియు ఉపరమించుటయందే మానవుని
ప్రయత్నము. దీనికి యోగమను నిష్ఠ అవసరము. సంసార
సమాధియందు మానవు డేనిష్ఠగలిగియున్నను కేవలము
విశ్వాసము చేతనే కదా, యీ సంసారము సాగుచున్నది.
అట్లునే శ్రుతిప్రమాణమందు విశ్వాసముంచుచో సమాధి
దానంతటదే కుదురగలదు. ఇప్పుడు సమాధి యనగా జ్ఞాననిష్ఠా
పూర్వక 'నిర్గుణోపాసన'. అనగా "నదియిట్లని తెలుసుకొను
యుండుటయే" యేకైక మార్గము. ఈభావమునే ఒక పాశ్చాత్య
తత్త్వవేత్త సూత్రప్రాయముగ "Forget the past, ignore
the present, be un-mindful of the future" అని
వర్ణించెనట. (అనగా గతమును విస్మరించుట, వర్తమానమునం
దుదాసీనత, భావినిర్లక్ష్యత) గాన నన్ను గురించి నాకే జ్ఞానము
(నాకు ఉన్నదో అదిగాక) శాస్త్రము బోధించుచున్నదో
అందే నిలబడిపోవుట యనునదే సమాధి. ఉత్తమమైన సహ
జావస్థ. ఇదియే అద్వైతము బోధించు అస్పర్శయోగము.
దీనియందు ఆత్మ (నేను) ఒక్కటే సత్యం. తక్కినదంతయు
అసత్యం అని తెలుసుకొని ఆ అంతరమందుండుటయే. ఇటుల
తెలిసిననేగాని యీఅస్పర్శయోగము నేమో తెలియరాదు.
ఇతరులకీ యోగమనిననే భయమగుటచే నొక్క అద్వైత
యోగికే యిది కరతలామలకము - సంపూర్ణ యోగము.
ఈ అర్థమునే భ. గీ. 6-47

శ్లో॥ యోగినామపి సర్వేషాం మద్గతేనాంతరాత్మనా।
శ్రద్ధావాన్ భజతే యో మాం స మే యుక్తతమో మతః॥

సూచించుచున్నది. అన్నిమతములవారికిని స్వరూపజ్ఞానము వల్లనే మోక్షమనునది పర్యవసానమయినను, ఆ స్వరూప నిర్ణయములోనే భిన్నాభిప్రాయులై దాని దానికి తగినట్లు యోగాభ్యాసముచేయ మొదలిడుటచేతనే యిన్ని విధములుగ యోగశబ్ద మన్వయింపబడుచున్నది. అటులన్వయించిన వారా యోగములను అష్టాంగవిధానమున చిరకాల మభ్యసించిన వారలై పిదప సమస్త విధములను పరదేవతకర్పించి యోగ్య మైన పదార్థము మఱియొకటి లేనిదగుటచే "శివశక్తి సామ రస్యమే ప్రధానమయిన యీ అద్వైతయోగమున కభిముఖు లగుచున్నారు. అదియే జీవబ్రహ్మల కైక్యరూపమయిన అపరోక్ష జ్ఞానస్వరూపయోగమును భక్తులకు గలుగజేయుచు ప్రశస్తమైన బ్రహ్మానందమను నిజమైన ఆనందమును గలుగ జేయునదిగానున్నది. మరియు ఉత్తమమైన స్థితప్రజ్ఞ రూపక మగు నిట్టి యోగసిద్ధిగలుగుటకు నియతమయిన పరిమాణము గల యాహారవిహారములును కర్మములందు నియతమయిన వ్యాపారమును, నియమితకాలములయిన స్వప్న జాగరములు గలుగుటయు యెంతయో సహాకరించునని శాస్త్రనిర్దేశము. గాన ప్రశ్నోపనిషత్ 4-2 లో వివరించి నటుల 'సర్వేంద్రియ వ్యాపారములు నాయా ఇంద్రియాధిష్ఠాన దేవతలకు పరమగు మనసు వలన బుట్టుచు ఆ మనస్సునందే లయించుచున్నవై, సర్వకర్మలు క్షరపురుషలక్షణములై యగుటచే, నీ ఆహారాది నియమము లెంతేని చిత్తశుద్ధి కుపకరించునవియై యోగసిద్ధికి తోడ్పడి ప్రమాదిదోషముల దొలగించి పరమోత్కృష్టశాంతిని గలిగించుచున్నదనుటలో సంశయము లేదుగాన గమనార్హము.

ఓమ్ - తత్ - సత్.

# 28. ఆ హా ర ని య మ ము

శ్రు॥ ఆహారశుద్ధౌ సత్వశుద్ధి । సత్వశుద్ధౌ ధ్రువాస్మృతిః
స్మృతిలమ్భే సర్వగ్రన్థీ నాం విప్రమోక్షః ॥-
(ఛాం. 7-26-37)

లోకములోని మానవుల కందఱకు గలుగు ఆధ్యాత్మి కాది సర్వ దుఃఖములకు, సర్వానర్థములకు మూలకారణము 'ఆత్మ స్వరూపాజ్ఞానమే'. ఇది వారెల్లప్పుడును యిష్టప్రాప్తి, అనిష్టనాశముగోరుచు జేయు సవిరళ ప్రయత్న ఫలమే! అనగ వారి రాగద్వేషములకు లోనైన విహిత నిషిద్ధకర్మా చరణమే ధర్మాఽధర్మములకు దారితీసి పరంపర యాతదను గుణమగు దేహగ్రహణంబును సిద్ధింపజేయుటచే వారి కాయా సుఖదుఃఖము లనుభవమునకు రాకతప్పుటలేదు. గాన నిట్టి రాగద్వేషములకు కారణమగు అధ్యాసను తొలగించి, ద్వైత ప్రపంచముయొక్క యదార్థస్థితిని గుర్తింపజేసిననేగాని సకలా నర్థములు నివర్తిల్లవు. దానికి రాగద్వేషములచే దూషితము గాని విషయవిజ్ఞాన మెంతేని యావశ్యకము. అప్పుడేగాని నిర్మలమైన అంతఃకరణ యేర్పడి అనేక జన్మార్జిత భావనా రూపమగు హృదయగ్రంధులు సంపూర్ణముగా నశించి, ఆత్మ స్వరూపజ్ఞానము అవిచ్ఛిన్నముగా ప్రస్ఫుటమగుచు, సకల పురుషార్థసిద్ధియు, నిరతిశయానంద ప్రాప్తియు గలుగనేరదు. ఇట్టి విశుద్ధాంతఃకరణ కలుగుట కెంత యాచార్యోపదిష్ట మహావాక్య శ్రవణాదులు సాక్షాత్సాధనలుగా నిర్దేశింపబడి నను, ఆహారాది నియమంబులును, ఆరాదుపకారకంబులుగ నెంతయో ప్రశంసింపబడుచున్నవగుటచే, వాటివిచారణొకింత సేయనగును.

తై. 2-1 'బ్రహ్మవిదాప్నోతిపరం, శ్వేతా3-8 "వేదాహమేతం పురుషం మహాంతం......తమేవ విదిత్వాతి మృత్యుమేతి......" ఇత్యాది శ్రుతులు, పరమ పురుషార్థమగు పూర్ణానందాద్వితీయ పరిజ్ఞానమే వేద్యమనియు, అమృతత్వము బొందుట కదియొకటేగాక మార్గాంతరమేమియు లేదనియు స్పష్టము జేయబడుటచే, బ్రహ్మవేత్తలు బ్రహ్మవిషయిక జ్ఞాననిష్ఠగలిగి విషయాంతర జ్ఞానములేని వారలగుటను, నిరుపాధికమగు నా సద్వస్తువే 'సత్యంజ్ఞాన మనన్తం బ్రహ్మ'యని లక్షణాయుతముగా వివరింపబడినటుల, సోపాధికమయే యుండవలయునుగదా! అట్టి సోపాధికలక్షణము కేవలము శుద్ధ సత్వప్రధానమును, ప్రథమాభాసయునగు'అహం' ప్రత్యయగోచరంబునునగు శబలస్థితియే (ఉన్మనీ) యగుటచే, దానిని సిద్ధింపజేసుకొనుటకు ముముక్షు లవశ్యము శ్రవణమననాదుల కనుకూలముగ మనస్సును సంస్కరింపజేసుకొనుటనునదే ప్రథమ కర్తవ్యము. శ్రుతియును బృ॥ 6-4-19 'మనసైవాను ద్రష్టవ్యమ్' యని దానినే ధ్రువపఱచుచున్నది.

(తై 2-1)'సవాఏషపురుషోఽన్నరసమయః'లో వర్ణించునపుడు పురుషు డన్నరసమయుడనియు, యీ స్థావర జంగమాత్మకమగు సర్వభూతములు అన్నమువల్లనే పుట్టి, వృద్ధిబొంది, మరియు నందే లయమగుచుండుననియు చెప్పబడుటచే, సర్వభూతములందును అన్నము శ్రేష్ఠమైనది. అట్టి అన్నము

"అగ్నౌప్రాస్తా హుతి స్సమ్యగాదిత్య ముపతిష్ఠతే ।
ఆదిత్యాజ్జాయతే వృష్టి ర్వృష్టేరన్నం తతః ప్రజాః ॥"

యనుస్మృతిప్రకారము సృష్టిక్రమములో జేరినదై, భ.గీ3/14-15

ళో వర్ణించుచునటుల బ్రహ్మముకన్న వేఱుగానిదగుటచే తేజో ఒబన్నరూపముగా ప్రసిద్ధిగాంచి, 'తస్మాదే తద్బ్రహ్మనామ రూప మన్నంచ జాయతే' యను శ్రుతిలో వివరించినటుల, ప్రాణాది నామాంతములగు పదునైదుతత్త్వములగు (నామము వాక్కు, మనస్సు, సంకల్పము, చిత్తము, ధ్యానము, విజ్ఞానము, బలము, అన్నము, జలము, తేజస్సు, ఆకాశము, స్మృతి, ఆశ, ప్రాణము) జగత్తులో, జ్ఞానశక్తి స్వరూపమేయగు తానే, త్రిగుణాత్మకమున జ్ఞానేచ్ఛా క్రియాశక్తులుగ నామరూప వ్యవహారము జరుపుచుండును. అనగా తానే, అన్నాదగా (అన్నమును భుజించువాడుగ) "అయమగ్నిర్వైశ్వానరో యో ఒయమన్తః పురుషే యే నేదమన్నం పచ్యతే" యను శ్రుత్యా నుసారమున, ('అహం' శబ్దవాచ్యముచేత పరుడైనవాడు) జఠ రాగ్నిరూపంబున సర్వప్రాణుల దేహమునను ప్రవేశించి పంచ భూతాత్మకమగు నన్నమును భక్షించుచున్నవాడగుటచే, సర్వప్రాణులయందును పరమేశ్వరబుద్ధినే యుంచవలయును. ఇదియే బృహదారణ్యకోపనిషత్ సప్తాన్న బ్రాహ్మణములో తానెట్లు, భోక్తృభోజ్యరూపమున, కార్యకారణసంబంధముతో సప్తాన్నవర్గముగా భాసించుచున్నదనియు వివరింపబడినది. మరియు నందలి అధిభూతాది దైవలక్షణంబగు అన్నాదులు (అన్నం - దర్శ - పూర్ణమాస్యాదులు, పాలు) ఆధ్యాత్మిక సాధ్యవర్గమునకు జెందిన వాఙ్మనోప్రాణములకెట్లు పరంపరయా సాధనములగుచున్నదియు జూడ ప్రథమమున సర్వసామాన్య సాధనమగు 'అన్నము' శరీరాదుల వృద్ధిక్షయములకును, అద్దాని పరిశుద్ధతయే విధముగ సాక్షాత్సాధనమగుచున్నదియు విశదముగాగలదు. అందువలననే పసిబాలకులసైతమన్న

ప్రాశన సమయమున బంగారముతో ఘృతము నుపానము చేయించుట మనకందఱకు ననుభవమే. ఇట్లెన్ని విధములుగ పరిచ్ఛిన్నభావముల - అన్నాన్నములనియు, పురుషుడు కళ లవియు, భోక్తృభోజ్యములుగను— నా పరాత్మను వర్ణించి నను, యెట్లు త్రివృత్కరణ పంచీకరణాది సృష్టి క్రమములు సృష్టినిబోధించుటయందు తాత్పర్యముగాక నార్చి నిలుచుటకు గట్టిన మూసలవలె యుపయోగ పడుచున్నవో యట్లనే అధ్యారోపాపవాదములచే నిష్ప్రపంచ పరబ్రహ్మాత్మ భావ మును గుర్తింపజేయుటయందే వాటి వినియోగమును ముఖ్య ముగా గమనింపవలసినది.

అట్టి అన్నమయ మనస్సును, ఆపోమయప్రాణమును, తేజోమయ వాక్కులేగదా, తేజోఽబన్నమయమగు శరీరాదు లయం దుపయోగబడుచు, షోడశ కలాపరిపూర్ణుడని ప్రసిద్ధి గాంచిన పురుషుడు అశనాయాపిపాసాది సర్వధర్మ శూన్య మగు తన నిరుపాధికస్వరూపమును గుర్తించగలుగుచున్నాడు. అదెట్లనిన, ఛాం. 6-5-1 లో వివరించినటుల, భుజింపబడిన యన్నము మూడువిధములుగ మాఱి, అందలి స్థూలభాగము మలముగాను,మధ్యభాగము మాంసముగాను,సూక్ష్మభాగము మనస్సుగాను, త్రాగబడు యుదకమునందలి స్థూలభాగము మూత్రముగాను, మధ్యభాగము రక్తముగాను, సూక్ష్మ భాగము ప్రాణముగాను, అటులనే భుజింపబడిన తైల ఘృతా దుల స్థూల, మధ్య సూక్ష్మభాగములు వరుసగా యస్థి, మజ్జ వాగ్రూపములుగాను పరిణమించినవగుటచే, షోడశ కలాపరి పూర్ణుడగు పురుషుని కళల వృద్ధిక్షయంబుల కన్నపానాదులే కారణము లగుచున్నవి.

ఇటులగు దీని ప్రాశస్త్యమును వివరించుచునే ఛాం. 6-7-7 లోని ఆఖ్యాయిక వెలయుచున్నది. గాన భోజనముండి నప్పుడే మనస్సు సర్వకళా పరిపూర్ణమయి స్వవ్యాపార సమర్థ మగుచు, భోజనము లేనపు డసమర్థమగుటచే, "అనాశకేన" యనునది కేవలము భోజన నివృత్తియని యెంచక, "కామా నశన మనాశకం" బను భాష్యకారుల నిర్వచనానుసారముగ, కోరికతోఁగూడిన షడ్రసోపేతమగు మృష్టాన్న భోజనమే సర్వానర్థ హేతువని నిషేధింపబడినదైనందున, ఆత్మ సమ్మిత మైన యన్నమునే యనుభవించనగునని తేలుచున్నది.

భ. గీ. 6-16

శ్లో॥ నాత్యశ్నతస్తు యోగోఽస్తి న చైకాంత మనశ్నతః।
న చాతి స్వప్నశీలస్య జాగ్రతో నైవచార్జున॥

యనునటుల, నియమములు పాటించక భుజించువారికి ధాతు వైషమ్యములచేతను, అసలేమియు కుడువనివారికి శరీరపతనమే ఫలమగుటచేతను యోగ(జ్ఞాననిష్ఠ) మసంభవమని విశదపఱచ బడినది. మరియు ఉపవాసాది కృచ్ఛ్ర చాంద్రాయణాది వ్రతములునూ, మనోబుద్ధీంద్రియాదులకు యతి శ్రమముచే ప్రవృత్తి యుపరతమైనప్పుడు, ఆత్మచైతన్యము స్ఫురణముగాక ప్రత్యగాత్మను కృశింపజేయుటయే ఫలమగుచున్నందున, నది పీడాకరమగు యశాస్త్రీయాచరణమే యగుచు, దానివలన నికృష్టమైన తామసభావ మేర్పడి, అసురులుగా జన్మించు వారలే యగుచున్నారని నిరసింపబడినది, గాన యింద్రి యములు విషయములయెడ విముఖంబులై నిర్బీజ విషయ జ్ఞానముసిద్ధించుట కనువైన అంతర్ముఖతయందే ముముక్షువులు శ్రద్ధగలవారు గావలయును.

ఆత్మ స్వయముగా నశనాయా పిపాసాదులు, శోక మోహములు, జన్మ జరామరణములు మొదలగున వేవియు లేనిదగుచు, విశుద్ధ చిత్తమునందే ప్రకాశించున దగుటచే యోగాభ్యాసమున కనుకూలమగు ఆహారాదులనే, తమ తమ యధికారముల ననుసరించి, యనవరతము ప్రయత్న పూర్వకముగ నభిలషించుచుండవలయును. అనగా ముముక్షు లేయే యాహారము, లేయే విధములుగా, నెంతెంత, తీసుకొనవలసి నదియు ముఖ్యముగా పాటించవలసియున్నది.

ప్రాణుల కంతఃకరణ మెట్టిసంస్కారము గలిగియుండునో అట్టి సంస్కారములతో గూడిన అంతఃకరణ కనురూపమగు శ్రద్ధలేక ఆస్తిక్యబుద్ధి యుండున దగుటచేతను, ప్రవృత్తియు దానిననుసరించియే యుండునదగుటచేతను, శాస్త్రవిహితమైన ఆచరణనే యెల్లప్పుడు గలిగియుండవలెను. ఇట్టి శ్రద్ధాభేదము వారు వారు సేవించు సాత్త్విక - రాజస తామసాహారముల మీద నాధారపడియుండును.. గాన తప్పక విచారణజేసి భ. గీ. 17/8 లో వివరించినటుల,

"ఆయుస్సత్త్వ బలారోగ్య, సుఖప్రీతి వివర్ధనాః ।
రస్యాస్స్నిగ్ధా స్థిరాహృద్యా, ఆహారాస్సాత్త్వికప్రియాః॥"

ఆయుస్సు మొదలగు వానిని వృద్ధి బొందించునవియు, రసయుక్తములును, స్నేహవంతములును, దేహమునయధికకాలము నిలుచునవియు, హృదయమున కింపైన ఆహారములనే యధికముగా సేవించవలయును. అదియును శ్రీ ఆచార్యస్వాముల వారు తెలపిచ్చినటుల(ఉపదేశపంచకమ్) 'క్షుద్వ్యాధిశ్చ చికిత్స్యతాం, ప్రతిదినం భిక్షౌషధంభుజ్యతాం। స్వాద్వన్నం నతుయా

చ్యతాం, విధివశాత్ప్రాప్తేన సంతుష్యతాం ॥ యనునదే లక్ష్య
ముగా నిడుకొని, శరీరధారణము గావలసిన వ్యాపారము
మాత్రమేగలవాడయి, దానియందును 'ఇది నాది' యను
యభినివేశము లేనివాడై, ప్రాణరక్షణమునకు మాత్రమేచాలిన
సాత్త్వికాహారములనే సేవించుచు, ఫలాభిసంధి లేక భగవదా
రాధన రూపములైన సత్కర్మాచరణ విశేషముచేత, క్రమ
క్రమముగా సత్త్వమును వృద్ధినొందగలడు. ఇటుల ప్రకృతి
గుణ విశిష్టంబయిన యీ ప్రపంచమందు, గుణాత్యయద్వారం
బుననే యూర్ధ్వగమనాదులు గానవచ్చుటచే ముముక్షువు
లెంతయో ఆహారాది నియమములందు శ్రద్ధవహింపకతప్పదు.
మరియు నట్టి ఆహారనియమములో 'మౌనేన భోక్తవ్య' మను
మంత్రవర్ణనియమము ప్రసిద్ధమైనది. అనగా ఆహారముభుజించు
నపుడు, మౌనమే యవలంభించిన అప్పుడు కలిగిన సంకల్ప
ములే సంస్కారములుగా పరిణమించునవగుటచే, భావము
లేకుండగనే భోగమునను భవించుటయే నిష్కామకర్మమగుచు,
స్వతస్సిద్ధమైన 'ఆత్మభావన' యనుభవమునకుగూడ రాగలదు.
భ.గీ. 3/12లో 'అప్రదాయైభ్యోయో భుఙ్క్తేస్తేన ఏవసః'
వివరించినటుల, "సర్వ ప్రాణభుత్"గా సృష్టింపబడిన భోగ
జాతమును, ఇతరులకు కాకుండా తానే స్వార్థపరుడై భుజించు
నెడ 'అనుక్రోశమను' దోషమును బొందినవారగుదురు. అట్టి
దాని పరిహరించు నిమిత్తమే వైశ్వదేవాది పంచ మహా
యజ్ఞములు నిర్ణయింపబడినందున, వాటిని యథావిధిగ నాచ
రించియే తీరవలయును. అట్లు నిర్వర్తించక తానొక్కడే
వంటరిగా భుజించి శరీరమును పోషుంచుకొనువాడు 'దొంగ'
యే యగు, గాన తోటివారలతో దానిని భుజింపవలయును.

అక్క-అలయందు సంతర్పణముల చేయుటయనుదాని విశిష్టత యిదియే! అప్పుడే సమస్త దుష్కృతములనుండి తొలగింప బడినవాడై, అన్నాదులవలన గలిగిన నైజకిల్బిషమును బొంద నేరడు.

ఈ ప్రకారమగు నియమము లెన్నియో ఆయా ఉపనిషత్తులయందు—

(1) " యోగ విఘ్నకరాహారం వర్జయేద్యోగ విత్తమః
అభ్యాసకాలే ప్రథమం శస్తంక్షీరాజ్య భోజనం
గోధూమ ముద్గశాల్యన్నం యోగివృద్ధికరం విదుః
తతఃపరం యథేష్టంతు శక్తస్స్యాద్వాయుధారణే ॥–
అనియు, (యోగతత్త్వ)

(2) అభక్ష్య భక్షణోత్పన్నం మిథ్యాజ్ఞాన సముద్భవమ్ ।
అనియు, (రామతాపినీ)

(3) భయంక్రోధ మధాలస్య మతిస్వప్నాతి జాగరమ్
అత్యాహార మనాహారం నిత్యం యోగీవివర్జయేత్ ॥–
(అమృతనాద)

ఇత్యాదులు లెక్కకు మిక్కటముగా ఆహార విహారములందు గానవచ్చుండుటచే, వాటిని కడు జాగరూకులై యనువర్తించిననేగాని, సత్వశుద్ధిగలిగి, తన్మూలమున వాక్మనోప్రాణములు సునిశితములై, శ్రుతి స్మృతులయందు ప్రమాణ బుద్ధి గలిగి, పరాపరైక్యజ్ఞానము సులభముగా బొందనలవిగాకున్నది.

ఇట్లెన్ని విధములుగ యాహారాది నియమములమీద నాధారపడియున్నవ్యక్తి గతసంస్కారములు, అన్యోన్యాశ్రయ సంబంధముగలవి, జన్మలకు నైతముకారణమగుచుండ, "ప్రత్య

క్షముగాకసబడు భేదములు లేవనియు, మనుజులందఱు నొకటే నను చు, భ. గీ 5-18 శ్లోక వివ్యాఖ్యనను సరిగగు ర్తించ నేఱక, విపరీతాన్వయముగావించుట కేవలము సాహసమే! గాక జన్మ వల నేగాని సమానావకాశముల ఫలమునకైనను తావులేదని గ్రహించవగు. అప్పుడే పునర్జన్మయనున దంగీకరింప గలుగు. మంటి-గ్రుడ్డి-మూగ-చెవుడు, యిత్యాది యంగవైకల్యము లుగలవారి కెంత సమానావకాశములు (Equal opportunities) గలిగించినను, వాటిప్రయోజనము పొందలేకపోవుటను గమనించినచో, జన్మవల్ల నేగాని (సమానావకాశములు గల్పింపబడినను) వాటి వినియోగ మెక్కువ యుండజాలదు. అట్టి తఱి, జన్మలను వృద్ధిపఱచుకొనుటకు వెనుక వివరించినప్రకారము, స్వవర్ణాశ్రమోచిత వైదిక ధర్మానుష్ఠానమే శరణ్యము. గాని మానవుని వేఱు వేఱు భాగీరథి ప్రయత్నము లాయాస జనకములే !- ఎట్లు కుసుమ వి త్తనము జల్లి ఆట్రగడ ధాన్యమున కాశించునట్లు—

గాన మానవులుతా, ముత్తమోత్తమ జన్మల సంపాదించుటందే యవిరళ కృషి సలుపుచు, దానికుచితమైన ఆహారాదినియమముల పాటించిన, తప్పక "ఇహపర" సౌఖ్యముల బొందగలుగుదురను నది నిస్సందేహము—

మైత్రాయణ్యుపనిషత్ శ్రుతి "తపసా ప్రాప్యతే సత్వం, సత్వాత్సం ప్రాప్యతేమనః । మనసా ప్రాప్యతే త్వాత్మా, హ్యాత్మాప్త్యాననివర్తతః" యని వినవచ్చుచున్నది.

ఓమ్ - తత్ - సత్ .

# 29. జ్ఞానాన్మోక్షః

శ్లో. ఆత్మా శుద్ధః సదా నిత్యః సుఖరూపః స్వయంప్రభః
అజ్ఞానాన్మలినో భాతి, జ్ఞానాచ్ఛుద్ధో విభాత్యయమ్
(దర్శనోపనిషత్)

మోక్షమనఁగ నిత్యసిద్ధంబైన ఆత్మైకత్వ స్వరూపావస్థానము. ఇయ్యది వస్తుతంత్రమైనయది కేవల జ్ఞానసాధ్యమే కాని పురుష వ్యాపారాధీనమగు కర్మసాధ్య మెంతమాత్రమును గానేరదు. ఎట్లనఁగ, కర్మలు ఉత్పత్తి, ప్రాప్తి, వికృతి, సంస్కారములను చతుర్విధ వ్యాపారాపేక్షితములై వెలయుచున్నవి. కాన యథార్థ స్వరూపమును మఱుఁగుపరచి భేదమును స్ఫురింపజేయుటయే స్వభావముగాఁగల అజ్ఞానమునకు, పైన పేర్కొనబడిన విధముగ భేదమునే యవలంబించియుండు కర్మము లెట్లు తొలఁగఁజేయఁగలవు? అనఁగా (యోగతత్త్వ) 'జ్ఞానస్వరూపమే వాహో, జ్ఞానం క్షేమైక సాధనం' మనునదే ప్రమాణము. ఇక కర్మలన్ననో అటు స్వస్వరూపమును గుర్తించుటయందు ప్రతిబంధకమైన దేహేంద్రియాది కల్పకమయిన మూలాజ్ఞానమను ప్రతిబంధకమును తొలఁగించుటయందే వినియోగము - ఎట్లు మలముచే నావృతమైన అద్దమును శుభ్రపరచుటయందే ప్రయత్న మవసరమో యట్లు - ఇటుల చెప్పుటచే ఆదర్శము ప్రతిబింబ గ్రహణరూపమయిన స్వకార్యమును జేయకపోయినను, స్వచ్ఛత్వ ధర్మముమాత్రము మఱుఁగుపడుటవలన స్వరూపంబున నేమో కనుపడకపోదు. కాన యావత్కర్మలు అజ్ఞాన కార్యములైనందున, జ్ఞానసాధ్యంబైన అజ్ఞాననాశమే లక్షణముగాఁగల మోక్షమునందు కర్మలు

[illegible]

'బహూన్యపి పశ్యతి [illegible] [illegible]

మానస స్వభావం'' వివరించిరి.

అయితే 'తెలియుట' [illegible] స్వప్నము [illegible] మెలకువ వచ్చినంతనే 'స్వప్నము [illegible]' [illegible], యీ జాగ్రత్తనుండి మెలకువ కలుగుటనగా 'ఇదీ నేను కాను' చెప్పుటయేనా ? కాదు. ఇది కేవలము [illegible] ! Intellectual Understanding) 'నేను' అనగా [illegible] యెవరినో కూడ తెలియదని; [illegible]. నేను ఇది కాను – ఇది కాను (నఇతి – నఇతి) అని చెప్పినంత [illegible] మున బాగులమే యగుదుము గాని 'అసలు నా స్వరూపము, తెలిసినట్లుగాదు. విశ నివేశ పూర్వకముగా తెలియుటయే తెలియుట. గాన 'తెలియుట' యనగా భ. గీ 9/2 'ప్రత్యక్షా వగమం ధర్మ్యం' అనునట్లు, ప్రత్యక్షఫలముగ ననుభవింప బడునదే గానలయును.

అనగా బ్రహ్మవిద్య తాను బుట్టినంత మాత్రముననే విద్వాంసుని బ్రహ్మభావము నొందించి సకారణముగ సంసారము నిశ్శేషముగా నివర్తించుచున్నది. "ఇట్టి అవగతి నిష్ఠను

"అవగత్యవసానమే" అనగా జ్ఞానమునకు విషయమగుటను బొందు టయే నిమిత్తముగాగలదియగు జగత్తుయొక్క సర్వప్రవృత్తియు జ్ఞానమునందే నిష్ఠగలిగి, జ్ఞానమునందే యవసానము(సమాప్తి) గలది యగుచున్నది. అదియే అపరోక్షానుభూతి. అయితే ఆత్మస్వభావ మేమన, జీవాత్మగా నుండుట, ప్రత్యగాత్మగా నుండుట, పరమాత్మగా నుండుట, యిదంతయు తానేనని తెలుసుకొనుటగూడ దాని స్వభావమే. దేనికైన స్వభావమో దానికా స్వభావము వలన నష్టములేదు - ఎట్లు దీపపు వేడిమి దీపమును కాల్చదో అట్లు - యీ యాత్మకు పైన పేర్కొన బడినదంతయు స్వభావమే యగుటచే దాని 'అసలు స్వరూప' మున కేమాత్రము నష్టములేదు గాన ఆత్మానుభవము, ఆత్మాను సంధానము, ఆత్మజ్ఞానప్రాప్తి, యిత్యాదులన్నియు కేవలము గౌణములే! 'పరమాత్మసర్వవ్యాపి' అనుటలోనే సుఖమం దును, దుఃఖమందును గూడియుండి అనుభవించుచునే యున్నాను. అయితే సుఖములో స్ఫురించినంత స్ఫుటముగా దుఃఖములో స్ఫురింపకపోవుట - మాసిన జడమైన గోడయందు సూర్యప్రకాశము తక్కువగా ప్రతిఫలించునో యట్లు - గాన అనుభవముమీద గూడ విరాగము రావలెను. అనగా నన్ను నేను చూచుకొనుటకు వీలులేదు గనుక, ఈ స్వరూప జ్ఞానము వలన విరాగము చెందవలసినది వేరుగ నేదియు లేనందున అనుభవముమీద సైతము విరాగము గలుగుటయే పూర్ణవిరాగము, పరమగమ్యము. అనుభవమనగా తెలిసిన పిదప తెలిసినట్లుండుటయే గాని, పూర్వ సంస్కారముల ననుసరించి వ్యాఖ్యానము జేయుటగాదు. 'తత్త్వసారాయణ' యను గ్రంథములో శ్రీ అప్పయ్య దీక్షితులవారు పేర్కొని

నటుల 'నేను శైవుడను' యని చెప్పగానే, వానికి శైవ చిహ్నములు లేకపోయిన నెట్లంగీకరించమో, అటులనే బ్రహ్మజ్ఞానము గలిగిన తరువాత, ఆ ప్రకారము ప్రవర్తన మారనియెడల వానికి తెలియలేదనే చెప్పవలెను. మరియు శ్రవణాదులు జ్ఞానము సంపాదించుటకు పూర్వమే, జ్ఞానమునకు అంగములుగా నుపయోగపడునుగాని తెలిసిన పిదప కర్తవ్యమిసుమంతయును లేదు. గాన అనుభవమనగా (మాం-కారికలు అద్వైత 45)

'నాస్వాదయేత్ సుఖంతత్ర, నిస్సంగః ప్రజ్ఞయా భవేత్' లో వివరించినటుల విచారణగాక మిగిలిన దంతయు, అనగా నే విధమైన విచారణలేక ఆ స్వాధనములోనే యుండుట. ఇదియే అసంప్రజ్ఞాత సమాధి - చిత్స్వరూప సత్తామాత్రముగ శేషించి యుండుటయే - ఇక విచారణలోగూడ నేదైన, యెప్పుడైన ఆస్వాదన (అనుభవ విషయము) వచ్చినచో నది తత్త్వము కానేరదు. గాన దానిని వదలవలసినదే. అప్పుడా ఆస్వాదనను గూడ విచారణ జేయవలసినదే. లోకములో ఆస్వాదనయే తత్త్వమని తప్పనస్థితికి వచ్చినది. బ్రహ్మనిష్ఠ యను పేరుతో తెలిసిన తరువాతగూడ యిష్టమువచ్చినట్లు సంచరించుట జరుగుచున్నది. జ్ఞానము అనుభవమునకు రానలయుననియు, దానికొఱకేమేమో చేయవలసియున్న దనియు పిచ్చి ప్రసంగములు! గాని మనము తెలియని ఆత్మను గుఱించి, మనకు తెలిసిన అనుభవమునుబట్టి విచారించుట గూడదు. ఇట్టి విచారణయందు గలుగు ఆనందముగూడ మృషయే! అయితే మన మాయనుభవముతోనే ఆగుచున్నాము. అది కూడదు. గాన యీ అనుభవముగూడ

అవగత్యవసానమే॥ అనగా జ్ఞానమునకు విషయమగుటకు పొందు
బడెడు నిమిత్తముగా కలిగినట్టి జగత్తునందు - సర్వత్ర వ్యాప్తియును
జ్ఞానమునందే నిష్ఠ గలిగి, జ్ఞానమునందే యవసానము (సమాప్తి)
గలిగి యుండునది. అదియే అపరోక్షానుభూతి. అయితే
ఆత్మస్వభావ మేమనగా, జీవాత్మగా నుండుట, ప్రత్యగాత్మగా
నుండుట, పరమాత్మగా నుండుట, అంతయును తానేనని
తెలుసుకొనుచుండుట దాని స్వభావము. దేనికే స్వభావమో
దానికా స్వభావము నశించదు - నిప్పు గరుప్పు వేడిమి
లేనిదగునా? కాల్చదో అగ్ని - యుష్ణమును వైన దెట్లు
బడినదంతయు స్వభావమే యుండునే కాని 'అసలు స్వరూప'
మున కేమాత్రము నష్టము లేదు గాన ఆత్మానుభవము, ఆత్మాను
సంధానము, ఆత్మజ్ఞానప్రాప్తి, ఆత్మోపలబ్ధియు కేవలము
గౌణములే! 'పరమాత్మసర్వవ్యాపి' అనుటలోనే సుఖమం
దును, దుఃఖమందును గూడియుండి అనుభవించుచునే
యున్నాను. అయితే సుఖములో స్ఫురించినంత స్ఫుటముగా
దుఃఖములో స్ఫురింపకపోవుట - నలుపు జడమైన గోడయందు
సూర్యప్రకాశము తక్కువగా ప్రతిఫలించినట్లు - గాన
అనుభవముమీద కూడ విరాగము రావలెను. అనగా
నన్ను నేను చూచుకొనుటకు వీలు లేదు గనుక, ఈ స్వరూప
జ్ఞానము వలన విరాగము చెందవలసినది వేఱుగ నేనియు
లేనందున అనుభవముమీద సైతము విరాగము గలుగుటయే
పూర్ణవిరాగము, పరమగమ్యము. అనుభవమనగా తెలిసిన
పిదప తెలిసినట్లుండుటయే గాని, పూర్వ సంస్కారముల
ననుసరించి వ్యాఖ్యానము జేయుటగాదు. 'తత్త్వసారాయణ'
యను గ్రంథములో శ్రీ అప్పయ్య దీక్షితులవారు బేర్కొని

యటుల 'నేను శైవుడను' అని చెప్పగానే, వానికి శైవ చిహ్నములు లేకపోయిన నెట్లంగీకరించవలెనో, అటులనే బ్రహ్మజ్ఞానము గలిగిన తరువాత, ఆ ప్రకారము ప్రవర్తన మారని యెడలవానికి తెలియలేదనే చెప్పవలెను. మరియు శ్రవణాదులు జ్ఞానము సంపాదించుటకు ప్రధానమే, జ్ఞానమునకు అంగములుగా నుపయోగపడునని తెలిసిన పిదప కర్తవ్యమిసుమంతయును లేదు. గాన 'అనుభవమనగా (మాండూక్యకారికలు అద్వైత 45)

'నాస్వాదయేత్ సుఖంతత్ర, నిస్సంగః ప్రజ్ఞయా భవేత్' లో వివరించినటుల విచారణగాక మిగిలిన దంతయు, అనగా నే విధమైన విచారణలేక ఆ స్వాదనములోనే యుండుట. ఇదియే అసంప్రజ్ఞాత సమాధి - చిత్స్వరూప సత్తామాత్రముగ శేషించి యుండుటయే - ఇక విచారణలోగూడ నేదైన, యెప్పుడైన ఆస్వాదన (అనుభవ విషయము) వచ్చినచో నది తత్త్వము కానేరదు. గాన దానిని వదలవలసినదే. అప్పుడా ఆస్వాదననుగూడ విచారణ జేయవలసినదే. లోకములో ఆస్వాదనయే తత్త్వమని తక్కువస్థితికి వచ్చినది. బ్రహ్మనిష్ఠ యనుపేరుతో తెలిసిన తరువాతగూడ యిష్టమువచ్చినట్లు సంచరించుట జరుగుచున్నది. జ్ఞానము అనుభవమునకు రావలయుననియు, దానికొఱకు కేమేమో చేయవలసియున్న దనియు పిచ్చి ప్రసంగములు! గాన మనము తెలియని ఆత్మను గుఱించి, మనకు తెలిసిన అనుభవమునుబట్టి విచారించుట గూడదు. ఇట్టి విచారణ యందు గలుగు ఆనందముగూడ మృషయే! అయితే మన మీయనుభవముతోనే ఆగుచున్నాము. అది కూడదు. గాన యీ అనుభవముగూడ

యేమిటిరాయను విచారణే "తత్త్వ విచారణ" ఇదియే

ఉత్తమా తత్త్వచింతైవ, మధ్యమం శాస్త్రచింతనమ్
అధమా మంత్రచింతాచ, తీర్థభ్రాంత్యధమాధమా॥

యని మైత్రేయి యుపనిషత్తులో ప్రశస్తముగ నిర్ణింపబడి
నది. ఇట్టి యీ 'తత్త్వవిచారణ' ఉత్తమ-మధ్యమ-మందాధి
కారుల క్రమము వేర్వేఱుగా వివరింపబడినది. భ.గీ 9/13
లో వర్ణించినటుల "బహుజన్మముల నారాధించిన పరమేశ్వ
రుని ప్రసాదాతిశయమువలన జక్కగా మృదిత కషాయం
బగుటచే విషయగ్రహణ విముఖంబై సర్వదా ప్రత్యక్ప్రవణ
స్వభావంబుగల ఉత్కృష్ట చిత్తముగల మహాత్ములు తీవ్ర
మోక్షేచ్ఛా వైరాగ్యశమదమ తితిక్షోపరమాది సత్వగుణ
సమృద్ధిలక్షణమును బొందినవారలై, కార్యము.కారణ మాత్ర
మే యగుటచే, భూతములను వేఱు స్వభావము లేమివలన,
'బ్రహ్మము' అద్వితీయమని తెల్పుటకొఱకు తనను శ్రవణా
దులచే స్వస్వరూపమును జక్కగా నెఱింగి, ఇతర వస్తుదర్శన
ము లేనివారై, "ఇదియంతయు - నేనును బ్రహ్మమే" యని
యప్రతిబద్ధ అఖండాకార వృత్తిచే సదా సర్వంబును బ్రహ్మ
ముగా నేజూచువారే యుత్తములు" వీరే తత్త్వమును లెస్సగా
గుర్తించినవారు. ఇట్టి వారికి కర్తవ్యత పోయినదిగాని
కర్తృత్వము పోలేదు. గాన తెలియుట యనగా "తానొక్కడే
ఆత్మయని" తెలియుటగాదు. తనకన్న భిన్నులెవఱును
లేరనియు, అంతవఱకు తనకు గలిగియున్న "తాను వేఱు -
ఇతరులు వేఱు" యను పృథగ్భావము పోయి కనబడు
సమస్త జీవరాసులు తానేనని మానసిక పరిణామము

(తెలుసుకొనిన) గలిగిన పిదప, వారి కే విధముగ నష్టము గలుగునట్లు ప్రవర్తించును? మరియు నాతడు ప్రారబ్ధమను శరీరమున్నంతవరకు చేయకుండ యుండగలుగునా? గాని వి ప్రతిపత్తి కవకాశము లేనట్లుగా జేయుచు, తానే ధర్మము నే ప్రకారము నాచరించుటచే నట్టి జ్ఞానాధికారి యగుట కవకాశము గలిగినదో, అట్లే క్రమశిక్షణ ప్రకారము యితరులకు నైతము స్వార్థరహితుడై (నిష్కామముగా) బోధించి, వారును అట్లాచరించునట్లు జేయును. వీరే లోకవిధాన ప్రధానులు, వివేక ప్రధానులని ప్రశంసింపబడు బ్రహ్మవేత్తలు. వీరుగాక సమాధి ప్రధానులగు బ్రహ్మజ్ఞానులు మూడవ తెగకు జెందినవారును గలరు. ఇట్టి వారందఱును భ.గీ 7/3 లో వివరించినటుల,

మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతిసిద్ధయే।
యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః॥–

చాల యరుదుగా నుందురు.

అటులగాక, సకృత్ శ్రవణము చేతనే తమ అర్హతను గుర్తించక, తాము కృతార్థులమని యెంచి, స్వేచ్ఛానుసారముగ ప్రవర్తించుచు, తాము బ్రహ్మజ్ఞానులమని భ్రాంతి జెందువారు, యజమానునిచే నొక కార్యమునందు నియోగింపబడిన జవాను, తాను తన యిష్టమువచ్చినట్లు సంచరించుచు నియోజిత కార్యము నెరవేర్చునంతవరకు అదియా, జవాను యెంత వినినట్లెంచవచ్చునో, యంతకన్న యధికముగా జెప్పనగునా? 'పెద్దపులి యిలాయుండును' అనునది శాస్త్రాచార్యోపదేశము. ఇదియే శ్రవణము. దానిని గురించి

తెలుసుకొనుట జ్ఞానము. అది మనసునకు తెచ్చుకొనుటకే విజ్ఞానమని పేరు. అటులనే జ్ఞానమునకు ముందు వినవలెను. దానియందు విశ్వాసముంచి మననము చేయవలెను. ఆపైన విచారణ పురస్సరముగా బాగుగ పరిశీలించవలెను. అప్పుడే సాక్షాత్కారము గలుగును. దానితో సంతుష్టి నొందును. ఆపైన కర్తవ్యత యనునది లేదు. ఎట్లనగా పూర్వమొకప్పు డొక సింగపుపిల్ల కాలవశమున నొక గొ్రెలమందలో జేరి వాటిమధ్యనే బెరుగుచు, వాటి వలెనే ఆహార వ్యవహారములు సల్పుచుండెను. ఒకనాడు అరణ్యమందు సంచరించుచుండ, నొక మృగరాజును ఆగొ్రెలమందజూచి పలాయనముగాగా, దానితోపాటు నా సింగపుపిల్లయు పరువిడ మొదలిడెను. ఇది ఆ మృగరాజునకు ఆశ్చర్యము గలిగించ, మెల్లమెల్లగా నా సింగపు పిల్లను సమీపించి దానికి దాని స్వస్వరూపమును స్మృతికి తెచ్చెను. అంత నా సింగపుపిల్ల యొకింత తడవు యీయకొనక తనకది ఋజువుపఱచిననే గాని తాను విశ్వసింపనని గట్టిగ దెల్పెను. అప్పుడా వృద్ధకేసరి, సింగపుపిల్ల నొక కొలనుయొద్దకు తీసుకొనిపోయి, ఆ నీటియందు దాని ప్రతిబింబము జూపినంతనే సింగపుపిల్ల తన నిజ స్వరూపమును గుర్తించి, పెద్దపెట్టున గర్జించెను. చూచితిరా! అనుభవ జ్ఞానముయొక్క ప్రభావము. ఆపైన ఆ సింగపుపిల్లకు కర్తవ్యమేమియు లేకపోయెను! తాను తన పూర్వ సంసర్గాధ్యాసనుండి విడువబడినదై సజాతీయమైన దానితో గలసి సుఖముగా నుండెను.

గాననిట్టి సమ్యగ్జ్ఞానమే వేదాంతమను దాని కైకైక ఫలమయి, సకలానర్థ నివృత్తి పూర్వక నిరతిశయానందా

సా ప్తియే పర్యవసానమగుటచే, భావమునందే తదనురూప పరిణామము ఘటిల్లుచు, అద్వైతసిద్ధి లభించుచున్నది. గాన క్రియాకారకాద్వైత ప్రసక్తియే గానరాదు. అనగా 'ఉన్నది ఉన్నట్లు చూచుట' యనున దలవఱచుకొనుటయందే కృత కృత్యత - మఱియు సమ్యగ్దర్శనమునందే, నైతిక - ధార్మిక, ప్రవృత్తి ఫలమగు ఋజువర్తన మంతర్భూతమయిన దగుటచే, ముముక్షువు లెంతెంతవఱకు దానిని సాధించగలుగుదురో యంతంతవి శుద్ధాంత కరణులై సులభముగ సౌఖ్యమనుభ వించగలవారగు చున్నందున, యమనియ మాద్యష్టాంగ సాధనోపేత వైదిక కర్మానుష్ఠానముకన్న వేఱొక సాధనాం తర మీసమ్యగ్జ్ఞాన మపేక్షింపగు. ఇటులీ వేదాంతమనున దనుభవసిద్ధమైన, సద్యోఫలకారియే యగుటచే అలసు లూహించునటుల దొక మనోరథ సృష్టి మాత్రమే ననియు, ఇష్టాగోష్ఠి కుపకరించునదేయని నిరసించుట కేవలము శుష్క ప్రసంగమే యగును.

గాన నైష్కర్మ్యసిద్ధి 3-89 లో వివరించినటుల, అన్వయ వ్యతిరేకములతో, 'త్వం' పదార్థమైన ఆత్మను నామము మొదలగువాని వలన నిరాకరించి, పరిగ్రహము లేనివాడై, యుష్మచ్ఛబ్దార్థములగు శరీరేంద్రియాదుల వలన ఆశలేనివాడై, శమాదిగుణ యుక్తుడై, అన్నమయాది పంచ కోశములందహంకార, మమకారములు లేనివాడై, యే పురుషు డుండునో, ఆ పురుషుడు అఖండ జ్ఞానోత్పత్తి ప్రతిబంధక ముల నన్నింటిని నివర్తింపజేసికొని యున్నందున నిస్సంశయ ముగా 'అహంబ్రహ్మాస్మి' త్యాకారకాఽపరోక్ష జ్ఞానము గలవాడగును. అట్టి పురుషునకే భ.గీ 3/17 వివరించిన

శాంతి తుష్టులు లభ్యమగును. గాన (శ్వే 3-8) 'నాన్యః పంథా విద్యతేయనాయ' యను శ్రుత్యాను సారమున, ఆత్మైకత్వ జ్ఞానము కంటె వేఱొక మోక్షసాధన లేదనునది సుస్పష్టము.

ఓమ్ - తత్ -

# 30. శ్రీ విమలానంద భారతీ స్వామివారి లేఖావళి.

"ఆచార్యవాన్ పురుషో వేద"

(ఛాం. 6-14-2)

లో సూచించినప్రకారము, గాంధారదేశపు యంధునింబోలె, స్వస్థానమగు సద్రూపమును బొంది సుఖముగనుంటకు, "అన్యథా శరణం నాస్తి" యనునట్లు, సద్గురూపదేశ మొక్కటే శరణ్యము. అట్టి దాని కనుకూలమగు గురుశిష్య సంఘటన, జిజ్ఞాసువుల తీవ్రమోక్షేచ్ఛాదుల ననుసరించియే లభించునది గాక, వారివారిజన్మాంతర సుకృతపరిపాకముమీద నెక్కుడు నాధారపడియుండు ననునదియు నెంతయు గమనించదగిన విషయము. అప్పుడే సద్గురువుయొక్క అవ్యాజ కరుణాకటాక్షమునకు పాత్రుడై, శిష్యుడు పరిపూర్ణ ఫలమును బొందగలుగుచున్నాడు. అట్టి సదవకాశము యీ జన్మమునందే నాకును, కరుణారససాగరంబైన శ్రీ దేవియొక్క పరిపూర్ణానుగ్రహము చేతనే ప్రాప్తించినదనుటలో నెంతమాత్రము సంశయములేదు. లేకున్న శ్రీవారు, తమ చిరకాల శాస్త్రాచార్యానుభవముల క్రోడీకరించి తాము శృంగగిరి పీఠాధిపతులు ప॥ప॥ సచ్చిదా

సందశివ అభినవ నరసింహభారతీస్వామివారి వలన గ్రహించిన సాంప్రదాయ సిద్ధమైన యన్వయములను, సూత్రప్రాయముగ, వారు ముఖస్థ, స్వహస్తములతో దెల్పిన యనేక అపూర్వ విషయములలో, చింతభావ మిమిడియున్నదను సంగతి విశదమగుట కేయవకాశము లేదు. గానదీనికంతకును ముఖ్యకారణము శ్రీవారికి, వారి శిష్యులయందుగల యనన్య ప్రేమ - పుత్ర వాత్సల్యతయే యని గట్టిగ చెప్పగతప్పదు. ఇది వారి సహజస్వభావము.

అట్టి వారి విశాలహృదయమును 'ఉదుత్తభక్తితో స్మరించుటకును, యింతకుముందు నానావిధ శీర్షికల క్రింద బొందుపఱచబడిన గద్య - పద్య - వ్యాసములలో వివరించిన యంశముల విశిష్టత శ్రీవారి బోధల సారాంశము (నేను గ్రహించగలిగినటుల) కన్న వేఱుగాదని నిరూపించుటకును, శ్రీవారి శిష్యులకు, తదితరులకు తృప్తినొసంగుటకొఱకును, శ్రీవారి ముఖ్యమైన లేఖలలోనివి కొన్నిటిని మాత్రమే నీ దిగువ సంపుటి జేయుచున్నాను.

(1) ది 6-11-1945 (మం. 2-8-67) తారీఖున వ్రాసిన లేఖ నకలు:—

దత్తాత్రేయమందిరం
కుర్తాలం.

అస్మదత్యన్త ప్రియశిష్యులు

తంగిరాల వేంకటలక్ష్మీనరసింహారావుకు నారాయణ స్మరణ పూర్వకముగా వ్రాయునది.

త॥ నీ 25-10-45 తేదీ ఉత్తరమందినది. నీ వంశాచారముగా వచ్చుచున్న దేవీపూజలు - యథాపూర్వకముగా జరుగుచుండవలసినదే. వానిని మానరాదు. నాకుసంతోషమే.

ఇక్కడ నావద్దనేయున్న మనరాజుగారినికూడ-నవరాత్రికి ముందే వారి ఆశ్రమములోగూడా దేవీపూజలు ప్రారంభము చేయమని పంపి, ప్రారంభముచేయించినాను. కావున అది నాకు సమ్మతమే.

త॥ నీఆరోగ్యము జాగ్రత్తగా చూచుకొనుచుండుటలో నీ యిష్టదైవరూపమున పరమేశ్వర ప్రార్థనయు చేయుచుండుట అత్యుపయోగకరము. ఆత్మజ్ఞానముతోడనే అదియు చేయవలయును. భక్తి - జ్ఞాన - యోగ - కర్మలు అన్ని ఒక్కరూపముగా సమన్వయించుకొని - మన మనేక కోశములతో, నుపాదులతో, ఉన్నాముగనుక అన్నిటికి శాంతిగా జ్ఞానము ముఖ్యముచేసికొని, తక్కినవి తాత్కాలిక సౌఖ్యదాయికములుగా - ఎట్లా అన్నకోశమునకు అన్నము వేయుచున్నామో అట్లు, తక్కినవానికిని తక్కినఉపచారము చేసికొనుచు-ఉండిన - మనము చేయవలసినది - మిగులదు. "చేయవలసినది చేసినాము" అను కృత కృత్యతతో జ్ఞానము దృఢమై ప్రపంచమేమైనను - హాయిగానుండును.

పిమ్మట నీ జాతకము నాడి పంపుము. ఇక్కడ చాలా మందికలరు. దానిని వివరించిచెప్పుటను - అని అనుచున్నారు. కావున పంపుము.

మీ యందరిక్షేమము వ్రాయుము.

ఇవియే నారాయణస్మరణములు.
(Sd.) విమలానంద భారతీస్వామి.

P. S. తుపాను హడావిడి ఇచ్చటలేదు. కాని వర్షములు కురిసినవి. ప్రసాదములు పంపించిన సంగతి officeలో కను

గొనెదను. ఇప్పుడు దీనితో పంపుచున్నాను. రామకృష్ణారావు లక్ష్మణస్వామిగార్లు ఇప్పటికి నావద్దకు రాలేదు.

విశేషములు వ్రాయుము.

వి॥ భా॥

(2) ది 22-11-1945 (గు. 18-7-67) తా॥ వ్రాసిన లేఖలోని అంశములు (కొన్నింటికి) నకలు.

దత్తాత్రేయ మందిరం
కుర్తాలం.

అస్మదత్యంత ప్రియశిష్యులు—

తంగిరాల వేంకటనరసింహారావుకు — నారాయణ స్మరణపూర్వకముగా వ్రాయునది.

త॥ నీవు 15-11-45 తేదీన పంపిన నీ జాతకము ఉత్తరము అందినది - ack. నీకు అందేయుండును. నీశరీరము మునుపటికన్న స్వాస్థ్యము ఛికిత్స, చక్కబడు చున్నదని వినుటకు మిగుల నానందించితిని. నేనే అక్కడికి త్వరలోనే ఒకసారి వత్తునేమో, కావున మనము కలుసుకొనవచ్చును.

*　　*　　*　　*　　*

త॥ నీవు ఉదహరించిన అన్నివాక్యములలో "శబల" అనుమాటకు అర్థము వ్రాయుచున్నాను:—

"శబలం" = "అనేక కామమిశ్రితం"

Mixed with all kinds of desires. Desires are of two Kinds: —

(1) Those born of false attachment to external objects — అనృత విషయ సంగ సంభవములు,

(2) Those that are enjoyed by the liberated ones by simply wishing them— సంకల్పమాత్ర సిద్ధములు. The second kind — the liberated one enjoys in Brahmaloka which is శబల - mixed with desires to be enjoyed by merely wishing them.

అదే అవిద్యా శబల - బ్రహ్మ - etc.

బ్రహ్మ=ఆత్మ; అవిద్యా=అజ్ఞానము. Ignorance అవిద్య- causes all desires.

ఆత్మను తెలుసుకొని సగుణ బ్రహ్మ లోకమున (శబలబ్రహ్మలోకమున) కామముల ననుభవించి ఆబ్రహ్మతో కూడ ముక్తిచెందును. కేవల శుద్ధ బ్రహ్మముగాక శబల బ్రహ్మమే జగత్కారణము—

అవిద్య= - అనాది - భావ - అజ్ఞానం - It is not mere nothing. It has its own existence. But it is not real. The real existing thing is Brahman only.

ఇదంతా - విద్యాపాండిత్యధోరణిలో గ్రహింపజూడక - అనుభవరీత్యా - ఒకసారి గుర్తించిన చాలును. మనము కలిసికొనినప్పడు మాట్లాడుకొనురీతి - ఇక్కడ వ్రాయుట సమంజసము కాదు. వ్రాత ఇట్లే ఎంతసేపైన.

1. ఆత్మను తెలియుట ఏమిటి ?

2. తెలిసి అవిద్యాశబలత బ్రహ్మలోకమున సంకల్ప సిద్ధములైన కామము లనుభవించుట ఏమిటి ? అనినీకు తటును గదా ! తట్టక తెలిసినసరే - సగుణమేమి నిర్గుణమేమి యని?

ఆత్మను తెలిసికొనుట - అనునదే - మహారహస్యము. వ్రాయరాదు. అది కుదిరిన - ఇనన్నియు కుదురును:-

ఇవియే నారాయణ స్మరణములు

(Sd.) విమలానంద భారతీస్వామి.

P. S. శబలము = Variagated Spotted అని ముఖ్యార్థము.

(Sd.) V. B.

3. అస్మదత్యన్త ప్రియశిష్యులు దత్తాత్రేయ మందిరం,
తంగిరాల వేంకటలక్ష్మీనరసింహారావు కుర్తాలం.
నకు నారాయణ స్మరణములు 28-1-1946
తః నీ - 24-1-46 తే-దు త్తరమందినది. (సో 27-10-67)

* * * * *

మనస్సుకు - స్వభావము - ఎప్పుడు ఏదో ఒకటి తేల కుండా ఉంచుకొని - పెద్దగా విచారించుటో - లేక ఏమిటో చేయుటో, పెట్టుకొనిన తప్ప - దానికి ఉనికి లేదు. గనుక అట్లే తోపించుచుండును. "ఇది తేలినది" అనిన తానే సమాప్తియగును. గనుక - అట్లు అలా దోచుచుండును. అది కొంచెము గమనించు చుండవలయును - ఉత్తరము వ్రాయుము. ఇవియే నారాయణ స్మరణములు.

(Sd.) విమలానంద భారతీస్వామి.

4. ది 6-2-1946 తా॥ వ్రాసిన లేఖ నకలు.

అస్మదత్యన్త ప్రియ శిష్యులు - దత్తాత్రేయ మందిరం,
కుర్తాలం.
తంగిరాల వేంకటలక్ష్మీనరసింహారావు 6-2-1946
నకు నారాయణ స్మృతులు - (బుధ 5-11-67)

తా॥ నీ 29-1-46 తే॥ న ఉత్తర మందినది. ఈ క్రింద వ్రాయు విషయములు సక్రమగా గమనింపుము.

1. మన వేదశాస్త్రములు - అధికారము, స్వధర్మము, పరధర్మము అను దానిమీద ఆధారపడియున్నది.
2. మనమనస్సును-మనస్సునుపట్టి నడచు ఇతరమతములను -వాని శాస్త్రములును—
   (a) అధికార వాదము తెలుగవు.
   (b) స్వధర్మము, పరధర్మము, అను విభాగము తెలుగవు. కావున - మనస్సును విచారింతము.

(ఇతర శాస్త్రములన్ని యింతులోనివే) మన మనస్సు -

1. నేను - ఫలానా వాడను, బ్రాహ్మణుడను అని గుర్తుంచునా ?
2. నేను - ఫలాని ఆశ్రమము వాడను, - అనగా గృహస్థును - లేక సన్న్యాసిని - అని అనుకొనునా ?
3. నేను పెద్దల సేవ చేసినాను - వినవలసినది విన్నాను తెలియ వలసినది తెలిసికొన్నాను - అని ఎన్నడైనను అనునా ?
4. నేను చేయువాడను - సంసారిని అను అభిమానముతో కూడియుండునుగాని తెలిసికొనినాను అని ఒప్పుకొనునా ? తెలుసుకొనినను యిట్లు ఉంటున్నానేమిటి - అని స్వవిమర్శ చేసికొనునా ?

(5) "అహరహస్సంధ్యాముపాసేత" అని చదివి మనము కూడ సంధ్యవార్చవలెను అనును గాని - నేను యతిని - నా యనుష్ఠానము వేఱు - అని యెన్నడైనను అధికార భేదమును తెలుసుకొనునా ?

(6) చేయుము - చేయుము - చేయుము - అని అనును గాని - చేయవలసినది చేసినాను, తెలియవలసినది తెలిసి కొన్నాను అని అనునా ?

"అందుండి నేనెట్లు బయటపడిన శాంతిని పొందగలను" అని వ్రాసినావు-

ఎందులోనుండి యైనను నీవు బయట పడుట యేమిటి? నీవు ఎవరవు ? ఎందులో చిక్కుకొనియున్నావు ?

ఒక్క నీ మనస్సు ఎట్లా అంటె అట్లా దాని వెనుక నీవును తాళము వేయుటతప్పు!

"బద్ధాభిమానీ బద్ధోహి !
ముక్తో ముక్తాభిమాన్యపి" ॥- అనగా

నేను బద్ధుడను - ఇంకా అది చేయవలయును - ఇది చేయ వలయును అని అభిమానించు కొనువాడు - బద్ధుడని భ్రమించుచుండును.

నేను ముక్తుడను - తెలియ వలసినది తెలిసినది - అని అభిమానించువాడు ముక్తుడనని సర్వభ్రమలు వదలుకొనును.

• పైన నేమిటి ? యథాప్రకారమే దేహపతనమువరకు- తన యధికారమునకు తగిన ధర్మ్యపనరన చేసికొనుచు హాయిగా నుండుటే ! ఏకాంత మేమిటి ? ఎప్పుడు ఏకాంతివే! వ్రాయుట మొదలు పెట్టిన యిట్లేయుండును. మనము కలిసి కొని మాట్లాడిన సంశయములు విడును. ఈ వ్రాసిన దాని చేతనే విడినా సరే.

ఈ నెలాఖరులోగా వచ్చుచున్నాను. మీ యింటికే వచ్చెదను. అప్పుడు చక్కగా మాట్లాడు కొందము. విశేషములు వ్రాయుము. ఇవియే నారాయణ స్మరణములు

(Sd.) విమలానంద భారతీస్వామి.

P. S. నీవు మెత్తి వ్రాసిన వాక్యములతో నేమి పని నీకు ఇంకా లక్షా తొంభైయారు వాక్యములు గ్రంధములు గలవు! నీ యధికారమేమి? వాటితో నీకేమి పని?

(Sd.) వి॥ భా॥

ఈ ప్రకారము శ్రీవారి లేఖల మూలమునను, వారి భాష్య పాఠ శ్రవణాములవలనను, ఏకాంత ప్రవచన ప్రసంగాదుల వలనను పొందిన అమూల్యాదేశముల సారాంశమును నేను గ్రహించగలిగిన రీతిగా నామననమున కనుకూలపడునట్లు, యీ గ్రంథస్థము జేయబడినవగుటచే, అందేవిధమైన స్ఖాలిత్యాది దోషములు గాంచబడినను, వాటి నన్నింటిని నాయవజ్ఞతకు జెందినవిగానే భావించి, వారివారి యధికారాను సారముగ, నాయీ లేఖల విషయముల జదువరు లుపయోగించుకొని కృతార్థులగుదురని ఆశించుచున్నాను.

హరిః- ఓం. పూర్ణమదః పూర్ణమిదం
పూర్ణాత్పూర్ణముదచ్యతే।
పూర్ణస్య పూర్ణమాదాయ
పూర్ణమేవావ శిష్యతే॥-
ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః-
ఓమ్ - తత్ - సత్.

# తదాత్మనిష్ఠ

## శ్రీ భగవాన్ శంకరాచార్య ప్రణీత

## 1. "లఘువాక్యవృత్తి"

(ఆంధ్ర పద్యానువాదము)

ఇందలి శీర్షికయే సూచించునటుల, శ్రీశంకరాచార్య స్వాములవారు, తా మతిగంభీరముగను, విస్తారముగను, తమ భాష్యాదులయందు విశిష్టమైన ప్రౌఢవాదములతో నిరూపించిన 'అద్వైత దర్శనము' నే, సూత్రప్రాయముగ 'లఘువాక్యవృత్తి' యనుపేర, ముముక్షు జనోపకారమగు పరమ పురుషార్థ మతిసులభముగ సిద్ధించునటుల, సంగ్రహముగను, సమగ్రముగను పదునెనిమిది శ్లోకములలో తమ దయాంతఃకరణను వెల్లడిజేయుటచే, భక్తులు జిజ్ఞాసువులందు వారికిగల ప్రేమాతిశయముల జెప్పక జెప్పుచున్నవి. దీనిని వారొక సిద్ధాంత స్థాపనయందు చేర్కొనవలసిన పూర్వాపర విమర్శనాది యంగములతో నింపక, తీవ్రమోక్షేచ్ఛాపరుల కుండవలసిన శుద్ధాంతఃకరణయొక్క ప్రాధాన్యతను నిరూపించి, వారెల్లప్పుడు నవశ్యముగా నాచరించవలసిన కర్తవ్యతను స్పష్టముగా విశదము జేయుచూ, యదార్థములో నెంతసులభముగా నీ తత్త్వార్థముద్వార తత్త్వమును గుర్తింపగలిగినది_ సీతారామాంజనేయ సంవాదములో వివరించినప్రకారము

చెలువుగ బువ్వులు జీరుటకంటెన్
బొలుపుగ గన్గవ మూయుటకంటెన్

నలువగు నీ యమన స్వరూపదంబే
సులభము, సౌఖ్యము, సూక్ష్మము నతా ॥

యని ఆచంద్రతారార్కము ప్రకాశించునటుల వెల్లడిచేసినది నా 'ప్రకరణ ప్రబంధావళి'కిఁ జెందిన దీని నొక సారైనను స్మరించిన పుణ్యపురుషులకు స్పష్టము గాకపోదు. అట్టి ప్రాశస్త్యము దీనియందుండుటచేతనే, నేను తృతీయ సంపుటమందు, అనేక శీర్షికల క్రింద వ్రాసి పొందుపఱచిన నా వ్యాసముల సారాంశమును సూక్ష్మముగను, సులభముగను గ్రహించుట కిది యెంతేనిఁ దోడ్పడగలదని దలఁచి, దానినిగూడ నిందు జేర్చితిని. మరియు నిది యత్యంతశ్రేష్ఠమైనదై కంఠస్థము జేయ దగిన దగుటచే, ముముక్షువులెల్లరకును ధారణకనుకూలపడు నటుల మూలసమేత, ఆంధ్ర పద్యానువాదము సులభశైలిలో నిందు జేర్చుట మంచిదని యట్లు గావించితిని.

గాన, నిందలి భావమును మాత్రమునే పాఠకులు ప్రధానముగ గ్రహించి కృతార్థులగుటకు ప్రయత్నించుట కర్తవ్యమని మనవి జేసుకొనుచు, తదితర స్ఖాలిత్యాది దోష విమర్శలకు గడంగక, క్షీర నీర న్యాయముగ దీని స్వీకరింప ప్రార్థించుచున్నాడను.

## దేవతా స్మరణమ్

గీ॥ శ్రీనివాసుని సహధర్మ చిత్స్వరూపి
భక్త రక్షణ దాక్షిణ్య పావనాశి
నైన బాలాంబయే నాకు 'ఆత్మశక్తి'
అగుటచే దాని దలతు నాదియందు॥

## గురు వందనమ్

'శ్రీ శివా' యని తానె యీ క్షేత్రమందు
'శంకరుండు'గ వెలసి సంక్షేపమునను
ఎత్తి వివరించె 'లఘువాక్యవృత్తి' యనుచు,
నదియె యనువాద మొనరింతు నాంధ్రముననుll

## మూలానువాదమ్

శ్లోll స్థూలో మాంసమయో దేహః సూక్ష్మస్స్యాద్వాసనామయః ।
జ్ఞానకర్మేంద్రియైస్సార్థం ధీప్రాణౌ తచ్ఛరీరగౌ ॥

సీతll "ఆత్మబ్రహ్మల యేకత్వ" మనుభవింప
స్థూలదేహము మాంసాది శోణితమును
పదియునేడగు నింద్రియ వాసనలను
సూక్ష్మదేహము వర్తిల్లు చోద్యముగను ll (1)

శ్లోll అజ్ఞానం కారణం సాక్షీ బోధస్తేషాం విభాసకః ।
బోధాభాసో బుద్ధిగతః కర్తస్యాత్ పుణ్యపాపయోః ॥

పంll కారణోపాధి 'యజ్ఞాన' పరిధవమున
సాక్షియనుబేఱ మూటికి సన్నిధాన
"పరుడె" భాసించు, స్ఫురణను "ప్రత్యగాత్మ"
అగుచు నభిమాన సంసార మనుభవింప
జేయు కర్తగ సకలంబు "జీవుడు"గను ll (2)

శ్లోll సఏవ సంసరేత్ కర్మవశాల్లోకద్వయే సదా ।
బోధాభాసాచ్ఛుద్ధబోధం వివిచ్యాదతి యత్నతః ॥

గీll అట్టి జీవుడె ప్రారబ్ధ మనుభవింప,
ఇహపరంబులదా, సదా, 'ఆహరించు' ।
కల్పితంబని దెల్పెడు ఘనవివేచ
నొకటియె జూపు విడదీసి "నున్న – పరుని" ll (3)

శ్లో॥ జాగరస్వప్నయో రేవ, బోధభాసా విడంబనా ।
సుప్తౌతు తల్లయే శుద్ధ, బోధో జాడ్యం ప్రకాశయేత్

సీ॥ స్వప్న జాగ్రతలను రెంటి సంజ్ఞలందె
జీవి కనయుంబు వ్యవహార చేష్టలుండి ।
సుప్తియందున నవి యెల్ల సాక్షిపోగ
"ఉండి" యజ్ఞానమును దెల్పు నొకట "పరుడు" ॥ (4)

శ్లో॥ జాగరేఽపి ధియస్తూష్ణీం, భావశ్శుద్ధేన భాస్యతే ।
ధీవ్యాపారాశ్చ తద్భాస్యా శ్చిదాభాసేన సంయుతాః ॥

సీ॥ జాగరంబున నైతము స్వచ్ఛముగనె
వృత్తిరాహిత్యముకు బుద్ధి వెలుగుచుండ ।
"చేయవలెనన్న మతిగల్గ" జీవుడుగను
బుద్ధితో గూడి వృత్తుల వృద్ధిజెందు ॥ (5)

శ్లో॥ వహ్నితప్తం జలం తాప యుక్తం దేహస్య తాపకమ్ ।
చిద్భాస్యా ధీస్తథా భాసా యుక్తాన్యం భాసయేత్తథా ॥

సీ॥ అగ్నితప్తపు జలముల నాతపంబు
దేహ మేరీతి కాల్చునో తీవ్రముగను,
శుద్ధ చైతన్య భాసిత బుద్ధి యటులె
ప్రతిఫలించుచు, నభివ్యక్తపఱచు నెల్ల ॥

శ్లో॥ రూపాదౌ గుణదోషాది వికల్పా బుద్ధిగాః క్రియాః
తాః క్రియా విషయైస్సార్ధం, భాసయన్తీ చితిర్మతా ॥

సీ॥ మంచి చెడుగుల దలచుచే మనసు యగుచు
నామరూపాది విషయంపు నడక గలిగి
చతురముగ బుద్ధి జేరిన, స్వప్రకాశ
మైన చైతన్యమునగాదె ! వ్యక్తమగుట ! (7)

శ్లో॥ రూపాచ్ఛగుణకోషాభ్యాం వివిక్తాకేవలాచితిః
సైవానువర్తతేరూప, రసాదీనాంవికల్పనే॥-

ప॥ కేవలంబగు "నిరుపాధి - నిర్విశేష
పరుడు" స్థిరముగా నుండనా బ్రహ్మశక్తి"
శబ్దరసరూప గుణదోష సంకులమును
అనుసరించినరీతిగా గానుపించ
"ఆత్మ" యనినను "బ్రహ్మ"మే యగును గాదె! (8)

శ్లో॥ క్షణేక్షణేఽన్యథాభూతా, ధీవికల్పాశ్చితిర్నతు
ముక్తాసుసూత్రవద్బుద్ధి, వికల్పేషుచితిఃస్థితా॥-

గీ॥ సాక్షిచైతన్యమనెడి యా "శబలశక్తి"
చంచలాత్మక వృత్తుల సాయపడిన
హారమందున వ్యాపించు దారమటుల
శుద్ధచైతన్య మొప్పగా, సుఖముకాదవె ? (9)

శ్లో॥ ముక్తాభిరావృతం సూత్రం ముక్తయోర్మధ్యఇష్యతే.
తథావృతా వికల్పైశ్చిత్ స్పష్టా మధ్యేవికల్పయోః॥-

ప॥ మణిగణంబులయందును, మధ్య - మధ్య
సూత్రమేరీతి వ్యాపించి చూడనగునో,
వృత్తులందునెగాకను, విషయములను,
స్ఫురణగొల్పెడు 'శివ - శక్తి' స్ఫుటముగాను
శుద్ధచైతన్యమంతట సిద్ధమనుచు
తెలుపకుండునె! తనుగూడ వెలుగుచుండ॥- (10)

శ్లో॥ నష్టే పూర్వవికల్పేతు యావదన్యస్యనోదయః
నిర్వికల్పక చైతన్యం స్పష్టంతావత్ విభాసతే॥-

గీ॥ పూర్వవృత్తులు విలయమై బుద్ధియందు
ఎంతవఱకెట్టివృత్తియు నెగయనట్టి
అంతరంబున స్పష్టమా 'తత్పదంబు
'త్వం' పదార్థపు లక్ష్యమై దనరకున్నె!॥ (11)

శ్లో॥ ఏకద్విత్రిక్షణేష్వేవం వికల్పస్య నిరోధనం
క్రమేణాభ్యస్యతాం యత్నాద్బ్రహ్మానుభవ కాంక్షిభిః॥

గీ॥ అట్టి యనుభూతికనువైన 'ఆత్మశుద్ధి'*
కాంక్ష గలుగ ముముక్షువు క్రమముగాను
వృత్తిరాహిత్యమునుజేయు విధముగానె
యత్నమొనరింపతగుగదా! యనయమునను॥ (12)
*ఆత్మశుద్ధి=అంతఃకరణశుద్ధి

శ్లో॥ సవికల్పకజీవోఽయం బ్రహ్మ స్యాన్నిర్వికల్పకమ్
అహం బ్రహ్మేతి వాక్యేన సోఽయమర్థోఽభిధీయతే॥

గీ॥ కేవలంబుగ 'సవికల్ప- నిర్వికల్ప'
విధములన్ 'జెప్పుటనునదే' భేదమగుచు
త్రాడునేరీతి పాముగ దలచబడెనో
జీవబ్రహ్మల భేదంబు చెప్పుటగునె॥ (13)

గీ॥ జీవుడుగనేది పూర్వము జెప్పబడెనొ
అదియె గురు శాస్త్రబోధల పిదప బ్రహ్మ
మనుచు వేదాంత వాక్యములభినుతించ
'అహము బ్రహ్మమునగుచుంటి' నను నెఱుఁగుటె "తెలివి"

శ్లో॥ సవికల్పక చిదోఽహం బ్రహ్మైకం నిర్వికల్పకం
స్వతః సిద్ధావికల్పాస్తే నిరోద్ధవ్యా ప్రయత్నతః॥

పం|| సహజ "సవికల్ప" జీవియు సతతముగను
అభ్యసించంగ "నుత్పత్తి" యడగిపోవు
ఘనముగా బుద్ధిమెఱసి, యఖండముగను
సచ్చిదానంద లక్ష్యమౌ స్వచ్ఛమైన
నిర్వికల్పపు చైతన్య నిష్ఠగుదురు||— (14)

శ్లో|| శక్యః సర్వనిరోధశ్చేత్సమాధిర్జ్ఞానినాంప్రియః
తదశక్తౌక్షణం ధ్యాత్వాశ్రద్ధయాబ్రహ్మతాఽత్మనః

గీ|| సర్వవృత్తి నిరోధంబు శక్యమైన
జ్ఞానులకెయుండు నీ "సమాధాన" మెప్పుడు
లేనియసమర్థులనుగూడ క్షణమెయైన
"ఆత్మబ్రహ్మల" సంధానమవసరంబు||— (15)

శ్లో|| శ్రద్ధాలుర్బ్రహ్మతాం స్వస్య చిన్తయేద్బుద్ధివృత్తిభిః
వాక్యవృత్త్యా యథాశక్తి జ్ఞాత్వాహ్యభ్యస్యతాంసదా||—

గీ|| శాస్త్రగురుబోధలందున శ్రద్ధగలిగి
శుద్ధబుద్ధిని "బ్రహ్మాత్మ" సూక్ష్మమెఱిగి
శక్తికొలది మహావాక్య సద్విమర్శ
సలుపు నేకాగ్రతే సదా శాంతి నొసగు||— (16)

శ్లో|| తచ్చిన్తనం, తత్కథనం, తత్పరస్పర బోధనమ్
ఏతదేకపరత్వంచ బ్రహ్మాభ్యాసం విదుర్బుధాః—

గీ|| మనసు విషయాంతరమునుండి మరలజేసి
తత్పదార్థమె విషయమౌ తన్మయమున
కథన - చింతన - యన్యోన్యబోధ లొకటె
వలయు, కర్తవ్యమనిదెల్పు ప్రాజ్ఞులెపుడు||— (17)

